Dutt, Ramesh Chunder

ప్రాథమిక బ్రిటీషుపాలనమునందలి హిందూదేశ ఆర్థికచరిత్రము

పిఠాపురము, 1910

Record no. 795

Dutt, Ramesh Chunder, 1848-1907.

Prāthamika
Briṭīṣupālanamunandali Hindūdēśa
Ārthikacaritramu

Piṭhāpuramu, 1910.

Record no. 795

Dutt, Ramesh Chunder, 1848-1907.
ప్రాథమిక బ్రిటీషుపాలనమునందలి హిందూదేశ ఆర్థికచరిత్రము / రమేశచంద్రదత్తుగారిచే రచియింపంబడిన ఇంగ్లీషుగ్రంథమునసుసరించి తల్లాప్రగడ సూర్యనారాయణరావుచే భాషాంతరీకరింపంబడినది.- పిఠాపురము : తల్లాప్రగడ సూర్యనారాయణరావు, 1910.

v. <1 > ;18 cm.

Record no. 795

Dutt, Ramesh Chunder, 1848-1907.
Prāthamika Briṭīṣupālanamunandali Hindūdēśa Ārthikacaritramu / Ramēśacandradattugāricē Raciyimpambaḍina Iṃglīṣugranthamu nanusariñci Tallāpragaḍa Sūryanārāyaṇarāvucē bhāṣāntarīkarimpambaḍinadi.- Piṭhāpuramu : Tallāpragaḍa Sūryanārāyaṇarāvu, 1910.

v. <1 > ;18 cm.

Record no. 795

సువర్ణలేఖాగ్రంథమంజరి 10.
మొదటిసంపుటము.

పుట 1..266.

ప్రాథమికబ్రిటీషుపాలనము

నందలి

# హిందూదేశ ఆర్థికచరిత్రము.

ప్రసిద్ధికెక్కిన రమేశచంద్రదత్తుగారిచే

రచియింపఁబడిన

ఇంగ్లీషు గ్రంథముననుసరించి

తణుకు డిస్ట్రిక్టు మునసబుకోర్టు ప్లీడరు

తల్లాప్రగడ సూర్యనారాయణరావుచే

భాషాంతరీకరింపఁబడి

ప్రకటింపఁబడినది.



పిఠాపురము.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

| | | |
|---|---|---|
| చందాదారులకు | పోస్టేజికాక. | వెల రు 1-0-0. |
| ఇతరులకు | | 1-8-0. |



Romesh Chandra Dutt, Calcutta.
रोमेशचंद्र दत्त.
चित्रशाळा, पुणें.

# విషయసూచిక.

# పీఠిక.

ప్రసిద్ధికెక్కిన రమేశచంద్రదత్తుగారిచే రచియింపఁబడిన "The Economic History of India under early British rule, and Victorian Era" అను గ్రంథరాజముల నాంగ్లేయ భాషాపరిచితిం గన్నవారలందరు నెఱుఁగుదురు. ఆగ్రంథరాజములు హిందూదేశవాసుల యోగక్షేమముల నారసి వ్రాయఁబడి యుండుటచే, నయ్యవి హిందూదేశమునందలి దేశభాషలన్నిటియందును భాషాంతరీకరింపఁబడవలసి యుండెను. ఆకొదువ నాంధ్రభాషయందుఁ దీర్పఁ దలంచి భాషాంతరీకరణమునకుఁ గడంగి గ్రంథము పెద్దది యగుటచే నంతయు నొక్కసారి ముద్రించి ప్రకటించుట పాఠకులకును లేఖకులకును గష్టముగా నుండు నని తలంచి సువర్ణలేఖాగ్రంథమంజరియందు వేరువేరు సంపుటములుగ ప్రకటింతునని పత్రికలలో ప్రకటించి యుంటిని. ఆప్రకటనలు పత్రికాపరిచితిం గన్నపాఠకు లందఱును నెఱింగియే యుందురు. గ్రంథము ముగియునప్పటికి దాదాపు 1200 పుటలు కాఁగలదు. ప్రథమసంపుటము నందు పదునొకొండు ప్రకరణములుమాత్రమే ప్రకటింపఁబడియెను. మొదటిది దత్తుగారిచే వ్రాయఁబడిన యుపోద్ఘాతము. ఇందు గ్రంథమునం దతఁడు వ్రాసినవిషయము లన్నియును సంగ్రహముగ వివరింపఁబడినవి. ప్రథమప్రకరణమున హిందూదేశము బ్రిటీషువారికి లభ్యమైనమార్గమును, కాలమును, వ్రాయఁబడెను. రెండవప్రకరణము వైదేశికవాణిజ్యము బంగాళాదేశమున పూర్వ మెట్లుండెనో, అది యెట్లు రూపుమాసెనో అది విపులముగ తెలుపఁబడెను. మూడవప్రకరణమున క్లైవు ప్రభువుగారి పరిపాలనావ్యాపారమును, వానిప్రభుత్వమందలి ఆర్థికవిషయములను చెప్పఁబడియెను. ఇట్లే తక్కినవిచూచిన యెడల విషయ

ములన్నియుఁ దెలియఁగలవు. ఏకాలమునుగూర్చి తాను వ్రాయఁద
లంచెనో, ఆకాలమునాఁటి పరిపాలకులయొక్కయు, తత్సంబంధికుల
యొక్కయు నభిప్రాయముల నెవ్వరు వ్రాసినది వారు వ్రాసినట్లే పాఠ
కులకు విశదీకరించుటయే గ్రంథకర్తగారి యుద్యమమై యుండుటచే నిం
దాదిమొదలంత్యమువఱకును అన్నియును గ్రంథభాగములుగనే కాని
పించును. అట్టిది యిక్కాలమున మిక్కిలి యుపయోగకరమై యున్నది.

ఇయ్యది కేవలభాషాంతరీకరణమై యుండుటచే గ్రంథకర్తగారి
యుద్దేశములను ఆంధ్రపాఠకులు కేవలభాషామాత్రముగనే తెలిసికొన
సమర్థులగుదురు. ఇందేభాగమైనను సరిగా నుండదందురేని యయ్యది
భాషాంతరీకరణవైకల్యమగుంగాని గ్రంథకర్తగారిలోపమని యెంచఁ
జనదు. ఈగ్రంథపాఠకులు విశేషముగ జనసామాన్యమై యుందురను సా
శయముచేతను నీగ్రంథము జనసామాన్యమునిమిత్తమే యుద్దేశింపఁబ
డియుండుటచేతను ఇప్పుడు వాడుకలోనున్న అన్యదేశపదములను వా
డుకలో నున్నమాదిరినే వ్రాసియుంటిని. అట్లు వాడకున్న గ్రంథము
సుబోధకముగా నుండదని అట్లు చేయవలసి వచ్చెను. భాషాంతరీకర
ణముచేతనైనంతవఱకు అన్యభాషావాక్యవిరచనను విడిచి సులభ
మగు తెలుఁగువాక్యవిరచనమే చేయం దలంచితిని గాని ఆదిగ్రంథ
మన్యభాషాగ్రంథమై యుండి అయ్యది యెదుట పెట్టుకొని వ్రాయు
చుండుటచేత అట్టివాక్యరచన ప్రమాదముననైన దొరలక మానదు.
పాఠకమహాశయులును, గ్రంథకర్తలును, ఇందేమేని లోపములు కని
పెట్టిరేని వానిని దెలుపఁ బ్రార్థితులు.

తణుకు,
9-11-09.

ఇట్లు
తల్లాప్రగడ సూర్యనారాయణరావు.

# హిందూదేశార్థికచరిత్రము.

## ఉపోద్ఘాతము.

హిందూదేశమునం దాంగ్లేయు లొనరించినరాజకీయవ్యాపార
ములనుగూర్చియు, సైనికకార్యములనుగూర్చియు, సమర్థు లగుచరిత్ర
కారులు మంచిమంచిగ్రంథముల రచియించి యున్నారు. మనదేశ మాం
గ్లేయప్రభుత్వముక్రిందకు వచ్చినతరువాత వారియొక్క వాణిజ్యస్థితిని
గూర్చియు, పరిశ్రామికవ్యవసాయస్థితులనుగూర్చియు ఆర్థికస్థితినిగూర్చి
యు నింతవరకును చరిత్రలను వ్రాసినవా రెవ్వరును లేరు.

ఈదేశము నీనడుమ పట్టి పీడించుచున్న కాటకములవలన నీదే
శవాసు లందరకును బ్రాముఖ్యమగునీవిషయమును దెలిసికొనవలె న
నునాసక్తి యెల్లెడ వ్యాపించి తమకుఁ గలరాఁబడిమార్గములును ఇంత
పేదతన మలవడుటకుఁ గలమూలకారణములును దెలిసికొన శ్రద్ధ హె
చ్చయినది. అందువలన నిప్పు డాంగ్లేయులకాలమునందలి హిందూదేశ
పుటార్థికచరిత్రను సంగ్రహముగనైనఁ దెలిసికొన జనుల కవసరమ
య్యెను.

హిందూదేశమునం దాంగ్లేయు లొనరించినపనులఁ దడవిచూచు
కొనినచో, నంత నిష్కళంకమైనసంతుష్టిఁ జెందుటకుఁ దగినకారణ మే
మియును వారికి లేదుకాని కొంతవరకు న్యాయమయిన గర్వమును
బొందుటకుమాత్రము దగినకారణము లేకపోలేదు. మానవులొందఁ

దగిన సుఖములలో మేటియనఁదగు దేశస్వాస్థ్య మొకటి యీదేశప్రజలకు వారు లభింపఁ జేసినారు. పాశ్చాత్యవిద్య దేశమునందు ప్రవేశపెట్టినారు. అందువలనఁ జిరకాలముక్రిందట నాగరికత నందినమనజాతివారికి, నవీనశాస్త్రములతోడను, నవీనవిమర్శనలతోడను, నవీనవిద్యాబుద్ధులతోడను, నవీనజీవనముతోడను సంయోగము తటస్థించినది. వారేర్పాటుచేసిన పరిపాలనాపద్ధతి యన్ననో, ప్రబల మయినదియు, నమోఘ మయినదియు ననుటకు సందియము లేనిదయ్యును, గాలానుసరణముగ నభివృద్ధిఁ జెంది సంస్కరింపఁబడవలసినదియై యుండెను. వారును బ్రజ్ఞాసమన్వితములైన చట్టముల నేర్పఱచి న్యాయసభలఁ బ్రతిష్ఠించిరి. అవి యన్నియుఁ బ్రపంచమునం దితరప్రదేశము లన్నిటియందువలెనే యుత్కృష్టముగఁ బనిచేయుచున్నవి. ఆంగ్లేయు లీదేశమునందుఁ జేసిన కార్యముల నన్నిటిని పరికించి చూచిన ప్రతివిమర్శకుఁడు నట్టికార్యములఁగూర్చి మెచ్చుకొనక తీఱదు.

కాని, మనదేశము వీరిచేతఁ బడినది మొదలు మనజాతివారియార్థికస్థితినిగూర్చి నిష్కపటముగఁ దలంచి చూచునాంగ్లేయుఁ డెవ్వఁడును సిగ్గుపడక మానఁడు. మనదేశమునం దిప్పుడు తులతూఁగుచున్న దారిద్ర్యదశ నాగరికతనందిన మరియేదేశమునందునను గూడఁ గానరాకున్నది. పందొమ్మిదవశతాబ్దాంత్యభాగమున మనదేశమును నిర్మూలించినకాటకములయతివ్యాప్తి భూతవర్తమానచారిత్రములయం దుపమానరాహిత్యముగ నున్నది. సామాన్యముగ మనము లెక్కించి చూచినచో 1877 & 78, 1889 & 1892, 1897 & 1900, సంవత్సరములలో మనదేశమునఁ దాండవమాడిన క్షామదేవతవాతఁ బడినజనులసంఖ్య కోటియేబదిలక్షలు. ఐరోపాఖండమునందలి మంచి విశాలమగు దేశమున నుండునంతటిజనసంఖ్య 25 సంవత్సరములకాలములో నీదేశమున నాశనమై



పోయినది. నడివయసులో నున్న వారు కొంచెము వెనుకకుఁ జూచి లెక్కించుకొనినచో నాంగ్లేయదేశపుజనసంఖ్యలో నర్ధభాగము తామెఱిగినతరువాత మనదేశమున నీరీతిని మరణించినట్లు గనిపెట్టఁగలరు.

కాటకము లింతతఱుచుగ నీదేశమునే పట్టిపీడించుటకును దారిద్ర్య మింతటిమహోన్నతపదవి నిచ్చుటనే పడయుటకును గలమూలకారణ మేమియనునంశము నిట్టితరుణమునం దరయనివా రెవ్వరునుండరు. దీనికి కల్లబొల్లిసమాధానము లేవియో కొన్ని యంతరువులుగఁ జెప్పుచు వచ్చిరి కాని తరిచి చూచిన నవి యెవ్వియును నిలుచునవి కావు. దేశమునందు జనసంఖ్య యభివృద్ధి యగుచున్న దనియు నందువలన దేశమునఁ గాటకములు సంభవింపక తప్ప దనియును గొందఱు చెప్పిరి. ఆంగ్లేయదేశమునందలి పదిసంవత్సరముల జనాభాయభివృద్ధియు మనయభివృద్ధియుఁ బరిగణించిచూచినప్పుడు మనదేశమున నావరుస యభివృద్ధి కనుపడనేకనుపడినది కాదు. మనదేశపువ్యవసాయదారు లజాగ్రత్తమనుష్యు లనియును దూరదృష్టి లేనివా రనియును గలిగినరోజులలో నార్జించుకొనలేనివాఁడు లేనికాలమునఁ దప్పక చావవలసినదే యనియు నొకప్పుడు చెప్పసాగిరి. తమజన్మమంతయు నీవ్యవసాయదారులతోఁ గడపువా రందఱును, మనదేశపుకాపులకంటె నూర్జితమయినమనుష్యులును, అంతకంటె మితాహారులును, అంతకంటె గుప్తహస్తులును మఱియొకరు లేరని కనుఁగొనిరి. మనదేశమునందలి ఋణదాతలవలన మనకాపువాండ్రకం దఱకిట్టియనర్థము సంభవించుచున్న దనియు, వారిమోసకృత్యములవలనను వారియన్యాయద్రవ్యాకర్షణవలనను దున్నుకొని బ్రతుకువా రందఱును తీరనిఋణముల పాలయి పోవుచున్నారనియు కొంతకాలము చెప్పిరి. దొరతనమువారు పన్నులు వసూలుచేయుటయందు వహించుకాఠిన్యమువలననే మనదేశపురయితు లందఱును ఋణదాతలకు దాస్యము

చేయవలసినవా రగుచున్నా రని మొన్న నీనడుమ నేర్పడినక్షామవిమర్శనాసంఘమువారి విచారణలో తేలినది. కేవలమును పంటలే తమజీవనాధారముగ నెన్నుకొను దేశములోని ప్రజలందరు ననావృష్టిదోషమువలన పంటలేమియుఫలించనప్పుడు చావవలసినదే యని మఱికొంతకాలము చెప్పిరి. కాని అదియును యథార్థమునకు చేరువయినవాద మయినది కాదు. హిందూదేశమునం దంతటను పంట లొక్కసారి నష్టమయినసంవత్సర మేదియును లేదు. దేశములోని ప్రజల కందరకును జాలినంతపంట దేశమున పండనిసంవత్సరము లేదు. కాని, యొకరాష్ట్రమునఁ బంటలు పండి మఱియొకరాష్ట్రమున లేనపుడు లేనిచోటవా రున్నచోటకు వచ్చి కొనుక్కొనుట కేల యుపపత్తి లేకుండఁ బోయినదో దానికి మాత్రము సదుత్తర మిచ్చువారు కానరా కున్నారు.

ఈ పయిపయిసమాధానములు విడిచి మనహిందూదేశదారిద్ర్యమునకును మనదేశ క్షామములకును, నిజమగునకారణము లెవ్వియో ఆనుపూర్వికగఁ గన్గొనుటకు మనము ప్రయత్నింపవలసి యున్నది. ప్రపంచమునందలి యితరదేశములం దేయార్థికశాసనము లుపయోగపడుచున్నవో యీదేశమునందును నవియే యుపయోగపడుచున్నవి. ఇతరజాతులవా రైశ్వర్యవంతు లగుటకుఁ గలకారణములే వీరికిని కలవు. వార లందరును పేదపడుట కెట్టికారణము లున్నవో వీరికి నట్టికారణములే యున్నవి. కావున హిందూదేశమునకు సంభవించినయీదుస్థితిని విచారింపఁబూను నార్థికచరిత్రకారుఁ డితరదేశపుకలిమిలేములు విచారించుట కనువుపడుమార్గమే యీదేశమునకు నన్వయించి చూడవలయును. దేశమున వ్యవసాయ మభివృద్ధిలో నున్నదా? పరిశ్రామికములును చేతిపనులును వర్ధిల్లుచున్నవా? జనులు రాజునకు పన్నులమూలమున చెల్లించుద్రవ్య మంతయును దేశమునకుఁ దగినప్రయోజనము కలుగు



పటుల యుక్తముగ తిరిగి వెచ్చింపఁబడుచున్నదా? జనులయార్థికయోగక్షేమములకై కుతూహలపడుప్రభుత్వమువారిచే జనులయైశ్వర్యము నభివృద్ధి నొందించుమార్గములు వృద్ధిపఱుపఁబడుచున్నవా? అను నంశములు ప్రపంచములోని యేదేశపునార్థికస్థితి విమర్శింపవలె నన్నను సామాన్యముగఁ బ్రతియాంగిలేయునకును దోఁచుసంశయములు. హిందూదేశమునుగూర్చిన వాస్తవ మగునార్థికవిషయమును విచారించవలసినప్పు డీమార్గములు వారికి పొడకట్టవా యేమి?

మనదేశ మాంగిలేయులయధీన మయినదిమొదలు మనజాతివారియైశ్వర్య మభివృద్ధియగుటకుఁ దగినయాధారము లన్నియు మనదురదృష్టవశమున సన్నగిల్లినవి. ఈవిషయము బాగుగ పరిశీలించి చూచిన ప్రతిహిందూదేశపునుద్యోగస్థునకును దెలిసినవిషయమే. పదునెనిమిదవ శతాబ్దమున మనదేశమునందు చేతిపనులు విరివిగ జరుగుచుండెను. వ్యవసాయ మభివృద్ధియం దుండెను. హిందూదేశమునందలి మగ్గములమీద తయా రయినసరకులే ఆసియా, ఐరోపాఖండములయందలి వర్తకశాలలయం దెచ్చటఁ జూచినను మారువలుకుచుండెను. ఇంగ్లండుదేశమునం దప్పుడప్పుడే తలచూపుచున్న చేతిపనుల యభివృద్ధినిమిత్తమై బ్రిటిషుపార్లమెంటువారును, తూర్పుయిండియాసంఘమువారును, నూరుసంవత్సరములక్రిందట కేవలస్వలాభాపేక్షిత మగువాణిజ్యనీతి ననుసరించి మనపనివాండ్ర నందర నణఁగఁ ద్రొక్కి తమవారి నుత్సాహపరచిరి. పదునెనిమిదవ శతాబ్దాంత్యభాగమునను, పందొమ్మిదవశతాబ్దప్రథమభాగమునను వా రవలంబించినవ్యవస్థితనీతియును గూడ నిటులే యున్నది. గ్రేటుబ్రిటనుదేశమున జరుగుచేతిపను లన్నిటికిని హిందూదేశము దాస్యము సేయుచు నచ్చట పనిచేయు కర్మ (యంత్ర) శాలలకును మగ్గములకును వలయువస్తువుల నెల్ల పండించి పుట్టినసరకులఁ బుట్టినట్లుగఁ

బంపవలసి వచ్చెను. ఈనీతి ననుసరించుటయందు వారి కీపఁశ్చాత్తి మయిన కొంకును జంకును లేక యెదుటివారిప్రాణముల మీఁదికిఁ దెచ్చి తాము జయప్రదముగఁ బని చేసికొనిరి. మనదేశమునం దున్న శిల్పు లందరిచేతను కంపెనీవారికర్మశాలలయందే పనిచేయింపవలయునుగాని మరియొకచోట పనిచేయనీయకూడ దనునుత్తరవులు పుట్టెను. హిందూదేశమునందలి నేతగాండ్రసరకులమీఁదను, వారిగ్రామములమీఁదను విదేశవర్తకులయధికారము నిరంకుశముగ నుండెను. వారేదుండగము లొనరించినను, అవి యన్నియు మంచివే యనుటకు చట్టములు పుట్టెను. అంతకుము న్నాంగ్లేయదేశమున కెగుమతి చేయఁబడు పట్టువస్త్రములకును నూలువస్త్రములకును విశేష మయినపన్నులుకట్టి యాదేశమున కెగుమతిగాకుండఁ జేసిరి. ఆంగ్లేయదేశమునందు తయా రయిన సరకు లన్నిటికిని పన్నులు లేకుండనో, లేక నామకార్థము కొలదిపన్నులు వసూలు చేసియో మనదేశమున బ్రదుకుతెరవు చూపఁబడెను.

బ్రిటనుదేశపుపనివాండ్రు "తమతోడ పోటీకి పనిచేయుహిందూదేశపుపనివాండ్రను జయింపలేక రాజకీయాధర్మ మనుశస్త్రమును బూని వారి గొంతుకలనుంగోసివేసిరి. లేకున్న సమానధర్మముగ పని చేయునంతవఱకును వీ రెప్పుడును వారిని జయింపలేకపోయి యుందురు" అని "హెచ్. హెచ్. విల్సను." అనుచరిత్రకారుఁడు వ్రాసి యున్నాడు. వేనవేలు హిందూదేశపుపనివాండ్ర నోటికడ నన్నము పోయెను. మనదేశప్రజనుల నైశ్వర్యమున కిందుమూలమున నొకగొప్పయాధారము పోయెను. ఇత్యాది బ్రిటిష్ప్రభుత్వమువారి మనదేశపరిపాలనాచరిత్రములోని దుఃఖకర మయిన యుపాఖ్యానము. అయిన నిది హిందూదేశవాసులు కేవలమును వ్యవసాయమునే యేల యపేక్షించియుండవలసివచ్చినదో దానికి తగుసమాధానము చెప్పుటకును, హిందూదేశవా



సుల యార్థికస్థితిని తెలియఁజేయుటకును చెప్పవలసినకథ యయియుండెను. ఐరోపాఖండమునందు మరమగ్గము లుత్పన్న మయినతోడనే మనదేశపరిశ్రామికముల నాశనము పూర్ణ మయ్యెను. ఈనడుమ మనదేశమునందు కూడ మరమగ్గములమీఁద పనిచేయుయంత్రశాల లేర్పరుపఁబడినపు డాంగ్లేయులు స్వలాభాపేక్షితు లయి మరల నన్యాయముగఁ బ్రవర్తించిరి. హిందూదేశమున తయా రయిననూలువస్త్రముల కెల్ల నొక యెగుమతిపన్ను వసూలు చేయఁబడుచున్నది. అందువలన మనదేశపుపనివాండ్రు జపాను, చీనాదేశపుపనివాండ్రతో పోటీగ నిలుచుటకు శక్యముగాకున్నది. ఈకారణముచేత మనదేశమునందలి యావిరియంత్రములుకూడ పైకి రాలేకుండ నున్నవి.

ఇంక వ్యవసాయ మొక్కటియే యిపుడు హిందూజాతివారి నైశ్వర్యమునకు మూలాధార మయినది. నూటి కెనుబదిమంది వ్యవసాయమే జీవనాధారముగాఁ గలవారయి యున్నారు. కాని బ్రిటిషుదొరతనమువారిచే వసూలు చేయఁబడుచున్న భూమిపన్ను లమితముగా నున్నవి. ఈపన్ను లయినను శాశ్వతముగ నొక్కమాదిరినే వసూలుచేయఁబడునవికాక, యిచ్చవచ్చినపు డెల్ల ననేకరాష్ట్రములలో మారుచుండును. ఆమార్పు లెంతటితో నిలుచునోకూడ తెలిసికొనుట కవకాశము లేకయున్నది. 1798 సంవత్సరమునకుపూర్వ మొకనూరుసంవత్సరము లాంగ్లేయదేశమున రాబడిలో భూమిపన్ను నూటికి 5 మొదలు 20 వరకు నుండెడిది. దానిని కూడ "విల్లియమ్పిట్టు" అనునాతఁడు ఎన్నటికిని మార్పు లేకుండ శాశ్వతముగ నుండుటకును అసలే ఇయ్యనక్కఱ లేకుండ విడిపించుకొని యనుభవించుటకును దగినశాసనము లేర్పరచెను. 1793-1822 సంవత్సరములమధ్య బంగాళాదేశమునందు రాబడిలో నూటికి తొంబదివంతునను ఉత్తరహిందూస్థానమున నూటి కెను

బదివంతుననుభూమిపన్ను లేర్పరుపఁబడెను. వీరిపూర్వపరిపాలకులగు మహమ్మదీయులు కూడ వీరివలెనే యమితముగ పన్నులు కట్టుచు వచ్చిరి. వీ రనుసరించినదియు కట్టుటలో వారిమార్గమె కాని వారు కట్టిన పన్ను లన్నియును వసూలుమాత్ర మయ్యెడివి కావు. మనయిప్పటిదొరతనమువారిపన్ను లన్ననో నిష్కర్షగ దమ్మిడీలతో వసూలు చేయబడుచున్నవి. బంగాళాదేశమును బరిపాలించినకడపటిమహమ్మదీయ ప్రభునికాలమున అనగా 1764 వ సంవత్సరములో భూమిపన్ను 8,17,553 పౌనులు (1 పౌను=15 రూ). తరువాతి ముప్పదిసంవత్సరములలో బ్రిటిషుదొరతనమువారు 26,80,000 పౌను లారాష్ట్రమునం దొక్కయేట రాఁబట్టిరి. 1802 వ సంవత్సరమున నయోధ్యనవాబు బ్రిటిషుదొరతనమువారి కుత్తరహిందూస్థానమున "అల్లహాబాదును" దానితోఁ జేరినభాగ్యవంతములగుమఱికొన్ని జిల్లాలను నిచ్చివేసెను. ఆజిల్లాలు ఆనవాబు బ్రిటిషువారి కిచ్చువరకు కట్టియున్న భూమిపన్నులు 13,52,347 పౌనులు. మనదొరతనమువారిచేతఁబడినమూడుసంవత్సరములలో 16,82,306 పౌనులకువృద్ధి యయ్యెను. చెన్న రాష్ట్రమున మొదట కంపెనీవారిపరిపాలనాకాలమున భూమిపన్ను పండినపంటలో సగభాగము. బొంబాయిరాజధానిలో 1817 వ సంవత్సరమున మహారాష్ట్రులవద్దనుండి గైకొనినప్రదేశములయం దప్పటికి భూమిపన్ను లక్షపౌను లుండెడిది. తరువాత వీరిచేతఁబడిన కొన్ని సంవత్సరములలోనే 15 లక్షలకు వృద్ధిచేయఁబడెను. అప్పటినుండియు: క్రమక్రమముగా వృద్ధి సేయఁబడుచున్నవి. హిందూదేశమంతయును దిరిగి యందుఁగలస్వదేశరాష్ట్రములను, బ్రిటిషురాష్ట్రములను చూచిన "హెబ్బరు" అను మతబోధకుఁడు "స్వదేశపరిపాలకుఁ డెవ్వఁడును మనము కట్టినన్ని పన్నులు కట్ట నేరఁడు" అని 1826 వ సంవత్సరమున వ్రాసి యున్నాఁడు. "ఐరోపాఖండమునందుఁ



గాని ఆసియాఖండమునందుగాని భూమిఖామందునకు వచ్చెడురాబడియావత్తును లాగివేయునిప్పటిహిందూదేశపుపన్నులవంటి పన్నులు మున్నెప్పుడు నేపరిపాలకుఁడును కట్టి యుండఁడు" అని 1830 సంవత్సరమున "కర్నలుబ్రిగ్సు" అనునతఁడు వ్రాసెను.

బ్రిటిషుపరిపాలనాప్రారంభమున బంగాళాదేశమునందును ఉత్తరహిందూస్థానమునందును గట్టినపన్నులబాధనుండి యారాష్ట్రములప్రజలు క్రమశః కొంత విశ్రాంతి నొందిరి. బంగాళాదేశమున శాశ్వతపన్ను లేర్పడియెను. వ్యవసాయాభివృద్ధితోకూడ పన్నులు వృద్ధికాలేదుగనుక రోడ్డుపన్నులును, తీర్వాజాస్తి, మొదలయిన వన్నియును గలుపుకొని భూమిఖామందునకు వచ్చెడునాదాయములో ఇప్పుడు నూటికి రు 35 లవంతున తేలినది. ఉత్తరహిందూస్థానమున శాశ్వతపుపన్ను లేర్పడలేదుకాని, 1855 సంవత్సరమునఁ బన్నులు కొంతవరకుఁ దగ్గింపఁ బడినవి. అప్పుడు అన్ని శెస్సులు చేరి రాఁబడిలో నూటికి ఏబదివంతున నుండునట్లు తగ్గింపఁబడినది. ఇప్పుడు నూతనముగఁ గొన్ని శెస్సులు చేర్పఁబడినవి. రాఁబోవుపంట లన్నిటిని లెక్కలు వేసి రాఁబడిమీఁద నూటికి 60 వంతున వచ్చువరకు వృద్ధిచేయఁబడినది.

బొంబాయి,మదరాసు రాష్ట్రములయం దీవిషయము లింతకన్న ఘోరముగా నున్నవి. ఇచ్చట పన్నులు చెల్లించువా రందరును సామాన్యముగ వ్యవసాయదారులె. వ్యవసాయదారులకును, దొరతనమువారికిని బాలప్రదేశములలో నడుమ భూస్వాములనువారు వేరే యొకరు లేరు. 1864 వసంవత్సరమున దొరతనమువారు, రైతుకు మిగిలెడునికరాదాయములో సగభాగము భూమిపన్ను కట్టఁబడు నని ప్రచురించి యున్నారు. అయితే, ఆఅర్ధభాగ మనునది నికరాదాయములోఁ గాక పండినపంటలో నర్ధభాగమును వసూలు చేయుచున్నారు. వ్యవసాయదా

రునకు వానికూలిపనియును, విత్తనములఖర్చును తప్ప మరి యేమియును మిగులకుండునట్లు చేసిరి. భూమిపన్ను ముప్పదిసంవత్సరముల కొకతూరి మార్పు చేయఁబడుచుండును. వ్యవసాయదారున కాపన్ను లే ప్రకారమున హెచ్చుచేయఁబడుచున్నవో తెలియదు. మార్పు చేసినప్పెల్ల శిస్తు లిచ్చుకొనవలెను. లేదా తాతతరములనుండి యున్న భూములను విడిచి చావవలెను. భూమిపన్ను లిట్లంతము లేక మార్పు చెందుటచేతనే వ్యవసాయమంతయును క్షీణించినది. ఆదాయము నశించినది. దున్నుకొని బ్రతికెడువానికి ఋణములు హెచ్చినవి. దారిద్ర్యదశ వానియింట మారుపలుకుచున్నది.

ఈసంగతులనుబట్టి చూడగా మనదేశమున భూమిపన్నులు మిగుల హెచ్చుగ నుండుటయును, నవియైనను నిరంతరమును మార్పుఁ జెందుటయు నేగాక చక్కఁగఁబరిపాలింపఁబడు నితరదేశములయందుపన్నులు హెచ్చించెడుపద్ధతులకును మనదేశమునందుఁ గట్టెడుపద్ధతులకును నేమియును సంబంధమే లేకయున్నది. ఇతరదేశములలోని యైశ్వర్యమభివృద్ధియగుటకుఁ బ్రభువులు సహాయముఁ జేయుదురు. జనులు ద్రవ్యము నార్జించుకొనుటకుఁ దగినయిరవుఁ జూపుదురు. వారి బాగుగ నుండి భాగ్యవంతులగుచో చూచి సంతసింతురు. అటుపైని దేశపరిపాలనకై వారియాదాయములోఁ గొలఁదిభాగమును గైకొందురు. హిందూదేశమునందన్ననో భూమివలన దొరికెడుఫల మేదయినను సేకరింపవలెనన్న, తామందులోఁగూడ జోక్యము కలుగఁజేసికొనుచున్నారు. దున్నుకొని బ్రతికెడువారియాదాయ మంతయును దారిలోనిది. దారిలోనే యున్నకొట్టుచున్నారు. క్రొత్తసెటిల్మెంటు వచ్చినప్పుడెల్లభూమిపన్నులు వృద్ధిచేయుచు వ్యవసాయదారుల నందఱను నిత్యదరిద్రులఁ జేసివిడుచుచున్నారు. ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాన్సుదేశములయందేమి, సంయుక్తరా



ష్ట్రములయందేమి, తదితరదేశములయందేమి దొరతనమువారు జనుల యొక్క రాఁబడి వృద్ధిచేయుదురు. వారిసరకుల నమ్ముటకుఁ గ్రొత్తక్రొత్త ప్రదేశములను జూపెదరు. వారి యైశ్వర్య మభివృద్ధి యగుటకుఁ దగినయాధారములఁ గనిపెట్టెదరు. జనులతో వారేకభావమునుందెదరు. వేయేల? జనులను భాగ్యవంతులను జేసి తాము భాగ్యవంతు లగుదురు. మనదేశమునం దట్లుకాదు. దొరతనమువారు జనులనిమిత్తమై క్రొత్త పరిశ్రామికముల నేమియు సంరక్షించుట లేదు. అడుగంటినపురాతన పరిశ్రామికముల పునరుజ్జీవింపఁ జేయుటయు నైన లేదు. పైపెచ్చు క్రొత్త సెటిల్మెంటు వచ్చినపుడెల్ల భూమిపంటలోఁ దమ కేమిరావలెనో దానిని తామే నిర్ణయించుకొని లాగుకొనుచుందురు. అట్టిసమయములయందెల్ల దొరతనమువారేమి తమక్రింద దిగఁద్రొక్కుకొని రైతుల కేమి నిలుపుదురో యని మదరాసు, బొంబాయిరాష్ట్రములయం దుండుప్రజల గుండెలు పీచుపీచు మనుచుండును. ఈపోరాట మనఁ దానికి నిది శాస్త్రమని లేదు. ఇది హద్దని చెప్ప వీలులేదు. పన్నులు వసూలుచేయు నధికారులయభిప్రాయమే కడపటియభిప్రాయము. దానిపై నప్పీలు లేదు. దీనిని తీర్చుటకు న్యాయాధిపతులు లేరు. కోర్టులు లేవు. పన్ను లభివృద్ధి యగుచున్నవి. జనులు కూటికిఁగూడ టికాణ లేకుండ పోవుచున్నారు.

"గీ॥ ఇలను గలచెమ్మ యెల్లను ♦ నినుఁడు పీల్చి
యవని కడుసారవంతమై ♦ యలరుకొఱకు
వర్షధారలఁ గురిసెడు ♦ పగిది నెపుడు
రాజు పన్నులు గొనవలె ♦ ప్రజలకడను."

మనదేశములోని చెమ్మ యంతయును విశేషముగ నితరదేశముల ఫలవంతముచేయ వర్షించుచున్నది కాని మనదేశమున వర్షించుట లేదు. దే

శమునఁ బన్నులమూలముగఁ జెల్లెడుద్రవ్య మంతయు నితరదేశమునకుఁగాక తనదేశమునకే యుపయోగపడవలె నని ప్రతిజాతీయుఁడును గోరుచుండును. హిందూదేశమును బూర్వము పరిపాలించినప్రభుత్వ మెంతపాడుప్రభుత్వ మయినను నీవిషయమునమాత్ర మట్లు జరుగలేదు. అఫ్‌గన్ చక్రవర్తులును, మొగలాయిచక్రవర్తులును సైన్యములకై యెంతసొమ్ము వెచ్చించినను, ఆసొమ్మువలనఁ గొన్నికొన్ని రాజకుటుంబములు బాగుపడినవి. లక్షలకొలదిసిపాయిలకును వారికుటుంబములకును బ్రతుకుతెరువు గలిగెను. వా రెన్నెన్ని దివ్యమందిరము లెంతెంతయద్భుతముగఁ గట్టించినను, వారిపేరును వీరిపేరును జెప్పి జ్ఞాపకార్థమునకై యెట్టికట్టడములనిర్మాణముఁ గావించినను, ఎంతెంతసొమ్ము వినోదములకని తమాషాలకని గొల్లవెట్టినను, ఆద్రవ్య మంతయు మనదేశములోని పనివాండ్ర యుదరపోషణమునకే వినియోగపడినది. అందువలన నాయాపనివాండ్రశిల్పములన్నియును వృద్ధి నొందఁగలిగినవి. సరదారులు, సేనానాయకులు, సుబేదారులు, దివానులు, ఖాజీలు మొదలగువా రందరునుగూడఁ బ్రతిరాష్ట్రమునందును, బ్రతిజిల్లాయందును తమతమదారలమార్గమునే యనుసరించిరి. మసీదులు, దేవాలయములు, రాచబాటలు, కాలువలు, చెరువులు మొదలయిన వన్నియును వారిదాతృత్వమునే చాటుచున్నవి. అవి యొకవేళ డాంబికమునకే యొనర్చి రనుకొందము. అట్లయినను దేశమునకుఁగలిగినకొదువ యేమియును లేదు. మంచిప్రభుత్వమునందును, జెడ్డప్రభుత్వమునందును గూడ పన్నులమూలముగఁ బోవుద్రవ్య మంతయును బ్రజలదిక్కునకే తిరుగఁబ్రవహించి వారివాణిజ్యములును, వారిపరిశ్రమికములు నభివృద్ధిగావించి దేశమునుఫలవంతముఁ జేసెను.

కాని, తూర్పుఇండియాసంఘమువారి యేలుబడిక్రింద మనదేశము



నకు మార్పు ప్రారంభమయినది. వారికన్నుల కీహిందూదేశ మైరోపాఖండవాసుల స్వంతజాగీరుగఁ గానుపించినది. అందువలన నిందలిసొమ్ములెల్ల నేదో యొకవిధముగ నాకర్షించి తమదేశమునందు పోగుఁబెట్టుటయే వారికి విధ్యుక్తధర్మ మయ్యెను. హిందూదేశపరిపాలనమునందలి పెద్దపెద్దజీతములు గలయుద్యోగము లన్నియు వారివారికయి యుద్దేశింపఁబడినవి. ధనాపేక్షచే మనదేశమున కచ్చటనుండి చేరువారికి యుద్యోగము లన్నియు నీయఁబడుచు వచ్చినవి. మనదేశమునఁ జెల్లెడుపన్నులలోని ద్రవ్యము పెట్టియే యిక్కడ వర్తకవుసరకులను గొని యాసరకు లన్నియు నింటికిఁ దీసికొనిపోయి యమ్ముకొనసాగిరి. వర్తకమునకై పెట్టుబడి పెట్టినధనముమీద దారుణముగ వడ్డీ లాగఁజొచ్చిరి. పన్ను లపరిమితముగఁ గట్టిరి. పరిపాలనకై కావలసినఖర్చులు మిక్కిలి కుదించుచు వచ్చిరి. ఏదో యొకవిధమున సొమ్ము మిగిల్చి యది యంతయును దమదేశమునకు లాగుకొనిపోవ మొదలుపెట్టిరి.

**1833** సంవత్సరమున తూర్పుయిండియాసంఘమువారివర్తకమునకు స్వస్తి చెప్పఁబడినది. **1858**సంవత్సరమున కంపెనీయే రూపుమాపఁబడెను; కాని వారిరాజనీతిమాత్ర మింకను నచ్చుచునే యున్నది. తూర్పుయిండియాసంఘసంస్థాపనమునకై వెచ్చింపఁబడినమూలధన మంతయును దొరతనమువా రప్పుతెచ్చి తీర్చివేసిరి. ఆయప్పు మనజాతీయఋణము. దానికి చెల్లించవలసినవడ్డీయెల్లను మన మిచ్చుపన్నులలోనుండి చెల్లింపఁబడుచున్నది. కంపెనీవారిసామ్రాజ్య మంతయు ప్రభువులయధీన మయినది; కాని యందులకుఁ గావలసినకొనుబడిసొమ్మంతయును మనదేశప్రజలే యిచ్చుకొన్నారు. **1857**వసంవత్సరమున హిందూదేశపుఋణము **51**కోట్లరూపాయీలు. **1862** సంవత్సరములో నది **97** కోట్లయినది. తరువాత నలువదిసంవత్సరములు రాజ్యము నిమ్మకు నీరువోసిన

ట్లున్నది; కాని 1901 సంవత్సరమునం దీఋణము లెక్కచూడఁగా 200 కోట్లయినది. మనదేశమునుండి మహాబ్రిటను దేశమునకు "యింటిఖర్చులు" (Home charges) క్రింద ఇరసాలు చేయఁబడుసొమ్ము మొత్తము పూర్వముకంటె 16కోట్లరూపాయాలు హెచ్చినది. పెద్దపెద్దయుద్యోగము లన్నియు నైరోపావాస్తవ్యులవే. వారియుద్యోగముల కిచ్చుజీతములు 10కోట్లరూపాయిలు. 44 కోట్లరూపాయ లీగ్రంథము వ్రాయునప్పుడు మనదేశమున వచ్చెడునికరాదాయము. అందులో సగముసొమ్ము ప్రతిసంవత్సరమును మనదేశమునుండి తరలిపోవుచున్నది. దీనినిబట్టి చూడ మనదేశపుసొమ్మువలనఁగాదా యితరదేశములు సారవంతము లగుచున్నవియును; శ్రీమంతము లగుచున్నవియును?

హిందూదేశపరిపాలనమునందే తనజీవితకాలములోని మేలిభాగమునెల్లఁ గడపినవానికి ఆపరిపాలనమునందలి లోపములనే బయటపెట్టుట చాల కష్టమయినసంగతియే యగును; కాని చిరకాలమునుండి యిచ్చటనే యధివసించుచున్న నీదారిద్ర్యదేవతయొక్క పూర్వోత్తరములు కనుఁగొనుటకై యీకథ యంతయును జెప్పుట యత్యవసర మయ్యెను. అందువలన హిందూదేశపరిపాలనము వారి యార్థికస్థితి యంతయును విశదముగఁ జెప్పవలసివచ్చెను. దేశములోని పరిశ్రామికము లన్నియు నశించిపోయినవి. వ్యవసాయ మంతయును పన్నులభారముచే లేవలేకయుండెను. దేశమున సమకూరెడుద్రవ్యములో సగపాలు యితరదేశములనుండి వచ్చిన యుద్యోగస్థుల జీతములకే పోవుచుండెను. ఇట్టిస్థితిలో నున్నప్పుడు దేశ మెంత భాగ్యవంత మైనదైన నేమి? కరవుల కేమికొదువ యుండునో యోచించి చూడుఁడు! ఐశ్వర్య మభివృద్ధియగు నాధారములు విలువైనమొదళ్ళు, పన్నులమూలముగఁ జెల్లెడుద్రవ్యమంతయుఁ బ్రజలకొఱకే వెచ్చింపఁబడిన మొదళ్ళ, దేశమభివృ



ద్ధిలోనికి రాఁగలదు. డబ్బువచ్చెడునాధారము లన్నియు సన్నగిల్లి, వచ్చెడుడబ్బులు రెండును దేశమునుండి తరలిపోవునేని దేశము పేదపడఁగలదు. ఈరెండును ఆర్థికశాసనములలోని ప్రథమనిబంధనలు. ఇవి హిందూదేశమున కొకటియును, మరియొకదేశమునకు మరియొకటియును కావు; దేశమునందలిపరిశ్రామికములు వృద్ధియగునంతవరకును, భూమిపైఁబడెడుపన్నుల కేదియో యొకశాశ్వతపద్ధతి యేర్పడి యది యింత యని తేలెడువరకును, దేశమున పన్నులమూలమున వచ్చెడుడబ్బు విశేషముగ దేశముననే ఖర్చుపడుటకు తగినమార్గ మేర్పడువరకును, హిందూదేశదారిద్ర్యము వదలనేరదని ప్రతిరాజనీతివిశారదునకును, ప్రతిపరిపాలకునకునుగూడ నాత్మానుభవమయ్యెడివిషయము.

మనదేశమున రాజకీయవ్యవహర్తలును, బరిపాలకులును నొకవిధమయినచిక్కులోఁ బడి కొట్టుకొనుచున్నారు. వెలిస్లీప్రభువును, మనయిప్పటిగవర్నరుజనరలుగారి తాతగారగు మింటోప్రభువును, హేస్టింగ్సుప్రభువును, వరుసగ ముగ్గురుగవర్నరుజనరలులు మనదేశమున భూమిపన్నున కేదో యొకశాశ్వతపద్ధతి నేర్పరుపవలెనని చూచిరి; కాని యది మెల్ల తూర్పుయిండియాసర్కారువారు సాగనిచ్చినారు కారు. రాజ్యము ప్రభువులయధీన మయినతరువాతఁగూడ "కానింగు" "లారెన్సు" "రిప్పను" అనుముగ్గురుగవర్నరుజనరల్సు అందులకు మరలఁ బ్రయత్నించిరి. ఈసారి వీరియాలోచనను స్టేటుశెక్రిటరీగారు సాగనిచ్చినారు కారు. బ్రిటిషుదేశపు పనివాండ్ర యాజ్ఞచొప్పున మనతరమున మూడుసారులు సరుకులమీద దేశలాభమునకు హానికరముగఁ బన్నులు వృద్ధిచేయఁబడెను. చాలసారులు గవర్నరుజనరలు కమిటీలోని మెంబరుల యభిప్రాయముగూడ నీవిషయమునఁ ద్రోసివేయఁబడెను. అస్సాముదేశమున తేయాకుతోటలు విదేశీయులవలన వేయఁబడినవి. అక్కడకూలీ

లులేవు. అచ్చటికిఁ బంపఁబడినకూలీలు కేవల మా తోఁటలయజమానులకు బానిసలై స్వేచ్ఛయంతయుఁ గోల్పోయినారు. ఆదేశమునకుఁగూలీలను సప్లయిచేయుట కొక చట్టము పుట్టినది. అటకుఁ బంపెడివారికంటరికిని గొన్ని కరారులు చేసి వారినల్లఁ గంట్రాక్టు వ్రాయించుకొని పంపించెదరు. ఆకంట్రాక్టు లన్నియును సామాన్యముగ నిచ్చటనుండి లాభమునుపొందు ఏజంట్ల మోసకృత్యములవలనఁ బుట్టుచుండును. ఈ కరారునామాలవలన స్వతంత్రమెల్లను బోయి జీవించువారిబ్రతుకెల్ల చూచి,యీనర్థము మూఁడుదఫాలను వారి కుపకారముఁ జూపఁ బ్రయత్నములు జరిగెను; కాని యవి యెవ్వియు నెరవేరినవి కావు వారిని వారితోఁటలకే దాసులనుజేయు శిక్షాశాసనము లింకను శాసనములసంపుటముల నలంకరించుచున్నవి. అస్సాముచీఫ్ కమీషనరుగా నుండి యిప్పుడు పార్లమెంటులో మనయిండియాపార్టీకి నాయకుఁడుగా నున్న "సర్ హెన్రీకాటను" గారు ఆయాకూలీలకుఁ దగినవేతన మీయవలెనని చేసినయేర్పాటులన్నియును,గవర్నరుజనరలువారిసభలోఁ ద్రోసివేయఁబడెను. తేయాకుతోఁటలపై పెట్టుబడి పెట్టినబ్రిటిషుభాగస్వాములు వలదనుటచే "కర్జను" ప్రభువువా రాయేర్పాటులను రెండుసంవత్సరములవరకును నిలిపియుంచుట కుత్తరువులుచేసిరి. ఇట్టిసమయములయందు హిందూదేశమునందలి పరిపాలకులు కేవలము చేతగానివారలగుచున్నారు. మనదేశమునందలి పన్నుల కొకన్యాయమయిన మితి యేర్పరుపఁబడవలెనని చేసినప్రయత్నము లన్నియు నాంగ్లేయస్థానికపరిపాలకులవలనఁ ద్రోసివేయఁబడినవి. మనదేశప్రజల సంరక్షణకై వలయువిధు లన్నియు భిన్నముగావింపఁబడెను. ఇది యంతయును పార్లమెంటుసభికుల నేర్పాటుచేయసమర్థులగు నాంగ్లేయదేశధనికులకుఁగాని పనివాండ్రకుఁగాని యేదో నష్టముసంభవించు ననుభయముచేత నేసుఁడీ!



మనదేశప్రజలరక్షణనిమిత్తమయి యున్న పరిపాలకు లయినను పట్టుదలగలవారు కాకయుండిరి. ఇండియన్ దొరతన మనఁగా గవర్నర్ జనరల్ గారును, సేనాధిపతియును, సైనికసభ్యుఁడును, పబ్లికువర్కుల శాఖాపక్షమున నేర్పడిన సభ్యుఁడును, ఆయవ్యయముల నడుపుచుండుసభ్యుఁడును, శాసననిర్మాతయును; నై యున్నది. జనులపక్షమున నీసభలో నుండువా రెవ్వరును లేరు. వారివ్యవసాయములుగాని వారిభూస్వామ్యమునుగాని, వారివాణిజ్యములనుగాని, వారిపరిశ్రమికములనుగాని యీసభయందు సమర్థింపఁబూనువా రెవ్వరును లేరు. ఈసభయందు స్వదేశీయుఁడైనసభ్యుఁ డిదివర కెప్పుడును లేఁడు. హిందూదేశవ్యయవిమర్శననిమిత్తమై యేర్పడినసంఘములో సాక్ష్యము నిచ్చియున్న "కాల్విను" గారును, "బార్బరు" గారును ఈసభికులనుగూర్చి ప్రసంగించుచు వీరు కేవల ధనవ్యయమును జేయ నేర్పడిన శాఖల కధిపతులని చెప్పినారు. ఈసభికు లందరు నిస్సంశయముగ ప్రజలయోగక్షేమమును సంరక్షింపవలసిన యాంగ్లేయదేశవాసులగు గొప్పగొప్పయుద్యోగస్థులే యయి యున్నారు. వారివారియుద్యోగధర్మములనుబట్టి వారివారిడిపార్టుమెంటు బాగుగ పనిజరుగుటకై యవసరమునుబట్టి విశేషద్రవ్యమును బోగుచేయవలసినవా రగుచున్నారు. ఈసంగతులను చెప్పఁగొనుస్వదేశీయు లెవ్వరు నాసభయందు లేరు. అందుఁ జెప్పువా రందరును ఖర్చుచేయు మనువారలే కాని యడ్డుచెప్పువా రొక్కరును గానరాకున్నారు. "అర్థికశాఖవారిచే నేదో యొకవిధముగ ద్రవ్యము ఖర్చుచేయించుటకై తొత్తరము తెచ్చిపెట్టుటయే వారికి ప్రాంతమైపోయినది. ఇతర డిపార్టుమెంటువారు ఎల్లప్పుడు ఖర్చుచేయు మనువారలే. వారికోరికలకు విరుగు తరుగు నుండదు" అని "బార్బరు" గారు చెప్పియున్నారు. ఖర్చు తగ్గింపు మనువారుగాని, పన్నులు మితముగఁ బుచ్చుకొనుఁడను

టకుఁగాని, ప్రజల వ్యవసాయక్షేమమును సంరక్షించుకొనుటకుఁగాని, వారిపరిశ్రామికములకును జేతిపనులకు నుత్సాహము గలిగించు మనుటకుఁగాని యెదిరించి చెప్పువా రెవ్వరును లేరు. మనదేశప్రభుత్వమే, విదేశీయ మైనది. దానియవయవ నిర్మాణ వైచిత్ర్యమువలన నది మరింత బలక్షీణము నొందుచున్నది. ఎంతెంత పెద్దవిషయము లైనను గొంచె మించుమించు ఏకపక్షవిమర్శనముమీఁదనే తీర్మాన మగుచున్నవి. ఆసభలో నుండుసభ్యు లందరును సమర్థులు, బుద్ధిమంతులు, అనుభవజ్ఞులు, మనస్సాక్షికి వ్యతిరేకముగఁ బ్రవర్తించువారు కారు; కాని న్యాయవిమర్శకుఁ డెంతవివేకవంతుఁ డైన నొక్కపక్షమువాని సాక్ష్యమును మాత్రమే వినినయెడల కేజులు న్యాయముగాఁ దీర్మానింపలేఁడు. మనదేశప్రభుత్వమున వారు చేయవలసినపనిని విధ్యుక్తముగఁ జేయవలెనని యెంతదొరలినను బ్రజలతోఁ దమకుఁ గలయిక లేనంతవరకును బ్రజలతోఁ గూడి పనిచేయుటకు వా రంగీకరించ నంతవరకును బ్రజలయొక్క యార్థికయోగక్షేమములు సమకూడనేరవు. ఇప్పటివారిప్రభుత్వపద్ధతి యందులకు మిక్కిలి భిన్నమైనదిగా నున్నది.

“ఏజాతివారి నాజాతివారే పరిపాలించుకొనినచో నది యన్వర్థముగ నుండును. అందు పరమార్థ మున్నది. ఒకజాతివారిని మరియొక జాతివారు పరిపాలించుట పొసంగదు. పొసంగిన నది నిలుపుట శక్యము కాదు. ఒకజాతివారిని మరియొకరు పరిపాలింతురుగాని యది కేవలస్వప్రయోజనమునకే; అప్పు డది ద్రవ్యార్జన కేర్పడిన స్థానము. తనప్రజలలాభమునిమిత్తమై యుపయోగించుకొను మనుష్యరూపముగ నున్న పశుక్షేత్రము.” అని “జానుస్టూవర్టుమిల్ ” అను చరిత్రకారుఁడు వ్రాసి యున్నాఁడు.

చాల గాంభీర్యముగ వ్రాయఁబడిన నీతని యీవాక్యము మొ



ట్టమొదట సామాన్యముగనే కానుపించును గాని విమర్శించినకొలఁది దానియాథార్థ్యస్థితి తేటపడక మానదు. ఒకజాతివా రన్యజాతివారిని పరిపాలించుదొరతన మెట్టిదొరతన మయినను దమకు లోఁబడియుండు ప్రజలక్షేమమునిమిత్తమయి ప్రభుత్వము గావించిన యుదాహరణ మొక్కటియును జరిత్రయం దెందును గాన్పించదు. పరిపాలనావిషయమున వారికిఁ గూడ కొంతసంబంధ ముండిననేగాని పరిపాలింపఁబడు జాతివారి యోగక్షేమము పరిపాలకజాతియే సంరక్షించుటకుఁ దగినయేర్పాటు లెవ్వియును మానవజాతియం దింతవరకును జరిగి యుండలేదు. పయిపెచ్చు అట్టి యహంకర్తృత్వ మవలంబించిన ప్రత్యేకప్రభుత్వము నా పరిపాలకసంఘమునకైనను క్షేమకారి కాదు. ఆంగ్లేయదేశవాణిజ్యము హిందూదేశమునం దాంగ్లేయులకుఁ గలప్రియతమ మయినవ్యాపారములలో మేటియైనది. అది గడచిన పదిసంవత్సరములనుండియు నొక్కరీతిగ నున్నది. హిందూదేశమున దిగుమతివర్తకపుసరకులలోఁ జాలభాగము బ్రిటిష్‌దేశపుసరకులే. అవి గడచిన పదిపండ్రెండు సంవత్సరములనుండి మొత్త మేఁబదికోట్లరూపాయిలకు మించి దిగుమతి యగుటలేదు. సరకులదిగుమతి నిలువఁబడి యున్నది గాని యభివృద్ధిలో లేదు. ఈదిగుమతుల విలువ జనసంఖ్యపై అర్జించి చూచినచో తలకు సంవత్సరమునకు మూఁడుషిల్లింగు లనఁగా ఇప్పటిలెక్కను రు 2-4-0, పూర్వపులెక్కను రు 1-8-0, అగుచున్నది. మనదేశపు ఐశ్వర్య మభివృద్ధియే గాంచినచో నది తలకు అయిదారు షిల్లింగులకు హెచ్చి యుండును. హిందూదేశమునఁ గాటకములును దారిద్ర్యమును హెచ్చినకొలఁది ఈఖర్చు తగ్గుచుండును. హిందూదేశమునకును మహాబ్రిటన్ దేశమునకును గూడ నైశ్వర్యాభివృద్ధికర మగునాధారములలో బ్రిటిష్ దేశపు వాణిజ్యము మేలయినది. అది హిందూదేశపు పేదతనముతో

క్షీణించి పోవుచున్నది. సరియైన లాభముఁ గలుగఁజేయక హిందూదేశపు పనములనుండి దీసికొనిన పన్ను హిందూదేశమును బేదవరచుచున్నదనియు, నందువలన నాంగ్లేయదేశమునకు బలము హెచ్చనేరదనియు, స్వతంత్రముగ నుండవలసిన యాదేశపువర్తకములకు వృద్ధి కలుగ నేరదనియు "సాల్సుబరీ" ప్రభువు చెప్పియున్నాఁడు. చేతిపనులఁజేసిదాని మరి యెక్కుడు తరపనులఁ జేసిదాని యభివృద్ధి నొందు జాతీయశక్తి సమానమైనలాభము గలుగఁజేయకయే పొందిన యైశ్వర్య మభివృద్ధి నొందనేరదు. అది మనుజున కెట్లో జాతికి నట్లే. మనము కష్టపడి తినిన తిండి దేహమున కుత్సాహమును బుష్టిని గలిగించును. పనిచేయకయే మనము తినిన తిండి మనదేహమునకు విషప్రాయ మయినదగును. పూర్వకాలమందేమి ప్రస్తుతపుకాలమునందేమి సామంతరాజ్యములనుండి విశేషములుగఁ గప్పములు గైకొనఁబడెనేని యవియెల్ల సుఖోపభోగములకు హేతుభూతములై యపవర్ధదాయకము లగునని పూర్వపుచరిత్రలవలన మనము నేర్చుకొనదగియున్నది. ఇదియే మనము చరిత్రలవలనఁ దెలిసికొనఁజాలమేని చరిత్రలు వ్రాయుట వృథాప్రయాస మని చెప్పవలయును.

బ్రిటిష్ కాలనీలు ప్రాముఖ్యమును బొందుటకుమున్నె హిందూదేశ సామ్రాజ్య మాంగ్లేయులకు లభించెను. ఈరోజులలో మనము చెప్పిన నది నిందాస్పదముగఁ గాన్పించును దాని బ్రిటిష్ సామ్రాజ్యమునుండి కాలనీ లన్నియును విడివడి తమబంధవిముక్తిఁ జెందినతరువాతఁ గూడ హిందూసామ్రాజ్య మిప్పటివలెనే యుండు నని యూహింపవలసియున్నది. కాలనీలన్నియును పండ్లవంటివి. అవి పక్వమగుట తోడనె తల్లివృక్షమునుండి వీడిపోవుటకే. ఇప్పటి జనసంఖ్యయును, బలమును, ఆధారమును గొంచెము వృద్ధియైనఁ జాలును. ఆస్ట్రేలియా, కెనడాల



లో, నీయిరువదవ శతాబ్ద మధ్యకాలమువర కైనను దల్లిరాజ్యమున కొదిగి యుండు నని చెప్ప శక్యము గాకున్నది. హిందూదేశపుప్రజలు మహాబ్రిటను దేశముతోఁ జాలకాలము తమ కనుబంధ ముండవలెనని మనఃపూర్వకమైన కోరిక గలిగియున్నారు. "డఫ్రిన్" ప్రభువుగారు చెప్పిన ట్లది తమ స్వలాభాపేక్ష చేతనేగాని కేవల రాజభక్తిచేఁ గాదు. పాశ్చాత్యప్రభుత్వమువలన పశ్చిమఖండవాసుల సంబంధము కలుగఁ జేసికొని విశేషలాభము నొందవలె నని యిప్పటికిని నమ్మియున్నవారు. మహాబ్రిటన్ దేశమునకును దమకు నీసంబంధము విధిలిఖిత మని యెంచుకొనినారు. బ్రిటిష్ పరిపాలనము దమ కనుగుణ్యముగ నుండినట్టు లేకీభావము నొందియున్నారు. ఈపరిపాలనమే నిలిచియుండవలెనని నిష్కపటముగఁ గోరుచున్నారు; కాని యీపరిపాలన మీరీతి నుండుట, ప్రత్యేక మొకనిలాభమునకే యేర్పడియుండుట, మాత్రము వారికిఁ గిట్టకున్నది. ఈపరిపాలనారూపము "వారన్ హేస్టింగ్సు" "కారన్ వాలిస్" అనువారలచే నేర్పరుపఁబడి, "మన్రో" "ఎల్ఫిన్ స్టన్" "బెంటింక్" అనువారలచే వృద్ధిచేయఁబడి డెబ్బదిసంవత్సరము లైనది. ఇప్పటికైనను సంస్కారము నభిలషింప కుండునా? ఈడెబ్బదిసంవత్సరములనుండి విద్యయభివృద్ధియైనది. విద్యావంతులు క్రమక్రమముగ దేశమున బలవంతులగుచున్నారు. తమదేశములోని గొప్పయుద్యోగములలోఁ దమకుఁ గొంతయధికారము గావలెనని వాంఛించుచున్నారు. ఈకోరికలను సూక్ష్మముగాఁ దిరస్కరింపవచ్చును. హిందూదేశవాసులలో విద్యావంతులయొక్కయు, పలుకుబడిగలవారియొక్కయు హృదయముల నన్యథాకరింపవచ్చును. అందువలన దేశములో నసంతుష్టియును విరక్తియును వృద్ధిచేయవచ్చును. ఈప్రత్యేకప్రభుత్వమునలన దేశమును క్షీణదశ నొందింపవచ్చును; కాని యిప్పు డిప్పుడు తలచూపుచున్న ప్రబలశక్తుల

నన ్నిటిని దొరతనమువారిపక్షమునకుఁ జేర్చుకొనుటయు, ప్రభుత్వవ్యాపారమునఁ బలుకుబడి కలవారికిఁ గొందరికిని విద్యావంతులకు కొందరకు నధికారము గలుగజేయుటయును దన్మూలమున వారివారిపరిశ్రామికములును వారివ్యవసాయవిషయములును వారికి లాభకరమగు నన్ని వ్యాపారములును వారే సమర్థించుకొన నిచ్చుటయును వారిదేశవాసుల యార్థికస్థితి నభివృద్ధిలోనికిఁ దెచ్చుకొని కాటకముల నింక, దేశములోనికిఁ జొరఁబడకుండఁ జేయుప్రయత్నములయందు వారే యుత్తరవాదులై యుండునట్లు చేయుటయును వివేకమయిన పనియైయుండును. "ఇతరులవ్యాపారములను జక్కఁబెట్టుటయందు మనమెంత నిష్కళంకమయిన యుద్దేశముతోఁ బ్రవర్తించుచున్నను వారిని జేతులు ముడుచుకొని కూర్చుండు మనుట శ్రేయస్కరము గాదు. ఎవ్వరైన నెవరివ్యాపారములను వారు స్వంతముగఁ జక్కఁబెట్టుకొనిననేగాని వారివ్యాపారములయందు వారికి స్థిరమయిన యభివృద్ధి కలుగనేరదు" అను "జాన్ స్టూవర్టుమిల్" అనుచరిత్రకారుని వాక్యము మరల నొకసారి మనము స్మరించుకొనవలసియున్నది.

హిందూదేశవాసు లొక్కసారిగఁ బ్రళయ మగుమార్పుల నపేక్షించువారు కారు. అందులకై వారు పెద్దపెద్ద విప్లవములకు లోనుగారు. రాజ్యాంగపద్ధతుల నొక్కమారుగఁ ద్రిప్పివేయు మని కోరఁబోరు. ఇదివర కేర్పడియున్న మార్గములనే పనిచేయ మేలుగ నెంతురు. ప్రస్తుతప్రభుత్వమును బలపరచి దొరతనమువారికిని బ్రజలకును చేరిక హెచ్చుగు మార్గముల నపేక్షింతురు. శెక్రెటరీ ఆఫ్ స్టేటు సభలోఁ గొందరు హిందూదేశసభ్యులును గవర్నరుజనరలు కార్యనిర్వాహకసంఘములోఁ దమవ్యవసాయ పరిశ్రామిక వ్యాపారములను సమర్థించు కొందరు సభ్యులు నుండవలె ననుచున్నారు. ప్రతిరాష్ట్రమునందును గార్య



నిర్వాహకసభయందుఁ గొందరు హిందూసభ్యు లుండవలె ననియును, బరిపాలనావిషయికమగు ప్రాముఖ్యమయిన ప్రతివ్యాపారములను జనులపక్షమునఁ గొందరుండి తమలాభనష్టములను ప్రభుత్వమువారితో చర్చించు చుండవలయు ననియు దేశప్రభుత్వ మంతయును ప్రభువులు ప్రజలతోఁ గూడి నడపుచుండవలెననియును వారికోరిక.

పెద్దపెద్ద ప్రతిరాష్ట్రమున కొకొక్క శాసననిర్మాణసభయున్నది. ఆసభలలో సభ్యులను గొందరిని ప్రజలు కోరుకొనుటకు 1892 సంవత్సరమున నొకచట్టము పుట్టినది. దానిని వ్యవహరించి చూడగా జయప్రదముగ నున్నది. ఆసభల నింకను వృద్ధిచేసి ప్రజాస్వాతంత్ర్య మందెక్కుడుగఁ గలుగఁ జేసినచోఁ బరిపాలన మభివృద్ధి నొందఁగలదు. ప్రతిరాష్ట్రమునం దిరువదియో ముప్పదియో జిల్లాలున్నవి. ప్రతిజిల్లాలోను పదిలక్షలకుఁ దక్కువ కాని జను లున్నారు. శాసననిర్మాణసభలో జిల్లా కొక సభ్యు నెన్నుకొనుటకుఁ దగిన కాలము వచ్చినది. ముప్పదిజిల్లాలను గలిగి మూడుకోట్ల జనసంఖ్య గలిగియుండు రాష్ట్రమున ముప్పదిమంది సభ్యులుగల శాసననిర్మాణసభ యుండుట యొకఘనకార్యము గాదు. రాష్ట్రపరిపాలనమున ప్రతిజిల్లాలోనివారును దమకు కొంతపలుకుబడి యుండవలెనని కోరుకొనుట వింతయా?

1833, 1853 సంవత్సరములలోను తరువాత 1858 వ సంవత్సరమున విక్టోరియారాణిగారు బాహాటముగఁ బ్రకటించిన వాగ్దానములను హిందూదేశమునందలి పెద్దపెద్దయుద్యోగము లన్నియు మాటకుమాత్రము ప్రజలకుఁగూడ నీయవచ్చునని చెప్పఁబడినవి. అట్టి వాగ్దానము లన్నియును పాశ్చాత్యదేశమునుండి యీదేశమునఁ బనులను సంపాదించుకొనవలెనని వచ్చు నాంగ్లేయబాలుర కొక్కరికే నిలిపియుంచకుండ బాహాటముగ జనుల కీయఁ బడవలెను. ఇండియన్ సివిల్ సర్వీసు యు

ద్యోగములే గాక విద్యాశాఖయందును ఇంజనీయరింగు డిపార్టుమెంటునందును తపాల తంతిశాఖలయందును పోలీసు డిపార్టుమెంటు వైద్యశాఖలయందును గూడ పెద్దపెద్ద యుద్యోగములు తమకు లభించు ననునాస ప్రజలకుఁ గలుగఁజేయవలెను. ఈడిపార్టుమెంటు లన్నిటియందాంగ్లేయులుగూడ నుండవచ్చును. అట్టివారికి మేమును స్వాగత మొసంగుదుము; కాని దేశమున పుట్టిపెరిగిన వారి నందరి నొత్తిగించి పెద్దయుద్యోగము లన్నియుఁ దామే గుత్తచేయవలె ననువారి యాసమాత్రమంగీకారము కాదు.

ప్రతిజిల్లా కొక్కొక్క జిల్లాయాఫీస రున్నాఁడు. అతని కిప్పుడు రివిన్యూ, క్రిమినల్, పోలీసు వ్యాపారములయందు సంపూర్ణాధికారమున్నది. ఇవి యన్నియు నిప్పుడు విడఁదీయవలయును. పరిపాలనాభారమంతయు వహించి పోలీసుఆఫీసరుగా నుండు నాతనికి మేజస్ట్రేటు పనిలేకుండినచో నీదేశమునందు పరిపాలనము గలుషవిరహితమై జనసమ్మతముగ నుండఁగలదు. ప్రతిజిల్లాయందు నొక్కొక డిస్ట్రిక్టుబోర్డు గలదు. గ్రామపంచాయితీ లిప్పుడిప్పు డేర్పడుచున్నవి. హిందూ మహమ్మదీయ ప్రభుత్వములలో దేశమం దంతట నీగ్రామపంచాయితీలే చిన్నచిన్న పరిపాలనాసంఘములుగా నుండి స్వతంత్రపరిపాలన మొనరించెడివి. వానినిగూర్చి తరువాతిప్రకరణములందు విశేషముగా చర్చింపఁబడును. బ్రిటిష్‌పరిపాలనమున నివియన్నియును ముందువెనుక లాలోచింపకయే రూపుమాపఁబడినవి. ఇప్పటికిని దూరదృష్టిగలిగి కొంచెము శ్రద్ధచేసినచో వానిని పునరుజ్జీవింపఁ జేయవచ్చును. కొంతవరకు నమ్మిక యట్టివానియం దుంచవలయును. ఉపయోగకరములైన పనులు కొన్ని వానియధికారమునం దుంచవలెను. గ్రామమునం దుత్పన్నములగు సివిలుక్రిమినలు తగాయిదా లన్నియును రాజీనామాలమూలముగ



పరిష్కరించుటకయి వారియొద్దకుఁ బంపవలయును. ఇరువదిముప్పదిమైళ్లదూరమునందున్న మనకోర్టులలోకన్న నాయావివాదములను బుట్టినచోటనే వారుబాగుగఁ దీర్మానింపఁగలరు. దూరదేశములకు వచ్చి శ్రమపడు లక్షలకొలఁది సాక్షులకు శ్రమ లేకుండఁబోవును. ఈకోర్టుల వెంటఁ దిరుగుటవలన నేర్చుకొనెడు తప్పుసాక్ష్యములును పేచీకోరుతనము లేకుండఁబోయి యనేకమంది పల్లెటూరిప్రజలు తమఋజువర్తనమును నిలుపుకొనఁగలరు. పైపెచ్చు ఈగ్రామపంచాయితీలును పంచాయితీదారులును ప్రజలకును ప్రభువులకును నడుమ రాయబారులుగ నుండి పని జరుపఁగలుగుదురు. అట్టి దిప్పుడు లేకయున్నదికదా!

ఇప్పటి మనప్రభుత్వమువారికిని బ్రజలకును సంబంధ మతిశయించుటకును బ్రజలసౌఖ్య మభివృద్ధియై ప్రభుత్వము ప్రజాసమ్మతముగ నుండుటకును దెలివితేటలతో నవలంబింపవలసిన పద్ధతులు కొన్నియున్నవి. దొరతనపుఠీటుఁ జూపి మనకొకరితో సంబంధము లేకుండ నుండవలె నన్నంతవరకుఁ బ్రభుత్వ మభివృద్ధి నొందనేరదు. అందువలన బాగుగ నాలోచింపకయే కొన్నికొన్ని యవివేకశాసనములను తొందరపడి చేయవలసివచ్చును. ప్రజల కది యసంతుష్టికిఁ గారణ మగును. మహాబ్రిటనుదేశమునందున్న పార్టీ గవర్నమెంటుమూలమున మన దేశపరిపాలనమువారిరాజనీతియం దద్భుతమగు మార్పు లాకస్మికముగఁ గలుగవలసివచ్చును. అందువలన వ్యయ మభివృద్ధి యగును. ఈవ్యయమువలనఁగలుగు ఫలిత మేమియు నుండదు. వ్యయమువలనఁ గలుగుఫలితమెప్పుడును పన్నులు చెల్లించువారి జాగరూకతవలనఁ గలుగవలెను. అయ్యది యితరదేశము లన్నిటియం దిట్లే కలుగుచున్నది. ప్రజల యార్థికస్థితి నభివృద్ధిలోనికిఁ దేఁగలశక్తి ప్రభుత్వమునకు నశించును. అట్టియభివృద్ధి ప్రజలతోఁ గూడి పనిచేసిననేగాని కలుగనేరదు. హిందువుల

లో నెంతటివిద్యావంతులతో నైన నెంతటిమితవాదులతో నైన నెంతటిపలుకుబడికలవారితో నైన మనఃకలహము గలుగుటకు కారణమగును. దేశవాసుల యోగక్షేమములకై పాటుపడవలసిన వారందరును ప్రభుత్వమునందుఁ బనిచేయుటకు హితవుచెడి యుందురు. జాతియంతయును మిక్కిలి పేదవడును. ప్రభుత్వబలము క్షీణదశనొందును.

"మన్రో," "ఎల్ఫిన్‌స్టన్," "బెంటింకు" మొదలగు వివేకవంతులయిన పరిపాలకులు తమకాలమునఁ బ్రజలతో కలసిమెలసి పనిచేసి ప్రజల యోగక్షేమముల నభివృద్ధి చేయవలెనని శక్తివంచనలేకుండ ప్రయత్నముచేసిరి. ఇప్పుడు కావలసినదిగూడ వారినీతి ననుసరించుటయును దాని నభివృద్ధిచేయుటయేగాని భేదభావమువహించి యవిశ్వాసముతో పనిచేయఁగల నీతి నవలంబించుట కాదు. ఏఁబదిసంవత్సరములకుఁ బూర్వము తమపూర్వులకుఁ దెలిసినంతయయినను దేశస్థితి తెలియని యిప్పటి బ్రిటిషుప్రభువులు చేయవలసిన దెల్ల తామెక్కినగుఱ్ఱమును దిగి దొరతనపుసొటు వదలి ప్రజలతో కలసిమెలసి పనిచేయుటయే. ప్రజలను దమసోదరులుగను కూడిపనిచేయువారుగను జేసికొనవలెను. ప్రభుత్వము చక్కఁబడుటకయి ప్రజలనే యుత్తరవాదులను జేయవలెను. నాగరికతనొందిన ప్రతిదేశమునందును జయప్రదముగనుండిన దొరతనము ప్రజలతో కలసిమెలసి యుండినదియే. ఇట్టి ప్రజానురాగ మితరదేశములన్నిటికన్న హిందూదేశమునం దత్యావశ్యకమై యున్నది. రోజులు గడచినకొలఁది దేశమునందలి బాధ లభివృద్ధియై చరిత్రలయం దంతకుముం దెన్నఁడును గనివిని యెఱుంగని యసంతుష్టి గాఢముగా నాటుకొనఁగలదు. ఒకయేఁడు క్షామము పట్టిన ప్రతిదేశముకన్న మరియొకయేఁడు కఱవుపట్టిన ప్రతిదేశ మెక్కువయై దేశమున ప్రజానాశనము హెచ్చగుచున్నది. కాటకము లేనిదేశమునందయినను జనులలో



చాలమంది కడుపుల నాయఁగట్టుకొని కూటికి లేక మలమలమాడుచు జీర్ణదశనొందిన దేహములతోఁ దమతిండిలేనిస్థితిని చాటుచుందురు. అందులో ననేకులు దినదినమును తిండిలేక మలమలమాడుచుందురు. ఎల్లప్పుడును దిండిలేమిచే బాధపడుచుండు పేదజాతులన్నియును దేహమునకువలయు నాహారమును గొనవలయే బ్రతుకు మార్గముల నేర్వనలవడుదురు. ఇట్టి సంగతులన్నియుఁ గనఁబడుచుండఁగ వీరిని జర్చించువారి నోరు మూఁతవేయుదురు. బ్రిటిషుపరిపాలనమునందు విశ్వాసముగలిగి ప్రభుత్వానుభవముగలిగిన యేయాంగ్లేయుఁడుగాని యేహిందువుఁడుగాని యెన్నఁడును హిందూసామ్రాజ్యమునకు సంభవింపని యీయుపద్రవమును తొలగింప నమవుపడు మార్గములఁ జూపక యెట్లూరకుండఁగలఁడు?



# హిందూదేశార్థికచరిత్రము.

## మొదటి ప్రకరణము.



### ఆంగ్లేయుల రాజ్యాభివృద్ధి.

"ఉద్ధరించెద దేశ మే నొక్కరుఁడనె
నిశ్చయంబిది సేయంగ నేర్తుఁడొరుఁడు"

ఇయ్యది యాంగ్లేయదేశ ప్రధానమంత్రి యగు "విలియమ్ పిట్టు" అను నాతని వాక్యము, ఈతఁడు పలికినది గర్వోక్తి కాదు. మహాత్కార్యావేశముగల మానవుల మనంబుల కప్పుడప్పుడు తలచూపుచుండు స్వశక్తి పరిజ్ఞానమును స్వచ్ఛముగఁ గాన్పించు భావ్యర్థసూచనలును నిట్టి వాక్యములఁ బలికించుచుండును. తాను చెప్పిన దానికన్న "పిట్టు" ప్రభు వెక్కుడుగఁ దన వాగ్దానమును జెల్లించి చూపెను. 1757 సంవత్సరము మొదలు 1761 సంవత్సరము వరకును నీతఁడు తన దేశపరిపాలనమును స్వీకరించెను. అది యేమివింతయో గాని యాంగ్లేయ సామ్రాజ్యముయొక్క యభివృద్ధి యంతయును నీనైదు సంవత్సరములలోపలనే లభించెను. 1757 సంవత్సరమున నాంగ్లేయ దేశమునకు మిత్రుఁడుగానుండు "మహాఫ్రిడరిక్కు" అను జర్మనీ దేశప్రభువు "రాస్బక్" యుద్ధమున జయమునొంది ఫ్రాన్సుదేశము నణఁగఁద్రొక్కి ప్రష్యారాజ్యమును స్థాపించెను. 1759 సంవత్సరమున "వూల్ఫు" అను నాతఁడు "క్విబెక్"ను జయించెను. 1760 వసంవత్సరమున "కనడా" దేశమంతయు ఫ్రెంచివారిని జయించి చేకొనియెను. 1757

సంవత్సరమున "క్లైవు" పలాసి యుద్ధమున విజయమునొందెను. "ఐరికూటు" అను నాతఁడు ఫ్రెంచివారి బలము నెల్ల 1761 సంవత్సరమునం దణఁగఁ ద్రొక్కెను. ఇట్లు 5 సంవత్సరములలో నాంగ్లేయదేశము ప్రపంచమున నొక మహోన్నతపదవి నొందెను. ఫ్రాన్సుదేశ మైరోపాఖండమునఁ దలయెత్తకుండఁ బోయెను. ఆసియా అమెరికా ఖండములయందు నిర్మూలమే యయ్యెను.

మనకథ హిందూదేశమునందలి యాంగ్లేయుల రాజ్యాభివృద్ధితో సంబంధించినదియును, ఆసామ్రాజ్యమునందలి జనులయొక్క యార్థిక స్థితిగతులను గూర్చినదియునై యున్నది. 1757వ సంవత్సరమున జరిగిన పలాసి యుద్ధము మొదలు 1837 సంవత్సరమున విక్టోరియా రాణీగారి సింహాసన స్వీకారము వరకును గల యెనుబది సంవత్సరములయందును బ్రిటిషువారి యధికారము, ఏకరీతిని వృద్ధిచెంది విజృంభించుటకు, ఆధారములయిన గొప్ప రాజకీయ కార్యముల మన మీప్రకరణమున సంగ్రహముగ ముచ్చటింతము. అందువలన జనులయార్థిక చరిత్రము చక్కఁగఁ దెలిసికొన నవకాశము కలుగును.

ఈయెనుబది సంవత్సరములలోను హిందూసామ్రాజ్యమును విజృంభింపఁజేసి స్థిరీకరించుటకు మూఁడుతరముల బ్రిటిషు రాజ్యవ్యావహార్తలును బరిపాలకులును బనిజేసిరి. ఒక్కొక్క తరము వారొక్కొక్క రీతి రాజనీతి ననుసరించిరి. మొదటి తరమునఁ బని చేసినది క్లైవును, వారన్ హేస్టింగ్సును. వీరికాలమున వర్తక సంఘములకు హిందూదేశమున రాజ్యాధికారమును గలిగించుటకై యత్యంత సాహసిక కార్యములును, యుద్ధములును జరిగినవి. ఈకాలము 1784వ సంవత్సరమున జరిగిన పిట్టుప్రభువుగారి ఇండియాచట్టముతోడను, ఆమరుచటి



సంవత్సరమున "వారన్ హేస్టింగ్సు" గారు, ఇండియా ప్రభుత్వమునుండి విశ్రాంతి గైకొనుటతోడను సమాప్తమయినది. రెండవ కాలము "కారన్ వాలీసు" "వెలెస్లీ" "హేస్టింగ్సు" ప్రభువులనాఁటిది. ఈకాలమున మైసూరుయుద్ధములును మహారాష్ట్రయుద్ధములును జరిగి హిందూదేశమున కంపెనీరాజ్య మేకచ్ఛత్రముగ స్థాపనమయ్యెను. ఆంగ్లేయులు 1817 సంవత్సరమున బొంబాయి రాష్ట్రమును దమ రాజ్యముతోఁ జేర్చుకొనిరి. ఈకాలము, ఆమరుచటి సంవత్సరమునఁ గడపటిపేష్వాను బట్టికొనుటతో ముగిసెను. మూఁడవయుగము "మన్రో" "ఎల్ఫిన్ స్టన్" "బెంటింకు" అనువారలనాఁటిది. ఈకాలము యుద్ధము లేమియును లేక పరిపాలనా సంస్కారము జరిగిన కాలము. వీరినామములు, ఆవిజయమునందినవారియొక్కయు, యోధులయొక్కయు, నామములకన్న మిగుల కృతజ్ఞతగ నేఁటివరకును జూడఁబడుచున్నవి. 1836 సంవత్సరమున "ఆక్లండు" ప్రభువుయొక్క రాజప్రతినిధిత్వ స్వీకారముతోడను, ఆమరుసటి సంవత్సరమున విక్టోరియారాణిగారి సింహాసనాధిష్ఠతతోడను నంత్యమైనది.

## I. క్లైవు, వారన్ హేస్టింగ్సుల కాలము.

### 1785సం॥ మువరకు.

తూర్పు, ఇండియాసంఘము 70,000పౌనుల మూలధనముతో 1600 సంవత్సరమున స్థాపింపఁబడినది. 1639 సంవత్సరమున నీకంపెనీవారు చెన్నపట్టణమున సెంటుజార్జికోటను కట్టినారు. రెండవ ఛార్లెసు ప్రభువు వద్దనుండి బొంబాయి ద్వీపమును గ్రయమునకుఁ బుచ్చుకొని 1687 సం॥రములో తమ ఫ్యాక్టరీల నచ్చటికి మార్చుకొనిరి. 1700 సంవత్సరమున బంగాళాదేశమును దమకు రాజధానిగాఁ జేసికొనిరి. చెన్నపట్టణమునకు దక్షిణభాగమున, పుదుచ్చేరియును, కల

కత్తా కుత్తరభాగమున చంద్రనగరమును ఫ్రెంచిరాజ్యమునకు చేరి యున్నవి. "మహాఫ్రిడెరిక్" యొక్క యుద్ధముల మూలమున ఫ్రెంచివారికిని, నాంగ్లేయులకును ఐరోపా, ఆసియా, అమెరికాఖండముల యందు 1744 సం॥ రము మొదలు 1763 సం॥ రమువరకు నించుమించు 20 సం॥ రములు పరస్పర విరోధము కలిగియుండెను. ఈకలహముల నూతగాఁగొని హిందూదేశమున పనిచేయుచున్న యాంగ్లేయులయొక్కయు ఫ్రెంచివారియొక్కయు కంపెనీలలోని నౌకర్లు హిందూరాజులతో సఖ్యమును జేసి యొకరి వర్తకస్థానముల నొకరు ముట్టడించుకొనుచు పశ్చిమ ఖండమునందు వారివారికిఁ గల పగయెల్ల నిచ్చటఁగూడఁ జూపుకొన నారంభించిరి. ఇందుమూలమున నింగ్లీషువారికిని ఫ్రెంచివారికిని నీయిరువది సంవత్సరములలోను మూఁడుయుద్ధములు తటస్థించెను. ఇవియే కర్ణాటక యుద్ధములు.

ప్రథమ కర్ణాటక యుద్ధమున ఫ్రెంచివారికి పూర్ణమైన జయము కలిగెను. చెన్నపట్టణము నింగ్లీషువారివద్దనుండి లాగికొని యాపట్టణమును దిరిగి స్వాధీనము చేసుకొనవచ్చిన కర్ణాటక నవాబు సైన్యమును దరిమివైచిరి. కాని 1748 సంవత్సరమున జరిగిన "యైలాషపిల్" సంధిషరతుల మూలమున చెన్నపట్టణము తిరిగి యాంగ్లేయుల కీయఁబడెను. ఫ్రెంచికంపెనీకి డైరక్టరుజనరలుగానుండిన "డూప్లే" యను నాతనికి హిందూదేశమున తనదేశస్థుల సర్వస్వతంత్రులఁ జేయవలెనను గొప్పయాశ యుదయించెను. కొంతవరకాతఁడా విషయమున సంపూర్ణ విజయము నందెను. తన మిత్రునొకనిని దక్షిణ హిందూస్థానమునకు నైజామగుటకు సహాయముచేసి మరియొకని కర్ణాటక రాజ్యమునకు నవాబుగాఁ జేసెను. ఈరీతిని దక్షిణహిందూస్థానమున నీతఁడు మిక్కిలి బలవంతుఁడగు ప్రభునిర్మాతయై బ్రిటిషువారియధికారము నెల్ల



నిర్మూలము గావించెను. ఈతరుణమున "రాబర్టుక్లైవు" అనునాతని బుద్ధినైపుణ్యము ఆస్థితిగతుల నన్నింటిని తారుమారు చేసెను. బ్రిటిషువారికి మిత్రుఁడుగానుండు కర్ణాటరాజ్యకాంక్షకుండగు మఱియొకనవాబునకు దానిరాజధానియగు "ఆర్కాటు" పట్టణమును జయించి యిచ్చి ప్రఖ్యాతుఁ డయ్యెను. ఇది రెండవకర్ణాటకయుద్ధము. ఈయుద్ధావసానమున కర్ణాటదేశమునకు నింగ్లీషువారిమిత్రుఁడు నవాబుగాను, దక్కనునకు ఫ్రెంచివారిమిత్రుఁడు నవాబుగను నిలిచిరి. అందువలన దక్షిణహిందూస్థానమున నీరెండుజాతులవారికిని సమానాధికారము కలిగెను. దక్కను నైజామువద్దనుండి తూర్పుసముద్రతీరమున ఫ్రెంచివారు, ఉత్తరసర్కారులను సంపాదించిరి.

మూఁడవకర్ణాటకయుద్ధమున ఫ్రెంచివారిబలమంతయును పూర్ణముగ నాశన మయ్యెను. దేశభక్తిప్రేరితుండగు "లాలీ" యను ఫ్రెంచినాయకుఁడు చెన్నపట్టణపుకోటను ముట్టడించి యపజయము నొందెను. 1761 వసంవత్సరమున నాతఁడు "ఐర్ కూటు" చే "వందవాసి" యుద్ధమున నోటువడియెను. ఫ్రెంచివారు తమస్వాధీనమందుండు "పుదుచ్చేరి" యెంతపట్టుదలతోఁ గాచుకొనినను, తుదకు దాని నింగ్లీషువారు పట్టుకొనిరి. 1763 సంవత్సరమున జరిగిన "పారిస్" పట్టణసంధివలన తిరిగి పుదుచ్చేరి ఫ్రెంచివారిస్వాధీన మైనదికాని హిందూదేశమునందు ఫ్రెంచివారిబలము మరల నెప్పటికిని తలయెత్తకుండ రూపుమాసి పోయెను. 1764 సంవత్సరమునాఁటికి హిందూదేశమున నాంగ్లేయులతో పోటీగ పనిచేయునైరోపాబల మేమియును లేకుండఁ బోయెను.

ఈనడుమ బంగాళాదేశమున గొప్పప్రయోజనములు కొన్ని సంప్రాప్త మయ్యెను. 1756 సంవత్సరమున బంగాళానవాబుగానుండి

న "సురాజదౌలా" ఇంగ్లీషువారివద్దనుండి కలకత్తాపట్టణమును లాగికొనెను. అప్పుడే చీకటికొట్టని చెప్పఁబడు వెల్తురును, గాలియును బాగుగ లేనియొక చిన్న చెరసాల (గది) లో నెండకాలమునం దొకనాఁటిరాత్రి చాలమందియాంగ్లేయఖైదీలు మడిసిరి. ఐరోపాఖండమునుండి మరలివచ్చినక్లైవు, ఆమదుసటిసంవత్సరముననే కలకత్తాను తిరిగి సంపాదించి యొకమూల నవాబుతో సంధిచేసుకొని మఱియొకమూల నాతనికి వ్యతిరేకముగ రహస్యముగ కుట్రలు పన్నుచుండెను. అంతయును సన్నద్ధమైనవెనుక నాతఁడు నవాబుపైకి వెడలి 1757 సంవత్సరమున పలాసియుద్ధమున నతని నోడించి కొంచెమించుమించు బంగాళాదేశము నంతను జయించెను. ఫ్రెంచివారి కుండునుత్తరసర్కారులనుగూడ జయించి 1760 సంవత్సరమున నాతఁ డింగ్లాండునకు పోవకపూర్వము హిందూదేశమునందు, ఈతూర్పు, యిండియాసంఘము నొకపెద్దరాజ్యశక్తిగా స్థాపించి పోయెను.

బంగాళానవాబు లిప్పుడు కంపెనీవారినౌకర్ల చేతిలోనికీలుబొమ్మలవలె ప్రవర్తించినారు. పలాసియుద్ధమైనవెనుక "మీర్జాఫర్" ను నవాబుగాఁ జేసి 1760 సంవత్సరమున మరల నాతని లాగివేసిరి. అప్పుడు "మీర్ ఖాసిమ్" అను మఱియొకఁడు నవాబుగాఁ జేయఁబడెను. ఈమీరుఖాసిమ్ బలవంతుఁడును సమర్థుఁడు నైనపరిపాలకుఁడగుటచే బంగాళాదైశికవాణిజ్యమునఁ గంపెనీనౌకర్లు గావించుదుర్మార్గములను నష్టపెట్ట నారంభించెను. అందువలన యుద్ధ మొకటి సంప్రాప్తమయ్యెను. ఈయుద్ధమున మీర్ ఖాసిమ్ ఓటువడి పలాయితుఁ డయ్యెను. మరల నొకసారి మీర్జాఫరును నవాబుఁ గావించిరి. బలహీనుఁ డగునీవృద్ధుఁడు కొలఁదికాలములోనే మృతినొందెను. పేరునకుబంగాళాదేశమున కాతనియుంపుడుకత్తెకొడుకు నొకనిం దెచ్చి యాసింహాసనము



నలంకరించిరి. బంగాళాప్రభుత్వ వి [illegible] ములమున కెంతపాడుగనుండవలయునో యంతపాడుగ నున్నది. ప్రజలు బాధల నలిగిపోయిరి.

1765 సంవత్సరమున క్లైవు కడపటిసారి యిండియాకు వచ్చి యెప్పటికిని మరపురానికొత్తరాజనీతి యొకటి యవలంబించెను. అప్పుడెందునకుం బనికిరాని ఢిల్లీచక్రవర్తివంశీయుఁడగు నొకబలహీనుఁడు ఇల్లువాఁకిలిలేక యాతతాయిగా నుండెనుకాని హిందూదేశమున కాతని చక్రవర్తినామముమాత్ర మింకను పేరునకు గౌరవింపఁబడుచుండెను. ఈమహాదేశమునందలి రాజులును, సామంతులును పేరున కితనికిఁ గప్పములు కట్టువారుగ నుండిరి. వారివారిస్వాధీనమునం దున్నరాష్ట్రము లెల్ల వారు స్వయముగనే యుద్ధము చేసి సంపాదించుకొనినను నీతనివలనఁ దమకు లభించినట్లుగనే చెప్పుకొనుచుండిరి. క్లైవును నీమార్గమునే యనుకరించెను. 1757 సంవత్సరమున బంగాళాదేశ మంతయును తనమూలమున సంపాదింపఁబడినను 1765 వసం॥రమున ఢిల్లీచక్రవర్తియొద్దనుండి, తూర్పుఇండియాసంఘము నారాష్ట్రమునకు పరిపాలకులుగా నుండునటుల దివాన్ పదము సంపాదింపుచు క్లైవొకపట్టాను పొందెను. ఈరీతిని యీస్టిండియాకంపెనీ తక్కినహిందూదేశరాజ్యములన్నిటివలెనే యొకశాస్త్రవిహితమైనస్థానమును గైకొని 80 సం॥రములకుపూర్వమే తాము సంపాదించినయారాష్ట్రముయొక్క పరిపాలనాభారమును తనయం దుంచుకొనెను. "క్లైవు" ప్రభువు తదుపరి సివిల్ మిలిటరీపరిపాలనమునఁ గొన్నిసంస్కారములను గావించి తుట్టతుదకు 1767 సం॥రమున హిందూదేశమును విడిచిపోయెను.

అతఁడు పన్నినయీపరిపాలనాపద్ధతిమాత్రము పనిచేసినదికాదు. కంపెనీవారియొక్కయు, నవాబుయొక్కయు, ద్వంద్వపరిపాలనముచే

బంగాళాదేశప్రజలకు మిగుల నొత్తుడు కలిగి పన్నులు వసూ లైనవి కావు. 1770-71 సం॥రములలో గొప్పకాటకము సంభవించి బంగాళాదేశపుజనసంఖ్యలో 3 వవంతు నాశనము పొందెను.

చెన్నపట్టణమున నాంగ్లేయాధికారులకును హైదరాలీకిని యుద్ధము తటస్థించెను. ఈహైదరాలీ పదునెనిమిదవశతాబ్దాంత్యభాగమున హిందూదేశమునందు పుట్టినసేనాధ్యక్షులలో మిక్కిలి సమర్థుడు. ఈతఁడు కర్ణాటదేశమునెల్ల నాశనముచేసి చెన్నపట్టణమునకుఁ గొన్నిమైళ్లదూరములో వచ్చి నిలిచెను. అందుల కాంగ్లేయసభవారు భయకంపితులై 1769 సం॥రముననాఘోరశత్రువుని(inneder) తోసంధి చేసుకొనిరి.

1773 సంవత్సరమున హిందూదేశమునందలి స్థితిగతుల నభివృద్ధిచేయుటకై బ్రిటిషుదేశమునందలి పార్లమెంటువారు "రిగ్యులేటింగు ఆక్టు" అనుపేర నొకచట్టమును నిర్మించిరి. ఈచట్టమువలన హిందూదేశమునందలి కంపెనీవారిపాలనమునకు ధర్మశాస్త్రవిహితమైనహక్కు కలిగినది. ఈదేశమునందున్న కంపెనీవారిస్వాస్థ్యముల కన్నిఁటికి నొక గవర్నరుజనరలు ఉద్యోగ మీచట్టమువలన నేర్పడెను. అప్పటివరకును బంగాళాదేశమున గవర్నరుగానున్న "వారన్‌హేస్టింగ్సు" 1774వసంవత్సరమున మొదటిగవర్నరుజనరలు అయ్యెను.

అప్పు డీదేశమునం దున్న ఆంగ్లేయులలో "వారన్‌హేస్టింగ్సు" కన్న నెక్కువసమర్థుఁడును, దేశముతోడను బ్రజలతోడను నంతకన్న నెక్కువ పరిచయముగలవాఁడును మఱియొకఁడు లేఁడు. 1750 సంవత్సరమున నాతఁడు హిందూదేశమునకు వచ్చువరకు కొంచె మించుమించు బాల్యావస్థలో నుండెను. బంగాళాదేశమునందును, చెన్నరాష్ట్రమునందును తనదేశపుప్రజలు చేయునధికారదౌర్గత్యములను నడ్డుపె



ట్టుచు వచ్చెను. అప్పు డాతనికి స్వతంత్రాధికారము వచ్చుటచే దేశపరిపాలనము నభివృద్ధిచేయ నవ్యాజమగుకోరిక కలిగెను. కాని ద్రవ్యసహాయమున నాతనికిఁ గలిగెడునంతరాయములచేతను, "ఫిలిప్‌ఫ్రాన్సిస్" అనుతనసభలోని సభ్యుఁ డొక, డొనరించునడ్డంకులచేతను నాతనికాలమునఁ దటస్థించినవిశేషయుద్ధములచేతను, నిరంకుశప్రభుత్వము చేయవలె నను దీయాతని నైసర్గికలక్షణముచేతను నాతఁడు స్వచ్ఛందకార్యము లెన్నియో చేయవలసి వచ్చెను.

ఇవియే తరువాత బ్రిటిషుపార్లమెంటువారిచే నాతనిపై మోపఁబడినయభియోగమువిషయములుగ నేర్పడినవి.

ఢిల్లీచక్రవర్తి కీయవలసియుండుకప్పమును, హేస్టింగ్సు నిలిపివేసెను. ఆచక్రవర్తి స్వాస్థ్యములగు "కోరా" "అలహాబాదు" లను లాగికొని ఔడ్ (అయోధ్య) నవాబున కయిదులక్షలపౌనుల కమ్మివేసెను. ఆనవాబునకే యింగ్లీషుసైన్యము నొకదానిని 4,00,000 పౌను లిచ్చుట కేర్పాటు చేసుకొని రోహిలాలను నణఁగఁ ద్రొక్కుటకై సహాయ మంపెను.

బొంబాయిదొరతనమువారు హిందూదేశమునం దప్పుడు మిక్కిలి బలవంతులుగ నుండుమహారాష్ట్రులతో వైరము తెచ్చుకొని చిక్కులకు లోనైరి. మహారాష్ట్రసంఘమునకు నాయకత్వము వహించియున్న "పీష్వా" అనునుద్యోగమున కప్పు డిరువురు హక్కుదారులుండిరి. బొంబాయిదొరతనమువా రందొకనికి సహాయము చేయ నేర్పాటుచేసికొనుటచే ప్రథమమహారాష్ట్రయుద్ధము సంభవించెను. అహమ్మదాబాదు, గ్వాలియరు, పట్టణములను పట్టుకొనుటలో బ్రిటిషుసైన్యము ప్రఖ్యాతివహించెనుకాని యుద్ధమున కావలసినకార్య మైనదికాదు. బ్రిటిషువారికి మిత్రుడగునాతఁ డుపజీవితమును వైకొని విశ్రాంతి నొందవలసి వ

చ్చెను గాని 1782 సం॥రమున జరిగినసంధిషరతులప్రకారము "శాల్వెట్టి" యును మఱికొన్ని యితరద్వీపములును బ్రిటిషువారిస్వాస్థ్యములోఁ గలిసెను.

మైసూరుమహావీరుఁడగు హైదరాలీతో మరల రెండవయుద్ధము తటస్థమైనది. 20 సంవత్సరములకు పూర్వము "వందవాసి" యుద్ధమునందు ఫ్రెంచివారి నోడించిన "ఐరికూటు" అనునాతనిచే నాలుగైదుస్థలములయందు హైదరాలీ యోటువడియెను. కాని ప్రతిరంగమునుండియును నాతఁడు తనసేనలను నేర్పుగ సంరక్షించుకొని తనబలమావంతయు చెదరిపోకుండఁ జేసికొనెను. ఇంతేకాక తనవ్యూహనైపుణ్యములచే "కర్నల్ బెయిలే" "కర్నలుబ్రాత్ వైటు" అనువారలచే సంరక్షింపఁబడుచుండు రెండాంగ్లేయసైన్యములను ముట్టడించి వానిని సంపూర్ణముగ రూపుమాపెనుకాని హైదరాలీ 1782 సం॥రమున మృతినొందెను. 1783 సం॥రమున నతనికుమారుఁడు "టిప్పుసుల్తాన్" తో సంధియై యాయుద్ధము చల్లారినది.

1775 సం॥రమున నయోధ్యనవాబు మరణించెను. ఆతనిరాజ్యమునకు వచ్చిననవాబు వారన్ హేస్టింగ్సునకు కాశీరాజ్యము నిచ్చివేసెను. అంతటినుండి కాశీరాజు బ్రిటిషుదొరతనమువారిసామంతుఁడయ్యెను. ఆతఁడేర్పాటుచేసిన కప్పమేగాక కాశీరాజుకడనుండియెక్కువసొమ్ములు కావలె నని హేస్టింగ్సు తగాయిదా పరచెను. అందులకాతఁడు సమ్మతింపమిచే నాతని కపరాధము విధించి పట్టుకొని చెరసాలలో వైచెను. ఆదేశప్రజల నంతట రాజుపైఁ దిరుగఁబడఁ బురికొలిపెను. అంతట రాజును సింహాసనభ్రష్టుని గావించి యాతనిబంధుగు నొకని పూర్వముకంటె హెచ్చుకప్పము చెల్లించుపద్ధతిని, ఆరాజ్యమున నిలిపెను. ఈక్రొత్త అయోధ్యనబాబును, ఆతనిపూర్వు లీయవలసిన



బాకీపైకమున్నుగూర్చి తగాదా చేయగా నాతఁడు తనయశక్తతను వెల్లడించెను. అందుపై నాతనితల్లియొద్దను, ముత్తవవద్దను విశేషద్రవ్యముండఁగా దానిని దోచుకొన సాయము చేసెను. ఈరీతిని తనకు బాకీయున్నసొమ్ము కోటిరూపాయలను వసూలు చేసుకొనెను. చెన్నరాష్ట్రమునందును, నయోధ్యయందును రావలసినభూమిపన్నులు, ఆంగ్లేయఋణప్రదాతలు గుత్తకు పుచ్చుకొనిరి. అందువలనఁ బ్రజలకు బాధలు మెండైనవి. బంగాళాదేశమునందు వారన్ హేస్టింగ్సు జమీందారులయొక్కయు, భూస్వాములయొక్కయు పారంపర్యపుహక్కులను పరిగణింపక కంపెనీవారి కెక్కువపన్నులను రాఁబట్టుటకై యెస్టేటులను వేలము వేసి విక్రయింపసాగెను.

ఇట్టికార్యము లెల్ల వారన్ హేస్టింగ్సుయొక్క పరిపాలనమునకు మాలిన్యమును గలిగించినవి. 1784 సం॥రమున "పిట్టు" గారియిండియాచట్టము నిర్మాణమై కంపెనీవారిహిందూదేశపరిపాలనము ఆదేశప్రభువులయాజమాన్యమునకు లోనయ్యెను. మరుసటిసంవత్సరమున "వారన్ హేస్టింగ్సు" ఇండియా విడిచి పోయెను.

ప్రారంభమునుండి 1785 సంవత్సరమువఱకును బ్రిటిషువారియధికారాభివృద్ధి యీమాదిరి నున్నది. ఫ్రెంచివారితోఁ గలిగినమూఁడు యుద్ధములవలన బ్రిటిషుజాతి కర్నాటదేశమునందు ప్రాముఖ్యమునువహించెను. "సురాజడౌలా" తోను, "మీర్ ఖాసిమ్" తోను కలిగినరెండుయుద్ధములతోడను వీరు బంగాళాదేశమునకు యజమానులైరి. మైసూరు, మహారాష్ట్రయుద్ధములు హిందూదేశమున "క్లైవు" "హేస్టింగ్సు" తరములలో జరిగినప్రధానసైనికకార్యములు. బంగాళాదేశమును, ఉత్తరసర్కారులును, కాశీరాజ్యమును, చెన్నపట్టణము బొంబాయిసమీపములయందలి చిన్నచిన్నప్రదేశములును, 1780 సం॥రమున "వా

ర్న్ హేస్టింగ్సు" ఇండియాను విడిచి పోవునాటికి కంపెనీవారి స్వా
స్థ్యములు.



## ii. కార్న్ వాలీసు, వెల్లెస్లీ లార్డుహేస్టింగ్సులకాలము.
## 1785—1817

పిట్టుగారి యిండియాచట్టము 13 ఆగస్టు 1784 సం॥రమున నేర్పడియెను. కంపెనీవారి అన్నివిధము లైనసివిలు, మిలటరీ, రివిన్యూ వ్యాపారములు ప్రభువులవలన నియామకమైన 6 గురు కమీషనర్ల యాజమాన్యమునం దుంచఁబడెను. హిందూదేశపరిపాలనావిషయము లభివృద్ధిచేయవలె ననియు, బ్రిటిషురాజ్యప్రథమదశలో ప్రజలుపొందిన బాధలును, పరిపాలనాలోపములును, తొలఁగింపవలెననియు నవ్యాజమైన కోరికతోడ పనిజరిగెను. కంపెనీడైరక్టరులుకూడఁ దమవ్యాపారములను చక్కఁజేసుకొన నభిలషించిరి. వార్న్ హేస్టింగ్సు ఇండియాను విడిచిపోయినతరువాత నుదారప్రవర్తకుఁ డగునట్టియు, నైసర్గికముగ సత్స్వభావముకలిగినట్టియు, "కార్న్ వాలీసు" ప్రభువును గవర్నరుజనరలుగాఁ బంపిరి. ఆతఁడు భూమిమీఁదనుండి రాజునకు వచ్చురాఁబడిని శాశ్వతముగా నేర్పాటుచేయనుత్తరవులనుపొందిమఱివచ్చెను. అందువలన వ్యవసాయమభివృద్ధియై భూములకుఁ దగినమరమ్మతులు చేసికొందురనియును తత్కాలమున వారిస్థితిగతులభివృద్ధినొందుననియును, వారియూహ అనేకతుపానులు పట్టి యంధకారబంధురమై యల్లకల్లోలముగా నుండు హిందూదేశమునకు చిరకాలమున కీతనికాలమున నొక్కింత సూర్యకిరణప్రసారము కలిగెను. ఆతనివలన గలుగునని నిరీక్షించియున్నయాశ లేమియును "కార్న్ వాలీసు" ప్రభువు వ్యర్థముచేయలేదు. ఈతఁ



డు పరిపాలన నభివృద్ధిచేసెను. బలవంతముమీఁద కంపెనీవారిచే నౌకర్లకు తగినజీతము లిప్పించి వారిని ఋజువర్తనముతో నుద్యోగముచేయునట్లు చేసెను. ఈతనికాలములోనె "ఇండియన్ సివిల్ సర్వీసు" పరీక్ష లేర్పడెను. ఆపరీక్షాపద్ధతులే యిప్పటివఱకును నిలిచి యున్నవి. ఈతనికి మైసూరున టిప్పుసుల్తాన్ తో నొక్కయుద్ధము తటస్థించెను. ఆతనిరాజధానినిజయించి యాతని బలమును క్షీణింపఁజేసి రాజ్యము బ్రిటిషువారిస్వాధీనము చేసి తదుపరి సంధి యొనరించెను. 1793 సం॥రమున నీతఁడు హిందూదేశమును విడిచి పోవకపూర్వము బంగాళాదేశమునందలిభూమిపన్నును ఎన్నటికిని మారకుండ నుండుపద్ధతిని జమీందారీసెటిల్ మెంటు చేసెను. హిందూదేశమునందు బ్రిటిషుదొరతనమువారు చేసినసదుపాయములలో నెల్ల నిది యొక్కటియె మేలయినది. ఇదియే ప్రజలసౌఖ్యమునకును, ఐశ్వర్యమునకును మూలాధారమైన కార్యము.

1793 సం॥రమున తూర్పుఇండియాసంఘమువారి కిచ్చినకవులు పరతు మరల నీయఁబడెను. హిందూదేశపుస్థితిగతులు పార్లమెంటులో చర్చింపఁబడి 1784 సం॥రములోని "పిట్టు" గారి యిండియాచట్టము యొక్క ముఖ్యనిబంధనలు నిలుపుచేయఁబడెను; కాని, యీసారి తూర్పున వర్తకముచేయునితరవర్తకులకు 3000 టన్నులబడలను రానిచ్చుటకు తూర్పుఇండియాసంఘమువారు ఒప్పుకొనవలసివచ్చెను. ఇదివఱకు తామొక్కరె సర్వాపోశనముగ ననుభవించుచున్న వ్యాపారమునకు దీనితో నంతరాయము కలుగ నారంభ మయ్యెను. లార్డుకార్న్ వాలీసునకు తరువాత "సర్ జాన్ షోర్" అనునాతఁడు గవర్నరుజనరలుగా వచ్చెను. ఆతఁడును తనపూర్వపరిపాలకుని శాంతనీతిననుసరించి పనిచేసి బంగాళాదేశమునకు "కారన్ వాలీసు" ఒసంగినభూమిపన్నుల శా

శ్వతపుసెటిల్‌మెంటురీతిని, కాశీరాజ్యమునఁగూడ భూమిపన్నుల కెప్పుడును మార్పులేని శెటిల్‌మెంటును చేసి పోయెను.

1798 సంవత్సరమున “సర్ జాన్ షోర్” తరువాత “మార్క్విస్ ఆఫ్ వెల్లస్లీ” అనునతఁడు ప్రభు వయ్యెను. పూర్వతరమున మహాఫ్రెడరిక్కుయొక్క యుద్ధములు బ్రిటిషురాజనీతిని తారుమారుచేసినట్టులే “నెపోలియన్ బోనపార్టు” తోఁ గలిగినయుద్ధములవలన హిందూదేశమునందలి రాజనీతి మారిపోయెను. “విలియమ్‌పిట్టు” అనునాతఁడు నెపోలియన్ దండయాత్రలనుండి కాపాడుకొనుటకు ఐరోపాఖండమునందు గలపెద్దపెద్దరాజ్యము లన్నిటికిని సహాయసైన్యపద్ధతి యేర్పాటు చేయుచుండెను. యీ వెల్లస్లీ పిట్టుగారికి స్నేహితుఁడును, మిగుల భక్తిగలశిష్యుఁడునుగూడనై యుండెను. ఆతఁడైరోపాఖండమునం దొనరించినయీ యుపబలపద్ధతిని హిందూదేశమునందుఁగూడఁ బ్రవేశపెట్టి దానియం దొకగొప్పమార్పు కలిగించెను. హిందూదేశరాజులయొద్దనున్న యసమర్థము లగుసైన్యములను సహాయసైన్యములుగ మేపుట యనుపయోగమని “వెల్లస్లీ” వారివారిరాష్ట్రములందు బ్రిటిషుసైన్యములను పోషించుటకు తగినధనమును వారియొద్దనుండి రాఁబట్టుటకు తగినయేర్పాటు చేసెను. ఈపద్ధతివలన కంపెనీకి విశేషద్రవ్యలాభము కలుగుటయేగాక హిందూరాజు లెల్ల బ్రిటిషువారియధికారమునకు లోఁబడియుండవలసివచ్చెను. ఈరాజనీతినే సహాయసైన్యనీతి యని గాని, యుపబలసైన్యనీతి యని గాని చెప్పుదురు.

మైసూరునం దున్న మనశ్శాంతిలేని టిప్పుసుల్తాను ఫ్రెంచివారితో రాయబారములు మొదలుపెట్టెను. అతని నణఁచివేయుట కర్తవ్యమగుటచే మైసూరుపైని నాల్గవయుద్ధము ప్రారంభ మయ్యెను. 1799 సంవత్సరమున తనరాజధానిని కాపాడుకొనఁబోయి టిప్పు మడిసెను.



మైసూరుభాగముల నింగ్లీషువారు కలుపుకొనిరి. సహాయసైన్యభారము వహించెడుపద్ధతిని మహారాష్ట్రులకు కొంతభాగమీయఁజూపిరి కాని, వారందుల కంగీకరింపరైరి. దక్కను నైజామునకు కొంతభాగ మీయఁబడినది కాని, యాతఁడు బ్రిటిష్‌సైన్యమునకు సహాయార్థముగ నేటేట నీయవలసియుండుసొమ్మునకు బదులుగ మరల నాప్రదేశము “వెల్లస్లీ” ప్రభువుచే నాకర్షింపఁబడెను. ఇంక మైసూరురాష్ట్రము కించిదవశిష్టముగ మిగిలినది. దానికి పూర్వపుహిందూరాజులలో నొకనిని దెచ్చి ప్రతిష్ఠించిరి.

బలహీనముగ నున్నరాష్ట్రముల నింతకంటె మిక్కిలి సులువుగఁ గలుపుకొనిరి. వెల్లస్లీప్రభువునకు తా నవలంబింపవలసినమార్గములు సరిగానే యుండవలయునను నియమము లేదు. 1799 సంవత్సరమున సూరతునవాబు మరణించెను. ఆతనిసోదరునకు కొంతపించను క్రింద నిచ్చి యాతనిరాష్ట్రము వెల్లస్లీ కలుపుకొనెను. తంజావూరురాజుగారిని రాజ్యమునుండి తప్పించెను. ఆతనిసోదరుఁడు బ్రిటిషువారికి తనయధికార మంతయు స్వాధీనముచేసి వారివలన కొంతపించను పుచ్చుకొనెను. కర్ణాటకనవాబు 1801 సంవత్సరములో మృతినొందెను. కానియాతనితరువాతవాఁడు తనరాజ్యమును వదలుకొనుట కంగీకరింపలేదు. ఆతనిస్థానమునకు మరియొకరాజును పురికొల్పి వానికి సహాయముచేయఁగా నీరెండవవాఁడుతన కామూలముగ లభించినరాజ్యమును బ్రిటిషువారి కొసంగి తానుపజీవితమును గైకొనెను. పిల్లవాఁడు గానుండినఫర్కాబాదునవాబునకు యుక్తవయసు వచ్చెడుతరుణమున నాతనిరాష్ట్రమును బ్రిటిషువారు ట్రాన్స్ఫరు చేయించుకొని యాతనికి పించను నిచ్చిరి. అయోధ్యనవాబును తనరాష్ట్రమునందలి సివిలుమిలటరీయధికారములను నాంగ్లేయుల కీయవలెననియు ననెను, లేదా బ్రిటిషువారి సైన్యపుకర్చులకై

తనరాజ్యమునం దర్ధభాగము నిచ్చి యుపబలపద్ధతికి లోఁబడ్డనైన లోఁబడమనెను. ఆతఁ డతిబలవంతముమీఁద రెండవదాని కొప్పుకొని 1801 సంవత్సరములో ఆంగ్లేయులకు “ అలహాబాదును ” మరికొన్ని యితర జిల్లాలను యిచ్చెను.

హిందూదేశమున నింక మహారాష్ట్రదేశ మొకటిమాత్రము పెద్దది మిగిలెను. మహారాష్ట్రబలమునకు నాయకుఁడుగా నుండినయప్పటిపీష్వా తదితరమహారాష్ట్రసామంతులవలన ఒత్తుడు చెంది వెల్లస్లీప్రభువుగారియదృష్టవశమున నాంగ్లేయులసహాయము నభిలషింపవలసినవాఁడయ్యెను. 1802 సంవత్సరమున సహాయోపబలపద్ధతి కాతఁడు ఒప్పుకొనెను. అంతట సింధియాహోల్కారు “ బొన్సలే ’ యనునితర మహారాష్ట్రసామంతులందరును నీవిధమున తమరాష్ట్రములోనికిఁ జొరఁబడినయాంగ్లేయబలమును జూచి నిర్విణ్ణులైరి. ఆకారణమున రెండవ మహారాష్ట్రయుద్ధము సంభవించెను. ప్రసిద్ధికుఁడై తరువాత తరువాత “ వెల్లింగ్టన్ ” ప్రభు వనుపేరుపొందినవెల్లస్లీయనుసేనాయకుఁ డొకమూల 1803 సంవత్సరమున అస్సే, ఆర్గాం, యుద్ధములలో సింధియా, బొన్సలేలసైన్యముల నోడించెను. “ లార్డు లేక్ ” అనునాతఁడు మరియొకవైపున నాసంవత్సరముననే ఢిల్లీనగరమున జయప్రదముగ ప్రవేశించి సింధియాసైన్యమును లాసారీయుద్ధమునం దోడించెను కాని, యింతవఱకును నెటు వీలైన నటువైపునకు నొరగవలె నని వేచియున్నహోల్కారు ఇట్టిసమయమున బ్రిటిషువారిచెట్టఁబట్టెను. అనేకములగు మొనలుగలిగిన మహారాష్ట్రసైన్యముతో సంప్రాప్తములైన తెంపులేని ఈ పోరాటములకు, ఈస్టిండియాకంపెనీడైరక్టర్లు అలజడిచెంది యుద్ధమునందు మితిమీరినయుత్సాహముతోనున్న తమగవర్నరుజనరలును వెనుకకు రప్పించి దేశమున నెమ్మది నెలకొల్పుటకై కారన్వాలీసుప్రభువును గ



వర్నరుజనరల్గా తిరుగ హిందూదేశమునకుఁ బంపిరి.

అంత నతిశీఘ్రముగ, హిందూదేశమునందు అధికారము నవలంబించియున్న యీవెల్లస్లీప్రభు వాంగ్లేయదేశప్రధానాయకుఁడగుపిట్టుగారిదర్శనము చేసెను. ఈపిట్టుగా రాదేశమునం దనుసరించినరాజనీతియే హిందూదేశమునందు వెల్లస్లీప్రభువునకు మార్గప్రదర్శక మయ్యెను. పిట్టుగా రాసన్నమరణులైయున్నతరుణమున వెల్లస్లీప్రభు వాతని చూచుట లభించెను. హిందూదేశమునందలియుద్ధములు వెల్లస్లీ పూర్తి చేయలేకపోయెను. పిట్టుగారును నట్లే ఐరోపాదేశమునందలియుద్ధములు ముగించలేకపోయిరి. అప్పుడు పిట్టుగారు వెల్లస్లీప్రభువుతో, ఐరోపాఖండమును జూపుచు “ నీపటము నింక చుట్టచుట్టుము. ఇంక పదిసంవత్సరములవఱకు దీనితో పని యుండదు.” అని చెప్పి మరణించెను. మంచముపట్టియున్నయాప్రధానమంత్రికిని, యుద్యోగమునుండి యింటికి రప్పింపఁబడినమనగవర్నరుజనరల్గారికిని జరిగినయాకడపటిసంభాషణము మిగుల సంతాపకరముగ నుండును. పిట్టుగారు మృతినొందుటకుపూర్వము కడపటిసారి చూచిన దీవెల్లస్లీప్రభువే. అప్పుడు జరుగుచున్నయుద్ధము లింకను కొంతకాలమునకు గాని ముగిసినవికావు. 1815 సంవత్సరమున నైరోపాయుద్ధములు ముగిసెను. 1817 సంవత్సరమున హిందూదేశయుద్ధములు ముగిసెను.

ఈలోపుగా హిందూదేశము కొంతకాలము నెమ్మదిగా నుండెను. హిందూదేశమునకు వచ్చినకొలదికాలమునకే కారన్వాలీసుప్రభువు మృతి నొందెను. ఆతనితదనంతరపరిపాలకులైనసర్ జార్జిబార్లోగారును, మింటోప్రభువును మహారాష్ట్రులజోక్యము కలుగచేసుకొనరైరి. 1813 సంవత్సరమున తూర్పుఇండియాసంఘమువారికవులు మరల త్రిప్పి వ్రాయఁబడెను. కాని యీసారి కేవలమును గుత్తగ ననుభవింపుచు

న్నవీరివాణిజ్యస్థితి యంతయును నశించెను. 1600 సంవత్సరమున తూర్పుఇండియాసంఘమువారి కీయఁబడినకవులుల్లో హిందూదేశమునందు వర్తకము చేసుకొను వీరి కొక్కరికిమాత్రమె స్వాతంత్ర్య ముండెను. చైనాదేశముతోడి తేయాకువర్తక మొక్కటి వినా తక్కినవ్యాపారమున కంతకును బ్రిటిషువర్తకు లందరికిని స్వాతంత్ర్యము కలిగెను.

మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్సను పేరొందిన మాయిరాప్రభువు 1813 సంవత్సరమున మింటోప్రభువునకు తరువాతిపరిపాలకుఁడుగా వచ్చి మహారాష్ట్రులతోడికడపటియుద్ధమున జయమునొందెను. నేపాళయుద్ధమువలన హిమాలయప్రాంతమునందలి దేశము కంపెనీవారికి లభ్యమయ్యెను. తదనంతరము పిండారీల రూపుమాపుట కొకయుద్ధము జరిగెను. ఆఫ్గనులు, జాట్లు, మహారాష్ట్రుల్లలోని తుంటరులగువారు కొందరును కలిసి, యూరూరున తిరుగుచుండుగుంపులకు పిండారీలని పేరు. వీరు ధనమెవ్వ రిచ్చిన వారిపక్షమున నుండి పని చేయుచుండెడివారు. పనులు లేనప్పు డూళ్లమీఁదబడి దోచుకొనుటయే వీరిపని. తరువాతమహారాష్ట్రులతో మూఁడవయుద్ధము జరిగెను. దీనితోడనే మహారాష్ట్రులయధికారమంతయును నశించెను. 1802 సంవత్సరమున పీష్వాఆంగ్లేయులతో సహాయోపబలపద్ధతి కొడంబడెను. కాని, యది మనస్ఫూర్తిగ జరిగిన యొడంబడిక కాదు. కొంతకాల మట్లుండి యుండి తనమనోగతి వెల్లడి చేయఁగా నితరరాష్ట్రసామంతు లందరును వచ్చి యాతనిని జేరిరి. అప్పుడు మరియొకపోరాటము సంప్రాప్తమయ్యెను. ఇందు కిర్కీయుద్ధమున పీష్వా యోటువడియెను. భాన్సలేసైన్యము సితాబల్దివద్ద పరాజయము నొందెను. మహిదపురమువద్ద హోల్కారుసైన్యము "సర్ జాన్ మాల్కలమ్" అనువానిచే నోటువడియెను. 1817 సంవత్సరమున పీష్వారాష్ట్రములన్నియును నింగ్లీషువారుస్వాధీనము చేసుకొనిరి. యిప్పుడు బొంబాయిరాష్ట్ర మని పేరుపొందిన రాష్ట్రమేర్పడినది. అప్పుడే ఆరాష్ట్రాధిపతిగూడ 1818 సంవత్సరమున పరాజితుఁడై యుపజీవితమునందుకొనెను. "సింధియా, హోల్కారు, భాన్సలే, గయక్వార్" అను తక్కినచిన్నచిన్న సామంత రాజులందరును నాంగ్లేయుల రాజ్యాధికారమునకు లోఁబడి తమతమరాష్ట్రములఁ బరిపాలించుకొన ననుమతిని పొందిరి.

హిందూదేశమున బ్రిటిషుప్రభుత్వమువారి రెండవయుగమున జరిగినరాజకీయసంబంధములైనట్టియు, మిలటరీతో చేరినట్టియు వ్యాపారములసంగ్రహచారిత్ర మిట్టిదై యుండెను. భూమిపన్నుల శాశ్వతపు శెటిల్మెంటు బంగాళాదేశమున 1793 సంవత్సరముతో సంపూర్ణ మయ్యెను. అయ్యది 1795సంవత్సరమున కాశీదేశమునందుగూడవ్యాపింపఁజేయబడెను. 1802 మొదలు 1805 సంవత్సరములోపల ఉత్తరసర్కారులలోను, తదితరప్రదేశములలోను ఈ శెటిల్మెంటు కొంతమట్టుకు చేయబడెను. ఈయుగమున జరిగినశివిల్ పరిపాలనలో నిదియే ప్రజలకు లాభకరమైనదియును, చెప్పుకొనతగినదియు నై యుండెను. మహారాష్ట్రులయొక్కయు, మైసూరురాష్ట్రముయొక్కయు నధికార బలనిర్మూలనము ఈయుగమున జరిగినరాజకీయకార్యములలో ప్రాముఖ్యమైనది.



### iii. మన్రో, ఎల్ఫిన్‌స్టన్, బెంటింకుల కాలము, 1817 మొదలు 1837 వరకు.

ఈకాలమున హిందూదేశమునందును, ఐరోపాయందును గూడ ప్రజలకు నెమ్మది కలిగెను. అనవసరవ్యయములన్నియు తగ్గింపఁబడెను. రాజ్యసంస్కారములు కొంతవరకు జరిగెను. వాటరులూయుద్ధమైనతరువాత ఐరోపాఖండమున నన్ని జాతులవారును నెపోలియనుయుద్ధముతో వి

సిగి చాలాకాలము విశ్రాంతి నొందిరి. ఎక్కడచూచినను సంస్కారములు చేయవలెనను ప్రయత్నములును ప్రజలకు స్వాతంత్ర్యములు కలుగచేయవలె నను ప్రయత్నములును జరుగుచువచ్చెను. ఫ్రాన్సుదేశమున నీవిధమయినప్రయత్నములుజరుగుచు రాఁగారాఁగా 1830 సంవత్సరమున ప్రజావిప్లవము తటస్థమయ్యెను. ఆంగ్లేయదేశమున 1832 సంవత్సరమున సంస్కరణచట్ట మొకటి యేర్పడెను. హాలండుదేశమునుండి బెల్జియము విడివడి స్వరాజ్యమును స్థాపించుకొనెను. జర్మనీదేశమునందును, ఇటలీదేశమునందును, జాతీయ ఐకమత్యమునుగూర్చియు, జాతీయస్వాతంత్ర్యమునుగూర్చియు కొన్ని కార్యములుజరిగెను. 1830సంవత్సరమున గ్రీసుదేశము స్వాతంత్ర్యమును పొందెను. 1833 సంవత్సరమున బానిసత్వము నిర్మూలమయ్యెను. ఎచ్చటచూచినను ప్రజలస్థితిగతులు బాగుచేయవలెననియు, సంస్కారములను చేయవలెననియు, తలంపులుగలుగుట యాకాలలక్షణమైయుండెను. ఈలక్షణములె మన హిందూదేశపరిపాలకులరాజనీతికిగూడ మార్గదర్శకమయ్యెను.

హేస్టింగ్సుప్రభువు 1817 సంవత్సరమున కలకత్తానగరమునహిందూకళాశాలనొకదానిని ప్రతిష్ఠించెను. 1827 సంవత్సరమున నతనితరువాత "ఆమహారెస్టు" ప్రభువు గవర్నరుజనరలుగా వచ్చెను. 1826 సంవత్సరమున నొకచిన్న బర్మాయుద్ధముజరిగి, అస్సాము, ఆరగాను, తెనాసరీమ్, అనురాష్ట్రములు కంపెనీవారిస్వాధీనములయ్యెను. మరిరెండుసంవత్సరములకు తరువాత విల్లియమ్బెంటింకుప్రభువు గవర్నరుజనరలుగా వచ్చెను. ఇతఁడును ఆంగ్లేయులరాజ్యమునకు మరికొన్నిచిన్నచిన్నరాష్ట్రములు కలిపి వృద్ధిచేసెను. కొడగుదేశము ఆంగ్లేయులకప్పుడు చేరినదే. మైసూరుపరిపాలనముగూడ 1830 సంవత్సరమునం దీతనికాలముననే వీరికి వచ్చి చేరెను. ఇప్పుడు మనము ప్రసంగించుచున్నయీయుగమున, ఆంగ్లేయులకు కలిగినయీచిన్నచిన్న దేశవిజయములు మన్రో, ఎల్ఫిన్స్టన్, బెంటింకు, అనువారికాలమునందుజరిగినసంస్కారములతో పోల్చిచూచిన మిక్కిలి లెక్కలేనివిగా చెప్పవలసియుండును.



వారన్హేస్టింగ్సు, కారన్వాలీసులకాలమునాఁడు ఏర్పడినన్యాయపరిపాలనాపద్ధతి పనిచేసినది కాదు. ఇందుకు కారణము పరిపాలనావిషయమున దేశప్రజల కేమియు జోక్యము లేకుండచేయుటయేమైయుండెను. న్యాయపరిపాలనాకార్యములన్నియు బాకీలుపడిగుట్టలుక్రింద పడియుండెను. ఆంగ్లేయన్యాయపరిపాలకులుతగవుతీర్చుటకు చేసెడుఆలస్యమువలన నన్యాయములు హెచ్చనారంభించెను. కంపెనీవారిరాష్ట్రములందు నేరములు వృద్ధియయ్యెను. ఆచోకీథీయువారిచే రహస్యముగ, చేయించుపనులవల్లను కేవలము అనుమానముమీఁదనే మనుష్యులను బట్టిబంధించుకార్యములవల్లను ప్రజాక్షోభ మెక్కువయ్యెను. 1810 సంవత్సరమున బంగాళాదేశమునం దేమూలచూచినను దోపిడులును, ఏతద్విషయికమగుఖూనీలును హెచ్చుగ నున్నవని మింటోప్రభువుగారు వ్రాసి పోయిరి. మిక్కిలి సమర్థులగుకంపెనీయుద్యోగస్థులప్పుడీ దాడణములను కనిపెట్టి దేశప్రజలకు పరిపాలనమునందు విశేషస్వాతంత్ర్యము కలుగఁజేయ నవసరమును కనిపెట్టిరి. కలకత్తాకోర్టుజడ్జీగానుండిన "స్ట్రాచీ" యనునాతఁడు విశేషజనసంఖ్య కలిగినట్టియు, నాగరికత నందినట్టియు హిందూదేశమువంటిదేశమున స్వదేశవాసులకు పరిపాలనాకార్యము లొప్పగించిననేకాని న్యాయము పమకూరనేర దని వ్రాసెను.

"థామస్మన్రో" అనునాతఁ డీయువదేశము నాచరణలోనికి దెచ్చి దేశప్రజలయందు పరిపాలనాకార్యములవిషయమున విశ్వాసముంచుటకు ప్రారంభించెను. ఈరాజనీతి ననుసరించినయాంగ్లేయులలో

నీతఁడే మొదటివాఁడు. 1780 సంవత్సరమునం దీతఁడు హిందూదేశమున కొకశిపాయిగా వచ్చెను. హైదరాలీతో సంభవమైనయుద్ధములలో పని చేసెను. దక్షిణహిందూస్థానములోను మైసూరుదేశములనుండి ఆంగ్లేయులు సంపాదించినప్రదేశములలో నీతని కొప్పగించినప్రదేశములం దితఁడు రివిన్యూఅధికారము వహించి 1793-1797-1800 సంవత్సరములలో చేసినరివిన్యూసెటిల్‌మెంటులో పేరు పొందెను. 1814 సంవత్సరమునందే మరల హిందూదేశమునకు వచ్చి మదరాసున్యాయపరిపాలనావిషయికమగుపరిపాలనాపద్ధతుల సవరించి యభివృద్ధి చేయుటకేర్పడినసంఘమునకు నాయకుఁడుగా నుండి జవాబుదారీగలపరిపాలనోద్యోగములను హిందూదేశప్రజల కిచ్చుటకై తగినవిబంధనలను కొన్ని యేర్పాటు చేసెను. 1820 సంవత్సరమున మూఁడవసారి యాతఁడు మదరాసురాష్ట్రమునకు గవర్నరుగా వచ్చెను. అప్పుడు మదరాసురాష్ట్రమున రైతువారీసెటిల్‌మెంటు నేర్పరచి 1827 సంవత్సరమునం దీదేశమునన మృతుఁ డయ్యెను. ప్రజలనిమిత్తమై తనజీవితము నెల్లధారపోసినయాతని నిచ్ఛయింపనివారును ఇతనినిగూర్చి విచారింపనివారును దేశమునం దొక్కరును గానరారైరి.

మదరాస్‌రాష్ట్రమునందు "సర్ థామస్ మన్రో" యేమిచేసెనో, బొంబాయిరాష్ట్రమున "ఎల్ఫిన్‌స్టన్" అనునాతఁ డదియే చేసెను. ఈతఁడు మన్రోకంటె 18 సంవత్సరములు చిన్నవాఁడు. 1796 సంవత్సరమున మిక్కిలి చిన్నతనమున హిందూదేశమునకు వచ్చి తనపనియందు పేరు నొందెను. 1803 సంవత్సరమున వెల్లింగ్టనుప్రభువు అస్సేయుద్ధమున జయించినప్పు డాతని యొద్ద నితఁ డొకవిధమయినరాజకీయకార్యదర్శిగా నుండెను. ఆఫ్ఘనిస్థానమునందు కలిగినయొక కార్యమునకై యాతఁడుమింటోప్రభువుచే 1808సంవత్సరమున నియోగింపఁబడి, ఆఫ్



ఘనులనుగూర్చియు, వారిదేశమునుగూర్చియు, శాశ్వతమైనచరిత్ర నొకదానిని వ్రాసెను. 1811 సంవత్సరమున పూనానగరమునకువచ్చి పీష్వాకోర్టులో రెసిడెంటుగానుండి 1817 సంవత్సరమున నాలుగవమహారాష్ట్రయుద్ధమున ప్రాముఖ్యమైనకార్యభారము లెల్ల తానే పైనవేసుకొనియెను. 1819 సంవత్సరమున మహారాష్ట్రదేశమంతయు బొంబాయిరాష్ట్రమునకు చేర్పఁబడినపిమ్మట నీతనికి మహారాష్ట్రవ్యాపారములందు కలిగినయనుభవమునుబట్టి యితనిని బొంబాయిగవర్నరుగా నియమించిరి. ఈపెద్దయుద్యోగమునం దీతఁ డెనిమిదిసంవత్సరము లుండెను. అప్పటికి బొంబాయిరాష్ట్రమునందున్న రెగ్యులేషను లన్నియు నీతఁడు చట్టములను చేసెను. ప్రజలకు పరిపాలనాకార్యములయం దెక్కువస్వాతంత్ర్యము నిచ్చెను. రాష్ట్రమునందు విద్యాభివృద్ధి చేసెను. మదరాసునందు 'మన్రో' మరణించినకొన్నిమాసములకే యనగా 1827 సంవత్సరము నవంబరునెలలో బొంబాయిరాష్ట్రమునుండి యాతఁడు విశ్రాంతి గైకొని యింగ్లాండునకు పోయెను.

ఈకారణములనుబట్టి 1828 సంవత్సరమున బెంటింకుప్రభువు గవర్నరుజనరలుగా వచ్చునప్పటికి సంస్కరణకార్యములు చాలభాగము జరిగిపోయెను. బెంటింకుప్రభువుయొక్క పరిపాలనాప్రథమభాగము బహుకార్యవిశిష్టమైనది. పందొమ్మిదవశతాబ్దప్రథమమున బెంటింకును మదరాసురాష్ట్రమునకు గవర్నరుగా పంపిరి. కాని, సైన్యసంక్షోభము కలిగినకారణమున నాతని నాయుద్యోగమునుండి వెనుకకు రప్పించిరి. అంతట నైరోపారాజకీయవ్యాపారములయందు మగ్నుఁడై 1814 సంవత్సరమున జినోవాను జయించి పూర్వపురాజ్యతంత్రముల నన్నిటిని మరల నెలకొల్పెను. ఇటలీదేశమునం దైకమత్యమును నెలకొల్పి స్వతంత్రరాజ్యమును కలుగచేయవలెనను తలంపు కలిగెను. ఆతఁడు పదు

నాలుగుసంవత్సరములకు వెనుక పూర్ణవయసును పొంది 54 సంవత్సరమున నిండియాకు గవర్నరుజనరలుగా వచ్చెను.

చెన్నరాష్ట్రమునందు మన్రోగారిచే సిఫార్సుచేయఁబడినఅన్ని రెగ్యులేషనులును అంగీకరింపఁబడినవి. ఆకారణముచేత సివిల్ న్యాయపరిపాలన మంతయు హిందూన్యాయాధిపతులచేతిలోనికి వచ్చెను. బొంబాయిరాష్ట్రమున ఎల్ఫిన్స్టన్ గూడ నిట్టిసంస్కరణములనే యొనర్చెను. విల్లియమ్ బెంటింకుప్రభువు బంగాళాదేశమునందలిసివిల్ న్యాయపరిపాలన మంతయును హిందూన్యాయాధిపతుల కొప్పగించెను. వారియధికారములును వారివచ్చుబడియును విరివియైనవిగా నుండెను. రివిన్యూపరిపాలనలో నైరోపియనుకలెక్టరుల కందరకును డిప్యూటీకలెక్టరులను సహాయ మొసంగిరి. పరిపాలనావిషయమున హిందూదేశప్రజల కెక్కువయధికార మిచ్చియుండుటచే నేఁటను పదిలక్షలు బాకీపడుచుండెడి పన్నులు 20 లక్షలవరకును వృద్ధిచేయుటకు విల్లియమ్ బెంటింకుకు వీలు కలిగెను. 1833 సంవత్సరమున ఉత్తరహిందూస్థానమున కొన్ని క్రొత్త మార్పులను చేసి మహల్వారిసెటిల్ మెంటును చేయ నారంభించెను. బొంబాయియందు 1835 సంవత్సరమున రైతువారీసెటిల్ మెంటు ప్రారంభ మయ్యెను.

1833 సంవత్సరమున తూర్పుయిండియాసంఘము వారికవులుతిరుగ నీయఁబడెను. ఆకవులు షరతులనుబట్టి కంపెనీవారదివరకు చేయుచుండువర్తకము నెల్ల మానుకొని కేవలము పరిపాలనాకార్యములే చక్కఁబెట్టుకొన షరతు వ్రాయఁబడెను.

హిందూదేశవాసుఁ డెవ్వఁడును తనమతప్రతిబంధకమువలనగాని, జన్మమువలనగాని, జన్మస్థానమువలనగాని, రంగుభేదమువలనగాని, యేయుచ్చపదవినిగాని, యుద్యోగమునుగాని, నౌకరీనిగాని పొందుటక



నర్హుఁడు కాఁగూడదని యాకవులులోనేషరతు వ్రాయఁబడినది.

బెంటింకుప్రభువుతరువాత "సర్ ఛార్లెస్ మెట్కాఫ్" అనునాతఁడు గవర్నరుజనరలుగా వచ్చెను. ఆతనికి తరువాత నాపదవికి, ఆక్లండు ప్రభువు నియమింపఁబడి 1836 సంవత్సరమున నాతఁడు హిందూదేశమునకువచ్చి చేరెను. ఆమరుచటిసంవత్సరముననే విక్టోరియారాణి బ్రిటిషుసామ్రాజ్యసింహాసనాసీనురా లయ్యెను.

ఆమహామహురాలు సింహాసన మధిష్ఠించినదినము బ్రిటిషుసామ్రాజ్యమునందలి సకలదేశములవారును జ్ఞాపక ముంచుకొనతగినదియును, చారిత్రికవిషయమున నుపయోగకరమైనదిగను నుండెను; కాని యీక్రింద చెప్పఁబోవునంశములనుబట్టి యయ్యది హిందూదేశమునందొకచారిత్రికయుగము నంతము నొందించి మరియొకదానిని ప్రారంభింపఁ జేసెను. 1837 సంవత్సరమునకు పూర్వము బంగాళా, మదరాసు, బొంబాయిరాష్ట్రములును, ఉత్తరహిందూస్థానమునందలి మంచిమంచి ప్రదేశములును, బ్రిటిషుదొరతనమువారియేలుబడిక్రిందికి వచ్చెను. ఇప్పుడు ఘనముగా నెంచఁబడుచున్న ఇండియన్ సివిల్ సర్వీసుపరీక్ష మంచి కట్టుదిట్టముల నొందెను. దేశముయొక్క ధర్మపరిపాలన మెన్నియో యపజయములను పొంది యనేకములగుమార్పులను జెంది తుదకు తృప్తికరమైనమార్గమునకు తేబడెను. ల్యాండురివిన్యూపరిపాలనావిషయ మన్నిటికంటె చిక్కగువిషయము. ఇయ్యది బాగుగనో, ఓగుగనో 1793 సంవత్సరమున బంగాళాదేశమునందును, చెన్నరాష్ట్రమున 1820 సంవత్సరమునను, ఉత్తరహిందూస్థానమున 1833 సంవత్సరమునను, బొంబాయిరాష్ట్రమున 1835 సంవత్సరమునను, స్థిరపడెను. దేశ మంతటను నెమ్మది నెలకొనెను. 1833 సంవత్సరమున కంపెనీవారికి వర్తకవ్యాపారము వదలి హిందూదేశరాజ్యపరిపాలనావ్యాపారము సిద్ధించెను. 1817

సంవత్సరమున కలకత్తానగరమునందును, 1834 సంవత్సరమున బొంబాయినగరమునందును, ఆంగ్లేయకళాశాలలు స్థాపింపఁబడెను. 1836 సంవత్సరమున పత్రికాప్రకటనాస్వాతంత్ర్య మీయఁబడెను. హిందూదేశమునకును, ఐరోపాఖండమునకును ధూమనౌకాప్రయాణము లేర్పడెను. కర్చులు కుదింపఁబడెను. సాలుసరికిఁ గొంత నిలవ యేర్పడెను. ప్రజాక్షేమమునకై పరిపాలనావ్యాపారము విజృంభణము చేయఁబడెను. బ్రిటిషుదొరతనమువారిపరిపాలనము హిందూదేశప్రజలమేలునకే యను మహదాశయము మాటమాత్రమునకైనను నంగీకరింపఁబడెను. ప్రజలును వారియిష్టానుసారము వర్తించిరి. ప్రజలకు బుద్ధివికాస మంకురింపఁదొడగెను. దేశమునందభివృద్ధిలక్షణములు పొడచూపెను. ఈకారణములనుబట్టి హిందూదేశచరిత్రకు 1837 సంవత్సరమున సహజమైనవిశ్రాంతి యొకటి యున్నది. మనము చెప్పఁదలచిన బ్రిటిషుపరిపాలనమువారి యెనుబదియేండ్ల హిందూదేశచారిత్రమును నీసంవత్సరముతో ముగియుచున్నది.



# హిందూదేశార్థికచరిత్రము.

## రెండవ ప్రకరణము.

### బంగాళాదేశమునందలిదైశికవాణిజ్యము.

( 1757 మొదలు 1765 )

ప్రపంచమునందలి యితరదేశము లన్నిటియందువలెనె హిందూదేశమునందుగూడ పదునెనిమిదవశతాబ్దమున బాటలవెంటను పడవలవెంటను బోవుసరకు లన్నిటికిని దైశికమగుపన్నులు కొన్ని చెల్లింపఁబడుచుండెను. కాని తూర్పుఇండియాసంఘమువారు తాము ఎగుమతీచేయుసరకులకుగాని దిగుమతీచేయుసరకులకుగాని యీవిధమయినపన్నులేమియు లేకుండ పర్వానా యొకటి సంపాదించిరి. ఐరోపాఖండమునుండి కంపెనీవారు దిగుమతిచేయుసరకులును, మనదేశమున కొని ఐరోపాదేశమున కెగుమతీచేయుసరకులును దేశమున నెచ్చటతిరిగినను, నీపన్నులు లేకుండ నంగీకరింపఁబడియెను. ఇంగ్లీషుప్రిసిడెంటుగాని, యింగ్లీషుఫ్యాక్టోరీలలోని మరియేనాయకుఁడుగాని సంతకముచేసి యిచ్చినదస్తకుగను కగాటీలయొద్ద చూపింపఁబడియెనా కంపెనీసరకుల కీపన్నులు లేకుండనుండెను.

1757 సంవత్సరమున పలాసియుద్ధమున గలిగినజయముతో నాంగ్లేయులకు బంగాళాదేశమున ప్రతిష్ఠ హెచ్చెను. బంగాళాదేశమున తాము స్వంతముగ వర్తకము చేసుకొనెడుకంపెనీవారిప్రతినౌకరును గూడ కంపెనీవారియెగుమతిదిగుమతీసరకులకుమాత్రమే యొసఁగబడిన

యీమినహాయింపు తమకుఁగూడ నుండవలెనని కోర మొదలుపెట్టిరి. ఈయంశము మనకు పూర్ణముగ తెలియవలసిన యావశ్యకతమెండుగ నున్నది. ఏమందురేని బంగాళాదేశముయొక్క ఆర్థిక చరిత్రయును, వాణిజ్యరాజకీయచరిత్రములును తెలిసికొనుటకు నిదియె ముఖ్యాశ్రయమై యున్నది.

బంగాళానవాబులు కంపెనీవారికి దిగుమతీవ్యాపారమునకును, ఎగుమతీవ్యాపారమునకునుగూడ పన్నులులేకుండఁజేసుకొనుట కుత్తరవులనిచ్చిరి. కాని, కంపెనీనౌకర్లు కంపెనీపక్షముననేగాక తాము స్వంతముగ గూడ వర్తకము చేసికొనుచు బంగాళాదేశ మంతటను సరకులను ద్రిప్పుచు తమకుఁగూడ నీపన్నులు మాపుచేయవలెనని నిరోధించుచు వచ్చిరి.

పలాసియుద్ధమైనపిదప 1757 సంవత్సరమున క్లైవు మీర్జాఫరును బంగాళాదేశమునకు నవాబుగాజేసెను. మీర్జాఫరు పరిపాలనావిషయమున నసమర్థుఁడై యాంగ్లేయులకును, తనకును జరిగినషరతొక్కటియైనను నెఱవేర్చలేకపోయెను. అందువలన 1760 సంవత్సరమున నాతనిని తప్పించి మీరుఖాసిమును నవాబునుగా ప్రతిష్ఠించిరి. ఈ క్రొత్తనవాబుగారు తూర్పుఇండియాసంఘమునకు, బరద్వాన్, మిధునపురము, చిట్టిగాంగు, అను మూడుజిల్లాలపన్నులను వారి కిచ్చివేయుటకు నిర్ణయించుకొనెను. ఇంతియేగాక మీర్జాఫరు చెల్లించగా దిగఁబడిన బాకీలను వసూలిచ్చుటకును, దక్షిణహిందూస్థానమున కంపెనీవారికి తటస్థించినయుద్ధపుఖర్చులకై అయిదులక్షలరూపాయిలు బహుమతిగ నిచ్చుటకును, గూడ నేర్పాటులు జరిగెను. మీర్ఖాసిం ఈయేర్పాటు లన్నియును చెప్పినట్టు నెఱవేర్చి రెండుసంవత్సరములలో ఇంగ్లీషువారికితానీయవలసినసొమ్ముసంబంధమైనయావత్తు పేచీపూచీలను వదల్చుకొనెను



కాని, ఆంతర (స్వదేశిక) వర్తకసంబంధమైనచిక్కులారోజున కారోజు వృద్ధిగాఁజొచ్చెను. కంపెనీనౌకర్లు తమసరకులను పన్నులులేకయే ప్రతిస్థలమునకును తీసికొని పోఁజొచ్చిరి. దేశీయవర్తకులసరకులకు ఒకస్థలమునుండి మఱియొకస్థలమునకు కొనిపోవుటలో తగులుబళ్లు విశేషము లయ్యెను. స్వదేశవర్తకులు చెడిపోయిరి. నవాబునకు రావలసినపన్నులు తగ్గిపోయెను. కంపెనీనౌకర్లు వర్తకమునెల్ల గుత్తగొని యమితమైనధనమును పోగుచేసుకొనిరి.

1760 సంవత్సరమున క్లైవునకు వెనుక గవర్నరుగావచ్చిన "హెన్రీవాన్సీటార్టు" అనునాతఁడు దినదినప్రవర్ధమాన మగుచున్నయీ దుస్థితిని కనిపెట్టి దానికారణము లిట్లువివరించెను. "వర్తకమునుగూర్చి మీర్జాఫరు నడిగిపుచ్చుకొనినక్రొత్తహక్కు లేవియును మనకులేవు. కంపెనీవారు తమకు 1617 సంవత్సరమున నిచ్చినషరతులతో తృప్తిచెంది నవాబుయొక్క స్వేచ్ఛాధికారమునుండి తమ కేమియును బాధకలుగకుండ తగినయేర్పాటు చేయుమని మాత్రము కోరిరి. దేశమున మనపలుకుబడి వృద్ధియైనకొలఁది కంపెనీనౌకర్లు కొందరును వారియధికారముక్రింద నేర్పాటైన ప్రజలు కొందరును టక్కరితనముల నవలంబించిరి. ఇంతకు పూర్వము నిషేధింపఁబడినసరకుల వర్తకముచేసి స్వదేశవిషయములతో జోక్యము కలుగచేసుకొనిరి."

ఆతనికి వెనుక గవర్నరుగా వచ్చిన "వెరలిష్టు" అనునాతఁడు కూడ నీరీతిన వ్రాసెను. "పన్నులు చెల్లింపకయె వర్తకము చేయసాగిరి. దీనిని సాగించుటలో దురాగతము లనేకములు ప్రబలెను. ఇంగ్లీషుఏజంట్లును, గుమాస్తాలును, ప్రజల హింసించుటతో తృప్తిచెందక దొరతనమువారి యధికారమునెల్ల నణఁగఁద్రొక్కి తమపని కడ్డమువత్తురనునవాబుఉద్యోగస్థులనెల్ల కాలికిని మెడకును గట్టి శిక్షింపజొచ్చిరి.

మియరుఖాసిముతో తటస్థమైనయుద్ధమున కిదియే తరుణకారణము."

నవాబుమియరుఖాసిమ్‌కూడ కంపెనీనౌకరు లొనరించుచున్న యీమరాగతములనెల్ల ధిక్కరించుచు నింగ్లీషుగవర్నరున కీక్రిందిరీతి నొకయుత్తరమువ్రాసెను. "కలకత్తాఫ్యాక్టరీయొద్ద ప్రారంభించి కాసింబజారు, పాట్నా, ఢక్కావరకునుగల ప్రదేశములలో ఇంగ్లీషువారిలో పేరుగలవారును, వారిగుమాస్తాలును, ఉద్యోగస్థులును, ఏజంట్లును చేరి గవర్నమెంటువారిప్రతిజిల్లాయందును తామె కలెక్టర్లమనియును, భూస్వాముల మనియు, జమీందార్ల మనియు, తాలూకాదార్ల మనియు, జెప్పకొనుచు కంపెనీవారిజెండాల నెత్తి మాయుద్యోగస్థులయధికారములు సాగనీయకున్నారు. ఇదిగాక ప్రతిజిల్లాలోను, ప్రతిపట్టణమందును, ప్రతిపరగణాయందును, ప్రతిగ్రామమునందును, గుమాస్తాలును తదితరనవుకరులును, నూనె, చేపలు, గడ్డి, వెదురు, బియ్యము, ధాన్యము, పోకలు మొదలగుసరకుల వర్తకము చేయుచున్నారు. కంపెనీవారిఫరమానాచేతనున్న ప్రతివారును కంపెనీవారి కున్నంతయధికారము తమకును గలదని విఱ్ఱవీఁగుచున్నారు."

మియర్‌ఖాసిమ్‌యొక్క యీఫిర్యాదులు కారణము లేకయె పుట్టినవి కావు. పాట్నానగరమున కంపెనీవారియేజంటుగా నుండిన "ఎల్లిసు" అనునాతనిచర్య లన్నియును నవాబున కసహ్యకరములై మిక్కిలి యనిష్టమును బుట్టించెను. ఆర్మేనియావర్తకుఁ డొకఁడు నవాబునకు కొంచెము సూరేకారము కొనినాఁ డనియును, అయ్యది కంపెనీవారిస్వాతంత్ర్యములకు ప్రతిరోధకమైన దనియు నేరస్థాపన చేసి వానిని పట్టి బంధించి సంకెలలు వేసి కలకత్తాకు బంపిరి. ఆంగ్లేయుల సైన్యమునందలి యిద్దరుద్రోహులు మాంఘిరుపట్టణమునందలి నవాబుగారి కోటలో దాఁగి యున్నా రను ననుమానము పుట్టెను. అందుపైన



"ఎల్లిసు" ఆకోటను వెదుక పంపగా నచ్చట వా రెవ్వరును కనఁబడరైరి. గవర్నరుజనరలుసభయం దప్పుడు మెంబరుగా నుండిన వారన్ హేస్టింగ్సు, నవాబుయెడల ముందువెనుక లాలోచింపక కనపరచినయీ తిరస్కారమునకు, మనస్సు చివుక్కుమని యేదో పెద్దకలహము సంభవమగునని యనుకొనెను. "ఎల్లిసువిషయమై నా కేమిచేయుటకును తోచకున్నది. వానిప్రవర్తన మిక్కిలి యయుక్తముగా నున్నది. నవాబుయెదుట నాతఁడు కనపరచినరాజద్రోహము ప్రత్యక్షముగా కనిపించుచున్నది. ఈవిషయమంతయును కంపెనీవారికి నివేదించినపక్షమున వారి కాతనిపై దప్పక యాగ్రహము రాకమానదు. జరిగినచర్య లన్నిటిని బట్టి నవాబుగారియధికారమును మనము బహిరంగముగ ధిక్కరించినార మనియు, వారియుద్యోగస్థుల ఖైదు చేసినామనియును, తనకోటపై సిపాయిలను పంపినా మనియును, తలంచి ఈప్రాంతముల నుండుఇంగ్లీషువారి ప్రముఖుఁడు నవాబుగారికి తనసుబా (రాజ్యమున) కే హక్కు లేదని యనుకొనులా గున్నారని ప్రపంచమంతయు ననుకొనుచుండెను. దీనివల్ల కలిగెడుఫలితమే బాహుళ్యమైనపోరాట మని స్పష్టముగా కనఁబడుచున్నది." అనిహేస్టింగ్సు గవర్నరుగారికి 1762 సంవత్సరము మేనెల 13–26 తేదీలను ఉత్తరములువ్రాసెను.

కంపెనీనౌకరులు పన్నులు లేకుండఁగనే తమస్వంతవర్తకము కూడ సాగించుకొనఁ జూచుప్రయత్నము లన్నియు సరియైనవికావని నిషేధింపుచు, బంగాళాదేశప్రజలవర్తకమున కిందుమూలమున కలిగినవినాశమునకు మిక్కిలి విచారించుచు, నీవిషయమున వారన్ హేస్టింగ్సు ప్రవర్తించినప్రవర్తనకు మన మాతని కొనియాడ తగియున్నది. కేవల స్వలాభాపేక్ష యాతనికన్నుల పొరకప్పలేదు. తనదేశవాసులపై సహజముగ నాతని కెంతయభిమానమున్నను వారన్ హేస్టింగ్సు

మాత్రము బంగాళాదేశవాసులకు జరిగినయీయక్రమములకు తనవారిని సాధించుటలో నించుకంతయును వెనుదీయలేదు.

“ఇప్పుడు గొప్పయక్రమ మొకటి మీయాదిలోనికి వచ్చి నివారణ కావలసియున్నది. దీనివిషయమై తగుశ్రద్ధ తీసుకొనిననేగాని మన మెన్నిప్రయత్నములు చేసినను కంపెనీవారికిని, ఈనవాబుగారికిని శాశ్వతమైనస్నేహము కలుగనేరదు. ఇంగ్లీషువా రంగీకరించినారని వారిపేరుపెట్టి వీరిపేరుపెట్టి పెట్టుచుండెడిబాధయే నేచెప్పఁబోవుగొప్పయక్రమము. నేను దిరిగినస్థలములయం దెక్కడఁజూచినను, ఇంగ్లీషుజెండాలె ప్రజ్వరిల్లుచుండెను. ఇదిచూడ నా కెంతయు వింతగ నున్నది. గంగానదిమీఁదజూచినపడవ యేదియును ఇంగ్లీషుజెండా లేనిది లేనేలేదు. నాకన్నులార నేఁజూచినసంగతి యొకరి నడుగ వేరె ప్రసక్తిలేదుగదా! వా రీపేరుచెప్పి ప్రవర్తించుచున్నను నిరంతరమును నిట్టులే జరుగుచున్నచో నవాబు పన్ను లెట్లు వసూలు కాఁగలవు? దేశ మెట్లు నెమ్మదిగా నుండును? మనజాతి కేమి గౌరవము నిలుచును? ఇవి యన్నియు నుగూడ క్రమక్రమముగ క్షీణింపక మానవు. మనముందు బోయెడు సిపాయిలను వారిచిత్తమువచ్చినరీతిని విడిచినయెడల వారుచేయుదారుణము లిన్ని యన్ని యని పరిమిత ముండదు. రోడ్లవెంట నేనుప్రయాణము చేయునపుడు వారిపై నాయొద్ద ననేకు లనేకవిధముల జెప్పసాగిరి. మనము దరికి వచ్చుచున్నంతమాత్రమున ప్రజలు పట్టణములును పల్లెలును విడిచి పారిపోవుచున్నారు. షాపు లన్నియును కట్టిపెట్టుచున్నారు. ఇవి చిన్నచిన్నయక్రమములే యగును; వీనివిషయమై పబ్లీకుగా నిన్నిసారులు వ్రాయుటకూడ ననవసరమే యగును; గాని యిట్టియక్రమములవలననే మనదొరతన మనిన నీదేశజనులకు క్రమక్రమముగ ననిష్టము ప్రబలుచున్నది.” అని 1762 సం॥రమున ఏప్రిలు 25 తేదిని మరియొకయుత్తరము వ్రాసెను.



హిందూదేశమున హేస్టింగ్సు చాలకాల ముండెను. కంపెనీనౌకరులపరిపాలనమన్న ప్రజల కుండెడువ్యతిరేకాభిప్రాయమునుగూర్చి ఎప్పుడును నొక్కి చెప్పుచునే యుండెను. “సియార్ ముతాఖరీన్” అను ప్రసిద్ధచరిత్రమును వ్రాసినగ్రంథకర్త యుద్ధరంగమునందలియాంగ్లేయసైన్యప్రవర్తనలకు మెచ్చుకొనుచు వారి సివిల్ పరిపాలనమును గూర్చి మిక్కిలి దుఃఖకరమైనచరిత్రమును వ్రాసి యుంచెను.

“ఆంగ్లేయులు నిశ్చలమైనధైర్యముతో అప్రమత్తులయి వివేకము గలిగి ప్రవర్తింతురు. యుద్ధములోని వ్యూహకార్యనిర్మాణమునందును, నియమము తప్పకుండ యుద్ధము చేయుటయందును వారికి చాలినవా రితరులు లేరు. మిలటరీవ్యాపారములయందు వారికి గలిగియుండునంతటి వివిధము లగుశక్తిసామర్థ్యములు ప్రజాప్రభుత్వము నందే వారికి పట్టువడియుండునేని, సైనికకార్యములం దేవిషయమునం దైనను చూపునంతటిబుద్ధిచాకచక్యము ప్రజలను కష్టనిష్ఠురములనుండి రక్షించుటయందు వారు కనపరచిరేని, వ్యవసాయకులయెడలను దేశమునందలిగౌరవముగలపెద్దమనుష్యులయెడలను వారిస్థితిగతులనుగురించివారు సంబంధమునుకలుగజేసుకొని యుందురేని ప్రపంచమునందలిమరి యేయితరజాతియును వారితో తుల్యులై యుండరు. ఉందురో ప్రభుత్వవ్యాపారమున కింతయర్హులై యుండరు. ఈరాష్ట్రములయందలి జనులయెడల వీ రెంతయును ననాదరమును కనపరచుచున్నారు. వీరియోగక్షేమ మనినవారి కెంతయును నలక్ష్యము. వారిరాష్ట్రములయందలి జనుల నెచ్చట గాంచినను కేవలమును మిక్కిలి పేదవడి కడగండ్లకు లోనై గోల పెట్టుచున్నారు. ఓ దైవమా! ఇట్టి యిడుమల గుడుచుచున్నయీ నీసేవకుల నీబాధలనుండి సంరక్షింప సాయపడుము.” అని “సియార్

ముతఖరీన్ '' అనుచరిత్రమునందు రెండవసంపుటము 101 వ పుటలో వ్రాయబడియున్నట్లు మిల్లుగారిబ్రిటిషుహిందూదేశచరిత్రమునందువ్రాయఁబడి యున్నది.

బంగాళానవాబు ఇంగ్లీషుగవర్నరుగారితో న్యాయమగుమొరలెన్నియో పెట్టుకొనెనుగాని, యందొక్కటియును తీర్పఁదగినది కాదు. "కంపెనీగుమాస్తాలు ఉప్పు, పోకలు, నేయి, బియ్యము, గడ్డి, వెదురు, చేపలు, సంచులు, అల్లము, పంచదార, పొగాకు, నల్లమందు, మొదలగుచెప్పలేనన్నిరకములసరకులు ప్రతిపరగణాలోను, ప్రతిగ్రామమునందును ప్రతిఫ్యాక్టరీలోను కొని అమ్ముచున్నారు. ఆసరకులపేళ్లన్నియు నేనేకరవు పెట్టలేను. చెప్ప నవసరమును లేదు. రైతులు వర్తకులు మొదలగువారియొద్దనుండి సరకులను బలవంతముగ నాలగవవంతుధరలకు లాగుకొని పోవుచున్నారు. దేహశ్రమలకు లోనుచేసియు, బాధ పెట్టియు, ఒకరూపాయవిలువగలసరకునకు 5 రూపాయలు పుచ్చుకొనుచున్నారు.జిల్లాయధికారులను, తమయుద్యోగధర్మములు నెరవేర్చకుండ నిర్బంధించుచున్నారు...............ఇట్టి బాధలవల్లను మాకు రావలసిన పన్నులు రాకుండ చేయుటవల్లను మాకు సాలుకు 25 లక్షలరూపాయలు నష్టము సంభవించుచున్నది. దైవానుగ్రహమువలన మే మింతవరకు మనకును మనకును జరిగినసంధిషరతుల నుల్లంఘింపలేదు. అట్టిపని ముందు చేయఁబోము.ఈ ఆంగ్లేయదొర లేల నాదొరతనమును నింద్యముగావించెదరు? ఇంత నష్టము నేల నాకు తెచ్చిపెట్టెదరు?'' అని 1762 వ సంవత్సరము మేనెలలో నవా బుత్తరము వ్రాసెను.

కంపెనీతరపుగుమాస్తాలు జరిగించినఘోరకృత్యము లింతకన్నను విపులముగ "సార్జెంటుబ్రిగో'' అనునాతనియుత్తరమున కనుపించుచున్నవి.



"ఏపెద్దమనుష్యుఁడో ఒకఁడు తనగుమాస్తాను సరకుల నమ్ముమనియో కొనుమనియో పంపుచుండును. అంతమాత్రముచేత నాగుమాస్తా ప్రతిమనుష్యునిచేతను తనసరకులను బలవంతపెట్టి కొనిపించుటకును వారిసరకులను బలవంతపెట్టి తనకే అమ్మునట్లు చేయుటకును అధికారమున్నట్లు, తలంచుకొనుచున్నాఁడు. అట్లు చేయుట కశక్తతచేత ఎవఁడైన నంగీకరింపకపోయెనా, తక్షణమే వానిని బట్టిముక్కోణమునకు కట్టి కొట్టించుటయో లేక కొట్టులో ద్రోయించుటయో సంభవింపక తప్పదు. తమ కిష్ట మయ్యేనేని యింతటితో తృప్తి చెందక కొన్నికొన్నిచోట్ల అవసరమునుబట్టి మరియొకనిర్బంధముకూడ కలుగుచున్నది. తాను వర్తకముచేయుసరకులను తానుతప్ప మరియితరుఁడెవ్వఁడును అమ్ముటగాని కొనుటగాని వల్లకాకుండ నావర్తకవ్యాపారము లన్నియును గుత్తగా తన కొక్కనికే యుండవలెననునిర్బంధమే యీయది. పైపెచ్చు తా మేసరకులు కొన్నను మరియొకవర్తకుఁ డిచ్చెడుధరకన్న చేతనైనంతవరకు తక్కువ యిచ్చుటయును, వీలైనపుడెల్ల తాయిచ్చెడిదైనను, ఎగవేయుటయును తాను చేయగలిగినదానిలో నెల్ల మిక్కిలి స్వల్పకార్యముగా నుండెను. నేను జోక్యము కలుగచేసుకొన్నయెడల వెంటనే ఫిర్యాదులు తటస్థ మగును. ఇవియును బంగాళాదేశములోనిగుమాస్తాలు ప్రతిదినమును చేయుచుండెడుచెప్పలేనియనేకము లగునిట్టి యక్రమములును బంగాళాదేశమునందు ఫలవంతమైనయీ బేకర్ గంజి జిల్లా క్రమక్రమముగ నిర్జనప్రదేశమై పోవుటకు కారణము లైనవి. ప్రతిదినమును జనులు తండోపతండములుగ నింతకంటె సురక్షితముగ నుండుస్థలములకుఁ బోయి జీవనము చేయ తమజన్మస్థానముల విడిచి పోవుచున్నారు. పూర్వ మిచ్చటతమసరకులు విరివిగ అమ్మకమై తమకు లాభము కలిగెడిదో యచ్చట తమ కుపయోగమగువస్తు వేది

యు లేకుండ పోయెను. మీదుమిక్కిలి వారిబంట్రోతు లీకూటికిలేని వాండ్రను పీకుకొని తిని విడుచుచుండిరి. జమీందారులు గనుక దీనికి అడ్డువెట్ట వచ్చిరా మీకును నిట్టియవమానమే జరుగు నని వారినిభయ పెట్టుచు వచ్చిరి. పూర్వము ధర్మపరిపాలనమునకు బాహాట మగుకచేరీ లనుచు నుండెడివి.ఇప్పుడన్నన్నో ప్రతిగుమాస్తాయును జడ్జీ యగుచున్నాడు. ప్రతివానియిల్లును కచేరియే. జమీందారులడు గూడ శిక్షలు విధించి వారి కీయపకారము చేసెద మా యపకారము చేసెద మని ద్రవ్యము లాగుచున్నారు.వారిపై మోపఁబడు నేరము లెట్టివనిన బంట్రోతులతమవారినెవరినో ఏమో యన్నారనియును, తమవారుదొంగిలించిన సొత్తులను బంట్రోతులేదొంగిలించినారని వారిపై బెట్టుటయును, అయియున్నవి.'' ఈపై సంగతులు సార్జంటుబ్రిగోగారి 1762 వసంగరము మే నెల 26 తేదియుత్తరమునం దున్నవి.

డక్కాకలెక్టరుగా నుండినమహమ్మదలీయనునతఁడు కలకత్తాయం దున్నయాంగ్లేయులగవర్నరుగారికి వ్రాసినయుత్తరమునందు కూడ నట్టిసమాచారమే వివరముగ వ్రాయఁబడియెను.

మొదటిది! కొంతమందివర్తకులు ఫ్యాక్టరీజనులతో లాలూచీయై వారిపడవలకు ఇంగ్లీషుజండాలను దగిల్చి యామిషచేత తమసరకు లన్నియు నింగ్లీషువారిసరకు లని చెప్పుకొనుచుండిరి. సాబందరు మొదలగు పన్ను లన్నియును నీగురుతులవల్లనే నిర్ధారణము చేయఁబడుచుండెను. రెండవది !! లక్కీపురము, డక్కా మొదలగుఫ్యాక్టరులలో పనిచేయు గుమాస్తాలు వర్తకులు మొదలగువారికి పొగాకు, దూది యినుము మొదలగుచిల్లరసరకులను బజారుధరలకంటె హెచ్చుధరలకు అంటగట్టి బలవంతముగా ఆసొమ్మును వారివద్దనుండి లాగుచుండిరి. ఇదిగాక బంట్రోతులకని బత్తెము కొంత యేర్పాటు చేసి యదిగనుక యీయకపోయిరా



అట్టివారికి జరిమానా కూడ కొంత విధించుచుండిరి. ఈరీతిచర్యలవల్ల సరుకులు తయారయ్యెడు "ఆరంగ'' లను ప్రదేశములును తదితర స్థలములును నాశనమయిపోయినవి. మూడవది!!! లక్కీపురమునందలిఫ్యాక్టరీగుమాస్తాలు తహశ్శీలుదారువద్దనుండి బలవంతముగ తాల్లూకాదార్లభూములను లాగుకొని వారికి యియ్యవలసినపన్నుల నెగపెట్టుచుండిరి. ఎవ్వరో కొందరు కుట్రచేయగా ఏదో యొకతగవు నేర్పరచి యాళ్లమీదికి కొందరు అయిరోపియను సిపాయీలను కంపెనీవారిదస్తకు నిచ్చి పంపించగా తన్మూలమున కలహములు సంభవించుచున్నవి. అనేకస్థలములయందు చౌకీలు, గాటీపాకలు, ఏర్పరచి పేదవాండ్రయిండ్లలో నేది దొరకిన నదియెల్ల అమ్మించి యాసొమ్ము మూటకట్టుకొనుచున్నారు. ఈయల్లరులవల్ల దేశ మంతయును నాశన మైనది. రైతు లిండ్లలో కాపురములు చేయ లేకున్నారు.పన్నులు చెల్లించ లేకుండ బోవుచున్నారు. క్యానలీయరుదొరవా రనేకస్థలములలో బలవంతముగ కొత్తసంతలు కొత్తఫ్యాక్టరీలు స్థాపనచేసి తమకోసమై కొందరు దొంగసిపాయిలను సన్నాహము చేసి యున్నారు. వారు తమచిత్తమువచ్చినవారి నెల్ల పట్టుకొని పీడించుచున్నారు. ఈదారుణచర్యలవల్ల ననేకములగుసంతలు, అనేకములగుఘట్టములు, అనేకములగుపరగణాలు నాశనమై పోయినవి.'' అని 1762 వ సంవత్సరము అక్టోబరునెలలో గవర్నరుగారికి చేరినయుత్తరములో నున్నది.

బంగాళా దేశమునందలి దైశికవర్తక మంతయు నీరీతిని కంపెనీ నౌకర్లచేతను వారియేజంట్లచేతను ప్రతిమండలమునందును కలతపడి పోవుచుండగా చేతిపను లెల్ల తమచేతనే యుండుటకై వా రనుసరించిన మార్గములు కూడ నింత బాధాకరములుగనే యున్నయవి. విల్లియమ్ బోల్టు అనునాంగ్లేయవర్తకుఁ డొకఁడు అప్పటిసంగతు లన్నియును క

న్నులార చూచి పూర్ణముగ నీరీతిని విశదీకరించెను.

“ఇప్పుడు జరుగుచున్న పద్ధతుల ననుసరించి చూచిన దేశములో
ని దైశికవర్తక మంతయును, కంపెనీవారిచే నైరోపాఖండమువారికొర
కై యింతరీతిని పెట్టుబడి పెట్టఁబడుచున్న పెట్టుబడిమార్గమంతయును, ఒ
క్కటేమాదిరి యుల్లంఘనగా నున్నదని నిశ్చయముగ చెప్పవచ్చును.
తయారయ్యెడుప్రతివస్తువును కూడ గుత్తయై పోవుచుండుటచే దేశము
లోని ప్రతినేతకాఁడును, ప్రతిపనివాఁడును కూడ దీనివల్ల మిక్కిలినష్ట
మును పొందుచున్నవాఁడు. ఈగుత్తవ్యాపారమునం దింగ్లీషువారు త
మకోమట్లను, తమనల్లగుమాస్తాలను పంపించి సంగతిసందర్భములరయ
కుండ ఏపనివాఁ డేయేసరకుల నొప్పగించవలయునో దానికి వాడెంత
సొమ్ము పుచ్చుకొనవలయునో నిర్ధారణ చేయించుచుండిరి..............
సరకులు తయారయ్యెడుపట్టణము (దీనినేఆరంగయందురు)నకు గుమా
స్తా వచ్చుటతోడనే తానొకచోట బస నొకదాని నేర్పాటు చేసుకొని
యక్కడ కచేరీ చేయుచుండును. ఆస్థలమునకు తమబంట్రోతులను,
హిర్కారాలను పంపించి ఖాయిదావర్తకులను పిలిపింతురు. వీరినేదడా
రీలని పైకారులని పిలుతురు. వారు నేతకాండ్రను వెంటబెట్టుకొనివత్తు
రు. తమయజమానులు పంపినపైక మందినతోడనే కొంతసరకు ఫలా
నాస్థలమున నింతకాలములో నింతఖరీదునకు తమకు వప్పగించవలెనని
పత్రమొకటి వ్రాయించుకొని వారికి కొంతసొమ్ము బయానాక్రింద యి
చ్చెదరు. సామాన్యముగా నీపనులకు కూటికిలేనియీ నేతకానియంగీకా
రముతో నావశ్యకము లేదు. కంపెనీవారు తమసొమ్ము పెట్టుబళ్లకు ని
యమించిన గుమాస్తాలు తరుచుగా తమచిత్తము వచ్చినట్లు వ్రాయించి
సంతకము చేయింతురు. నేతకాండ్రీబయానాలనుపుచ్చుకొననియెడల
ఆసొమ్ము వారి నడుములకు కట్టి కొరడాదెబ్బలు కొట్టి పంపించివేయుచుం



డిరని యందరకును వెల్లడియైనవిషయమే..............సామాన్యముగా
నీనేతకాండ్రలో జాలమంది కంపెనీవారిగుమాస్తాలబుక్కులలో రిజస్ట్ర
రుకాఁబడి వారెవ్వరును మరియొకరిక్రింద పని చేయుటకు వల్లకాకయుం
డెను. గుమాస్తాలీపనివాండ్రను బానిసలనువలె తమచిత్తమువచ్చినరీ
తిని మరియొకరికి ట్రాన్సుఫరు చేయుచుందురు. ఈగుమాస్తాల
యొక్కయు, వీరిస్థానమున వచ్చెడు వారియొక్కయు క్రౌర్యమున
కును దౌర్గత్యములకును లోనై యీపనివాం డ్రిందరును పని చేయవ
లసి యుండును..................ఈడిపార్టుమెంటువారు చేయుదురా
గతము లిట్టివని యూహింప శక్యము గాకున్నది. ఇవి యన్నియును ని
రుపేద యగునా నేతకానికడ తేర్చుటతో నంత్యమగుచుండెను. కంపెనీ
గుమాస్తాలును వారితోకూడి బట్టలు నాడెముచూచువారును కలిసి
బాహాటముగ నేతగాండ్లు స్వతంత్రముగ బజారులో అమ్ముకొను నెడల
వచ్చెడుధరలకంటె మొత్తముమీద నూటికి 15 లేక కొన్నికొన్నిసమ
యములయందు నూటికి 40 వంతున తక్కువఖరీదు కట్టుచుండిరి. ఈరీ
తిని కంపెనీవారియేజంట్లీనేతకాండ్ర కంటగట్టి కంట్రాక్టులప్రకారము
సరకు వారుతయారుచేసి వప్పగింత చేయలేకపోయినయెడల వారిసరకుల
న్నియును పట్టుకొని తత్క్షణమే అమ్మివేసి తమలోటుసొమ్ము బర్తీపరచుకొం
దురు. ఈమాదిరి కంపెనీయేజంట్లకు బంగాళాదేశమున ముచ్చల్కా
లని పేరు. పట్టువడికెడిపనివాండ్రగునగోడాలకు జరిగినయన్యాయము
కూడ నిట్టులనే యున్నయది. పట్టు వడకుకొనకుండ వారిచేతిబొటనవ్రే
ళ్లు తెగగొట్టినదృష్టాంతములుకూడ ననేకము లున్నవి.” “హిందూదేశ
వ్యాపారయోచనలు” అను (లండను 1772) గ్రంథమున 191-194
పేజీలలో నీపైసంగతులు కన్పట్టుచున్నయవి.

ఇట్టిస్థితి యొక్కపరిశ్రామికములకే కాదు. బంగాళాదేశము

నందలివ్యవసాయము కూడ నిట్టులె క్షీణదశ చెందినది. దేశములోనిచేతిపనివాండ్రందరును సామాన్యముగా వ్యవసాయదారులై అయియున్నారు. "సామాన్యముగా భూమికామందులును పనివాండ్రును కూడనైయుండు రైతులు సరకులనిమిత్తమై గుమాస్తాలు పెట్టెడుబాధలవల్ల తమభూములను బాగుచేసుకొనుటకుగాని, శిస్తులు చెల్లించుటకుగాని శక్తి లేకుండ పోవుచున్నారు. ఇందునకై రివిన్యూపన్నులు వసూలుచేసెడుఅధికారులవలన మరియొకమూల వేధింపఁబడుచున్నారు. రాబందులవలె పీకుకొని తినునీయుద్యోగస్థుల దాడి కోర్వలేక శిస్తులు చెల్లించుటకై కొంతమంది తమపిల్లల నమ్ముకొనుచున్నారు. కొందరీపన్నులు చెల్లించలేక దేశమును విడిచి పారిపోవుచున్నారు." ఇదియును పైగ్రంథమునందే కనిపించుచున్నది.

కేవలమును గ్రంథములలో నుండి గైకొనఁబడినభాగము లివి చాలును. ఇవి యన్నియును తలాయొకచోట నుండియును నెత్తి వ్రాయఁబడినవి. ఇంగ్లీషుగవర్నరుగారు వ్రాసిన దొకటి. ఇంగ్లీషుసభలోని సభ్యుఁడు వ్రాసిన దొకటి. ఇంగ్లీషువర్తకుఁడు వ్రాసినదొకటి. నవాబు స్వయముగా చేసుకొన్న విన్నపమొకటి. మహమ్మదీయకలెక్టరు వ్రాసికొన్నరిపోర్టు ఒకటి. మహమ్మదీయచరిత్రకారుఁడు వ్రాసినచారిత్రము నుండి యొకటి. ఇవి యన్నియుకూడ నొకమాదిరి దుఃఖకరమైనకథనే తెల్పుచున్నవి. బంగాళాదేశప్రజలు యింతకుమున్ను దురంతప్రభుత్వవేదన కలవడి యున్నారుకాని, సంతసంతకును మగ్గముమగ్గమునకును వ్యాపించి తమజీవనాధారమును పూర్ణముగ నున్మూలించినయింతటియొత్తుడు వీ రెన్నడును పొందియెఱుంగరు. అధికారబలమున యుక్తాయుక్తము లేకుండ పెట్టినబాధలకు మున్ను వారలవడినవారు గాని, వారివాణిజ్యము, వారివృత్తులు ప్రారబముకు తెరవును పూర్ణముగ నాశనము



నొందినపద్ధతిని మాత్రము వా రెన్నడు నెరుంగరు. చేతిపనులవలన వారికి కలుగులాభప్రవాహము లన్నియును నాగిపోయినవి. వారియైశ్వర్యపుటాధారము లన్నియును నెండిపోయినవి.

ఈరీతి వ్యాపారముల నాపుచేయవలెనని ప్రయత్నించిన యింగ్లీషువారిద్దరు బంగాళాదేశమునందున్నారు. హెన్రివాంశిటార్టు, వారన్ హేస్టింగ్సు, అనువారలేవారిద్దరును. మీరుఖాసిమ్‌నవాబుతో స్నేహపూర్వకముగ స్వయముగ మాట లాడి పరిష్కరించుటకై వా రిద్దరునుకలసి మాంఘీరుపట్టణమునకు వచ్చిరి. మీర్ ఖాసింనిరంకుశప్రభువే కాని యాతఁడు దూరదృష్టికలవాడు. తనకు స్వాతంత్రశక్తియును సమర్థతయును గలిగియున్నను, కంపెనీవారిపై తనశక్తిసామర్థ్యములు చాలమి దలంచి, వాంసిటార్టు, హేస్టింగ్సులు మాత్రమే తనకుస్నేహితులుగ నమ్మి వారేమియుపకారములు కావలెనని కోరిరో వాని కెల్ల నొప్పుకొని వారితో నొకయొడంబడిక చేసుకొనెను.

ఆసంధిషరతు లన్నియు 1773 సంవత్సరములోని యీస్టిండియాకంపెనీవారివ్యాపారములను గూర్చిన పార్లమెంటువారిమూఁడవరిపోర్టులో మాంఘీరుసంధి అనుభాగము నందున్నవి. ఈషరతులు మొత్తము తొమ్మిది. అందులోమూఁడుమాత్రమే మిక్కిలి ప్రాముఖ్యములైనవి.

1. ఓడలమూలమున జరిగెడు యెగుమతీదిగుమతీ వాణిజ్యమునకంతకును కంపెనీవారిదస్తకుండవలెను. వాని కేవిధమయినపన్నులును కట్టకూడదు. వారిసరకుల కేవిధమయినయభ్యంతరములునుకలుగచేయరాదు.
2. సరకులు దేశముననే తయారైయాసరకులతో దేశములో నేమూల వర్తకముచేసికొన్నను, ఆసరకులకన్నిటికిని కంపెనీవారిదస్తకుండవలెను.

3. ఒడంబడికెలో నమోదుచేయఁబడినసరకుల కందులో నేర్పరుపఁబడినప్రకారము పన్నులు వసూలుచేయఁబడవలెను.

ఇంతకంటె న్యాయమయినయొడంబడిక మరియొకటియుండదు. కాని,యిదికలకత్తాలో నుండువారి కత్యంతక్రోధకారణమయ్యెను. **1763** సంవత్సరము జనవరి **17**వ తేదిని " అమియటు " " హే " " వాట్సు " అనువారలు వాంశిటార్టు ఏర్పాటుచేసినషరతు లన్నియు నింగ్లీషువారికి మర్యాదహీనముగ నున్నవనియును, అందువలన పబ్లీకువర్తకమును ప్రైవేటువర్తకమును గూడనాశనమునొందు ననియును వ్రాసిరి. 15ఫిబ్రవరిని గవర్నరుగారిసభ జరిగెను. మార్చి1 తేదిని ఇందునుగురించి మిక్కిలి తీక్ష్ణమైన యోచనలు జరిగెను. దైశికవర్తకము కంపెనీనౌకరు లందరును, పన్నులు చెల్లింపకయె చేసుకొనుటకు హక్కు కలదని నిశ్చయింపఁబడియెను. ఇందులకు వాంసిటార్టును హేస్టింగ్సును అంగీకరించినారు కారు. ఇందునకు ప్రతిఫలముగా నవాబునకు నూటికి 2½వంతున నుప్పుపయినిమాత్రము పన్నులు చెల్లించుట కేర్పాటయ్యెను. ఇందులకు వాంసిటార్టు కూడ నంగీకరించెను. పూర్వమన్ననో అన్నిసరకులమీఁదను నూటికి 9వంతున పన్నులు చెల్లెడివి.

కేవలమును స్వలాభమునే యపేక్షించిన స్వలాభాపేక్షితులచే చేయఁబడిన తీర్పిది. న్యాయముకొఱకయి పోరాడుచున్న వార్రన్ హేస్టింగ్సు దీనికి ప్రతికూలవచన మిచ్చెను. **1773**సంవత్సరమునందలి పార్లమెంటుకమిటీవారి నాలవరిపోర్టు గ్రంథముయొక్క యనుబంధములోని 486పుటలో వార్రన్ హేస్టింగ్సుగా రప్పుడు వ్రాసినపెద్దయుత్తర మొకటి యుదహరింపబడియున్నది. ఆయుత్తరమునందలి యీక్రిందివాక్యములను మనము ఎత్తి వ్రాసికొని జ్ఞాపక ముంచుకొనఁ దగును.

" నేను ప్రప్రథమమున కొన్నిదినములు నామరూపములులేని



పల్లెటిదిక్కు ప్రజలతో కలిసి యుంటిని. మన మప్పుడు దొరతనమువారి కనువర్తులమయి శానిసలవలెనుండినారము. జమీందారులును దొరతనమువారియుద్యోగస్థులును మనల నెన్నోవిధముల నాదరించిరి. గౌరవముగ కూడచూచినారు. కాని వారియెడ మనము ప్రవర్తించెడు యీప్రవర్తన మేమియును న్యాయముగ లేదని నేను నొక్కిచెప్పఁగలను. ఇంతే కాక మరియొకటి కూడ నావిశేషానుభవమునుబట్టి చెప్పెదను. మనవారు దేశమునెల్ల పీడించి దొరల మనిపించుకొనుటకన్న న్యాయమైన ఋజువర్తనమునె యనుసరించి యుండి దొరతనమువారి యధికారమునకు లోఁబడియుండునెడల వారందరును ప్రతిస్థలమునందును మనవారిని కన్నుల నద్దికొని గౌరవింతురు. ప్రతిస్థలమునందును ఛీఛీ యనిపించుకొనుటకు బదులుగ ఇంగ్లీషువారనిన నెల్లెడను గౌరవముగనుండును. మనవర్తకమువలన దేశమునకు లాభము కలుగును. ఇంగ్లీషువారియధికారము నిరుపేదలగు దేశవాసులకు భయాస్పదముగ నుండి వారు మనయొత్తుడు తగిలి బాధనొందుచు, మనకనువర్తులయి యుండుటకు మారుగ వారంద రియ్యది తమయదృష్టమువలన లభించిన దనియును తమ కిది రక్షక మనియును అనుకొందురు."

కలకత్తాసభవారు తనయొడంబడిక షరతుల నంగీకరించలే దనియును,దాని ననుసరించి వా రిచ్చినయుత్తరవు లమలుజరుగుటకభ్యంతరము కలుగుచున్న దనియును నవాబుమియర్ ఖాసిమ్‌కు తెలిసెను. ఇందులకు నవాబుకోపించి మహౌదార్యముతో నదివర కెన్నడును తూర్పుఖండమునందలి పరిపాలకులును,రాజులును చేయనియొకఘనకార్యము మిక్కిలి దయార్ద్రహృదయుఁడై చేసెను. పన్నులమూలమున వచ్చెడి యాదాయమును పోఁగొట్టుకొనుట కొప్పుకొని తూర్పిండియా సంఘమువారితో సమానముగ తనప్రజలు వర్తకము చేసుకొనుటకై

దైశికవర్తకముమీఁదిపన్నులన్నియు పూర్ణముగ మాఫుచేసెను.

సామాన్యముగ దీనియందు నమ్మకము కలుగదు గాని, కార్యము మాత్రము జరిగినదిచూచుకొనవలయును. కలకత్తాసభవారీపన్నులుమాఫుచేయుకార్యమునకుకోపగించినవారుఇంగ్లీషుజాతివారియందు విశ్వాసఘాతుకముగఁబ్రవర్తించుచున్నాడనియును, నట్లు చేయకూడదనియును నిషేధించి వ్రాయసాగిరి. వారన్ హేస్టింగ్సును, వాంసిటార్టును అందుల కనుమతింపలేదు. ఇందునుగూర్చి “జేమ్సుమిల్లు” అనుచరిత్రకారుఁడు తనహిందూదేశచరిత్రమున నిటుల వ్రాసెను.

“న్యాయమును విడచితి మనిగాని లజ్జావిహీనమైనపని చేయుచున్నా మనిగాని యనుకొనకుండ నిష్పట్టున కంపెనీనౌకరులు నడచిన నడవడి మిక్కిలి పేర్కొనదగిన నిదర్శనమైయున్నది. ఇందు స్వలాభాపేక్షయే బలవత్తర మయినది.” “హెచ్ హెచ్ విల్సన్” అను నాతఁడు మరియొక యింపైనయభిప్రాయమును గూడ నిట్లు వెల్లడించెను. “ఈప్రొసీడింగ్సుపైన నభిప్రాయభేద ముండరాదు. గౌరవనీయులగు హేస్టింగ్సు, వాంశిటార్టు, లిద్దరును వినా సభలోని తక్కినమెంబరులందరు కేవలవర్తకలాభాపేక్షచేత కుటిలదృష్టులయి వివేకము, న్యాయము, నీతి యనువాని, యుపదేశముల లేశమైనను మనంబుల జొరనీయలేకపోయిరి.”

ప్రతికూలవాదు లగు వాంశిటార్టు వారన్ హేస్టింగ్సు లిద్దరును తమయభిప్రాయములను నీరీతిగ నిష్కర్షగ వ్రాసిరి. “వాణిజ్యమంతయును మనస్వాధీనములోనే యుండుటయును, మనజాతివారెల్ల పొట్టపోసికొనుటకు తగినమార్గము లేర్పర్చుటయును, దేశమున తయారగుసరకు లెల్ల దేశమునుండి తరలించుకొని పోవుటయును, మనకు లాభకరమయినపనియే యగును. కాని, దేశములోనివర్తకులయాధారముల



నెల్ల పోఁగొట్టుటయను ప్రయత్నములలో సవారు మనకు తోడ్పడు నని యెంచ వలనుపడదు.” అనివాదించిరి. దీనినిబట్టి యప్పటితగాదా యంశము లెవ్వియో మనకు స్పష్టముగ తెలియఁగలవు.

స్వతంత్రముగ సరకులను తయారు చేయుటయును, వానిని తమయిచ్ఛవచ్చినట్లు స్వేచ్ఛగ క్రయవిక్రయములను జరుపుకొనుటయును ప్రపంచమునందలి నాగరికత కందినప్రతిజాతివారికిని గలిగియున్న స్వాతంత్ర్యములై యున్నవి. అట్టిస్వాతంత్ర్యము లెల్ల నాగరికతవందినట్టియు శ్రీమంత మయినట్టియు నీదేశమునందు మంచిదొరతనమునందును చెడ్డదొరతనమునందును కూడ ప్రజలెల్లరు నింతవర కనుభవించుచున్నారు. అట్టి ద్రవ్యార్జనాధారము లెల్ల, దేశవాసులకు లేకుండఁజేసి కంపెనీనౌకరులు తమస్వంతయుపయోగమునకై ద్రవ్యము నార్జించుకొన నభిలషించిరి. వీరు తాము గుత్తకొనసెంచినసరకులు ఒక్కటియును, రెండును గావు. అన్నిసరకులలో జరిగెడువర్తకమున దమకును దేశవాసులకును యంతర ముండవలెనని వీరి కోరిక. ఈయంతరము వలన బంగాళాదేశవాసులకు గలుగునష్ట క్షేమనివ సాధారణముగ మానవజాతి కంతకును నున్నస్వాతంత్ర్యములెల్ల బోఁగొట్టుకొనుటయే. జనసంకీర్ణమయినవిశాలముగు దేశమునందలివర్తక మెల్లను తామే గుత్తగొనుటకయి ఆయుధసహాయము నపేక్షించి యింతటియుత్పాతకరముల గుహక్కులకై పోరాడెడు విదేశీయవర్తకులనిదర్శనము చరిత్రనమునందిది వినా మరియొకటి యెందును నుండియుండదు. మియర్ ఖాసీమ్ వవాబీహక్కులను నిరాకరించెను. ఇందువలననే వీరికిని వారికిని యుద్ధము కలిగెను.

హెన్రివాంశిటార్టు 1760 సంవత్సరము మొదలు 1765 సంవత్సరమువరకును కలకత్తాగవర్నరుగా నుండెను. మీర్ ఖాసీమ్ బంగా

ళాదేశమును పరిపాలించినకాల మంతయును నదియే. ఆతనిపరిపాలనమునుగురించి వాంసిటార్టు సంక్షిప్తముగ నిట్లువ్రాసెను.

" మీర్ ఖాసీమ్ కంపెనీవారిఋణమును అతనిసైన్యపుకర్చులకై పడినవిరివియైనబాకీలను తీర్చివేసెను. తనపూర్వులరాబడినెల్ల మ్రింగివేసెడితనయాఫీసుఖర్చుల మితపరచెను. ఇంతకుమున్ను రాష్ట్రమునం దంతటను ప్రజలనెమ్మది కెల్లప్పుడును భంగము కలుగచేయుచుండుజమీందారులయధికారముల నెల్ల నణఁగద్రొక్కి దేశమునం దంతటను తనయధికారము నాటికొన జేసెను. ఇది యంతయును నాకు సంతోషముగఁ గనఁబడినది. అతనికి కంపెనీవారిసహాయ మెంతతక్కువుగ కావలసియుండునో కంపెనీవారి కర్చులునంతతక్కువుగ నగును. వారిస్వంతస్వాస్థ్యములను వారెక్కువశ్రద్ధతోఁజూచుకొనుటకవకాశము కలుగును. ఒక్కటిమాత్రి మున్నది. ఎవ్వఁడైన పగవాఁడు మనయందరిపైన నొక్కసారియే దండెత్తి వచ్చినప్పుడు మాత్ర మతఁడు నిశ్చయముగ మన కుపయోగకరమైనమిత్రుఁడుగా నమ్మకొనవలసియున్నది. ఆతనిస్వాతంత్ర్యములజోలికిగాని ఆతనిదొరతనముజోలికిగాని మనము పోకుంటిమా ఆతఁడు మనతోడ కలహించునుద్దేశము కలవాఁడు కాఁడనినాకు నమ్మకము. ఇంతయేల? మనగుమాస్తాలు వారివ్యాపారముల నాక్రమించుకొని మనస్వంతవాణిజ్యమునకై క్రొత్తహక్కుల కల్పించుకొన తగాదాలలోనికి దింపువరకును మన కొసంగినభూములలోని కాతఁ డెప్పుడును మనిషినైన పంపించినట్టుగాని వర్తకములో నొకవస్తువును గురించియైనను మనల చిక్కులుపెట్టినట్టుగాని ఒక్కనిదర్శనమైనను మనము చూపలేము. ఆతఁడే అట్టితకరరు లేవియును రాకుండ జాగ్రత్తగనున్నవాఁడు. మనకును వారికిని గలిగినకలహములు వృద్ధియై యుద్ధము తటస్థమయ్యెడువరకును సూరేకారము వ్యాపారమునుగూర్చి ఎల్లీసుగారు అతిశయోక్తిగ చెప్పినవేవియో యొకటిరెండుతగాదాలు తప్ప కంపెనీవ్యాపార మెచ్చటను ఏవిధమయినఅభ్యంతరమును లేక నడచెను. ఇట్టివానికి వ్యతిరేకముగ సమ్మకట్టి పనిచేయుపెద్దమనుష్యులప్రవర్తనకును ఆతనిప్రవర్తనకును ఎంతభేదమున్నదో చూడుఁడు. ఆతఁడు జమీందారీభారము వహించిననిమిషము మొదలు మనవారు ఏదో యొక మిష కల్పించి నవాబుదొరతనము నణఁగద్రొక్కుటయును, ఆతనియుద్యోగస్థులఁబట్టుకొని భయపెట్టుటయును తిట్టుటయును, జరుగనిదినమే లేదు. ఈచరిత్రయొక్క ప్రతిపుటయందును అట్టినిదర్శనము లెన్నియో కనఁబడఁగలవు. వాని నే వేరుగ రూపింప నవసరములేదు. ఇయ్యది " నారెటివు " అనుగ్రంధముయొక్క మూఁడవసంపుటము 381 పేజీయందు దాహరింపఁబడి యున్నది.



తూర్పుఇండియాసంఘము వారి సైనికకార్యములను వ్రాయుట యీప్రస్తుతగ్రంధముయొక్క పని కాదు. 1763 సంవత్సరమున మీర్ ఖాసీమ్‌తో తటస్థమైనయుద్ధసారాంశము నెప్పుడును సందేహాస్పదముగ లేదు. ఇంగ్లీషువారితో బంగాళాదేశమునం దింతకుమున్ను పోరినరాజులందరికంటె నన్నిసైన్యములకంటె నతఁడు నెక్కువుగ పోరాడినాఁడు; కాని ఘీరియాయొద్దను, పిమ్మట ఉదయనలయొద్దను, ఆతఁడు అపజయము నొందెను. క్రోధాతిరేకంబున పిచ్చియెత్తి పాట్నానగరమునందున్న యాంగ్లేయఖైదీల నొక్కపెట్టున హతమార్చి అతడు తనరాష్ట్రముల విసర్జించిపోయెను. 1760వసంవత్సమున తప్పింపఁబడినముసలిమీర్జాఫరును మరల నవాబుగా ప్రతిష్ఠించిరి. కాని, యాతఁడు కొలఁదికాలములో నెమృతుఁడయ్యెను. 1765 సంవత్సరమున మీర్జాఫరు యుంపుడుకత్తెకుమారుఁడైన " నిజాముద్దౌలా " ను త్వరత్వరగానవాబు కావించిరి.

క్రొత్తనవాబులను సింహాసన మెక్కించదొరకిన తరుణములెల్ల

కంపెనీవారికి పండ్లచెట్లనుదులుపుకొనుటకు తగినసమయములుగా కనుపించెను. 1757 సంవత్సరమున పలాసియుద్ధ మైనతరువాత మీర్జాఫరును మొదట నవాబునుగాచేసినపుడు బ్రిటిషుఉద్యోగస్థులును, వారిసైన్యములును 12,38,575 కాసులును బహుమానముగా నొందిరి. ఆసొమ్ములో 31,500 కాసులును బంగాళాదేశమునందలి శ్రీమంతమయిన తొకజాగీరును క్లైవుదొరగారు స్వీకరించిరి. 1760 వ సంవత్సరమున మీర్ ఖాసీమ్‌ను నవాబుగా చేసినపుడు బ్రిటిషుఉద్యోగస్తులు పొందిన బహుమానములు 2,00,269 కాసులు. ఈసొమ్ములో వాంశిటార్టుగారు 58,333 పౌనులుపుచ్చుకొనిరి. 1763 సంవత్సరమునమీర్జాఫరును రెండవసారి నవాబును చేసినపుడు దొరకినబహుమానములు 5,00,165 కాసులు. 1765సం॥రమున నిజముద్దౌలాను నవాబునుచేసినపుడు 2,30,356 కాసులు మరలదొరకినవి. 8 సం॥రములలో పొందిన 21,69,665 కాసులబహుమానములు గాక 37,70,833 కాసు లీకాలమునందే (రెస్టిట్యూషనుసొమ్మని) వారిది వారి కుండనిచ్చినందునకు ప్రతిఫల మని చెప్పిపుచ్చుకొనిరి. ఈసంగతులన్నియు 1773 సంవత్సరమున హౌసు ఆఫ్ కామన్సు యొక్కమూడవరిపోర్టు 311 పేజీలో కనఁబడుచున్నది.

1772-73 సంవత్సరములలో ఈస్టిండియాకంపెనీవారిస్థితిగతులనువిచారణ చేసినపార్లమెంటుకమిటీవారియెదుట నీసొమ్ములన్నియును తమకు చేరినటుల ఋజువు చేయఁబడినది. క్లైవుదొరగా రీసంగతు లన్నిటిని సమర్థించుకొనెను.

“నే నీవ్యాపారము నెన్నఁడును రహస్యముగ నుంచఁదలఁచుకొనలేదు. నవాబుయొక్క యౌదార్యము నాయైశ్వర్యమునకు సులభమార్గము మయ్యెననియును, నేనిప్పుడు ఇండియాలో నున్నది ప్రత్యేకముసు కంపెనీయభివృద్ధికే యనియును, డైరక్టర్ల రహస్యపుకమిటీకి స్పష్ట



ముగా వ్రాసియుంటిని. నేను కంపెనీవారి నౌకరిలోనుండి యనేకపర్యాయములు ప్రాణములకు తెగించి పనిచేసినపుడును వారికి నష్టములేకుండ నే నైశ్వర్యముసంపాదించుకొన తరుణము దొరకినపుడును యీతరుణ మొక్కటియును వదలుకొనుటకు తగినసబబు కంపెనీవా రేమిచెప్ప సాహసింతురో తెలియరాకున్నది. నేను తక్కువపుచ్చుకొన్నందువల్ల వారి కెక్కువ దొరకున దేమియును లేదు.” ఇయ్యది 1872 సంవత్సరములోని పార్లమెంటుకమిటిలోని మొదటిరిపోర్టుయొక్క 148 పేజీలో నున్నది.

ఈద్రవ్య మంతయును కంపెనీవారిద్గాని తనది గాని కా దనియును, దేశముదే యనియును అది తత్ప్రజలయొక్క మేలుకై యుపయోగింపవలసి యుండె ననియును, క్లైవుదొరగారి కెప్పుడును స్ఫురించినది కాదు.

ఐనను తూర్పిండియాసంఘము వారుమాత్రము బహుమానములని పేరు చెప్పి లాగినయీసంపాదనలయెడ పరాఙ్ముఖులై బంగాళాదేశమునందు తమనౌకర్లు చేయుదైశికవర్తకమునుగూర్చి తిరస్కారభావమును కనపరచిరి. 1760 సంవత్సరమున నిట్టిబహుమానములు పొందఁగూడదని యుత్తరవులు పంపి తా మిదివరకే నిషేధించియున్నతమనౌకర్లు చేయుదైశికవర్తకమును ఆపు చేయు మని క్లైవును మరలనొకసారి యిండియాకు బంపిరి. ఈయుత్తరవులు బంగాళాదేశమునకు వచ్చిచేరినవి. కంపెనీనౌకర్ల సంతకములకై కరారునామాలు కొలదికాలములో రానై యున్నవి. ఆలసించుటకు తగినసావకాశము లేకపోయెను. అందువలన కలకత్తాసభవారు త్వరత్వరగా నిజాముద్దౌలాను సింహాసన మెక్కించి బహుమానరూపక మగుతమయీకడపటిపంటను తసరబు చేసుకొనిరి.



# హిందూదేశార్థికచరిత్రము.

## మూఁడవ ప్రకరణము.

### లార్డుక్లైవును, ఆతనియనంతరమున బెంగాలు దేశమును పరిపాలించినవారును. (1765-1772)

హిందూదేశచరిత్రలో 1765 సం॥రమున క్రొత్తశక మారంభమైనది. ఆసంవత్సరమున లార్డుక్లైవు మూఁడవసారి హిందూదేశమునకు వచ్చెను. ఇదియే కడసారి. ఈతడు మొగలాయీచక్రవర్తికడనుండి, యీస్టిండియాకంపెనీవారికి దివానీపదమును సంపాదించి యందులకొకపట్టాను పొందెను. అందువలన కంపెనీవారు బంగాళాదేశమునకు పరిపాలకులైరి. అప్పటికే మొగలాయిచక్రవర్తియొక్క యధికారమంతయును పోయినను, ఆతడింకను పేరునకుమాత్రము ఇండియాచక్రవర్తిగనే యెన్నబడుచుండెను. అందువలన నాతఁడొసంగినపట్టావలనకంపెనీవారి కీదేశమున శాస్త్రసిద్ధమైనస్థితిగతు లేర్పడెను.

క్లైవుప్రభువు దుస్సాధ్యములైన ధర్మములు నెరపవలసివచ్చెను. కంపెనీవారివ్యవహారము లన్నియును మిక్కిలిపాడుగా నున్నవి. వారినౌకరులందరును లంచములకు మరగిరి. ప్రజలందరును కష్టములకు లోనగుచుండిరి. ఆతడు హిందూదేశమున నుండదలచిన కొలదికాలములో నీస్థితిగతులనెల్ల చక్కఁజేయ నభిలషించెను. క్లైవుకలకత్తానుండి 1765 సం॥రం నవంబరు 30 తేదిని కంపెనీడైరక్టర్లకొకజాబు వ్రాసెను. హిందూదేశవ్యాపారములవిషయమై ప్రకటింపబడినసంపుటము



లలో జ్ఞాపకముంచుకోఁదగినవిషయము లనేకములీయుత్తరమున నున్నవి. క్లైవు హిందూదేశమున కీకడసారి వచ్చినపుడు దేశస్థితిగతు లేతీరున నున్నవో, వానిని చక్కఁజేయుటకు తా నేమార్గములనవలంబింపదలచెనో, యీసంగతులన్నియు నతఁ డీయుత్తరమున వ్రాసెను. తాను చేయ నుద్యమించినపనినిగూర్చి ఆతడు వ్రాసినది వ్రాసినట్లే యిచట పొందుపరచుట కర్తవ్యమై యున్నది.

2. "నే నిక్కడకు చేరుసరికి మీవ్యవహారములన్నిటిని నింతటిదుస్థితిలో నేఁజూడవలసివచ్చె నని తెలుపుటకు నాకెంతయు విచారమగుచున్నది. తమ స్వలాభమునకై మిక్కిలి ఆతురతతో పనిచేయువారికి తప్ప, ఆత్మగౌరవమును, స్వామిభక్తియును గల కంపెనీయుద్యోగస్థులకందరకుగూడ నీవ్యవహారస్థితి చూడగనే యొడలుకంప మొందక మానదు. అందున కనేక కారణము లున్నవి. చేయరానిమాదిరిని వారతిశీఘ్రకాలమున నతిదారుణముగ ధనసంపాదనముచేయుటవలన వారనేకవిధములైన సుఖోపభోగముల కలవడిరి. దారుణమైన యీచెడుగులు రెండును రాష్ట్రమెల్లెడలనునొకదానివెంబడి నొకటివ్యాప్తమై అంటువ్యాధివలె ప్రతిడిపార్టుమెంటులోనున్నప్రతినౌకరును వశపరుచుకొన్నవి. చిన్నచిన్ననౌకరులకును పెద్దపెద్దయుద్యోగస్థులకును గల యంతర మమితవ్యయమునందుమాత్రమే కన్పట్టుచుండుటచే, చిన్నచిన్ననౌకరులకు గూడ తమపైయధికారులతోపాటు విశేషముగ ధనము వ్యయముచేయవలె నను నాశపుట్టి వారు ధనార్జనమునకు మరగినట్టు కన్పట్టుచున్నారు. వీరికిఁ బుట్టినయీయమితధనకాంక్షచే ద్రవ్యసంపాదనమునకై కనపడినసాధనములనెల్లను వారుపయోగించుచుండుటయును, మీకార్యనిర్వహణమునకై మీరు వారికొసంగిన యధికారములను తమ స్వలాభమునకై యుపయోగించుకొని సులువుగా తమదాహము తీర్చ

కొన వీలుగానపుడు ప్రజలను బాధించి తమకోర్కెలను నెరవేర్చుకొనం జూచుటయును, తటస్థించుచున్నదని చెప్పుట యొకవింతలోనిదికాదు. పెద్దయుద్యోగస్థులు త్రొక్కుచున్న యీదారులు చిన్ననౌకరులుకూడ తమకు దగినరీతిననుసరింపకుండుట పొసంగదు. ఈచెడుగు అంటువ్యాధివలెనె సివిలు, మిలిటరీ డిపార్టుమెంటులతో చేరినలేఖరులను బంట్రోతులను స్వతంత్రవర్తకులనుగూడ నలముకొన్నది.''

9. ''నాకు రెండుమార్గములు స్పష్టముగా కనబడుచున్నవి. అందొకటి సుగమమైనదియు ధనార్జనము చేయుటకు సులభమైనసాధనములు కలదియునై యున్నది. రెండవ దిదివర కెవ్వరును త్రొక్కిచూడనిది. అం దడుగడుగునకును గష్టములే యున్నవి. నేను వచ్చినప్పుడెట్లున్నదో అట్లే దొరతనమును నేను స్వీకరింపగలను. అందువలన నేను పేరునకుమాత్రమే గవర్నరునామమును పొందవలసినవాడ నగుదును. ఆయధికారమున కుండవలసిన గౌరవము, ప్రాముఖ్యము, దర్జా ఇవి యన్నియును నిదివరకు నశించిపోవుచున్నట్టువలెనే యిప్పుడును నశింపపలసివచ్చును.........అయితే గౌరవయుక్తమగు రెండవమార్గముగూడ నాయెదుట గనబడుచున్నది. ఆయుద్యోగధర్మమును నెరవేర్చుటకు దగినశక్తియును నాయందున్న దనునమ్మక మున్నది. నన్ను భ్రమపెట్టుటకు నాత్రోవలో మచ్చుమందు లెన్నెన్ని చల్లినను వానియన్నిటినుండియును దప్పించుకొని నిల్చుటకు నాకు దగినశక్తియును కలదు. సంస్కరణము చేయ నభిలషించినప్రతిమనుజునియెడలను నీర్ష్యచేతను కార్పణ్యముచేతను కల్పింపజూచెడు ప్రతికష్టమునకును లొంగి నాప్రవర్తనమును నేను నిలబెట్టుకొనుటకు నాకు దగినదార్ఢ్యమును గలదు. వీనిని నిలబెట్టుటలో నపనింద లేనైన గలిగినను వాని నన్నిటిని సైరించి పనిచేయనుగలను. ఇం దవలంబింపవలసిన మార్గముల నరయుటలో



నాకుదీర్ఘాలోచనతో నవసరము కలుగలేదు. నాపైబడినయీభారమును వహించుటకు తగినమనోనిశ్చితమును, పట్టుదలయును, దేహదార్ఢ్యమును గావలసియున్నవి. నేనవలంబింపవలసిన మార్గమును నిశ్చయించుకొని యీప్రయత్నమునకు దగినంతపని చేయ పూనుకొంటిని. ఇందు జయప్రదముగ పనిజరిగె నేని మనజాతియొక్క గౌరవమును కంపెనీయొక్క జీవనమును నిలుచునని మనస్సునకు తట్టి ఆనందము కలుగుచున్నది.''

12. ''కంపెనీవారినౌకర్లయధికారముక్రింద పనిచేయుచున్న, ఇంగ్లీషుఏజంట్లవల్లను అట్టియేజంట్లక్రింద పనిచేయుచున్న వేనవేలు నల్లయేజంట్లవల్లను వారిక్రిందినబేజంట్లవల్లనుకలుగుచున్న బాధచేతను, ఒత్తుడుచేతను, ఇంగ్లీషువారిపేరున కీదేశమున శాశ్వతమైనయవమానము రానైయున్న దని భయము కలుగుచున్నది. అయినను తుట్టతుదకు మనకిట్టిసమయమున దివానీపదములభ్యమైనందులకుమాత్రమూనా కెంతయుసంతస మగుచున్నది. అందువలన మన కీయొక్కవిషయమందేకాక యనేకములగునితరవిషయము లందుకూడ అదివర కెన్నడు నెరుగనియుపయోగములు కలుగుటకును, తప్పించుట కుపాయము కానరాని యనేకానర్థములు నశించుటకును తప్పక మార్గ మేర్పడగలదు. ఈదివానీపదముచే మనకు బంగాళము, బీహారు, ఒరిస్సారాష్ట్రములపన్ను లన్నియును వసూలుచేయుటకును అందలిభూము లన్నియును తనిఖీచేయుటకును అధికారము వచ్చినది. మనసైన్యమువలనను మనద్రవ్యమువలనను పొందినసహాయమునకై మొగలాయీచక్రవర్తి కంపెనీవారి కీబహుమానమును మనస్ఫూర్తిగా నిచ్చివేసినాడు. మన కెట్టికట్టుదిట్టములతో పని జరుగవలెనని యున్నదో యయ్యది యట్టులే జరిగినది. నవాబుయొక్కదర్జాకును అందుకుదగినపరివారమున కాతనికి కావలసినంత

ద్రవ్యమును, మొగలాయీచక్రవర్తికి మనము చెల్లింపవలసిన కప్పమును, మాత్రము మనము క్రమముగ చెల్లింపవలయును. మిగిలిన ద్రవ్య మంతయును కంపెనీవారికి నఫా క్రింద రాగలదు.''

13. "బర్ద్వాను మొదలగు మీపూర్వపుస్వాస్థ్యములతో మీ యీ క్రొత్తయాదాయమును చేర్చుకొనినయెడల ముందుసంవత్సరము మీకు వచ్చెడుపన్నులు కొంచెమించుమించు 250 లక్షల శిఖారూపాయిలకు తక్కువ కాకుండ నుండునని తోచుచున్నది. ముందుముందు సాలున కింకొక యిరువదిముప్పదిలక్షలరూపాయిలు హెచ్చుకూడ రాగలదు. దేశము నెమ్మదిగా నున్నదినములలో మీకగు సివిలుమిలటరీఖర్చు లెప్పుడును 60 లక్షలకు మించియుండవు. నవాబున కిచ్చెడు అలవెన్సు 42 లక్షలకును మొగలాయీచక్రవర్తికి కట్టెడికప్పము 26 లక్షలకును, ఇదివరకె తగ్గింపఁబడియెను. ఇవియన్నియును పోను కంపెనీవారి కింకమీఁదట సిసలుగా 122 లక్షల శిఖారూపాయిలనఫా రాగలదు.''

16. "హిందూదేశమునకు వచ్చినదిమొదలు మీయుద్యోగస్థుల కందరికిని తగినంతవేతనము మీ రేర్పరచవలయును. ఆవేతనమువారివారియుద్యోగముల ననుసరించి క్రమక్రమముగ హెచ్చించుచుండవలయును. చిరకాలమునుండి వచ్చుచున్నదురభ్యాసములనుతగ్గించుటకై యీనడుమ మనముచేసిన క్రొత్తశాసనముల ననుసరించి ఉప్పు, పోకలు, పొగాకు, వీనిపై వచ్చెడిలాభమువల్లను, సరకులను తెచ్చెడియోడలమూలమున వచ్చెడియాదాయమువల్లను నర్తకపురాబడి (ఆసదుపాయములన్నియును మీ రెరుంగనివికావు) వలనను పైవేతనములకర్చు కూడివచ్చును.''

"19. మిలటరీడిపార్టుమెంటువారు సివిలువారియధికారములకు



లోబడకుండుటయును తాముస్వతంత్రముగ సంచరింపవలెనని ప్రయత్నించుటయు నేను మీయాదిలోనికి తేఁబోవు మరియొకవిషయము. సైన్య మంతయును సివిలువారియధికారమునకు లోబడియుండవలయును. వారిలో వా రెప్పుడైనను తమకే పైయధికారముండవలయునని పోరాడినచో గవర్నరుగారును వారిసభయును శాయశక్తుల పనిచేయవలసియుండెను. కంపెనీవారిపక్షమున తా మీదేశమున ట్రస్టీలుగానున్నవా రనియును, సివిలువారి యధికారముక్రిందికివచ్చిన పబ్లికుఆస్తికంతకును తామే రక్షకులమనియును వా రెప్పుడును జ్ఞాపక ముంచుకొనవలసిన విషయమై యున్నది.''

"26. ఇంకొక సంగతికూడ మీకు జ్ఞాపకముచేయ ననుజ్ఞ నీయవలయును. నాకుటుంబము చాల పెద్దకుటుంబము. దాని కంతకును తండ్రి నగునాసంరక్షణ మావశ్యకము. నే నీయున్నదేశముననే నా జీవనమునెల్ల గడుపుచుండుటచే నాదేహస్థితి చెడిపోవుచున్నది. నా యైశ్వర్యమునకుకూడ భంగము కలుగుచున్నది. నే నొనర్చునేర్పాటులు మీ కేమైన నంగీకారముగ నున్నవా? ఉండినచో మీయనుమతి సఫలపించి యవసరమని వ్రాసి పంపిన సంస్కారశాసనముల కన్నిటికినా? లేక కొన్నిటికిమాత్రమా? వీనికి ప్రత్యుత్తరములకొరకై వేచి యున్నవాఁడ. మీ రంగీకార మయ్యేనేని మీరును సెలెక్టుకమిటీవారునుకలిసి జయప్రదముగా పనిజరుప ప్రారంభించిన యీవిషయములను నమలుజరుప నధికారముల నొసంగ వేడుచున్నవాఁడ. వాని నన్నిటిని రాబోవుసంవత్సరాంతములోపల సులభముగ నమలులో పెట్టవచ్చును. అప్పటికి నేను ఇంగ్లండునకు మరలి రా నిశ్చయించుకొన్నవాఁడ. వచ్చునపుడు బంగాళాదేశమునందలి మీవ్యాపారములయొక్క యభివృద్ధిని గూర్చి మీరు చేయదలంచిన యన్నివిషయములను మీరును నేనును

సముఖమున మాటలాడుకొనవచ్చును.”

క్లైవుగారి సొంతమాటలలో నుదహరింపబడిన యీయుత్తరమునుబట్టి హిందూదేశమున బ్రిటిషువారి యధికార మభివృద్ధియగుటకు ముఖ్యసాధనమైన వ్యాపారములను మనము తెలిసికొనవచ్చును.

ఇంతవఱకు బ్రిటిషువారు హిందూదేశమున వర్తకులుగనే కన్పట్టుచువచ్చినారు. 1757 సంవత్సరమున జరిగిన పలాసియుద్ధమువలన బంగాళాదేశమున కంతకును వారధికారులై యున్నను పేరునకుమాత్రము చక్రవర్తిత్వము ననుభవించుచున్న ఢిల్లీచక్రవర్తి 1755 సం॥రమున ఈస్టిండియాకంపెనీవారి కిచ్చిన దివానీపదమువలన హిందూదేశమున వారు శాస్త్రవిహితమైన స్థితిగతులను పొందినారు. అందువలన బంగాళాదేశమునందలి పరిపాలనాధర్మము లన్నియును వారు పూనవలసివచ్చెను. క్లైవుప్రభు వీధర్మముల నెట్లు నిర్వహింప తలంచెనో యది యంతయును నాయన సొంతమాటలతోడనే వివరింపబడినవి. మిలటరీపరిపాలనమునందును సివిలుపరిపాలనమునందును నతం డొనరింప దలచిన సంస్కారప్రయత్నము లన్నియును చరిత్రకారులు వర్ణించుటకు స్తుతిపాత్రములైనవియె యగును. కాని హిందూదేశమున నిర్మింపబడిన పరిపాలనాపద్ధతు లన్నిటివలెనే దీనినిగూడ మనము పరిశీలించి చూచినచో నందలి ముఖ్యనిబంధన లన్నియును కేవలము బ్రిటిషుపరిపాలకులకే లాభకరమైనవిగా నున్నవి; కాని ప్రజలలాభమునకై గాక యున్నవి. బంగాళాదేశమంతయును ఈస్టిండియాకంపెనీవారి లాభమునకాధారమైన జాగీరుగ భావింపఁబడెను.

మూఁడుకోట్ల జనులకడనుండి వసూలుచేసెడి పన్నులలో కర్చులకును, అలవెన్సులకును అయ్యెడి సొమ్ముపోను మిగిలిన సొమ్మంతయు కంపెనీవారి లాభముక్రింద నింగ్లాండునకు పంపబడవలసినదేగాని



దేశలాభమునకై దేశములో కర్చుపడవలసినది కాదుగదా! ఏటేట 15 లక్షలకాసులకు తక్కువకాకుండ తమపరిపాలనమునకు లోఁబడిన యీదేశమునుండి ఇంగ్లీషుభాగస్వాముల లాభమునిమిత్తమై యిరసాలుచేయఁబడుచువచ్చెను. ప్రపంచమునందెల్ల మిక్కిలి శ్రీమంతమైన జాతివారియైశ్వర్యమునకు తోడ్పడుటకై పేదవడిన జాతివారిపన్నులమూలమైన శాశ్వతమగు బంగారునీటిప్రవాహ మావైపునకు ప్రవహింపఁజొచ్చెను.

దీనినిబట్టి హిందూదేశపరిపాలనమునకై బ్రిటిషుప్రభువు లేర్పాటుగావించిన మొట్టమొదటి పరిపాలనాపద్ధతులలోనే మనదేశమునుండి ద్రవ్యము తరలిపోవుస్థితి ప్రారంభమైనట్టును, క్రమక్రమముగ నిప్పుడు కోట్లకొలదిసొమ్ము ఆవైపునకు పంచికొని పోవుచున్నట్టును, మనము కని పెట్టఁగలము. హిందూదేశమున బ్రిటిషువారికి కలిగిన సైన్యవిజయములు, పరిపాలించుటకై దేశమున వారేర్పరచిన కట్టుదిట్టములు, ప్రజలనెమ్మదికి భంగము లేకుండ వారొనరించిన నిబంధనలు, వారి న్యాయపరిపాలనాపద్ధతులు, వారి పాశ్చాత్యవిద్యావ్యాపనము, ఇవి యన్నియును వారొనరించిన కార్యములలో వర్ణనీయములైనవియే యగును; గాని ఇంగ్లీషువారికిని, ఇండియనులకును కలిగియున్న ఆర్థికసంబంధములైన విషయము లెవ్వియును మొట్టమొదటినుండియును, న్యాయముగ లేవు. హిందూదేశమునం దెన్నివిధములైన యాధారములున్నను ఎన్ని సారవంతమైన భూములున్నను, పరిశ్రామికకార్యముల కనువుపడు జనసంఖ్య యెంతయున్నను, బ్రిటిషుదొరతనమువారు 1½ శతాబ్దము రాజ్యముచేయుసరికి దేశము ప్రపంచమునందలి నిరుపేదదేశములలో కెల్ల మేటియైనది.

కంపెనీవారికి సాలుకు 15 లక్షలచొ॥ ఆదాయము నేర్పరచితి

సని క్లైవుప్రభువు తృప్తిచెందక బంగాళాదేశమునందలి దైశికవర్తకముగూడ కంపెనీవారినౌకరులకే యుండవలెనని గట్టిపట్టు పట్టెను. స్వంతవర్తకమునకు కలిగెడు పీడలన్నియును తొలగిపోవుటకు తగినయుపాయములను పన్నెను. కాని ఆవర్తకమువలన బంగాళాదేశమునందలి యాంగ్లేయులకు లాభకరముగా నుండెను. దానిని వదలివేయుటకు క్లైవుప్రభువున కిష్టములేదు. తమయజమానులైన యీస్టిండియా కంపెనీవారి నిషేధయుత్తరవుల నుల్లంఘించి, ఉప్పు, పోకలు, పొగాకు ఈసరకులలోని దైశికవర్తక మంతయు దామే సాగింపవలెనని నిశ్చయించుకొని 1765 సం॥రం సెప్టెంబరు 18 తేదిని కంపెనీవారియుత్తరవు లెట్లున్నను వర్తకమును నడుపుటకై యితరవర్తకులతో నొకయొడంబడిక వ్రాయించెను. ఆయొడంబడికలోని యీక్రిందిషరతు ముఖ్యముగ గమనింపతగినది.

“ఈజాయంటువర్తకవ్యాపారము కట్టిపెట్టవలసినదని యింగ్లాండునందలి కంపెనీడైరక్టర్లు ఉత్తరవులు సాదరుచేసినయెడలగాని, ఆవాణిజ్యమంతయునుగాని లేక యందులో కొంతభాగముగాని, నడుచుటకు తగిన యంతరాయములు వారు కలుగచేసినయెడలగాని, పైని వ్రాయబడినట్టియును, ఇందునకు సంబంధించినట్టియును, ఒడంబడికలకుగాని,షరతులకుగాని, అందులోనియుపషరతులకుగాని, వానిలోనన్నిటికిగాని, కొన్నిటికిగాని, యేయుత్తరవులయందైనను, ఏమైనను వ్యతిరేకముగ నుండినయెడల, నవి యన్నియు, అశాస్త్రీయమైనవిగాను, అమలుజరుగకూడనట్టివిగాను ఎంచబడవలయును. అంతటినుండి రాబర్టుక్లైవుప్రభువు ప్రసిడెంటుగాను విల్లియమ్‌బ్రైట్‌వెల్‌సమ్మర్ మొదలగువారు పైనిచెప్పబడిన (ఫోర్టు) విల్లియము కవున్సిలుకు మెంబరులుగానుఉండి, సదరు ప్రత్యేకపు జాయంటు వర్తకమునకు ప్రొప్రయిటర్లయిన విల్లియమ్



బ్రైట్‌వేలుసమ్మరు, హేన్రివెరలిష్టు, రాల్ఫులీష్టరు, జార్జిగ్రే మున్నగువారికిని, ఇకముందు అందునహక్కు కలిగించుకొనువారికిని వారివారసులకును వారిస్థానీయులకును, సంరక్షకులను, ఏవిధమైననష్టమును కలుగకుండ చేయవలయును. అట్టినష్టము వచ్చినయెడల ముదరా చెప్పవలయును. కంపెనీడైరక్టరులవలన ఏవిధమైన వ్యతిరేకపుటుత్తరవులు పుట్టినను ఈప్రత్యేకపు జాయంటు వర్తకము, ఒక సంవత్సరమువరకు నిర్బాధకముగ నుంచి సాగించి తీరవలయును.” అని 1773 సం॥రమునందలి హౌసు ఆఫ్ కామన్సువారి నాల్గవరిపోర్టుయొక్క అనుబంధము 534 పేజీయం దుదహరింపఁబడి యున్నది.

30 సెప్టెంబరు తేదిని క్లైవుప్రభువుగారు పంపిన ముఖ్యమైన యుత్తరము చేరినతోడనే 1766 సంవత్సరము 17 మెయి తేదిని కంపెనీడైరక్టర్లు కలకత్తాకమిటీవారి కొకప్రత్యుత్తరమును, క్లైవుప్రభువుగారికి ప్రత్యేకముగ మరియొకయుత్తరమును, పంపించిరి. కంపెనీవారికి క్లైవుప్రభువుచేసిన గొప్పయుపకారములకు కృతజ్ఞతాపూర్వకముగ వందనములు సమర్పించుచు, బంగాళము, బీహారు, ఒరిస్సా వీనిప్రభుత్వస్వీకరణము అనగా దివానీపదమును అంగీకరించినట్లు డైరక్టర్లు తెలియచేసిరి. కాని క్లైవు దైశికవాణిజ్యమునుగూర్చి కావించిన యేర్పాటు నంగీకరింపక త్రోసివేసిరి. ఈవిషయమున కంపెనీవారియభిప్రాయము మిక్కిలిగ సంస్తవనీయమై యున్నది.

“బహుమానపూర్వకముగ సంపాదింపబడిన ద్రవ్యమునుగూర్చి మాకు కలిగినయభిప్రాయము సెలెక్టుకమిటీవారికి మేము వ్రాసిన యుత్తరమువలన తెలియగలదు. అందున కింకొకటి చేర్చవలసియున్నది. అది యేది యనిన, మీరు దైశికవాణిజ్యమువలన దొళ్లదోపుగ సంపాదించిన ద్రవ్యమంతయును, ఇదివర కేయుగమునను ఏదేశమునను

కని విని యెరుంగని మార్గముల నవలంబించి జనులను పట్టి పీడించి అక్రమముగ సంపాదించితి రని మాయభిప్రాయము. ఈసంగతి మాకు మొదట తెలిసినప్పటినుండియును ఇందునుగూర్చినమాయభిప్రాయములును ఉత్తరవులును కూడ నొక్కమాదిరినే యున్నవి. ఈవాణిజ్యవిషయమున జరుగుచున్న దారుణములైన అక్రమము లన్నియును పూర్ణముగ మేమెరిగి యున్నవార మగుటచే కమిటీవారి ప్రొసిడింగ్సులలో నుదహరింపబడిన మాదిరిని మీ రెన్ని నిబంధనల నేర్పరచి, యెంతకట్టుదిట్టముగ నెంతమితముగ వర్తకము సాగింపదలంచినను, దాని మేమంగీకరింపనేరము. అందులకు మీరు వింతపడ నవసరముండదు." అని 1773 సంవత్సరములోని హౌసుఆఫ్‌కామన్సువారి మూడవరిపోర్టుయొక్క అనుబంధము 400 పుటయందున్నది.

కంపెనీవర్తకులు సాగించుచున్న నాటువర్తకమునుగూర్చి కంపెనీడైరక్టరు లెప్పుడును సందిగ్ధముగ చెప్పి యుండలేదు. 1764 సం॥రము ఫిబ్రవరి 8 తేదీగల వారియుత్తరమున నట్టివర్తకము చేయ వల్లకా దనిరి. 1765 సం॥రం ఫిబ్రవరి 15 తేదీగల మరియొకయుత్తరమున చెప్పఁగలిగినంత శీఘ్రముగ చెప్పుచు మరలనిషేధించి వ్రాసిరి. కాని వారియుత్తరవు లన్నియును వారినౌకర్లు వ్యతిరేకించి త్రోసిపుచ్చిరి. 1766 సం॥రము మెయి 17 తేదిని వ్రాసినయీయుత్తరమున తా నేర్పరచిన కట్టుదిట్టములతో నీవర్తకమును సాగించెదనని వ్రాసెను. ఈ మార్గమును తా మంగీకరింప మని త్రోసివైచిరి. ఇదివరలోనే కంట్రాక్టులన్నియును పుట్టినవనియును వాని కిచ్చినబయానాలు నిలువయుండి పోయిన వనియును మిషకల్పించి యింకొకరెండుసంవత్సరములు దైశికవర్తకము సాగించి యీయుత్తరవులనుగూడ నుల్లంఘించిరి.

క్లైవుప్రభువు 1767 సం॥రమున ఇండియానుండి తరలిపోయె



ను. ఆతనిస్థానమున "వెరలిస్టు" అనునాతఁడు గవర్నరుగా వచ్చి 1770 సం॥రమువరకును పరిపాలించెను. ఆతనివెనుక "కార్టియరు" అనునాతఁడు గవర్నరై యతడు 1772 సం॥రమువరకును ఆయధికారమునందుండెను. "వెరిలిస్టు" "కార్టియరు" వీరి యుభయుల పరిపాలనకాల మైదుసంవత్సరములును బంగాళాదేశ మనుభవించినది అంతకుపూర్వపు ప్రభుత్వమువంటి దుష్ప్రభుత్వమే అయినది. క్లైవు ప్రతిష్ఠించి పోయిన పరిపాలనాపద్ధతి ఒకవిధమైన ద్వంద్వపద్ధతి. పన్నులన్నియును నవాబు ఖజానాకే పంపబడుచుండెను. ధర్మపరిపాలన మంతయును నవాబు ఉద్యోగస్థులు చేయుచుండిరి. వ్యాపారములన్నియును కూడ నవాబు ఉత్తరవుల ననుసరించి జరుగుచున్నట్టే జరుగుచుండెను. కాని లాభ మంతయును దేశమునకుఅసలు ప్రభువులైన ఈస్టిండియాకంపెనీవారికే పోవుచుండెను. కాని కంపెనీవారినౌకరులు తమసొంతలాభమును గూర్చి నవాబునౌకరులను భయపెట్టియు తమపనులను నెరవేర్చుకొనుటకై వారిన్యాయస్థానములను సాధనములుగా జేసికొనియును అపరిమితములైన దుండగములను చేయుచువచ్చిరి. ఇంగ్లీషుగవర్నరుగారు దీనిని చూచి వలదనిరి కాని దీనిని మరలింప సమర్థులు కాకపోయిరి.

" మనకును దొరతనమువారికిని గల సరిహద్దుల నెల్ల అజ్ఞానముచే నశింపఁజేసితిమి. దేశీయుడు తన కెవ్వరిపై నట్టియధికారము కలదో దానిని తెలిసికొన లేకుండ బోవుచున్నాడు. ఈయధికారవైషమ్యమువలనను ఆవిధమయిన చిక్కులవలనను ఇదివర కెన్నడు నెరుంగని కుట్రలును, బాధలును, బయలుదేరినవి. గవర్నమెంటు ఉద్యోగస్తులకుకూడ నీయంటురోగ మంకురించినది. వారిపై తనిఖీ చూచువారెవ్వరును లేకుండపోవుటచే వారింతయధికారదార్ఢ్యముచే పనిచేయుచున్నారు." అని 1769 సం॥రము 16 డిశంబరు తేదిని డైరక్టర్లకు గవర్న

ర వెరిలిస్టు ఒకయుత్తరము వ్రాసెను.

బంగాళాదేశమునందలి ప్రజలకు జీవనాధారములలో కెల్లము
ఖ్యమైనది వ్యవసాయము; కాని కంపెనీనౌకర్లచే ప్రతిపాదింపబడిన
క్రొత్తభూమి సెటిల్‌మెంటు పద్ధతులవలన అది యంతయును క్షీణించి
నది. బంగాళాదేశములోని భూములన్నియును అనాదిసిద్ధముగ జమీం
దారులగు భూమిఖామందులకును వారివంశికులకును వంశానుక్రమణి
కగ చెందియున్నవి. వా రాభూములను కొంతవరకు పన్నులు చెల్లించి
యు, నబాబునకు అవసరమైనపుడు కొంతవరకు సైన్యమును సమకూర్చి
యును, వశమందుంచుకొని తమ యెస్టేటులోని ప్రజలకెల్ల కొంచెమిం
చుమించు తామె ప్రభువులై సామంతరాజుల యధికారములతో పని
చేయుచుండిరి. వారిప్రజలును వారిరైతులును వారిని రాజావా రని
పిలుచుచుండిరి. ప్రజల నెమ్మదిని వారే నిలుపుచుండిరి. వారికి కలుగు
తగాదాలను పరిష్కరించుచుండిరి. అపరాధములకు వారేశిక్ష లొనర్చు
చుండిరి. మతవిషయముల నుత్సాహము కలిగించుచుండిరి. భక్తి సముచిత
గౌరవము నందుచువచ్చెను. విద్యలను కళలను ఆదరించుచువచ్చిరి. వి
ద్యలకు పోషకులుగా నుండుచుండిరి. 17 వ శతాబ్దమున యుక్తాయు
క్తము లేకుండ ప్రవర్తించిన మూర్షదు ఖూలీవంటి నబాబులును, 18
వ శతాబ్దమున మియర్ ఖాసీమును, ధనము నోడుచుకొనుపట్టున దయా
లేశశూన్యులై పనిచేసిరి కాని అనుశ్రుతముగ వంశానుక్రమణికగ వ
చ్చుచున్న వారి యెస్టేటులను మాత్రము వారికి తప్పించియుండలేదు.
1760 సం॥రమున మియర్ ఖాశిమువద్దనుండి కంపెనీవారు బర్ద్వాను, మి
థునపురములను సంపాదించినతోడనే క్రొత్తపద్ధతి నొకదానినవలంబించి
అనుశ్రుతముగ జమీందారుల కుండిన హక్కులను మన్నింపక
పన్నులయభివృద్ధికి ఎవరు సొమ్మెక్కువ యిచ్చిన వారికెల్ల ఎస్టేటులను ఏ



లము వేసి అమ్మజొచ్చిరి. ఇందువలన ప్రజల కనేకకష్టములు సంభ
విల్లినవి.

"1760 సంవత్సరమున మీర్ ఖాసిము కంపెనీవారి కొసగిన
మిథునపురము బర్ద్వాను రాష్ట్రములయందలి హక్కు స్వాతంత్ర్యము
లన్నియును కంపెనీవారి స్వాధీనము లైనవి. మూరుల (ఇది ఆఫ్రికాదే
శమందలి యొకజాతి) దొరతనమునందలి దుర్నీతివలన సంభవమగుచు
న్న అనర్థములుమాత్రము తగ్గలేదు. అందుకు భిన్నముగా 1762 సం
వత్సరమున నొకపద్ధతి యవలంబింపబడెను. అందువలన రాష్ట్రమున
కొకవిధమున నష్టము సంభవమయ్యెను. భూములు మూడుసంవత్సర
ముల కొకసారి యేలముమూలముగా అమరకము చేయబడుచుండెను.
ఆయేలమున ద్రవ్యముకాని సత్ప్రవర్తనముకాని లేని మనుష్యులు పా
టదారు లగుచుండిరి. కొందరు పూర్వపువ్యవసాయదారులు తమయిం
డ్లు వదలి పోలేక పెట్టవలసినదానికంటె నెక్కువసొమ్ము పెట్టుచువచ్చి
రి. ఎంతనష్టము వచ్చినను నష్టపోవుట కేమియును లేని పోటీదారులు
ఏవి యెటుపోయినను తక్షణమే యెస్టేటులను స్వాధీనముచేసుకొను స
భిలాషతో అంతకు మించిన పాటలు పాడజొచ్చిరి. ఈరీతిని రాబందుల
వంటి దోపిడికాండ్రు వేనవేలు విడివడి మొదటిసాలున తాము చెల్లించ
వలసిన సొమ్ము పూర్తిపరచుటకై అదివరకె దైన్యపడియున్న జనుల
కొల్లపెట్టజొచ్చిరి." ఇట్లు 1772 సం॥రమున బంగాళా గవర్నరగు వె
లివిర్టు వ్రాసిన ఇంగ్లీషుగవర్నమెంటు అనుగ్రంథము 70వ పుటయందు
వ్రాయబడియున్నది.

పీడాకరమైన యీక్రొత్తపద్ధతి వారన్ హేస్టింగ్సుగారు తరువా
త బంగాళాదేశమునం దెల్లెడలను వ్యాపింపచేసి ప్రజలకు మిక్కుటము
గు నసంతుష్టియును, గందరగోళములును బాధయును కలిగించెనని మ

నము ముందుముందు చదువగలము. ఈస్టిండియాకంపెనీవారి బాకీలను వసూలుచేయుటకై వెరిలిస్టుగారును, కార్టియరుగారును భూమివన్నులకై దయాదాక్షిణ్యములను విడిచి పనిచేసిరి.

గవర్నరు వెలివిర్టుగారు కంపెనీడైరక్టర్లపేర దానినిగూర్చి యీ క్రిందియుత్తరమును వ్రాసెను.

"కావున నది వారు కోరతగినదియే యై యుండెను. ఇదివర కియ్యది అనేకపర్యాయములు తమయాదిలోనికి వచ్చినది. వారిభూములు మనస్వాధీనములోనికి వచ్చినప్పుడు వ్యవసాయాభివృద్ధికొరకు ఉత్సాహకరముగనుండుటకై ఆభూములమీద పన్నువృద్ధిచేయ ప్రయత్నించుటకు మారుగ చాలజిల్లాలలో కొంతకాలమువరకును ఇదివరకు కట్టినపన్నులనే తగ్గించితిమి........నేనుగడచిన 19 సం॥రములనుండి అన్నిజిల్లాలలోను మీకుండెడు స్వాస్థ్యము లన్నిటిలోనురివిన్యూఅధికారమును వహించి అన్నిడిపార్టుమెంటులలోను పనిచేసితిని. మీపరిపాలనాశక్తిని వినియోగించి యేవిధముచేతను మీరు శిస్తులు వృద్ధిచేయజాలరని ఆయనుభవమునుబట్టి గట్టిగ చెప్పుచున్నాడను. అందులకు మీ రనుజ్ఞనొసంగవలయును."

వాణిజ్యమంతయును గుత్తచేయబడుటచేతను చేతిపనులన్నియును బాధపెట్టిపీడించుటచేతను నశించిపోయినవి. ఈస్టిండియాకంపెనీడైరక్టర్లు తమనౌకర్ల నిదుండి మరలింప ప్రయత్నించిరి కాని యీతూరి తామే యింతకంటె నెక్కుడు దుండగమును చేయ నారంభించినారు. బంగాళాదేశపు పట్టుపనివాండ్రు తమపట్టుసరకులను ఇంగ్లండునకు నెగుమతీ చేయుచువచ్చిరి. అందువలన బంగాళాదేశపు పనివాండ్రయందు బ్రిటీషుపనివాండ్ర కసూయత కలిగెను. ఇంగ్లండుదేశపు చేతిపనులభివృద్ధి చేయుటకై కంపెనీవారు బంగాళాదేశమునందు తాముసంపాదించిన రాజకీయశక్తిని వినియోగించి బంగాళాదేశపు చేతిపనుల నణగద్రొక్కుటకై దారుణప్రయత్నములను చేయసాగిరి. 1769 సంవత్సరము మార్చి నెల 17 తేదిని బంగాళాదేశమునకు కంపెనీవారు వ్రాసినయుత్తరములో బంగాళాదేశమున పట్టు తయారు చేయనీయకూడదనియు, పట్టు సరకులను తయారుచేయు పని నాదేశమున నణగద్రొక్కవలెననియును, తమయభిప్రాయమని తెలుపుచు, పట్టునడుకు పనివాండ్రను కంపెనీ ఫ్యాక్టరీలలోనెతప్ప స్వంతయిండ్ల కడపనులు చేయనీయకూడ దనియును, అట్లు ఫ్యాక్టరీలలో మనఃపూర్తిగ పనిచేయనియెడలనిర్బంధించి పనిచేయించవలె ననియు సలహా నిచ్చిరి.

"పూర్వ మీషూదిరిని పనిచేయుచున్న పట్టు వడుకువాండ్రనందఱను ఫ్యాక్టరీలలో పనిచేయుమార్గములోనికి దెచ్చుటకై యీనిబంధన మంచిపని చేసినది. పొరబాటుననైన నీపనివాండ్రు మరల తాముస్వంతముగ నింటికడపనిచేయకడంగి రేని యిపుడుగవర్నమెంటువారు అధికారబలమున నెక్కువ శిక్షను విధించి పూర్ణముగ దానిని మాపుచేయింపవచ్చును. అయ్యది చక్కగ నాచరణలోనికి గొనిరాతగినదై యున్నది" అని 1783 సం॥రమున హిందూదేశపరిపాలనావిషయమున సెలెక్టుకమిటీవారి 9 వ రిపోర్టుయొక్క అనుబంధమున 37 పేజీలో నున్నది.

"నిర్బంధము ప్రోత్సాహము ఈరెంటి ననుమతించు పరిపూర్ణమగు రాజనీతిమార్గ మీయుత్తరమున నున్నది. ఇందువలన బంగాళాదేశమునందలి చేతిపను లన్నియును చాలభాగము నశించుటకు తగిన మార్గ మేర్పడగలదు. దానియొక్క ఫలిత మేమనిన పరిశ్రమికముల తో తులతూగుచుండు దేశమంతయు గ్రేటుబ్రిటను దేశమునందలి చేతి

పనుల కన్నిటికిని ఉపచరించు పదార్థములు పోగుచేయు ప్రదేశమగుటయే" ఇదియును పైగ్రంథముయొక్క అనుబంధము 64 పుట యందున్నది.

ఆంగ్లేయులు హిందూదేశమున వర్తింపచేసిన యీరాజనీతి సుమారు ఏబదిసంవత్సరములవరకును నీరీతినే స్థిరముగా నున్నట్లుముందు ముందు మనము తెలిసికొనగలము. పార్లమెంటుసభవారిముందర నీవ్యాపారమంతయు బహిరంగముగ నొప్పుకొనిరి. 1833 సంవత్సరమువరకో లేక యింకను తరువాత కొంతకాలమువరకో ఈనీతి పట్టుదలతో అమలుజరుపఁబడియెను. ఆంగ్లేయుల చేతిపనుల లాభమునకయి హిందూదేశమునందలి యనేకములయిన దేశీయపరిశ్రామికషులు జయప్రదముగ రూపుమాపఁబడియెను.

అయితే యెడతెగకుండ నెల్లప్పుడును బంగాళాదేశమునందలి ద్రవ్యము ఇతరదేశములకువంచుకొనిపోవుటయే దేశమునకు సంభవమయిన యనర్థములలో నెల్లమేటి యయినది. ఇయ్యది కంపెనీవారిస్వలాభమునిమిత్తమైకాని ప్రపంచమునందలి యితరదేశములతోవారి కర్చువెచ్చములకైగాని యేటేట జరుగుచువచ్చినది. 1773 సంవత్సరమున పార్లమెంటువారు తయారుచేయించిననాలగవరిపోర్టులో ఈస్టిండియా కంపెనీవారికి దివానీపదములభ్యమయిన ఆరుసంవత్సరములలో బంగాళాదేశమునందలి ఆదాయమును వెచ్చమును తెలియచేయు స్టేటుమెంటు తయారుచేయింపఁబడినది. ఆరిపోర్టునుండి యీక్రిందిమొత్తములు ఎత్తివ్రాయబడినవి.



| సంవత్సరము. | మొత్తమురాబడి. | మొగలాయిచక్రవర్తికి యియ్యవలసినకప్పము, నవాబుకియ్యవలసిన అల్లవెన్సు వనూళ్లకు జీతములకు మిాషనులకు అయ్యేడుకర్చులుపోను మిగతనికరాదాయం. | సివిలుమిలటరీపనులకువలయు గృహములు కట్టడములు మొదలగు వానికి అయ్యేడుకర్చులు | సాలుసరికివచ్చునికరాదాయము |
|---|---|---|---|---|
| మెయి ఏప్రిల్ | కాసులు. | కాసులు. | కాసులు. | కాసులు. |
| 1765–1766 | 22,58,227 | 16,81,427 | 12,10,360 | 4,71,607 |
| 1766–1767 | 38,05,817 | 25,27,594 | 12,74,093 | 12,53,501 |
| 1767–1768 | 36,08,009 | 23,95,005 | 14,87,383 | 8,71,622 |
| 1768–1769 | 37,87,207 | 24,02 191 | 15,73,129 | 8,29,062 |
| 1769–1770 | 33,41,976 | 20,89,368 | 17,52,356 | 3,36,812 |
| 1770–1771 | 33,42,343 | 20,07,176 | 17,32,088 | 2,75,088 |
| | 201,33,579 | 130,66,761 | 90,27,609 | 40,37,152 |

ఈమొత్తములనుబట్టి బంగాళాదేశమునందు వచ్చెడినికరాదాయములో,ఇంచుమించు మూడవవంతుసొమ్మేటేటను ఇతరదేశములకు పంపబడుచు వచ్చె నని తెలియగలదు. కాని దేశమునుండివంచుకొనిపోవుసొమ్ము ఇంతకంటె చాలా హెచ్చుగా నున్నది. సివిలుమిలటరీకర్చులలో చాలభాగము ఐరోపియను ఉద్యోగస్థుల జీతములనిమిత్తమైయుండెను. ఆసొమ్ములోనియాదాయ మంతయును వారు ఇతరదేశములకు పంపివేయుచురు. న్యాయముగ దేశీయవర్తకులకు చెందియుండు వర్తకపరిశ్రామికములు వారికి లేకుండచేసి తన్మూలమున పోగుచేసిన

విశేషద్రవ్యమంతయు ఏటేటను దేశమునుండి పోవునదియేకదా. గవ
ర్నరు వెరిలిస్టుగారిచే తయారుచేయబడిన 1766-1767-1768 సంవత్స
రముల యెగుమతీదిగుమతీ సరకుల కగుసొమ్ము లెక్కలను గనుక
మనము చూచితిమా బంగాళాదేశమునుండి నిజముగా వంచుకొని పో
వుద్రవ్యము తేలగలదు.

| దిగుమతీ. | ఎగుమతీ. |
| --- | --- |
| కాసులు.<br>6,24,375 | కాసులు.<br>63,11,250 |

అనగా దేశములోనికి దిగుమతీ అయ్యెడిసరకులకన్న ఎగుమతీ అయ్యె
డిసరకులు ఇంచుమించు పదిరెట్లున్నట్టు కనపడుచున్నది. వెరిలిష్టుగారే
యీయనర్థముయొక్క దురంతమును కనిపెట్టి బంగాళాదేశమునందలి
జనుల యార్థికస్థితినిగూర్చి కలుగుచున్న దుఃఖకరమైన ఫలితముల
నాతడెల్లప్పుడును వ్రాయుచునేయుండెను.

" పూర్వమెంతసొమ్ము డిల్లీకి ఇరసాలగుచుండినను బంగాళాదే
శమున కాసొమ్మంతయును విరివియైన వర్తకరూపమున తిరిగి వచ్చి చే
రుచుండెను..................నబాబు రాష్ట్రములయొక్క ప్రస్తుతపు
స్థితిగతు లెంతమార్పును చెందినవో చూడుడు...............దేశమున
సంపాదించిన సొమ్మువలన ఐరోపియను కంపెనీలన్నియును దేశధనము
న కొకదమ్మిడీయైనను చేర్పకయే తమపెట్టుబడి ధనమును విశేషము
గ వృద్ధిచేసికొనినవి. " ( 1767 సంవత్సరము సెప్టెంబరు 26 తేదిని వ్రాసి
నయుత్తరమునం దున్న దిది. )



" ఈరాష్ట్రమునుండి మీరెప్పటి కప్పుడు కావలసినచోటి కెల్ల
సొమ్ము నప్లయిపొందుచుండినందువలన ఖజానాయంతయునుమిగుల
సన్నగిలుచున్నది. దేశమునుండి సొమ్మింత యెగుమతీ యగుచుండినపుడు
ముందుముం దెన్నియో యనర్థములు కనిపెట్టుకొనియున్న వనియు,
ఈదేశము వానివాతబడక తప్పదనియు భయము కలుగుచున్నది. "
అని 24 మార్చి 1768 సంవత్సరము తేదిని వ్రాయబడినది.

" దేశమున వచ్చెడునాదాయములో మూడవవంతు ఏటేటను
కర్చుపడుచుండినపుడును,అందునకు ప్రతిఫలముగ ఏరూపమైన ధనము
ను చేరనపుడును దేశమెంతభాగ్యవంతమైనదైనను ఎట్లు తనయథాస్థి
తిని నిలుపుకొనగలదు ? ఇంక నిది యెట్లు ముందునకు రాగలదు ? ఇం
తేకాక దేశమందలి ద్రవ్యమంతయును హరిస్వమైపోవుటకు దీనితో
సంబంధించిన యనర్థములు మరికొన్ని యున్నవి. అయ్యవి తొలగిపో
వ నేరవేని దేశైశ్వర్యమంతయును ఊడ్చిపెట్టుకొని పోవలసినదే. పూ
ర్వమీదేశమునకు కలిగిన గొప్పలాభ మొక్కటి కనిపెట్టినాడను. దే
శమునకు చెల్లెడిపన్ను లన్నియును తిరిగివచ్చి వేరువేరు కుటుంబములకు
గొప్పగొప్ప యీనాములరూపకముగ చేరెడివి. అప్పటి గవర్నరులంద
రును దూబరదిండిగ కర్చుపెట్టెడివారు. మరి యిప్పు డన్ననో భూము
లపై వచ్చెడు సొమ్మంతయును మనబొక్కసమే మ్రింగివేయుచున్నది.
మనపెట్టుబడికిని, అవసరమగు కర్చువెచ్చములకును, వలయు ధనముత
ప్ప అందొకపైస అయినను,రకము మార్పునకైనను వెనుకకు మరలు
టలేదు. " అని1769 సంవత్సరము ఏప్రిల్ 5 తేది యుత్తరమునందున్నది.

1783 సంవత్సరము తొమ్మిదవ రిపోర్టులో పార్లమెంటు సెలక్టు
కమిటీ వారు పెట్టుబడి యనిన నేమియో పూర్ణముగ తెలియచెప్పినారు.

" అనేకసంవత్సరములనుండి బంగాళాదేశపుపన్నులలో కొంతభా

గము ఇంగ్లండుదేశమునకు సరకులుకొని యెగుమతీచేయుటకై విడదీసి యుంచుచున్నారు.ఇదియె పెట్టుబడి. ఈపెట్టుబడి యెంత వృద్ధియైన కంపెనీయొక్క ప్రధానాధికారుల యాధిక్య మంత హెచ్చుగ పరిగణింపఁబడుచున్నది. హిందూదేశము పేదవడుటకు మూలకారణ మయినదీనినే మనము సామాన్యముగా ఆదేశపుఐశ్వర్యమునకును అభివృద్ధికిని కొలపాత్రిగా నెంచుచున్నాము. ప్రాగ్దేశమునుండి వేలకొలది యోడలు అమూల్యము లగు నచ్చటిసరకులను నింపుకొని యేటేటను ఇంగ్లండుదేశమునకు వచ్చి చేరుచున్నవి. ఈయోడలసంఖ్యఎడతెగకుండ నేటేట వృద్ధియగుచున్నది. దేశమునకు సరిపడగా మిగిలిన సర కింత విరివిగా వర్తకప్రపంచకమును ముంచివేయుచున్నపుడు, జనులందరికన్ను లావంకకు దిరిగి,స్వభావసిద్ధముగ ప్రతిమనుజుడును దేశముసౌఖ్యస్థితియం దున్నదనియు,ఐశ్వర్యము వృద్ధియగుచున్న దనియును,భావింపకమానడు. అచ్చట మనము చేయువర్తకమునకయి పెట్టెడుమూలధనము క్రమముగా వృద్ధిచేయఁ బడుచున్నదనియు అందుమూలమున హిందూదేశమునుండి ఇంతసరకు దేశమునకు వచ్చుచున్న దనియును కూడ యోచింపవలసివచ్చుచున్నది. ప్రళయాంతముగ నున్న యీవిశ్వరూపసందర్శనము దేశమునకులాభకర మైనవర్తకమువలన కలిగినది కాదు.'' అని 1783 సంవత్సరం తొమ్మిదవరిపోర్టు 54 పుటలో నిట్లున్నది.

గవర్నరు వెరిలిష్టుగారును సెలెక్టుకమిటీవారును కనపరచిన తెరగున శాశ్వతముగ హిందూదేశమునుండి వంచుకొని పోవుచున్న యీయర్థప్రవాహమునుగూర్చి ఆంగ్లేయదేశమునందలి గొప్పరాజకీయ తత్వశాస్త్రజ్ఞు డొకడు తిరస్కారపూర్వకముగ వ్రాసియున్నాడు. ఆవాక్యము లింగ్లీషుభాష నిలిచియుండి నన్నాళ్లును ప్రతిపాఠకునకును కంటబడకతీరవు. 1783 సంవత్సరమున ఫాక్సుగారియీస్టిండియాబిల్లునుగూర్చిజరిగినప్రసంగములో, ఇండియాదేశముయొక్క యీశాశ్వతధనప్రవాహామువలనకలుగుచున్న అనర్థకములనుబర్కుగారిట్లువివరించిరి. ఈబర్కుగారుమహావక్త.యథార్థవాది.పార్లమెంటుసభ్యులలో రత్నమువంటివాఁడు. ఈత డీవిషయమునుగూర్చి ప్రసంగించినంత ధాటీగను,అంత సత్యముగను, పార్లమెంటులో మఱిదేనినిగూర్చియైనను ప్రసంగించినాఁడాయనిసంశయము పొందవలసి యున్నది.



"ఆసియాఖండపు విజయయాత్రికులు తాము జయించిన దేశమునే వారు స్వస్థానముగ చేసికొనుటచే తమక్రౌర్యమును కొలదికాలమునకె తగ్గించుకొనిరి. తమలాభనష్టము లన్నియును తాము వసియించుచున్న ఆరాష్ట్రముయొక్క వృద్ధిక్షయములనుబట్టి యుండెను. తండ్రులు తమబిడ్డల వర్ధమానస్థితిని యచ్చటనే నిలిపియుంచిరి. బిడ్డలుతమతండ్రుల శాశ్వతకృత్యముల నెల్ల నచ్చటనే పొడగాంచుచుండిరి. చిట్టచివరకు వారి యదృష్టము (వారిబాగోగులు) నిలుచు స్థానమదియె యయ్యెను. ఎవ్వనికిని తనబాగోగుల కావాసంబగు చోటు చెడ్డచోటు కాకూడ దనుట ప్రకృతిసిద్ధమగు నభిలాషముకదా! దేశము పేదవడుట నిస్సారముచెందుట పాడువడియుండుట, యియ్యవి, యేమనుజునికన్నులకు చల్లగా నుండును? ముదిసి ముప్పుకాలముగడుపుదేశమున జనులెల్లరును తిట్టి పోయుచుండవలెననుకోరిక యెవ్వరి కుండును? తురుష్కప్రభువులు దురాశాపిశాచమునకు లోనై యెంతటిందుడగములను పాపకార్యములను పొనరించినను మనుజుని యీస్వల్పజీవితకాలములో నధికారశక్తివలన కలిగిన యనర్థకములను యీశక్తివలననే మరలించుటకు తగినకాలము లేకపోలేదు. క్రూరకృత్యములచే నిర్బంధించి సొమ్ము సంగ్రహించి రనుకొన్నను అయ్యది యంతయును తమగృ

హాముననే నిలవచేయుటకును తమగృహసంబంధమైన వ్యయమునకే
దూబరదిండిగ వెచ్చించుటకు నయి యున్నది. బలవంతుడైన వ్య
యశీలు డొక డింకొకని దోచె ననుకొందము. అదియును ప్రజల
కందరకును నొసంగుటకే అయియున్నది. ఎన్ని అల్లకల్లోలములు కలి
గినను తమయధికారబల మొంత నిరంకుశముగా నుండియుండినను, స్వ
భావసిద్ధమగు పనుల కేమాత్రమును విపరీతములు జరుగలేదు. వారి
యార్జనమునకు వలయునాధారము లేపియును నెండిపోలేదు. అందువ
ల్ల వాణిజ్యమును, చేతిపనులును, దేశముయొక్క వర్తకవ్యాపారము
ను అభివృద్ధి నొందినవి. దురాశయును, బలవదాకర్షణమును, గూడదే
శధనమును కూడబెట్టుటయందును దానియుపయోగమునందును విని
యోగించినవి. కాపువారును జేతిపనివారును హెచ్చువడ్డీల నిచ్చిన
మాట వాస్తవమే కాని వారికి మరల పరపతి పుట్టుస్థానమునందలి ధ
నమునే వా రభివృద్ధి చేసినది. వారికి పుట్టెడి పరపతి మిక్కిలి ఖర
ముగానే యుండెడిది కాని అయ్యది నిశ్చయముగ దొరకు ననెడినమ్మక
ముండినది. ఈవిధముగ సంఘముయొక్క మూలద్రవ్యము వృద్ధియగు
చువచ్చెను."

"ఇంక నింగ్లీషుప్రభుత్వమునం దన్ననో ఈకార్యములన్నియును
తారుమారైనవి. తురుష్కులదండయాత్రలు హానికరము లైనవియే
యగును కాని మనసంరక్షణ హిందూదేశమును నాశనము చేయుచు
న్నది. వారు సాధించినది పగచేత. మనమో స్నేహముచేత. ఇరువది
సంవత్సరము లైనది మన మాదేశమును జయించి. మొదటిరోజున నె
ట్లున్నదో యిప్పటికిని దేశ మట్లేయున్నది. ముచ్చటకైనను హిందూ
దేశమున ముదిసిన యాంగ్లేయుని ముఖము కనిపించదు. పడుచువాం
డ్రు—కొంచె మించుమించు బాలురే—వారిని పరిపాలించుచున్నారు



వారికి జనులతోడి సాంగత్యమూ లేదు. దేశీయులం దభిమాన మనునది
శూన్యము. వా రాదేశమునందలి జనులతో కలసిమెలసి యుండవలసి
న వారయ్యును, ఇచ్చట నున్నవా రెట్టులుందురో వారును అట్టులేయు
న్నవారు. తమధనార్జనమునకై జనులతో వలయుసంబంధముతప్ప ని
జముగా వారికిని వీరికిని ఏవిధమైనసంబంధమున్ను లేదు. ఈద్రవ్యార్జన
యంతయు దూరదేశమునకు పోయి యచ్చట వసతివాడ లేర్పరచుకొ
నుటకే. యౌవనమునకు సహజమగు సాహసముతోడను వయసునందు
నైజముగ నుండెడి దురాశతోడను ఒకనివెంబడి నొకడాదేశమునకు
దొరలిపోవుచున్నారు. ఎంత తిన్నను ఆకలితీరని క్షుత్తుచే వేధింపబడు
ఘాతుకపక్షులు దినదినము నొకవింతమాదిరిని దేశమునకువచ్చి దిగుటతప్ప
ప్ప దేశీయుని కన్నులకు మరియొక పద్దియును కానిపింపదు. ఇది యి
ప్ప డంతమగునను నపేక్షలేదు. లాభరూపకముగ ఆంగ్లేయునిచేతికి చి
క్కెడి ద్రవ్య మొక్కరూపాయియైనను హిందూదేశమునకుపోయినట్టే."

గవర్నరువెరిల్సు, బర్కు వీరిదినములనాటికన్న నిప్పుడు దేశప
రిపాలన మనేకవిధముల వృద్ధిచేయబడినది. గడచిన యేబదియేండ్లనుం
డి హిందూమహాఖండ మంతయును అవిచ్ఛిన్నమైన చల్లదన మనుభవిం
పుచుండెను. అట్టిది 18 శతాబ్దమునం దెప్పుడు నెరుంగనిదియె. వర్తక
వ్యాపారమున కీర్ష్యామూలముగ కట్టబడిన దారుణమైనపన్నులన్నియు
ను, మాపు చేయబడినవి. ధర్మపరిపాలనము పూర్వముకంటె మరింత
పరిపూర్ణదశ నొందినది. అర్థమును ప్రాణమును మునుపటికంటె ఎక్కు
వ రక్షణమును పొందుచున్నవి. విద్యావ్యాపకత్వమువలన క్రొత్తయా
దర్శముల నపేక్షించుచు జనులు మేల్కనినారు. కాని వెరల్సు బర్కు
ల కాలమునాడు వారు మొరలెత్తినట్టియు, సంతతధారగా పోవుచున్న
ట్టియు అర్థప్రవాహము హిందూదేశమునుండి నేటివరకు దినదినప్రవర్ధ
మానముగ ప్రవహించుచు హిందూదేశము నంతయును పేదవరచి క్షా

మదేవతకు రంగస్థానముగ నొనరించుచున్నది.

హిందూదేశమునందలి క్షామములు, ఏటేటను గురియుచుండు వర్షములు తక్కువయగుటచే పుట్టుచుండు ననుమాట వాస్తవమే. కాటకములు తరచుగా సంభవించుటయును అందువలన జననష్టము కలుగుటయును మాత్రము జనులనిత్యదారిద్ర్యమునుబట్టి సంభవించును. జనులు సామాన్యముగా మంచిస్థితియందుండినచో తమకు పంటలు లేనపుడు దరిదాపుప్రదేశములనుండి కొని తెచ్చుకొని జీవనములకు నష్టము లేకుండ నిలుపుకొనగలుగుదురు. జనులకేవిధమైన యాధారమును లేనపుడు, పంటలు లేకుండపోవునేని ఆదరిదేశములనుండు వాన్నినైనను సంపాదించుకొననేరక వేనవేలుగ లక్షోపలక్షలుగ జనులు నష్టపోవుచుందురు.

1769 సంవత్సరారంభమున ధరలు హెచ్చిక్షామము పొంచియున్నట్లు ద్యోతకమైనది. కాని భూమిపన్ను ఎప్పటిమొత్తము మునుపటికంటె నెక్కువకఠినతను వహించి వసూలుచేసిరి. "పన్నులంతసంపూర్ణముగ నిదివర కెన్నడును వసూలుకాలేదు." సంవత్సరాంతమున మామూలుగ కురియుచుండు వర్షము లేమియును లేకుండబోయెను. కలకత్తాసభవారు డైరక్టరులకు 23 నవంబరు తేదీని వ్రాసిన యుత్తరములో పన్నులవసూలు తగ్గిపోవునట్లున్నదని వ్రాసిరి గాని దానికి తగిన పరిహారమార్గ మేదియును తెలియచేసినారు కారు. 1770 సంవత్సరము మే నెల 9 తేదిని యిట్లు వ్రాసిరి. "మొన్నటిక్షామమువల్ల నష్టమైన జనులసంఖ్యయును సంభవమయిన ముష్టిమార్గమును వివరింపజాలకున్నారము. పూర్ణియాపరగణా మున్ను మిక్కిలి ఫలవంతమైనది. అట్టిపరగణాయందు జనసంఖ్యలో మూడవవంతు నశించినది. ఇతరస్థలమునందలి దుస్థితియు నిట్లేయున్నది." 11 సెప్టెంబరున నిటుల వ్రాసిరి. "ఈదేశవాసులు అనుభవించిన దుస్థితిని హైన్యమును నెట్లు వర్ణించినను అతిశయోక్తి యనుటకు సావకాశము లేదు. ఈవిపత్తుచే దేశము



మీద మనకు రావలసిన పన్నులు రాకుండబోయె ననిన వింత యేమియును లేదు. కాని మేమనుకొనిన దానికంటె తగ్గినమొత్తము చాలతక్కువగ నున్నదని చెప్పుటకు సంతసమగుచున్నది." 1771 ఫిబ్రవరి 12 తేదిని ఇట్లు వ్రాసిరి. "మొన్నటి క్షామ మెంతదారుణమైన దైనను అందువలన జను లెంతమంది నష్టపడినను, ఈసంవత్సరమున జగిగిన బంగాళము, బీహారు రాష్ట్రములలోని అమరకమున పన్నులు కొంతవరకు అదన మయ్యెను." 1772 జనవరి 10 తేదీ యుత్తరముననిట్లున్నది. "ఈ సంవత్సరమున రివిన్యూడిపార్టుమెంటులో ప్రతిదానిలోను వసూళ్లనుకొన్న మాదిరిని జయప్రదముగ జరిగినవి."

ఇవి యన్నియును హంటరుగారి రూరల్ బెంగాలులోనుండి యెత్తి వ్రాయబడినవి.

మనుష్యచరిత్రయం దింతకు మున్నెన్నడును కని వినియెరుంగని దారుణబాధలును దారుణమరణములును జనులు పొందుచుండగా భూమిపన్ను లింతకఠినముగా వసూలుచేయబడిన వని చదువుట మన కెంతయును దుఃఖకరముగా నుండకమానదు. కాటకమువలని నష్టములను నిర్ధారణచేయుటకు కలకత్తా సభవారు దేశము నలుతట్లను తిరిగి అధికారమార్గమున లెక్కలుతయారుచేయించిరి. ఆలెక్కప్రకారము బంగాళాదేశమునం దానమయమున ప్రాణములు కోల్పోయిన జన మాదేశసంఖ్యలో మూడవవంతున్నది. అనగా ఒకకోటిజనులు నష్టపడినారు. ప్రతిగ్రామమునందును, రోడ్డుప్రక్కలను, బజారులలోను చచ్చిన జనులబాధలను తొలగింప కంపెనీవారు ఏవిధమైన యేర్పాటులును చేయలేదు సరియేకదా కంపెనీనౌకర్ల చర్యలవల్ల మృత్యుబాధ మరింత హెచ్చయ్యెను. వారిగుమాస్తాలు, చావునకు సిద్ధమైయున్న ప్రజలకడనుండి లాభము సంపాదింప ధాన్యమంతయును గుత్తచేసిరి. ఆగుత్తచేయుటలో రైతులు ముందు పంటకై నిలవయుంచుకొనిన విత్తనములనుకూ

డ బలవంతముగ కొని పోగుచేసిరి. ఈసమాచారము కంపెనీడైరక్టర్ల చెవినిపడిన తోడనే వారు మండిపడి “కంపెనీవారి దాక్షిణ్యభావమును తారుమారొనరించి జనుల కందరకును ఒక్కసారిగ తటస్థమైన యీయాపదలో తాము లాభము నొందతలచిన నేరస్థుల నందఱం బట్టి యింక ముందెప్పుడును నట్టితప్పిదమును చేయకుండుటకు తగిన దండన మొనర్పు” డనియుత్తరవులు చేసిరి.

కాని కంపెనీవారి స్వంతవ్యాపారవిషయములు వచ్చినప్పుడీ “దాక్షిణ్యభావమే” మూలనుండెనో కనుపించదయ్యెను. బంగాళాదేశము నందలి మూడవవంతు జనము తుడిచి పెట్టుకొని పోయినప్పుడును, భూములలో మూడవవంతు గయాళీగా నున్నప్పుడును భూమిపన్ను తగ్గింపవలెనను దాక్షిణ్యభావము జాడయైనను వారికడ కనుపింపదయ్యెనే. 1772 సం॥రము నవంబరు 3 తేదిని కంపెనీడైరక్టర్లకు వారన్ హేస్టింగ్సు యీరీతిని వ్రాసెను.

“రాష్ట్రములోనిజనులలో మూడవవంతుజనులు నష్టపోయి ఆకారణముచేత వ్యవసాయము తగ్గిపోయి యున్నప్పుడు 1771 సం॥రములో వసూలయిన నికరాదాయము 1768 సం॥రములో వసూలయినదానిని కూడమించినది........అంతటివిపత్తులోకలిగిన నష్టములతోపాటు పన్నులరాబడికూడ తగ్గి యుండవలసినదని స్వతస్సిద్ధముగా ప్రతివానికినితోచక మానదు. అట్లు తగ్గకుండుటకు తగినకారణము బలవంతముమీద పూర్వపుస్థితిగతు లన్నియును నిలుపుచేయబడుటయే అయి యుండవలెను.” ఇదియును హంటరుగారిరూరల్ బెంగాలునుండియే యెత్తి వ్రాయబడినది.

ఇట్లు భూమిపన్ను తగ్గిపోకుండ బలవంతముమీద నిలబెట్టుటయును నది ప్రస్తుతపు ఇండియాపరిపాలకుల పరిభాషలో హిందూదేశము యొక్క స్థితస్థాపకశక్తి యని చెప్పుదురు 'కాబోలు'!



# హిందూదేశార్థికచరిత్రము.

## నాల్గవ ప్రకరణము.

### బంగాళాదేశమున వారన్ హేస్టింగ్సు.

(1772-1785)

1773 సం॥రమున బ్రిటిషుపార్లమెంటువారు రెగ్యులేటింగుచట్టమును జేసిరి. 1772 సం॥రమునబంగాళాదేశమునకు గవర్నరుగా వచ్చిన వారన్ హేస్టింగ్సె యీక్రొత్తచట్టముప్రకారము 1774 సంవత్సరమున మొదటిగవర్నరుజనరలయ్యెను. ఇంగ్లండుదేశమునుండి గవర్నరుజనరలు సభకు ముగ్గురుమెంబరులను పంపిరి. అందులో “ఫిలిప్ఫ్రాన్సిసు” అనునతడొకడు. మిగిలిన యిద్దరుమెంబరులును కంపెనీనౌకరులనుండి కోరుకొనబడిరి. కలకత్తాలో సుప్రీముకోర్టు ఒకటి స్థాపన మయ్యెను. ఈ క్రొత్తయేర్పాటులవలన దేశపరిపాలన మభివృద్ధి గాంచు నని యందరకును, ఆశకలిగెను.

హిందూదేశచరిత్రములో వారన్ హేస్టింగ్సునామముతోపాటు పార్లమెంటులో నాతనినిగూర్చి చాలకాలము చర్చింపబడిన వ్యవహారములు కొన్ని తలంపునకు వచ్చును. ముఖ్యముగా నీతని సంబంధమున అయోధ్యబేగముల (మహమ్మదీయరాజులరాణివాసజనము) కథయును, కాశీరాజుచరిత్రయును, రోహిలాలయుద్ధవిషయమును, స్మరణకు రాకతప్పదు. అంతచమత్కారవిషయములు కాకపోయినను పశ్చిమమున మ

మహారాష్ట్రులకును బ్రిటిషువారికిని కలిగిన కలహములు హేస్టింగ్సు పరిపాలనతో సంబంధించిన చాల ముఖ్యమైనకార్యములు. ఆతనిపరిపాలన మంత్యమై యిప్పటికి నూరుసంవత్సరము లైనను ఆవిషయములతో సంబంధించిన వారన్ హేస్టింగ్సు చర్యలన్నియును చరిత్రాంశములై యుండి ఆచర్చ లింతవరకును ముగియకుండెను.

ఈప్రస్తుతకథకును, ఆవివాదాంశములకును సంబంధము లేకుండ చేయఁగలిగితిమేని అయ్యది చెప్పశక్యముకాని యానంద మొసంగ కలదు. వారన్ హేస్టింగ్సుచర్యలలో లక్షలకొలదిజనుల జీవనాధారములతో సబంధించినట్టివియుపజాతీయమగుఆర్థికస్థితితో చేరినట్టివియు మాత్రమే మనము గమనింపవలసినవిషయము లయి యున్నవి. అట్టివిషయముల నతిక్రమించి వ్రాయుట యీగ్రంథముయొక్క యాశయము కాదు. నూరుసంవత్సరముల పైకాలమునుండి చరిత్రకారుని కలమునకును, మహావక్తలవాక్కునకును పనికలిగించిన యీవివాదాంశములన్నిటిని విడిచి వారన్ హేస్టింగ్సుయొక్క రివిన్యూ సివిలుపరిపాలనమునుగూర్చి మాత్రమే యీగ్రంథమున విమర్శింపఁదలచినారము.

మన మింతకు మున్ను వారన్ హేస్టింగ్సునుగూర్చి ముచ్చటించినపు డాతడు బలిష్ఠుఁడనియు, సమర్థుఁడనియు కంపెనీనౌకరు లాక్రమించుకొనుచుండిన మీరుఖాసింగారియొక్క స్వాచ్ఛములైన హక్కులన్నియును సంరక్షించువిషయమునను, క్రొత్తపరిపాలకులు క్రొత్తహక్కులను కల్పించుకొని దారుణముగ నశింపుచేయుచున్న బంగాళాదేశపు దైశికవర్తకమును కాపాడువిషయమునను, మిగుల ధైర్యముతో పని చేసెననియు, అం దాతఁడు న్యాయముగను గౌరవయుక్తముగను ప్రవర్తించె ననియు, చెప్పకొనినారము. ఆకాలమునందలి ఆంగ్లేయుల కందరికినివలెనే బంగాళాదేశపుభూమిపద్ధతి హేస్టింగ్సునకు కూడ యేమియు



తు తెలియని క్రొత్తపద్ధతి యయ్యెను. కంపెనీడైరక్టర్లు ప్రతిదినమును పన్ను లభివృద్ధి కావలె నని పెట్టెడినిర్బంధమువలన, ఆవిషయమును చక్కఁగా తెలిసికొనుటకును, దానిని న్యాయముగ నమలు జరుపుటకును కూడ నీతనికి అవకాశము లేకపోయెను.

పదునెనిమిదవశతాబ్దమున నింగ్లీషువారికి తెలిసినది ఇంగ్లీషుదేశపు భూమిపద్ధతియే. అందు భూము లన్నియును జమీందారులవి. వారాభూములను ఇజారాల కిత్తురు. ఇజారాదారులు పనివాండ్రచేత ఆభూములను దున్నించెదరు. బంగాళాదేశపు పద్ధతికిని దీనికిని ఏమియును సంబంధము లేదు. దొరతనమువా రొకమూలను, భూస్వాములు జమీందారులు ఒకవంకను, వ్యవసాయదారులు రైతులు ఒకవైపునను, హక్కులనుగూర్చి పడుచుండిన తగాదాలవలన ఈభూమిపద్ధతియొక్క వాస్తవస్థితి యెట్టిదియో యది చాలకాలమునుండి మరుగుపడియుండెను. దొరతనమువా రెట్లు చూచినను భూస్వాములు కానేరరు. వారికి భూమియందలి పన్నునకు మాత్రమే హక్కు కలదు. ఎస్టేటులు జమీందారులకు తరతరములనుండి వచ్చుచున్నవి. సివిలు క్రిమినల్ అధికారములన్నియు చలాయించుచుండెడు వీరు సామంతరాజులవలె నున్నారు. వీరికైనను సేద్యగాండ్రవద్దనుండి మామూలు శిస్తులనుమాత్రమే పుచ్చుకొనుటకు హక్కు కలదు. సేద్యగాండ్రుకాని రైతులుకాని భూమి దున్నపెట్టువారుమాత్రమే కారు. వారికి భూములయందు శాశ్వతపుహక్కు లున్నవి. తమభూస్వాములకు మామూలుపన్నులు చెల్లించి భూములు పిల్లపిల్లలతరము ననుభవించుచున్నారు. అప్పు డప్పుడు బంగాళాన బాబులు యెస్టేటులను సర్వేచేయించి పన్నులను వృద్ధిచేయుచుండెడివారు. జమీందారులును అప్పుడప్పుడు శిస్తులను హెచ్చుచేయుచుండిరి. ఇన్ని జరుగుచున్నను అనేకశతాబ్దములనుండి యీపద్ధతియందలి

ప్రధానాంశములుమాత్రము ఇంచుకంతయును మార్పుచెందక నిలిచియున్నవి. దొరతనమువారికి పన్ను పుచ్చుకొనహక్కు కలదు. ఆపన్నులు చెల్లించుచు జమీందారులు తమమామూలుశిస్తులను వసూలు చేసికొనహక్కు కలిగియున్నారు. భూస్వాములకు మామూలుశిస్తులు చెల్లించెడిపద్ధతిని రైతులకు భూములయందు వంశపారంపర్యపుహక్కు కలదు.

1765 సం॥రమున ఈస్టిండియాకంపెనీవారికి బంగాళాదేశముయొక్క పరిపాలనము లేక దివానీపదము చక్రవర్తిగారికడనుండి లభ్యమయ్యెను; గాని, రివిన్యూపరిపాలనమునుగాని, ధర్మపరిపాలనమునుగాని కంపెనీనౌకర్లు ఆవెంటనే తమపై నిడికొనలేదు. నవాబుకోర్టులోనున్న కంపెనీవారి రెసిడెంటుయొక్క తనిఖీకి లోబడి మూర్షడాబాదునందున్న మహమ్మదీయోద్యోగస్థుఁడొకడు బంగాళాదేశపుపన్నులన్నియును వసూలు చేయుచుండెను. పాట్నాయందుండెడి కంపెనీయేజంటు అధికారమునకు లోబడి సీతాబరాయి అను హిందూనాయకుఁడొకడు బిహారుదేశమునందలి పన్నులు వసూలుపరచుచుండెను. కంపెనీవారి పూర్వపుస్వాస్థ్యములైన 24 పరగణాలు, బర్ద్వాను, మిధునపురము, చిట్టిగాంగు, జిల్లాలుమాత్రము కంపెనీవారి "కవినెంటెడ్డు" ఉద్యోగస్థులు పరిపాలించుచుండిరి.

1769 సం॥రమున రివిన్యూవసూలును, ధర్మపరిపాలనమును తనిఖీచేయునధికారములతో సూపర్వైజర్లను కొందరిని నియమించిరి. ద్వంద్వపరిపాలనము తిన్నగ పని చేయలేదు. భూమికి యథార్థపరిపాలకు లగువారు హిందూమహమ్మదీయరివిన్యూవసూలుదార్లచాటున నుండి వసూళ్లుమాత్రము చేసికొనుచుండిరి. పరిపాలకులు బాధ్యతలను తెలిసికొన నవసరము కలుగుట లేదు. హిందూమహమ్మదీయరివిన్యూవసూలుదార్లు తాము కంపెనీవారితరపున యేజంట్లమనుకొని, వారును



పరిపాలనాభారమునువహింపరైరి. జను లాయుభయులనడుమ నొత్తుడు పడుచుండిరి. ఇందు రక్షించువారొక్కరును గాక పోయిరి. 1769 సంవత్సరమున నియమింపఁబడినసూపర్వైజర్లు చేసినవిచారణలో పరిపాలనము మిగుల గందరగోళముగా నున్నట్టు తేలినది. "వసూలుదారులు జమీందార్లకడ నుండియు, యిజారాదార్లకడ నుండియును, తమ సొమ్మును లాగుకొనుచుండిరి. వారు వారిక్రిందివారిని స్వేచ్ఛగ దోచుకొనుచుండిరి. ఎవరి కవసరము వచ్చినపుడు వారు తమక్రిందివారిని దోచుకొనుటకు తగిన యధికారమును నిలుపుకొనుచుండిరి." ఇంక ధర్మపరిపాలనావిషయ మందురో, "మామూలుపద్ధతు లన్నిస్థలములందును కట్టువడియెను. ఎవఁడు తనతీర్పు నములు జరుప శక్తి కలిగి యుండెనో అట్టివాఁడే తనయధికారమును చలాయించుచుండెను." ఇయ్యది 1772 సం॥రము నవంబరు 3 తేదిని కౌన్సిలువారును, ప్రసిడెంటును వ్రాసిన యుత్తరమునం దున్నది.

1772 సం॥రమున దేశపరిపాలన మంతయును బ్రిటీషుఉద్యోగస్థులయధీనము చేయ తీర్మానమయ్యెను. గవర్నరు వారన్ హేస్టింగ్సుగారును, కౌన్సిలులోనిమెంబరులు నలుగురును, ఒక కమిటీగా ఏర్పడి పన్ను వసూలునకును ధర్మపరిపాలనమునకును చట్టముల నేర్పరచిరి. మూర్షదాబాదునం దున్నఖజానాను కలకత్తాకు మార్చిరి. గవర్నరుగారును, కౌన్సిలును కలిసి రివిన్యూబోర్డుగా నేర్పడి ఆఖజానాను తమయధీనమం దుంచుకొనిరి. పూర్వమేర్పరుపఁబడినసూపరువైజర్లకు కలెక్టర్లని పేరు పెట్టి వారిని సొమ్ము వసూలు చేయుటకు అధికారులుగ చేసిరి. అయిదుసంవత్సరముల కొకసారి భూమిపన్నులు సెటిల్మెంటు చేయ నేర్పాటయ్యెను. కమిటీలోనిక్రిందిమెంబరులు నలుగురు నీయేర్పాటుల నమలు జరుప సరిక్యూటు బయలుదేరిరి. ప్రతిజిల్లాకును ధర్మపరి

పాలనమునకై ఒకసివిల్‌కోర్టును, ఒకక్రిమినల్‌కోర్టును స్థాపనమయ్యెను. కలెక్టరు సివిలుకోర్టు కధికారి. క్రిమినల్‌కోర్టునకుఁగూడ నాతఁడు వచ్చెడువాఁడు కాని, మహమ్మదీయఖాజీ యొకఁడును, ఇద్దరు మౌల్వీలును న్యాయమును నెరపుచుండిరి. సివిలు క్రిమినల్‌కోర్టులతీర్పులపైని అప్పీళ్లు కలకత్తాయందలి రెండుపెద్దకోర్టులకు చేసుకొనవలసి యుండెను. పోలీసుభటులపద్ధతి క్రొత్తది యొకటి యేర్పాటయ్యెను. బంగాళాదేశమప్పుడు పదునాలుగుజిల్లాలు. ప్రతిజిల్లాలోను ఫౌజుదారు లనుపేర దేశీయులను పోలీసుఅధికారులుగ నియమించిరి. రివిన్యూఉద్యోగస్థులకును, ధర్మపరిపాలకులకును నిర్ణయమైనశాసనము లన్నియును దేశభాషలయం దచ్చువేయఁబడి ప్రచురింపఁబడెను. పలువిధము లైనయీపరిపాలనాసంస్కారము లన్నియును వారన్‌హేస్టింగ్సుయొక్క శక్తిసామర్థ్యములను చాటుచుండును. కాని, దీనితోపాటు ఈదినమువరకు వచ్చుచున్నబ్రిటిషుపరిపాలనలోపములు కూడ బయటపడుచుండును. అదియే జనులయందలి అవిశ్వాసమును, అపనమ్మకమును. కంపెనీనౌకర్లెంతలంచగొండులుగను, క్రూరకర్ములుగ నుండిరో 18 శతాబ్దములోని హిందూమహమ్మదీయాధికారులుకూడ అంత లంచగొండులుగను, దారుణకర్ములుగను, ఉండిరి. బ్రిటిషునౌకర్లను యోగ్యులుగ చేయుటకును, నమ్మకమైనట్టియు, బాధ్యత కలిగినట్టియు పను లెల్ల వారి కొప్పగించుటకును, వారి కొప్పగించినపనులకు తగినప్రతిఫలము ముట్టచెప్పుటకును వారన్‌హేస్టింగ్సును, అతనిస్థానీయుఁడైన కారన్‌వాలీసును సఫలప్రయత్నములను చేసిరి. నమ్మకమును బాధ్యతయును కలిగినట్టిపని నొప్పగించుటకు కాని, తగినజీతము నిచ్చుటకుగాని, పరిపాలనాకార్యమున వారొసంగెడు సహాయమును నంగీకరించుటకుగాని హిందూమహమ్మదీయోద్యోగస్థులయెడల అట్టిప్రయత్నము లేవియును జరుగ లేదు.



1774 సం॥రమున రెగ్యులేటింగుఆక్టు ననుసరించి వారన్‌హేస్టింగ్సు గవర్నరుజనరల్ అయ్యెను. అయిదుసంవత్సరములకు నియామకమైనభూమిపన్నుసెటిల్‌మెంటు మంచిదికాదని తెలిసెను. పరంపరానుగతముగ భూస్వాము లైనజమీందార్లహక్కు లన్నియును నిర్లక్ష్యము చేయఁబడెను. సెటిల్‌మెంటు వేలముమూలమున జరుగుచుండెను. పోటీయం దుండెడిఆతురతకొలఁది హెచ్చుపాటలను పాడి భూమిదున్నకొనువాండ్రను పీడింపఁజొచ్చిరి. అట్లుచేసినను చెల్లవలసినపన్నులు చెల్లవయ్యెను. బంగాళాదేశపుభూమిపద్ధతి అర్థము కాకుండ పోయెను. పూర్వపుభూస్వాములకుటుంబములు నాశనమయ్యెను. పొలము దున్నకొనువాండ్రిందరు మిక్కిలిగ ఒత్తుడుపడి పోయిరి. 1774 సంవత్సరమున ఇంగ్లీషుకలెక్టరుల నందర వెనుకకురప్పించి, కలకత్తా, బర్ద్వాను, ఢక్కా, మూర్షదాబాదు, దినాజపురము, పాట్నాజిల్లాలలో రాష్ట్రీయసభల నేర్పరచి పన్నులవసూళ్లు వారియధీనమం దుంచబడెను. అసాధ్యమైనపనిని చేయుటకై దేశీయులు అమలుదారులుగ ప్రతిజిల్లాయందును నియమింపఁబడిరి.

1776 సం॥రమున కలకత్తాలో న్యాయమాయుసభూమిసెటిల్‌మెంటుపద్ధతి యొకటి యేర్పరుపఁబడవలె ననిచర్యలు జరిగెను. వారన్‌హేస్టింగ్సు బార్వెలుగా రిద్దరును భూములఁ బహిరంగమైనయేలములో క్రయపరచుటగాని, కవుళ్లకు యిచ్చుట గాని జరిగింపవలె ననియు, అక్రయదార్లకుఁగాని, కవులుదార్లకుఁగాని భూములు వారిజీవితకాలమువరకును జరుగవలెననియు ప్రపోజు చేసిరి. ఇంతకంటెను ప్రాజ్ఞుఁడగు రాజనీతివిశారదుఁడు యెక్కువ న్యాయమైనట్టియు, దయాహృదయము కలిగినట్టియు అభిప్రాయముల విశదీకరించెను. ఇతఁడే గవర్నరుజనరలు కౌన్సిలులోనిమెంబరైన “ఫిలిప్పుఫ్రాంసిస్సు” అనునాతఁడు. దొరతనము

వారు భూమిపన్ను శాశ్వతముగా నొక్కసారియే యేర్పరుపవలె నని యుపదేశించుచు, ఈయభిప్రాయమును మిక్కిలి సమర్థతతో కౌన్సిలు వారితీరుమానపుపుస్తకములలో ముఖ్యమైనవిషయముగా వ్రాసి పోయెను.

« జమీందారులలో చాలమంది నాశనమై పోయిరి. భూము లన్నియును వారియధీనమునుండి తప్పింపఁబడెను. కుటుంబగౌరవమును దర్జాయును నిలబెట్టుకొనినవారును, పూర్వము పెద్దపెద్దయుద్యోగములను చేసినవారును బహుస్వల్పముగ నున్నవారు. తక్కువస్థితిలోనిజనులు గవర్నమెంటువారితరపు కలెక్టర్లుగను, అమీరులుగను, నియమింపఁబడిరి. తమ్ము నియమించినజిల్లాలో తామింతసొమ్ము వసూలుచేసి యిచ్చెద మని వారియొద్దనుండి యొకకంట్రాక్టు వ్రాయించుకొనుచుండిరి. వీరే పన్ను చెల్లించు యిజారాదారులుగ భావింపఁబడుచుండిరి. అంతట వీరు హుజూరునుండి బయలుదేరి తాము చెల్లించుట కేర్పాటయినజిల్లాలకు పోయి అచ్చటి జమీందార్లతోడను రైతులతోడను పన్నులను సిసలుపరచుకొనుచుండిరి. »

ఈయిజారాపద్ధతివలనిచెడుగులను గూర్చియు దేశమున కిందు మూలమున కలుగుచున్న యనర్థములను గూర్చియు వివరింపుచు జనులయభివృద్ధిని కోరితి రేని భూమిపన్ను శాశ్వతపుసెటిల్‌మెంటు చేయుఁడ నియుపదేశించెను.

«ఒకసారి పన్ను ఏర్పాటయ్యెనేని అది బహిరంగమైన రికార్డులో వ్రాయించవలెను. అదిశాశ్వతముగానుండవలెను. మార్పుచేయరాదు. వీలయినంతవరకు జనులకు దీనియందు నమ్మకము పుట్టునట్లు చేయవలెను. ఆతరుణమున నున్నట్టిగాని, ముందు రాఁబోవునట్టిగాని భూస్వాములతో సంబంధ మేమియు లేకుండ, భూమినిపట్టి పన్ను లేర్పాటు కావలెను



ఇవిగాక పాతు లేవైనను దొరకినయెడల ఆసొమ్ము తెప్పించి భూముల మరమ్మత్తునిమిత్త మయ్యాది యుపయోగింపవలయును. దానితో భూస్వాములు తాము పడినకష్టమునకు తగినఫలము తాము పొందుదు మని సంతుష్టి చెందఁగలరు." ఇవి యన్నియును 1776 సం॥రములోని ప్రాన్సిసుగారి « మినిటు » లో నున్నవి.

ఈయభిప్రాయము లన్నియును లండనులోని డైరక్టరులకు పంపబడియెను. గాని, వారిపై సలాయుత్తరవును వేయ సంకోచించిరి. బ్రిటిషువారికి సహజమైనసంపాత (drift) నీతి ననుసరించిరి. « జీవితకాలపు హక్కులను కలుగచేసి కాని, శాశ్వతపుహక్కులను కలుగచేసి కాని, భూములను అమరకపరచువిషయమున సాధకబాధకము లన్నిఁటినియోచించి చూచినారము. ఈరెండుపద్ధతులును గూడ నిప్పు డనుసరింపఁదగినవి కానట్లు మాయభిప్రాయ మైయున్నది. ఇందులకు ప్రబలకారణము లున్నవి." డైరక్టర్లతీరుమానములలో నింతకంటె చెడ్డది మరియొకటి యుండదు. వారన్ హేస్టింగ్సుగారు చెప్పినజీవితకాలపుషరతుల గాని ప్రాన్సిసుగారు చెప్పినశాశ్వతపుకవుల్లనుగాని అంగీకరింపరైరి. బంగాళారాష్ట్రము నంతయు నిదివరకే సగము నాశనము చేసినకొద్దిషరతులమీఁదియేలపుపద్ధతినే యనుమతించిరి. హిందూదేశపువర్తకపరిపాలకులు పన్ను లెడతెగకుండ పదేపదే వృద్ధి యగుచుండుటకు తగిన "ప్రబలకారణములను" బాగుగ నెరుంగుదురు. ఈయేలములు, కొద్దిషరతులు, సొమ్ము చెల్లకట్టలేనిజమీందారులను బట్టి బంధించునిబంధనలు, అమలు జరుపునట్టిపద్ధతిక్రింద ఇంకొక పదియేండ్లు బంగాళాదేశము వీనిని బాధపడవలసి యుండెను.

1772 సం॥రమున చేయఁబడిన అయిదేండ్లఅమరకము 1777 సం॥రముతో సరిపోయెను. ఆయేలపుపద్ధతి కొంత మార్పు చెంది సం

శానుగతముగ నున్నజమీందారులుగాక ముందు పాటదార్లుగ నంగీకరింపఁబడిరి. కాని యెస్టేటు లైదేండ్ల కొక్కసారి కాక యేఁటేఁటనువేలము వేయుదు మని మొదట నుద్ఘోషించుటవలన అమలు చలాయించునప్పటికంటె ఆదియందే యీపద్ధతి యెక్కువకఠినముగ కనఁబడియెను. 1778-79-80 సం॥రములలో భూములు జమీందారులకు ఏఁటేఁటను అమరకపరుపబడెను. దేశ మీయార్థికపీడచే మిక్కిలి బాధింపఁబడియెను. పన్నులు చెల్లమి మరల ప్రారంభ మయ్యెను.

1781 సం॥రమున కొన్ని గొప్పమార్పులు కలిగినవి. సివిలుకోర్టులు కట్టుదిట్టముగా నడుచుటకై 13 నిబంధనల నేర్పరచిరి. తరువాత నీనిబంధనలు 95 నిబంధనలుగ సివిలుకోడ్డులో చేర్పఁబడియెను. అవియన్నియును బంగాళీభాషలోను పరిషియన్ భాషలోను అచ్చువేసి ప్రకటించిరి. సివిలుజడ్జీలకును కలెక్టరులకును మేజస్ట్రీటుఅధికార మిచ్చి రాష్ట్రములోఁ గలనేరముల వారు కూడ విచారించునదుపాయమును కలుగచేసిరి. కలకత్తాయందు రివిన్యూకమిటీ యొకటి ఏర్పాటయినది. ఈ జమీందారులకు ముందు హక్కులను కలుగఁజేయుచు భూమిసెటిలుమెంటుపద్ధతి యొకటి క్రొత్తది యీకమిటీవారు తయారు చేసిరి. అట్లు సెటిల్‌మెంటును కావించిరి. ఈసెటిల్‌మెంటులో భూమిపన్నుమునుపటికంటె 2౧ లక్షలరూపాయిలు వృద్ధి యయ్యెను.

బంగాళాదేశమునందలి గొప్పగొప్పజమీందారులు అందరును భూస్వాస్థ్యము గలపూర్వపుకుటుంబము లన్నియును, తా మిదివర కెన్నడును కని విని యెఱుంగనివసూళ్లవిషయమైన కఠినపద్ధతులవలనను ఏఁటేఁటను సెటిల్‌మెంటు చేయుటవల్లను పదేపదే కట్టుపన్ను హెచ్చుటవలనను బాధపడిరి. పూర్వమునుండి పేరుచెందినకుటుంబములవారివంశీకు లందరును ఈమూలమున కలకత్తాలో నుండుఋణదాతలచేతులలోను



రాబోవులాభముల నాశించి సాహసవ్యాపారములు చేయువారి చేతులలోను పడిపోయిరి. సాలుకు లక్షపౌనులు పన్ను చెల్లించుబంగాళాదేశములోని మూఁడుఎస్టేట్లు ప్రసిద్ధికులయినముగ్గురుహిందూస్త్రీలపరిపాలనమునందుండుట యీసమయమున తటస్థించినది. వారినామస్మరణ ఆదేశీయు లెవ్వరును ఎప్పటికి మరచిపోకుండునట్టిమహత్కార్యము లారాణులు ముగ్గురును చేసి పోయిరి. 3,50,000 కానులు పైన చెల్లెడుబర్ద్వానుదేశము ప్రసిద్ధికుఁడైనతిలకచందుగారి భార్యయును తేజచందుగారి తల్లియునగునామెచేత నుండినది. 2,60,000 కానులు పైనచెల్లెడురాజశాహిదేశము పూజ్యురాలైనరాణీభవానీగారిపరిపాలనమునం దున్నది. ఈమెనామము హిందూదేశమున ఆమెయొనరించినగొప్పగొప్పధర్మకార్యములచేతను, ఆమె పావనచరిత్రములచేతను ఆమెయున్నతదశశక్తిసామర్థ్యములచేతను, మిక్కిలి వాసిగాంచినది. 1,40,000 కానులకుపైగా చెల్లెడుదినాజపురపురాజు 1780 సంవత్సరమున మరణించెను. ఆతనివారసుఁడప్పటికి 5 సంవత్సరములవాఁడు. ఈయనభార్యయే యాబాలునికి సంరక్షకురాలుగానుండెను. నిమిషనిమిషమునకును మారుచుండెడివార౯ హేస్టింగ్సుగారిరివిన్యూసంబంధ మగుక్రూరమయినరాజనీతివలన ప్రజ లెట్టికష్టములను పొందినారో అయ్యది కొంతవరకీ ముందు ఎస్టేట్ల చరిత్రమువలన తెలియఁగలదు.

దినాజపుర మీమూఁడింటిలో మిక్కిలి బాధ నొందినది. రాజు మైనరుగా నున్నసమయమున యీయస్టేటును సంరక్షించుటకు కలకత్తానుండి దేవిసింగు అనునాతఁడు ఏజంటుగా నియమింపఁబడియెను. ఈతఁడు క్రూరకర్ముఁడును, ఏపని చేయుటకును జంకు లేనివాఁడు నై యుండెను. పూర్ణియాయందును, రంగపురమునందును నీతఁడు చూపినదారుణకృత్యములను కనిపెట్టి పూర్వపుటధికారమునుండి తప్పించి కం

పెనీరికార్డులో నీతని అపకీర్తిపరు డని వ్రాయఁబడి యుండెను. దినాజపురమునుండి పన్నుల వడివేసి వసూలు చేయవలసివచ్చినపుడు, ఈతఁడే యుక్తమైనయేజంటుగా నేర్పరుపఁబడియెను. దేవిసింగు తన కేర్పరచినపనికి తగినవాఁడై యుండెను. బంగాళాదేశమున 18 శతాబ్దమునందు సైతమెన్నఁడును కని విని యెరుంగని క్రూరకృత్యము నవలంబించి పన్నులు వృద్ధిచేయుటకై జమీందారులను పట్టి బంధించియు, రైతులను కొరడాలతో కొట్టించియు, పనిచేసెను. ఈదారుణములనుండి స్త్రీలైనను తప్పించుకొనలేకపోయిరి. కొరడాదెబ్బలకును, చబుకుదెబ్బలకును తోడు, అవమానమును, మానభంగమును గూడ తటస్థము కాఁజొచ్చెను.

దేవిసింగువలన కలిగినయీబాధలవలన సేద్యకాండ్రందరును స్వగ్రామములను, స్వంతయిండ్లను విడిచి పారిపోవలసినవారైరి. వారచట వదలి పారిపోవుచున్నారను ప్రయత్నములు సింగుగారిచెవిం బడినవెంటనే ఆయుధపాణు లగుసిపాయిలను వెనువెంట పంపి వెనుకకు మరలించుకొని వచ్చుచుండెను. అనేకులడవులకు పారిపోయిరి. మిక్కిలి వినయవర్తనులును, త్రొక్కినను తిరుగఁబడనివారును అగుకాఁపువాండ్ర నేకు లీకారణముచే తిరుగఁబడుటకు కారణము కలిగెను. ఈరాజవిద్రోహము దినాజపురమును, రంగపురమును గూడ నలముకొనియెను. సిపాయిబలము రావింపఁబడెను. శిక్షలును, వానివెంట నంటియుండుదారుణ మగునరహత్యలును గూడ కావింపవలసివచ్చెను. అప్పు డాజిల్లాయందుండుఇంగ్లీషునాయకుం డగు "గుడార్డు" అనునాతఁడు ఈయల్లరివంటి తీవ్రమగునల్లరి బంగాళాదేశమునం దెప్పుడును జరిగియుండ దని వివరించెను. దాని నాఁపుట కెట్టిదారుణకృత్యంబు లవలంబనంబు లయ్యెనో యవియును, బంగాళమున నెప్పుడును నెఱుఁగనివియే.

బర్ద్వాన్ దేశమునందలిపీడ జనుల నంతగా బాధింపక ఆయుప



ద్రవ మంతయు రాజకుటుంబముపైనిమాత్రమే చూపఁబడి యుండుటచే నాదేశకథ అంతదుఃఖకరముగ కనిపించుటలేదు. 1767 సంవత్సరమున తిలకచంద్రమహారాజు మృతుడయ్యెను. ఆతనిమైనరుకుమారుడు తేజచందు తండ్రికి స్థానీయుఁడుగా నంగీకరింపఁబడియెను. ఆకుటుంబమునకు మిత్రుఁడుగా నుండులాలాఉమాచందు అనునాతని ఆయెస్టేటునకు ముందుపరిపాలకుఁడుగ నుండ మరణించినప్రభు వేర్పాటు చేసెను. కాని, యాజిల్లాకు ఇంగ్లీషునాయకుఁడైన "జానుగ్రాహాము" అనునాతఁడు "వ్రిజకిశోరుఁ" డనుక్రూరకర్ముని ఇది చేయవచ్చు నది చేయరా దనుసందేహము లేనివాని నొకనిని పరిపాలకుఁడుగా నుంచవలె నని రాణీని నిర్బంధపెట్టెను. రాణియును స్త్రీకి సాధ్యమైనంతవరకు ఆతని యయోగ్యతను సాగనీయకుండ ప్రయత్నించి యెస్టేటుముద్ర నాతని కిచ్చుటకు నిరాకరించెను.

1774 సం॥రమున వారన్‌హేస్టింగ్సున కొకఅర్జీ వ్రాసికొనుచు "నాకుమారునిముద్ర నాస్వాధీనమునం దున్నది. నే నేకాగితమును ముందుగ చూడక ముద్రవేయకపోవుటచే, ఆముద్రను తనచేత నుంచుకొనవలె నని వ్రిజకిశోరుఁడు సర్వవిధముల ప్రయత్నించెను. కాని, నే నెప్పుడును ఆతనికి లొంగినదానను కాను. 1772 సంవత్సరమున బర్ద్వానున కాతఁడు గ్రాహాముగారి కేదో బోధ చేసి తీసికొని వచ్చి తొమ్మిదేండ్లవయసుగలనాబిడ్డను తేజచంద్రుని నాయొద్దనుండి లాగుకొనిపోయి యొకరక్షకునిస్వాధీనమున వేరుస్థలమున చెరఁబెట్టిరి. ఈస్థితిలో భయమును, బాధయును, వేధింప ఏడుదినములు ప్రాణమునకు తెగించి యేవిధమైనతిండియును తినక నిలిచియుంటినిగాని వేరుశరణ్యము లేకపోవుటచే ముద్ర నిచ్చివేసితిని." అని వ్రాసెను. ఇది 1783 సం॥రము సెలెక్టుకమిటీరిపోర్టులో నున్నది.

ఇట్లు యెస్టేటుముద్రను సంగ్రహించినవ్రజకిశోరుఁడు ఎస్టేటుద్రవ్యము నెల్ల కొల్లబెట్టియు, విశేషభాగ మపహరించియు, పాడుచేసియు తుదకులెక్కయైనను చెప్పకుండ పోయె ననియు, రాణి, తనయొక్కయు, తనకుట్టువానియొక్కయు ప్రాణములకు కూడ భంగము కలుగునని భయపడి కలకత్తాకుపోయి, స్వేచ్ఛగ బ్రదుక ననుజ్ఞనీయ వేడుకొనియెననియు నాయుత్తరమునందే లిఖింపఁబడియున్నది.

వ్రజకిశోరునిపైనను, గ్రాహాముపైనను మోపఁబడినయీయపహరణాభియోగమును “క్లావరింగు” “మాన్సను” “ఫ్రాన్సిను” అను గవర్నరుజనరలు కవున్సిలుమెంబరులు ముగ్గురును విచారింపవలె ననిరి. 1775 సం॥రము జనవరి 11 తేది “తనచిన్నికొమరుని ఆస్తి యని చెప్పి 11 లక్షలరూపాయిలును అపహరించినట్లు గ్రాహాము, కిశోరులపైన తెచ్చినఅభియోగములయొక్క సత్యాసత్యములలోనికి మేముదిగము. ఆమె చెప్పినసంగతుల సత్యాసత్యముల ఋజువు చేసుకొనుబాధ్యత యామెయందే యున్నది. ఋజువుపడకుండ (అభియోగము తెచ్చినంత మాత్రమున) మనుజులయొక్క యోగ్యతయును, నిష్కల్మషతయును, చెరుచునంతటియన్యాయమునకు మే మొడిగట్టలేము. రాణీయిచ్చిన అర్జీయందైనను మమ్ము నట్టిది కోరుట లేదు. అర్జీదారుని ప్రార్థన మంగీకరింపుఁడ” ని వారు వ్రాసిరి.

సభలోకలిగిన కలహమువలన సరియైనవిచారణ జరుగకపోయెను. వారన్ హేస్టింగ్సు గ్రాహాముగారిని వెనుక వేసుకొనివచ్చెను. “గ్రాహాముగారికి ముట్టినట్లు చెప్పబడియెడి యీచిన్నిబహుమానము లాతనికిప్పు డున్నట్టు తెలియవచ్చెడు విశేషైశ్వర్యమునకు కారణమై యుండనేరవు.” అని క్లావరింగు, మాన్సను, ఫ్రాన్సిసు, వారు ముగ్గురును వ్రాసిరి. “గ్రాహాము ద్రవ్య మెంత యున్నదో నాకు తెలియదు. మీ రే



కారణములచేత నాతని నైశ్వర్యము విరివియైనట్లు లూహించితిరో తెలియకున్నది. బర్ద్వాన్ రాణీ మోపిన యభియోగమునుండి సంరక్షింపవలసిన బాధ్యత మనపై నున్నట్లు లెంచితిని.” అని వారన్ హేస్టింగ్సు జవా బిచ్చెను.

బర్ద్వాన్ ఎస్టేటుపైన పన్నులు మిక్కిలి భారముగ కట్టఁబడియెను. రివిన్యూబోర్డులో దివానుగా నుండిన గంగాగోవిందసింగనునతఁడు బర్ద్వానువారి కుటుంబనముకువిరోధియైయుండెను. ఆకారణమునబంగాళాదేశమునందలి యితరజమీందారీ లన్నిటికంటెను హెచ్చుశిస్తైను. అనేకశతాబ్దములనుండి బర్ద్వాన్ ఈబాధను పొందుచుండెను. సైన్యసమపాయ మొనరించు సామంతప్రభువు లందరును మహారాష్ట్రుల దండయాత్రలలో బంగాళానబాబులకు సహాయము చేసియుండిరి. వారే వారియస్టేటులలో సర్వవిధముల ప్రభువులుగానుండిరి. అట్టిసామంతప్రభువు లిప్పుడే బంగాళమునందలి క్రొత్తయజమానులపన్ను లతిభారము లగుటచే వానిని చెల్లింప నసమర్థులైరి. జమీందారుతోపాటు పూచీపెచీ లనుభవించెడి శాశ్వతపుఅమరకములపద్ధతి యొకటి సమకూరుటచే, ఆకుటుంబ మప్పటికి చెడిపోకుండ నిలిచినది. బంగాళాదేశమునందలి పెద్దపెద్దయెస్టేట్లు గవర్నమెంటుకు చెల్లించెడుపన్నుకంటె బర్ద్వానుజమీ యిప్పటికిని హెచ్చుపన్నులను చెల్లించుచున్నది.

ఇంక రాజశాహిజమీ, పూజ్యురాలగు రాణీభవానీదేవి:— ఈమె పడినపాట్లు 18 శతాబ్దమున మిక్కిలి దుఃఖకరమైనవిషయములుగ భావింపబడియెను. నేటివరకు నీమె నామ మనిన బంగాళాదేశమునందలి స్త్రీపురుషాదు లందరును మిక్కిలి గురుభక్తితో చూచి కొనియాడుచుందురు. క్లైవుప్రభువు పలాసీయుద్ధమున విజయము నొందకపూర్వ ముత్తరబంగాళ మంతయు నీమెజమీలో చేరినదియే. మహమ్మదీయ

రాజ్యౌన్నత్యమును తన్నాశనమును కూడ ఈమె తనకన్నులార గాంచినది. బ్రిటిషువారి రాజ్యప్రారంభమును తద్వ్యాప్తియును చూచుచున్నది. పరిపాలకురాండ్రగా నున్న హిందూస్త్రీలలో శక్తిసామర్థ్యములలో ఈమెకు మించినవా రెవ్వరును కనిపించకున్నారు. బంగాళాదేశమునం దేయింట విన్నను, ఈమె పవిత్రజీవితమును ఈమె యపరిమితదాక్షిణ్యాభావమును వేనోళ్ల చాటుచుందురు. చరిత్రలయందును పురాణగాథలయందును స్త్రీరత్నము లని వన్నెకాంచిన మానినీమణులు తొమ్మండ్రుగు రున్నారు. వారిలో నీమెయొక్కరిత. ఈమెచరిత్రమును బాలురును బాలికలును నేటివఱకును పాఠముగ పఠించుచున్నారు.

బంగాళాదేశమునందలి యితరయెస్టేటు లన్నియును బాధ నొందినయట్టులే 1772 సంవత్సరమున వారన్‌హేస్టింగ్సుచేసిన రివిన్యూపద్ధతిచేత రాజశాహి యెస్టేటుకూడ బాధ నొందెను. 1773 సంవత్సరమున డిశంబరు 31 తేదిని గవర్నరు కవున్సిలువారు వ్రాసినయుత్తరమున "రాజశాహి జమీందారిణీ యగు రాణీభవాని పన్ను చెల్లించుటలో మిక్కిలి వెనుకబడియున్న" దని వ్రాసిరి. "1774 సంవత్సరము మార్చి 1 తేదికిని, ఫిబ్రవరి 10 తేదికి రాణీభవాని చెల్లించవలసియుండు యావత్తుపైకమును మార్చి 15 తేదీ నాటికి చెల్లించనియెడల ఈమెను జమీందారీనుండి తప్పించి గవర్నమెంటువారికి చెల్లింపవలసియుండు పన్నులను సరిగా చెల్లించువారియధీనము చేయబడు" నని ఖండితముగా నుత్తరవు నీయనిశ్చయించుకొనిరి. 1774 సంవత్సరము అక్టోబరు 18 తేదీగల మరియొకయుత్తరములో గవర్నరుజనరలుగారు "ఆమె యిజారాయును, ఆమె జమీందారీయును, భూములయం దామె కుండెడు యావత్తుహక్కులనుగూడ ఆమెకు తప్పించి ఆమెకు బ్రతికినన్నాళ్లును నెలకు రు4000ల రూపాయిలచొప్పున మనోవృత్తి నీయ నిశ్చయించియుండిరి."



ఇయ్యది 1783 సం॥రములోని సెలెక్టుకమిటీ 11 రిపోర్టులో నున్నది.

ఈయవమానమును దైన్యమును తనపైబడకుండ చేసికొనవలెనని యావృద్ధరాణి యనేక అర్జీ లిచ్చుకొనియెను. అందు కొన్ని యెక్కువ యభిరుచికలవిగా నున్నవి. అందొకదానియందు 1772 సంవత్సరమున జరిగిన అయిదుసంవత్సరముల సెటిల్‌మెంటు మొదలు అప్పటివరకు జరిగిన యెస్టేటుచరిత్రము ఇజారాదారుడుగ నియమింపఁబడిన "దులాలరావు" పెట్టిన యుల్లంఘనలును, తన్మూలమున దేశము జనశూన్య మగుటయును ఆమె యేకరవుపెట్టెను.

"సర్కారువారి యింగ్లీషుమహాజను డొకడు 1772 సం॥రమున ఆభూముల పైనుండు పూర్వపుశిస్తు లన్నియును కలిపి మొత్తము చేసెను. జమీందారీ, మొఘోటో, మొదలగు అస్థిరమగు కొన్ని శాశ్వతమగువానిగా మార్చెను............నేను పూర్వమునుండి జమీందారిణీగా నున్నాను. నారైతులు పొందెడు, యీదుఃఖము చూడలేక నేనే యీజమీ యంతయును యిజారాకు పుచ్చుకొనుట కంగీకరించితిని. ఆవెంటనే దేశ మంతయును పరిశీలించి చూచితిని. శిస్తుడబ్బు లిచ్చుటకైనను ఒకనికిని టికాణా లేకపోయెను.

"భాద్రపదమాసమున అనగా 1773 సంవత్సరము ఆగష్టునెలలో ఏటిగట్లన్నియు తెగిపోయి రైతులభూములును పంటలును జలమయములై పంట అన్నియును నష్టమయ్యెను. నేను జమీందారునై యుండుటచే రైతులు పాడైపోకుండ చూచుట నావిధాయికకృత్యమై యుండెను. అందువలన వారు చెల్లింపవలసిన పన్నులకు వాయిదాలొసంగి చేతనైనంత సాయము చేసితిని. అటుపై నింగ్లీషు ఉద్యోగస్థుల సిరీతినే తనకు గడువు యిప్పించుమని ప్రార్థించితిని. కాని వారు నన్ను నమ్మక నాయం దాగ్రహించి సొమ్మువసూలుకచ్చేరీని నాయింటినుండి త

ప్పించి మోతీజీలులో సొమ్ములు వసూలు చేయసాగిరి. నాయొద్దనుండియును, దేశమునుండియును పన్నులు వసూలు చేయు నుద్యోగస్థునిగను సాజావాలుగను దులాల్‌రాయి అను వానిని నియమించిరి.

“అనంతరము నాయిల్లు ముట్టడివేసిరి. నాయాస్తి యెంత యున్నదో విచారణ చేసిరి. ఇజారాదారుగను జమీాందారుగను నేను వసూలుచేసిన సొమ్మెంత యున్నదో, నేను ఇతరులవద్ద నెంత అప్పు తెచ్చి నానో, నాకు నెలకు కర్చు ఎంత యున్నదో ఇవి యన్నియును దర్యాప్తు చేసిరి. ఇవి యన్నియును రు 22,58,674 లుగా తేలెను.”

“క్రొత్తసంవత్సరమున అనగా 1774 సం॥రమున నాయధికారమును తప్పించి రు 22,27,824 లకు జమీాయంతయును దులాల్‌రాయికి యిజారాకు నియ్యబడెను. అంతట దులాల్‌రాయియును, ప్రాణబోసు అను మరియొకయుల్పుడును కలిసి భూములు పూర్వపురైతులు వదలివేసినందువలన కలిగిననష్టమును ప్రస్తుతపురైతులవద్దనుండి పుచ్చుకొనిరి. మొత్కోటో, అస్సేజాఫిరు, మొదలుగాగల పేరులుగల మరికొన్ని క్రొత్తపన్నులు అధికముగా కట్టిరి. వీరిద్దరును తమ యమలు చలాయించి విత్తనములు దుక్కిటెడ్లు మొదలుగాగల రైతులకున్న దంతయును లాగుకొని దేశమును జనశూన్యము గావించి నాశనము చేసిరి. నేను పూర్వపుజమీాందారిణిని. నేనుచేసిన నేరమేమియును లేదు. దేశమంతయును దోచివేసిరి. రైతు లందరును మొరబెట్టుకొను చుండిరి.”

“ఈకారణమునుబట్టి నేను ప్రార్థించునది యేమనిన:—ఈసంవత్సరము దులాల్‌రాయి యియ్య నిర్ణయించుకొనిన రు 22,27,817లును నేనే చెల్లించెదను. సర్కారునకు సొమ్ము నష్టము రాకుండ చెల్లించుటకు నేను జవాబుదారీ చేసెదను.”

ఇట్లు 1783 సం॥రమున సెలెక్టుకమిటీవారి 11 వ రిపోర్టులోనున్నది.



ఎత్తి వ్రాయబడిన యీావిషయములు ఉపయోగకరములైయున్నవి. అందువలన బంగాళాదేశములో చాలచోట్ల నేమూాల నేమిజరుగుచున్నదో తెలిసికొన నవకాశము కలుగుచున్నది. పూర్వపుజమీాందారులు ఏలములో పోటీకి నిలువలేక పోయిరేని తరతరములనుండి వారియధీన మందున్న యెస్టేటులనుండి వెడలఁగొట్టఁబడుచుండిరి. ఇజారాదారులతో పోటీకి నిలిచి హెచ్చుమొత్తములకు పాడి, పన్నులు గనుక సమయమునకు చెల్లింపకపోయిరా వారియెస్టేట్ల పయిన మేనేజరులను నియమించుచుండిరి. వారు నేలదున్నుకొనువాండ్ర నందర దోచివేసి వారి ననేకకష్టములం బెట్టి దేశమెల్ల జనశూన్యము గావించుచున్నారు. ఎంత నిర్బంధపెట్టినను తుదకు భూమిపన్నులు వసూలగుట మానివేసినవి. బంగాళాదేశమున సేద్యమగు భూములలో మూడవవంతు అరణ్యమై పోయినది.

రాణిభవాని కుమారుడైన ప్రాణకృష్ణుడను నాతఁ డనేకఅర్జీలను పంపెను. అందుపైన రివిన్యూవిషయమైన సలహా లనేకములు జరిగెను. దేశములోని కోమట్ల పేరుపెట్టి ఇంగ్లీషునౌకర్లు ఇజారాలు చేయుపద్ధతి, ఫిలిప్పుఫ్రాన్సిసు ఖండితముగా నిషేధించెను. “దేశము దేశమున పుట్టినవారిది. పూర్వపు విజయయాత్రికులు భూములపై వచ్చిడి కప్పములతో తృప్తి నొందెడివారు. పూర్వమునుండియు దేశమున జరుగుచున్న ఆచారములకును ఏర్పాటులకును భిన్నముగా నేమి చేసినను దేశమున కనర్థములు సంభవింపక తప్పవు. బంగాళా, బిహారుదేశములలో రెండువంతులభూమి యంతయును జనశూన్యమై పోయినదని జనులందరును చెప్పుకొను చున్నారు. హిందువులు పిరికివాండ్రు. ఈ బాధలకు తాళలేక వారు పారిపోవుచున్నారు.” అని వ్రాసెను.

చిట్టచివరకు 1775 సం॥రమున కౌన్సిలులోని యెక్కువమందిచే

“రాజశాహియిజారానుండి రాజాదులాల్‌రాయిని తప్పించి యిజారాను రాణీకే యిచ్చి తిరిగి యామెస్వాధీనము చేయుటకు నిశ్చయింపబడెను. హేస్టింగ్సు యీతీరుమానము నంగీకరింపలేదు. భూములయందలి పూర్వపుకుటుంబములవారి వంశపారంపర్యపుహక్కులను వారన్ హేస్టింగ్సుప్రభువు కనిపెట్టినట్లు వారన్ హేస్టింగ్సెప్పుడును దానియందుండెడి గుణమును తెలిసికొనడయ్యెను. దయాదాక్షిణ్యశూన్యులై మిక్కిలికఠినముగ పనిచేయుచు ద్రవ్యము నార్జించిన యిజారాదార్లను వెనుకవేసికొని వచ్చుట ఆతడెప్పుడును మానలేదు. వారన్ హేస్టింగ్సుగారి షరాబుగా నుండు కాంతబాబు అను నతనికొరకై రాజశాహియెస్టేటు ఖండఖండములక్రింద విభజించి మేలయినభూముల నేర్చి ఆతనికి జాగీరుకింద నిప్పించెను.

నిమిషనిమిషమునకును మారుచు పీడాకరముగ నున్న యిట్టి భూమిపద్ధతివలన అనర్థములు మెండయ్యెను. దీనికితోడు దేశమున పన్నులమూలమున వచ్చెడుద్రవ్యమంతయును వంచుకొనిపోవుచున్నది. జనులవర్తకములకు గాని పరిశ్రామికములకుగాని వ్యవసాయమునకు గాని ఈబాపతుసొమ్మేమియును నేరూపకముగను మరలివచ్చుచుండలేదు.

“1770 సం॥రమున బంగాళాదేశమును అతిదారుణముగ నాశనముచేసిన క్షామ మదృష్టశ్రుతపూర్వమై యుండినను పెట్టుబడిసొమ్ము అనేకోపాయములచేత నిర్బంధముగ నిలబెట్టబడెను. ఈయుపాయములు మిగుల విపత్కరములైనవై యుండెను...............దేశమున వచ్చినపన్నులసొమ్ములోనుండియు ఇంగ్లండునుండివచ్చిన సరకుల క్రయధనమునుండియును, గుత్తచేయబడిన పంటలనుండియును, బంగాళాదేశపుసరకులు ఖరీదుచేయబడినవి. ఈసరకులమొత్తము సాలుకు కోటిరూపాయిలు మొదల్కు కోటియిరువదిలక్షలవరకు నున్నది. అయిరోపాదేశమునకు పంపుసరకుల మూల్యము అధమము కోటిరూపాయ లున్నది. అందులకు తగిన ప్రతిఫల మేమియును లేదు. పైగా కంపెనీవారినిమిత్తమై యిండియానుండి చీనాదేశమునకు కోటిరూపాయిలు పంపబడుచున్నవి. ఆసొమ్మునకు ప్రతిఫలముగ వచ్చుసరకులెల్లను చైనాదేశమునుండి ఐరోపాదేశమ్మునకు పోవుచుండెను. ఇదిగాక బంగాళాదేశమునెమ్మదిగా నున్నకాలములో, తమనౌకర్ల జీతములకు సరిపోయిన రాబడి లేని హిందూదేశములోని యితరరాష్ట్రములకు, కావలసిన సప్లయి లన్నియును దేశమున యుద్ధములు లేని కాలములో జరుగుచువచ్చెను.”



బంగాళాదేశమ్మునకును ఇంగ్లండునకును నడిచిన యీవ్యవహారముయొక్క లెక్కలు చూచితిమేని యిది వాణిజ్యమని చెప్పవలనుపడదు. పన్నులలోనుండి పెట్టుమూలధనపుపద్ధతి స్వచ్ఛముగ బయటపడక మానదు. ఆపక్షము వహించి మనము చూచితిమేని దేశమునుండి యెగుమతీచేయబడుచున్న సరకులన్నియు కంపెనీవారి సంబంధ ముండినంతవరకు ఏరూపమైనధనమును దేశమున కొసంగకయే తీసికొని పోబడుచున్నది.

“ఈయార్థికప్రవాహములయాధిక్యమును, వానివలన గలుగుచున్నయనర్థకములును మరియొకటి చూచిన బాగుగ విశదము కాంగలదు. చీనాదేశముకొరకును, ఐరోపాకును కంపెనీవారు పెట్టుబడికై యుపయోగించుచున్నసొమ్ములు గాక బంగాళాదేశమునందలిపన్నులలోమీ రితరవిషయములకై యుపయోగించుచున్నవానిని గమనించినయీరెండవది యెద్దియో బోధపడును...........కొంతసొమ్ము సివిలుడిపార్టుమెంటులోని యుద్యోగస్థులవేతనమునకు పోవుచున్నది. ముఖ్యమైన పన్నుల వసూళ్లలో దేశీయుల కెట్లు జోక్యము లేకుండ పోయెనో అ

ల్లే యీయుద్యోగములకును వారికిని యెడ మయ్యెను! ఏవియో యొకటిరెండు మినహాయింపులమాట యటుండనిచ్చినచో దేశీయులు ఐరోపియనులయొద్ద యేజంట్లుగనో లేక నౌకర్లుగనో నియమింపఁబడుచున్నారు. లేదా వారికి వసూళ్లవిషయములో వారిసహాయము లేకుండ అడుగవతలకు వెట్టుటకు వీలులేనితక్కువయుద్యోగములనైన యిచ్చుచున్నారు.''

బంగాళాదేశములో 8 సంవత్సరములలో వసూలయినసొమ్మును, అయినవెచ్చమును తెలియులెక్కలు సర్కారువహీని తయారైనవి. అవి యీక్రిందిమొత్తములవలన తెలియ నగును.

| సంవత్సరము. | భూమిపన్ను. | మొత్తము పన్నులు. | సివిల్ ఉద్యోగస్థుల ఖర్చులు. | మిలటరీ ఖర్చులు. | మొత్తం ఖర్చులు. |
|---|---|---|---|---|---|
| మే. ఏప్రిల్ | కాసులు. | కాసులు. | కాసులు. | కాసులు. | కాసులు. |
| 1771–1772 | 23,41,941 | 32,59,564 | 2,06,781 | 11,64,348 | 28,84,192 |
| 1772–1773 | 22,98,441 | 28,66,968 | 2,34,051 | 12,88,667 | 28,27,141 |
| 1773–1774 | 24,38,405 | 31,60,186 | 2,13,237 | 13,04,883 | 27,27,975 |
| 1774–1775 | 27,77,870 | 35,64,915 | 2,68,232 | 10,80,304 | 33,00,124 |
| 1775–1776 | 28,18,071 | 41,98,017 | 3,35,968 | 10,51,969 | 34,38,480 |
| 1776–1777 | 27,55,043 | 39,71,440 | 3,25,192 | 9,42,199 | 34,24,401 |
| 1777–1778 | 25,30,042 | 36,88,088 | 4,77,293 | 11,84,708 | 33,53,029 |
| 1778–1779 | 26,56,809 | 37,82,690 | 5,53,810 | 18,46,237 | 49,72,590 |

ఇంతవరకు బంగాళాదేశముయొక్కస్థితిగతులనుగూర్చి చెప్పితిమి. బంగాళాదేశమును విడిచి వారన్‌హేస్టింగ్సుగారియేలుబడిక్రిందికి వచ్చినయితరరాష్ట్రములస్థితి యెట్లున్నదో సంగ్రహముగ చూతము. ఆతనియధికారబల మెచ్చట ప్రయోగించిన నచ్చట తత్ప్రథమఫలితములన్నియును నిశ్శేషసౌఖ్యదాయకములై యున్నవి. 18 వ శతాబ్దమున



ఉత్తరహిందూస్థానమున గలచిన్నచిన్నరాష్ట్రము లన్నిఁటియందును కాశీరాష్ట్రము మిక్కిలి శ్రీమంత మైనదియు, స్వస్థ మైనదియుగ నుండెను. జనులు పాటుపడుస్వభావము కలవారు.వ్యవసాయమ్మును చేతిపనులును ఉచ్ఛదశయం దున్నవి. హిందూదేశమంతటను హిందువు లందరివల్లను పూజింపఁబడుచుండినపావననగరమును రాజధానిగ జేసికొని రాజా బలవంతసిం గా దేశమునకు ప్రభువుగా నుండెను.

బలవంతసింగు 1770 సంవత్సరమున మరణించెను. ఆతనిపై ప్రభుండగుఅయోధ్యరాజునకు వజీరనిపేరు. పూర్వపువన్నులకంటెకొంచెమేమాత్రమో వృద్ధిచేసి వారసత్వపుఫీజని చెప్పి కొంత పుచ్చుకొని ఆతనికుమారుడైనచైత్యసింగునకీయయోధ్యరాజు తండ్రిస్థానము నొసంగెను. ఈవారసత్వమున ఈస్టిండియాకంపెనీవారు కొంత స్వాభిమానమును పూనినవారై గవర్నరుజనరలుగారు 1770 సం॥రము అక్టోబరు 31 తేదిని కంపెనీడైరక్టర్లపేర నొకయుత్తరము వ్రాసిరి. “ మనసిఫార్సును ఈమనకోరికయును వజీరు నిమిషములో నామోదించె నని తెల్పుట కెంతయును సంతస మగుచున్నది. ఆతనికిని ఇంగ్లీషువారికిని గలదృఢస్నేహమును గూర్చి హిందూస్థానమునందలియితరపరిపాలకు లందరకును గట్టినమ్మకము కలుగును. అందువలన నిది సంతోషవార్తగా నెన్నతగినది.'' అని 1782 సం॥రములోని సెలెక్టుకమిటీరిపోర్టుయొక్క 452 పేజీలో నున్నది.

1775 సంవత్సరమున అయోధ్యరాజయిన సూజఉద్దౌలాయె మరణించెను. బ్రిటిషువారికి పూర్వమిత్రునియీమరణము నాధారము చేసికొని బ్రిటిషురాజ్యమును వారియధికారమును వృద్ధిచేసికొనవలె నని వారన్‌హేస్టింగ్సుగారికి తలంపు కలిగెను. 1775 సం॥రము అతనివారసును కుమారుడును అయినఅసాఫుద్దౌలాతో నొకక్రొత్తయొడంబడిక

గావింపఁబడెను. దీనినిబట్టి కాశీరాజ్యము ఈస్టిండియాకంపెనీవారి కీయఁబడెను. రాజా చైత్యసింగు ఆకారణమువలన బ్రిటిషువారికిసామంతుఁ డయ్యెను.

“చైత్యసింగునకు సంబంధించిన కాశీయును, తదితరరాష్ట్రములును మనకు వచ్చుట మీామనస్సునకు పూర్ణమైనయంగీకార మైనవిషయమే అయియుండును. ఇందువలన కంపెనీకి గొప్పరాజ్యలాభము కలిగినది. ఈరాజ్యపూర్తివలనవచ్చెడునాదాయము రు 23,72,650 లు. ఇయ్యది రాజా నెలనెలకు కప్పముక్రింద చెల్లించుచుండును. ఆతనివసూళ్లతో మన కేమియును పని లేదు. మదరా లేవిధమైనవియు మనమంగీకరింప నవసరము లేదు.” అని 1775 సం॥రము అగష్టునెలలో డైరక్టర్లపేర గవర్నరుజనరలు వ్రాసెను.

మూఁడుసంవత్సరములు గడచినవెనుక దురదృష్టవంతుఁడగు చైత్యసింగు ఈప్రభువులమాత్సవలనిపూర్ణభావమును కనిపెట్టకలిగెను. “గ్రేటుబ్రిటనునకును ఫ్రాంశువారికిని యుద్ధము జరుగు నని 18 మార్చితేదిని ఇంగ్లీషువారు ఖండితముగా చెప్పిరి......మీారు కంపెనీవారి భృత్యులై యున్నారు. అందువలన వారిక్షేమమునకై సర్వవిధముల వారియందభిమాన ముండవలసియుండెను. అందువలన కంపెనీవారిపక్షమున నేనే యీాయుద్ధమునకై వలయుధనము మీావంతు మీారు దయచేయుఁడని వేడుచున్నాడను.” అని గవర్నరుజనరలు 1779 సంవత్సరము జూలయినెలలో యుత్తరము వ్రాసెను.

న్యాయము చెప్పవలసివచ్చినప్పుడు ఇవ్వట్టున బలవంతముగ వడివేసి ధనము లాగుటకై ప్రయత్నించుచుండిన వారన్ హేస్టింగ్సు ప్రయత్నముల నిరోధించుచు ఫిలిప్పుఫ్రాన్సినుగారు యోగ్యుఁడైనఆంగ్లేయుఁడై పని చేసె నని మనము చెప్పకొనవలసియున్నది. కాశీరాష్ట్ర



మును బ్రిటిషువారియధికారముక్రిందికి తెచ్చినవారిలో ప్రముఖుఁడీయనయే యైయుండెను. కంపెనీవారికి సామంతుఁడై యుండినయారాజును యుక్తాయుక్తవివేచనలేకడబ్బునకై పీడింపవలదనియీాతఁడేనిరోధించెను.

“ఈదొరతనమువారియధికారమునకు రాజా లోఁబడితీరవలెననుట కేవిధమైనసంశయమును లేదు. న్యాయమునుబట్టి ఆయధికారమను చలాయించినంతవరకును ఈబోర్డులోనియందరివలెనే నేనును దానిసమలుజరుప నంసిద్ధుఁడనై యుందును. ఆతనికిని మనకును ప్రథమమున నొకయొడంబడిక జరిగినది. ఆతఁ డందుల కంగీకరించినాఁడు. ఆమరతులమీాఁదనే జమీాందారీ నాతఁ డనుభవించుచున్నాఁ డని నే నింతవరకును తలంచుచున్నాఁడను. ఆమరతులకు మించి రాజాను హెచ్చుగా నిమ్మని యడుగుటకు న్యాయముగ మన కధికార మున్నదా యనువిషయమున మొదటినుండియును నాకు సంశ మున్నట్లు చెప్పచునే యున్నాఁడను. పైయధికార మున్నదికదా యని చిత్తము వచ్చినట్లు ఆతఁడీయవలసినసొమ్ముల హెచ్చించుచుండినయెడల నాతని కింక హక్కు లెక్కడ నుండును? ఆస్తి యేమి నిల్చును? అన్నింటికిని ఆశ వదలుకొనవలసినదియే. అయిదులక్ష లన నేల? ఏబదిలక్ష లిమ్మనరాదా? ఆతఁడు సొమ్మీాయననుటయో, యీాయ లే ననుటయో సంభవించును. మనమావెంటనే వానిజమీాందారీ యంతయును లాగుకొనవచ్చును.” ఇది సెలెక్టుకమిటీ 2 వ రిపోర్టు 465 పేజీలో నున్నది.

ఈయవరోధము లన్నియు వ్యర్థము లయ్యెను. రెండవసంవత్సరము 5 లక్షలును, మూఁడవసంవత్సర మైదులక్షలును 4 వ యేట 5 లక్షలును చైత్యసింగు తనవంతుక్రింద నిచ్చుకొనవలసివచ్చెను. ఇదిగాక సైన్యపుఖర్చులక్రింద కొంత భరింపవలసివచ్చెను. ఆతఁ డాసొమ్మియ్యలేకపోయెను. అంతట నాతని దూషింప నారంభించిరి. తరువాత

బందెం బడవైచిరి. అతనిప్రజలు కంపెనీరక్షకభటుల నెదిరించి పెనగులాడిరి. ఆనిమిషములో వానియాయువే మట్టమయ్యెను. అతఁడు ఎస్టేటునుండి పారిపోయెను. అతనిమేనల్లుని మహీపనారాయణుఁ డనునాతని అతనిస్థానమున ప్రవేశపెట్టిరి. అతఁడు మునుపటికంటె విశేషధనమును చెల్లించుట కొప్పుకొనియెను. ఈపరిపాలన మంతయును గవర్నరుజనరలుగారి స్వంతదివానులచేత నుంచఁబడియెను.

దేశమంతయును దారుణముగ పాడుపడియెను. వారన్ హేస్టింగ్సు బలవంతసింగు, చైత్యసింగులపాటి పరిపాలకుఁడు గాకపోలేదు. వారియిరువురిపరిపాలనమున దేశము సుభిక్షముగానే యున్నది. కానియీ క్రొత్తపరిపాలనములో భూములపై పన్నులు వృద్ధియై దేశమునందలి వ్యవసాయపరిశ్రామికము లడుగంటిపోయెను.

వారన్ హేస్టింగ్సుగారు నియమించిన మొదటిదివానును క్రమముగా పన్నులు వసూలుచేయలేకపోవుటచే తప్పించివేసిరి. పన్నులక్రింద నిసబుచేసినసొమ్మంతయు వసూలై తీరవలెననుఖండితశాసనప్రకారము రెండవయాతఁడు నడుచుకొనియెను. భూములపై మోయలేనిభారము పడియెను. వసూళ్లు మిక్కిలి క్రూరముగ నుండెను. జను లందరును విపత్తులలో మునిఁగిపోయిరి. 1784 సం॥రమున సంభవమైనదారుణక్షామముతో దేశ మంతయు నాశనమై పోయెను.

ఈక్షామమువలనను, ఈవినాశమువలనను, కలిగినఫలితములను వారన్ హేస్టింగ్సుగారు కన్నులార చూచి 1784 సంవత్సరము ఏప్రిల్ 2 వ తేదిని కంపెనీడైరక్టరులపేర నొకయుత్తరము వ్రాసెను.

“ బక్సారులోని మూలమూలలనుండి కాశీవరకును గలజను లందరును మిక్కిలి యసంతుష్టులై నన్ను వెంబడించి యేడుచుచు రాగా నాకును అలసట జనించినది. దీర్ఘకాలమువరకును విడువకుండిన యీ



లేమిచే గలిగినయనర్థములు జనులబాధను వృద్ధిచేయుట స్వాభావికధర్మమే. అయినను పీడాకరమై కలుషితమైనపరిపాలనాలోపమువలన నీయనర్థములు కలుగుచున్న వని నాయభిప్రాయము. బక్సారునుండి దానిమొదటసరిహద్దువరకును గల ప్రతిగ్రామమును పూర్ణముగానాశనమైన జాడలు తప్ప మరి యేమియును కనుపించుట లేదు. ఒక కాశీపట్టణము తప్ప యింక రాష్ట్రమేమూలచూచినను రాజు లేనట్టుగనే కనబడుచున్న దని తెలుపవలసివచ్చినది. దేశపరిపాలన మంతయును తప్పుదారింబడినది. జనులు ఒత్తుడుపడి పోయినారు. వాణిజ్యము నీరసించినది. చెల్లించుటకు సాధనముకనఁబడమిచే పన్ను లన్నియు క్రమక్రమముగా క్షీణించుదుస్థితిలోనికి వచ్చినవి. ” అని 1858 సంవత్సరమునాటి మిల్లుగారి బ్రిటిషుఇండియాలో 4 వ సంపుటము 7 వ ప్రకరణములో నున్నది.

అయోధ్యరాష్ట్రములనుండి ఈస్టిండియాకంపెనీవారిపాలనము క్రిందికి వచ్చినతొమ్మిదిసంవత్సరములలో కాశీరాజ్య మీస్థితికి వచ్చినది. మన మింకొకయడుగు పైకి వేసి అయోధ్యస్థితి యెట్లున్నదో యదియును విమర్శింతము.

బ్రిటిషువారికి మిత్రుడైనసూజఉద్దౌలా 1775 సంవత్సరమున మరణించె నని యిదివరకే చెప్పి యుంటిమి కదా! అతఁడు తనశత్రులయెడల కనికరములేనివాఁడును క్రూరస్వభావుఁడు నై యుండెను. కాని యతనిరాజ్యములోనిప్రజ లందరును కొదువలేమియు లేక శ్రీమంతులై సుఖముగానున్న వారు. అతనిపరిపాలన అంత్యదశయందు ఇంగ్లీషుఉద్యోగస్థులు అయోధ్యచూచినారు. వారే ఆదేశ మెంత సుభిక్షముగ నున్నదో జను లెంతస్వస్థముగ నున్నారో తెలుపఁగలరు.

అసాఫుద్దౌలాతండ్రి సింహాసనము నధిష్టించినపుడు వారన్ హే

స్టింగ్సు ఈస్టిండియాకంపెనీవారియధికారమును అయోధ్యపై వ్యాపింపజేసెను. సూజఉద్దౌలాతో జరిగిన పూర్వపుఒడంబడిక సవరణ యయ్యెను. అసాఫుద్దౌలాతో మరియొకయొడంబడిక జరిగెను. ఆయొడంబడికనుబట్టి అయోధ్య కంపెనీవారిక్రింద సామంతరాజ్యము కావలసివచ్చెను.

ఈభృత్యత్వము అయోధ్యపాడునకే. కొంతసైన్యమున కధినాథునిచేసి కర్నల్ హానీగారిని హేస్టింగ్సు అయోధ్యకు పంపెను. తనదేశీయు లందరివలెనే యీతఁడును తనకు తరుణము దొరకినపుడెల్ల తనయధికారబలముచేత శీఘ్రముగ విశేషధన మార్జింపవలెనని కాంక్ష కలిగియుండెను. మదరాసురాష్ట్రమునందును తదితరప్రదేశములయందును వినాశకరముగా నుండినభూమిపన్నులయిజారాపద్ధతియే యిచ్చటను ఉపయోగపఱచెను. అయోధ్యయందు హానీగారు సివిలుమిలటరీ యధికారములు రెండింటిని గూడ నుపయోగించి బారియచు, గోరకపురము పరగణాల నతఁడే యిజారాకు పుచ్చుకొనియెను. శిస్తులు వృద్ధిచేయఁబడెను. సొమ్మువసూళ్లు నిర్బంధించి వలసినన్నిదుండగము లొనరించి చేయఁబడియెను. ప్రజలు ఊళ్లను పొలములను విడిచి పారిపోయిరి. దేశము జనశూన్య మయ్యెను.

అసాఫుద్దౌలా తాను తెచ్చిపెట్టుకొనిన యీవినాశనమును చూచెను. 1779 సంవత్సరమున బ్రిటిషుదొరతనమువారికి ఉత్తరము వ్రాసెను. "కప్పులు మిక్కిలి వృద్ధియగుటచే పన్నులెక్కువబాకీ చేయఁబడినవి. ఏఁటేఁటను పన్నులకు లోటు వచ్చుచున్నది. జనులు దేశమును వ్యవసాయమును విడిచిపెట్టిపోవుచున్నారు." క్రొత్తసైన్య మేమియును అచ్చటికి పంపవలదనియును సైన్యముతో దనకేమియును పని లేదనియును అదియే తనపన్ను నష్టమునకు తనపరిపాలనావిషయమైనఅల్లరులకును కారణ మనియును నవాబు యెదుర్కొని వ్రాసెను.



కలకత్తాసభవారు ప్రాముఖ్యమైనయీయుత్తరమును గూర్చి నలుగురును కూడి ఆలోచన చేసిరి. స్వతస్సిద్ధముగ న్యాయదృష్టి గలిగిన ఫిలిప్పుఫ్రాన్సిసు మరల పేర్కొనఁదగినతనయభిప్రాయమును వ్రాసివేసెను.

"అన్యులసైన్యమును పోషించుభారమునుండి విడుదలచేయింపుడని స్వతంత్రరాజకుమారుం డొకఁడు వేడికొనియెను. అందు నిందాస్పద మయినదిగాని భయావహ మయినదిగాని యెద్దియును లేదు. వారిదేశమును సంరక్షించుచున్నా మనుమిష పెట్టి అతనిదేశముపై వచ్చెడునాదాయమును దేశమును గూడ మ్రింగివేయుచున్నాము. ఇట్టియలవాటులు చిరకాలాభ్యాసము లేకపోవుటచే సాకింకను పట్టువడలేదు

"1775 సంవత్సరముడిశంబరు 15 తేదీగలయుత్తరమున కంపెనీడైరక్టరులు "సుబా" మనస్ఫూర్తిగ నంగీకరించెనేని, ఆతనినౌకరీలో నొకసైన్యము నుంచుఁడని యనుమతి యిచ్చినారు. కాని యాతఁడొప్పుకొనకుండిన నట్లు చేయు మనలేదు.

"అయినను ప్రస్తుతపుతగాదా యీసైన్యభాగమునుగూర్చి కాదు. వజీరు ఆసైన్యమును వెనుకకు రప్పించుకొనుఁడనికోరుట లేదు. మేజర్ హానీ, కెప్టన్ఆస్‌బరన్ అనువారి అధిపత్యమున నున్నచరసైన్యము నొకదానిని గూర్చియు, స్వతంత్రదళ నొకదానిని గూర్చియు మాత్రమే ఆతఁడు తగాదాపెట్టుచున్నవాఁడు. చరసైన్యము తనదొరతనమున కేవిధమయినయుపయోగమునను లేకపోవుటయే కాకుండ తనపన్నులకును సుంకములకును విశేషనష్టము కలిగింప కారణమగుచున్నదనియనుచున్నవాఁడు. రెండవది తనప్రభుత్వవిషయమున నల్లరి కలుగరా

దనియును వారొకరికి లోఁబడి యుండువారు కారనియును నొక్కి చెప్పుచున్నాఁడు.

"ఇప్పుడీవాదమువలన మన మాతని సీదడములవెచ్చ మంతయును భరింపుఁడని నిర్బంధించు టొక్కటియె కాక ఆదడముల కియ్యవలసిన జీతములకై పన్నులను గూడ మనమే వసూలు చేయవలెనను చున్నాము. ఇప్పుడు జరుగుచున్న యేర్పాటులనుబట్టి చూచినచో ఆతని దేశము నంతయును సైన్యాధికారమునకు లోఁబరచి యుంచుట యని తేలుచున్నది. ఇట్లొకయవసరమునుబట్టి మరియొకటి బయలుదేరుచున్నది. ఇయ్యది యీహిందూరాష్ట్రములయం దేమేని మిగిలి మనయాశలకు చోటున్నంతవరకును లేదా మనయాశలన్నియును తీరువరకును ఈరెండునుగాక యితరులకు న్యాయము చేసినయెడల అయ్యది మనకు గూడ లాభకరమైనపనియే యనువివేకము మనయనుభవమువలన నేర్చుకొనుపర్యంతమును సాగుచుండవలసినదే." అని 1783 సం॥రములోని సెలెక్టుకమిటీరిపోర్టులో నున్నది.

వారన్ హేస్టింగ్సుగారికన్నులకు అయోధ్యలోని ప్రజలు పడుకష్టములకంటె నీసైన్యము నచ్చటినుండి మరలించినందువలన కంపెనీవారిపైఁబడుద్రవ్యనష్టము హెచ్చుగ కనిపించినది. నవాబు కంపెనీవారిక్రింది సామంతరాజనియును ఈసైన్యమున కయ్యెడుకర్చు అదనముగా వచ్చి కంపెనీవారిపైఁబడుననియును అది వారిపై మోపక సైన్యములను మరలింపరాదనియును ఆతఁడు వాదించెను. జేమ్సుమిల్లు అనుహిందూదేశచరిత్రకారుఁ డీవిషయమై యిట్లు వ్రాసెను. "ఇంగ్లీషువారు ఏవిధమైనహక్కును లేకుండగ నబాబును తమసైన్యములమేపుమనుట కేవలమును తమయుపయోగమునకు తప్ప మరి యెందులకును కాదు. అందులకై హేస్టింగ్సుగారు చెప్పినట్లు రాజును తమసామం



తునిగా నెంచి ఆతనికిని ఆతనిదేశమునకును తామె యాజమాన్యమును వహించి ప్రభుత్వపుహక్కు లన్నియును గ్రహించి వాని నమలుజరిపిరి."

1780 సం॥రమున బ్రిటిషుగవర్నమెంటువారు తమకు రావలెనని కోరినది 1,40,00,000 రూపాయిలు. గవర్నరుజనరలుగా రెట్లు లక్ష్మణపురమునుండి బ్రిస్టోగారిని వెనుకకు రప్పించి రెసిడెంటుగా మిడిల్టన్‌గారిని పంపినదియు, కంపెనీగవర్నమెంటువారి కియ్యవలసినసొమ్ముకొరకై అయోధ్యబీగము లైన నబాబుగారితల్లిని ముత్తవను, దోపించుట కెట్లుసాయము చేసినదియు, మిక్కిలి పీడాకరముగను, మిక్కిలి నీచముగను ప్రవర్తించి యెంతద్రవ్యము అచ్చటినుండి బలిమిని దోచుకొనినదియు, కేవల చారిత్రాంశము లైయున్నవి. అవి యిట నుడువ పనిలేదు. రాజకుటుంబమునకు గలిగినయీలోపములను గూర్చిన నాటకకథకన్న అయోధ్యలోని వ్యవసాయదారులస్థితిగతు లెట్లున్నవో, అది తెలుపుట యీగ్రంథమున కెక్కువయుపచరించునది యైయున్నది.

పేదపడియున్న రైతులవద్దనుండి పన్ను లెట్లు వసూలు చేసెనో దానినిగూర్చి వారన్ హేస్టింగ్సుపై మోపఁబడిన ప్రఖ్యాతమగు నభియోగము విచారణమైనపుడు తెలుపఁబడినవి. ఆవిషయములు పూర్ణముగ దుఃఖకరమైనవై యున్నవి. ఆతనిపై బాకీదారులను బోనులలో బెట్టి బంధించి రను నేరము మోపిరి. హిందూదేశమున బోనులలో పెట్టించుట నిర్బంధించుటకాదని వాదించిరి. తండ్రులు బిడ్డల నమ్ముకొననిర్బంధపెట్టి రని చెప్పఁబడియెను. అట్టియమానుషవిక్రయముల కుత్తరవిచ్చినది కర్నల్ హానీగా రని బదులు చెప్పిరి. జనులు తండోపతండములుగ గ్రామములను విడిచియు, దేశమును విడిచియు, పారిపోయిరి. వారు పారిపోకుండ సైన్యములను బంపిరి. తుదకు జను లెల్లరును తిరుగఁబడిరి. దుస్సహమైన యీవసూళ్లకు తాళలేక యిజారాదార్లును సేవ్యగాండ్రును వ్యతిరేకిం

చిరి. అందుపై పొలము దున్నుకొని బ్రతికెడి (ఏమియుచేతగాని) వాండ్రపై బడి చెలరేగినసిపాయీలు ఘోరకృత్యములను గావించి మృత్యుముఖమునఁ బడవైచిరి.

అయోధ్యనుండి కర్నల్ హానేగారిని పిలువ నంపిరి. తిరుగబాటు తగ్గిపోయెను. కాని అయోధ్య ప్రజాశూన్యమై పాడుపడి యుండెను. 1774 సం॥రమునను 1783 సం॥రమునను కెప్టన్ ఎడ్వర్డు అనునాతఁడు అయోధ్య చూచెను. మొదటిసంవత్సరమున చేతిపనులు, వ్యవసాయము, వాణిజ్యము, దేశ మంతయు విజృంభించి యున్నట్టు కనిపెట్టెను. రెండవమారు దేశ మంతయు పాడుపడి ప్రజాశూన్యమై యుండుట కనుగొనెను. "హోల్టు" అనునాతఁడు కూడ అయోధ్యయొక్క పూర్వస్థితి చెడిపోయిన దనియును, పట్టణములు, పల్లెటూళ్లు, అన్నియును జనశూన్యము లైయున్న వనియును, దేశము క్షామమువాతఁ బడినజాడలు కనఁబడుచున్న వనియును చెప్పెను. 1784 సం॥రమున భీకరమైన క్షామ మొకటి దేశమున సంభవ మయ్యెను. దుష్పరిపాలనాపీడకును, యుద్ధములబాధకును తోడు తిండిలేమిబాధకూడ యొకటి వచ్చి చేరెను.

ఈస్టిండియాకంపెనీవారిదారుణధనాకర్షణయును, వారిరాష్ట్రమునకు వచ్చి చేరెడుక్రొత్తరాష్ట్రము లన్నిటిలోను ప్రజలు పొందెడి విపత్తులును, 1773 సం॥రములో జరిగిన రెగ్యులేటింగుఆక్టు తగినసంస్కారములను చేయలేక పోవుటయును, 1782-1783 సం॥రములలో ప్రచురింపఁబడిన, ఆరురహస్యపుకమిటీరిపోర్టులమూలముగను, పదునొకండుసెలెక్టుకమిటీరిపోర్టుమూలముగను, బ్రిటిషుపార్లమెంటువారికి విశదీకరింపఁబడినది. పరిపాలనావిషయ మైనసంస్కారమునకై మొరలెత్తుచుండిరి. పాక్సుగారు, ఇండియాబిల్లు నొకదానిని పార్లమెంటువారి



యెదుట పెట్టిరి. దానిని బర్కుగారు బలపరచిరి. పార్లమెంటువా రంగీకరింపలేదు.తుదకు 1784 సంవత్సరమున పిట్టుగారుహిందూదేశపుమేలిపరిపాలన మనుపేర బిల్లు పెట్టి చట్టమునుచేయించిరి. అందువలన కంపెనీప్రభుత్వ మంతయును రాజుగారియధీనములోనికి వచ్చెను. సివిలు, మిలటరీ, రివిన్యూ వ్యాపారము లన్నియు ఆర్గురు కమీషనర్లయాజమాన్యమునం దుంచఁబడియెను. ఈకమీషనర్లు రాజుగారిచే నియమింపఁబడిరి. మరుచటిసంవత్సరమున వారన్ హేస్టింగ్సు తన ప్రభుత్వమును వదలివేసెను. సత్ప్రవర్తనము కలిగినట్టియు దాక్షిణ్యస్వభావము కలిగినట్టియు, ఉదారపురుషుని కారన్ వాలీసుప్రభువును ఇండియాకు గివర్నరుజనరలుగాఁ బంపిరి.

వారన్ హేస్టింగ్సుగారిదొరతనమునుగూర్చి సంగ్రహముగా వ్రాయఁబడినయీభాగమునందు జనులయొక్క యార్థికస్థితినిగూర్చి మాత్రమే వ్రాయవలె నని పట్టు పట్టి యట్లు వ్రాసితిమి. ఈవిషయమునుబట్టి చూచినచో పక్షపాతము లేని చరిత్రకారు లందరివలెనే అతనిపరిపాలనము బాగుగ లేదని విచారింపవలసినవార మైతిమి. "టార్న్‌మత్" ప్రభువను పేరుపొందిన షోరుగారు 1789 సంవత్సరమున వారన్ హేస్టింగ్సుగారిపక్ష మవలంబించి న్యాయముగ చెప్పిన యీక్రిందివాక్యములుకూడుత్తి వ్రాయుట యవసర మైయున్నది.

"కంపెనీవారి కీరాష్ట్రములలో చాలాభాగము పన్నులువసూలు చేయుహక్కులతో దఖలుపడి యిప్పటికి ఇరువదియెనిమిదిసంవత్సరము లైనది. దివానీపదము నొసంగుటమూలముగ రాష్ట్రమంతయును స్వాధీనమై యిప్పటి 24 సంవత్సరములుమాత్రమే యైనది. ఈసంపాదనముయొక్క ప్రకృతి యెట్టిదియో, దానివిస్తీర్ణ మెంత యున్నదో మనరాజ్యాధికారములకు లోఁబడిన ప్రజలనడవడి యెట్టిదియో, వారి వారియా

చారములకును వేషభాషలకును ఎంతెంతభేదము కలదో,దానిపూర్వపు
రాజ్యాంగపద్ధతుల మొగమైన యెరుంగకుండ ఆదేశపు యేలుబడి మన
పై నెట్లు పడినదో, ఆసియాఖండమునందలి రాజకీయద్రవ్యవిషయ మై
న వ్యాపారములయందు మన కెంత తక్కువ యనుభవ మున్నదో, ఇవి
యన్నియు యోచించి చూచితిమేని, మన మిట్టి తప్పులలో పడిపోయినా
ర మని కాని, అట్టిలోపము లేవేని యిప్పుడు సవరణ కావలెననుట గా
ని ఆశ్చర్యకర మైనసంగతిగా నెంచ వల్లపడదు." అని 1812 సంవత్సర
ములోని సెలెక్టుకమిటీ 5 వ రిపోర్టులో నున్నది.

ఈమాటలయందు యథార్థ మెంతయైన నున్నది గాని, ఇందు
చాలభాగము వారన్ హేస్టింగ్సుకాలమునాటి, మరి యితరఆంగ్లేయుల
కెవ్వరికైన వర్తించిన వర్తించునుగాని, హేస్టింగ్సునకుమాత్ర మయ్యా
వి విశేషముగ వర్తింపవు. వారన్ హేస్టింగ్సు హిందూదేశమునకు
క్రొత్తవాఁడు కాఁడు. ఆదేశజనుల నాతఁడెరుగనివాఁడు కాఁడు. ఇం
డియా కాతఁడుచిన్నతనముననే వచ్చెను. ఆతఁడు మొదటిరోజులలో
మిక్కిలి చిన్నయుద్యోగమం దుండినవాఁడు.జనులతో కలసిమెలసి యుం
డెడివాఁడు. వారిగుణాగుణము లెట్టివియో ఆతఁడు పూర్ణముగపరిశీలిం
చి కనిపెట్టినాఁడు. ఇండియానుండి విశ్రాంతికొనిన పిదప 28 యేండ్ల
కు బ్రిటిషుపార్లమెంటువారియెదుట "హిందూదేశప్రజలు దుర్నీతిదో
షమున బడియున్నవా రని వారినిగురించి మీరు చెప్పుసంగతులు అస
త్యము లనియును వాని కాధారము లేవియును లేవనియును, నేను
ప్రమాణముమీఁద చెప్పఁగలను. వా రందరు సాధులు, దయాశీలురు,
వారికి చూపినదయకై వారికి కృతజ్ఞతయేకాని వారి కపకారము చేసి
తి మను పగ యింతైనను కలవారు కారు. ప్రపంచమునందలి యిత
రజాతివారు మానుషధర్మము లగుమనోవికారముల కెంత వెలియై యుం



దురో వీరును అట్టివారలే అయి యున్నవారు." అని వాక్రుచ్చెను.
1750 సం॥రము మొదలు 1785సం॥రమువరకు ఆతఁ డేదో కొలఁదికొ
లఁదికాలములలోతప్ప ముప్పదియేండ్లు ఇండియాయం దుండి వారిగుణ
లక్షణము లెరింగి కలసిమెలసి పనిచేసినజనులు కాని వా రన్యులు కారు.

వారన్ హేస్టింగ్సు ఇండియాయందు ఆతఁ డొనరించినజనోప
యోగ మైనకార్యములనుబట్టి చూచిన ఆతఁడుప్రజలయం దంతమంచి
యభిప్రాయము లేనివాఁడునుకాఁడు. దైశికవర్తకమున బంగాళాదేశ
ప్రజలను దోచుకొని శీఘ్రముగా విశేషద్రవ్యము సంపాదింపవలె నని
కంపెనీనౌకర్లు పూనుకొనినపుడు తనదేశీయులదుష్కార్యముల ప్రతిరోధిం
చుటకై వారన్ హేస్టింగ్సు ఒక్కఁడే నాయకుఁడై "వాన్సిటార్టు"పక్షము
న ధైర్యముతో నిలఁబడెను. 1772 సం॥రముమొదలు 1785 సం॥ర
మువరకు నాతఁడు పరిపాలనమునుస్వీకరించిన పదుమూఁడుసంవత్సరముల
కాలము నందు సైతము అల్లరిగా నుండుప్రభుత్వమును కట్టుదిట్టములలో
మంచ ప్రయత్నించెను. హిందూమహమ్మదీయధర్మశాస్త్రముల ఏక
ముఖము చేసి ప్రచురించెను. ఆధర్మశాస్త్రములను పరిపాలింప న్యా
యస్థానముల నేర్పరచెను. ఆతఁ డేర్పరచినపరిపాలనాపద్ధతియె యిప్ప
టివరకును నభివృద్ధిచేయఁబడుచున్నది. దీనివిషయమై యాతఁడే ప్రాథ
మికుఁడైన గొప్పశిల్పి యని చెప్ప నొప్పును.

అవయవనిర్మాణశక్తి యం దంతటివైశద్యము గలిగియున్నపుడు
ను, దేశమునుగూర్చియును, ఆప్రజలనుగూర్చియును చక్కనిపరిజ్ఞాన
ము కలిగియున్నపుడును, అట్టివానికాలమున ప్రజాపరిపాలనము ఉచ్చ
దశ నొంది జయప్రదముగ పని జరుగవలె నని స్వభావసిద్ధముగ జను
లందరును తలంచుచుందురు. జనులు పొందెడిసౌఖ్యమునుబట్టియె దొ
రతనముయొక్క బాగోగులు పరీక్షింపవలసివచ్చునేని వారన్ హేస్టింగ్సు

యొక్క పరిపాలనమంత చెడ్డది మరియొకటి లేదనియే చెప్పవలెను. బ్రిటిషువారి అధికారజ్వాలము వ్యాపించినందువలన జనులయార్థికస్థితి అభివృద్ధి పొందలేదు సరికదా బంగాళము, బీహారు, ఒరిస్సా, ఈదేశములం దెచ్చట చూచినను అనేకములైన కాటకములు తిరుగబాటులు మొదలగు ననర్థచిహ్నములే గాఢముగ నిలిచియుండెను.

ఇప్పటి కీస్థితి గడచి నూరుసంవత్సరములైయుండుటచే ఈదుస్థితికి వాస్తవములైన కారణము లేవని చల్లగ యోచించి తెలిసికొనవచ్చును. హిందూదేశము, ఈస్టిండియాకంపెనీవారికిని వారినౌకర్లకొరకును ఏర్పడిన గొప్ప జాగీరనియెడు విరుగుతరుగులేనినమ్మక మొకటి ఆకాలమునాటియితర ఆంగ్లేయులందరివలెనే యాతనికిని పట్టువడినది. ఆకారణమున తనమనోశక్తిని యావత్తును ధారవోసి ఇండియానుండి బాగుగ రాబడి వచ్చుమార్గమును చూచెను. కంపెనీదొరతనము మొదటికార్యముగను జనులయోగక్షేమములు వానికి నలయుసాధనములుగను భావింపబడెను. రాజులహక్కులును ప్రజలహక్కులును, జమీందారులహక్కులును, రైతులహక్కులును, వర్తకమే ప్రధానాశయముగ గలిగిన హిందూదేశపరిపాలకుల నిరాటంకమగునీసంకల్పమునకు బలిపెట్టబడెను. 1770 సం॥రములో కలిగిన కాటకములో బంగాళాదేశములోని మూడవవంతుజనము తుడిచిపెట్టుకొని పోయెను. అట్టిసమయమున భూమిపన్ను వృద్ధి చేయబడెను. అనేకవందలసంవత్సరములనుండి హక్కుగా అనుభవించుచున్న భూస్వాముల కుటుంబములు, ఋణదాతలకును వ్యవహారము చేయువారికిని వ్యతిరేకముగ, యేటేటయిజారాలకు పాడుకొనవలసినవారైరి. ఇండ్లును, ఊళ్లును, కూడ వదలిపెట్టి పారిపోయెడువ్యవసాయదారులను, కడుపు మండి తిరుగబడెడుకాపువాండ్రను సిపాయిలు దారుణకార్యము లొనరించి వెనుకకు మరలించు



చుండిరి. ఈవిధముగ పోగుచేయబడిన ధనము యేటేటను ఇంగ్లండులోని సంతృప్తులగుభాగస్వాములకు పెట్టుబడిరూపకముగ పంపబడుచుండెను. పరిపాలకు లెంతటి తెలివితేటలుగలవారైనను పరిపాలనమెంత పరిపూర్ణమయిన దైనను, ఒకదేశములోని యాధారములు మరియొకదేశములోనివర్తకులనిమిత్తమై సంతతధారగా తోడివేయబడుచున్నపుడును ఆర్థికనీతి అందుల కనుకూలముగ నున్నపుడును జాతీయదారిద్ర్యములును, జాతీయక్షామములును ఎట్లు లేకుండ పోవును?

వారన్ హేస్టింగ్సుగారి పరిపాలనము జయప్రదముగ పనిచేయకపోవుటకు ఇదియే ముఖ్యకారణము. ఆతనికాఠిన్యసాధనములును, నిరంకుశప్రభుత్వమార్గములును, యుక్తాయుక్తవివేచనాశూన్యములగుపరిపాలనాపద్ధతులును, ఈయనర్థకముల మరింత యుద్రేకింపజేసెను. హిందూదేశప్రజలు తమదేశము నంతను దారిద్ర్యదశకు తెచ్చినవారన్ హేస్టింగ్సుగారిపరిపాలనము తలంచుకొనునపుడు గుండెలుపగిలి యెంతోవేదనపడుచుందురు. అతనిపరిపాలనకొప్పగించిన అసంఖ్యాకులగుప్రజలక్షేమాభివృద్ధికై పాటుపడి, వారియెడల దయాదాక్షిణ్యములు కలిగి, యాతనిస్థానీయుడై మిగులధైర్యముతో పనిచేసిన కారన్వాలీసుప్రభువు పరిపాలనముం గాంచిన యెంతయో కృతజ్ఞతం జూపుదురు.



# హిందూదేశార్థికచరిత్రము.

## అయిదవప్రకరణము.

### కారన్‌వాలీసుప్రభువు బంగాళాదేశమునందలి శాశ్వతపుసెటిల్‌మెంటు.

(1785–1793)

1784సంవత్సరము ఆగష్టు 13 తేదిని పిట్టుగారి ఇండియాబిల్లు చట్టమయ్యెను. అందువలన కంపెనీపరిపాలన మంతయును ప్రభుత్వమువారి పరమయి కొన్ని సంస్కారములను చేయవలసివచ్చినది. కంపెనీడైరక్టరులు తమవ్యాపారములను సరియైనమార్గముల నడిపింపవలసివచ్చినది. మంచి సత్ప్రవర్తనము గలిగినట్టియు,విపులమయిన యనురాగము కలిగినట్టియు,గొప్పవంశికు నొకని వారన్‌హేస్టింగ్సునకు తరువాత పరిపాలకునిగ నేర్పరచిరి. 1786సంవత్సరము ఏప్రియలు 12 తేదీగలయుత్తరమున యీక్రొత్తగవర్నరుజనరలుగారగు కారన్‌వాలీసుప్రభువు ముందు నడుచుకొనవలసిన విధులన్నియు,పూర్ణముగ నుదహరించిరి.

సంస్మరణీయమయిన యీయుత్తరమున బంగాళాదేశమునందలి పన్నులపద్ధతిలో పదేపదే కలుగుచున్న మార్పులపద్ధతి తమకంగీకారము లేదనిరి. జాగరూకతగల యాజమాన్యముక్రింద యేదో యొక స్థిరపద్ధతి యేర్పాటయియుండుట వారియభిమతమని తెలిపిరి. భూమిపన్ను లెడతెగకుండ వృద్ధిచేయబడవలెనను కోరికలు నిషేధించిరి. జమీందారులనుతొలగించి రైతుల యోగక్షేమమునందు శాశ్వతమైనయభిమానము లేనియిజారాదార్లకును,సాజావాలాలకును,అమీనులకును భూముల నీయకూడదనిరి. సహేతుకమైన నిబంధనలు కొన్నిటి నేర్పరచి, వానిననుసరించి శాశ్వతమగు సెటిల్‌మెంటు చేసినయెడల ఇప్పుడు వచ్చుచున్న పన్నుల సంగ్రహించుట సంభవింపవేర దనియు భూములయందు వారసత్వపుహక్కులను కలుగచేసినయెడల పన్నులుసరిగా చెల్లుచుండు ననియు,అట్లు చెల్లుచుండుట కిది యొక్కటియే మేలిమార్గమనియు తమయభిప్రాయమనిరి. వీలయినచోట నెల్ల ఈసెటిల్‌మెంటు జమీందారులతోడనే జరుగవలె ననియును,మితముగ నేదో యొక శిస్తు నేర్పరచి,ఆశిస్తు నియతముగ వసూలుపరచిన యెడల అయ్యది మనకు లాభకరమును, దేశవాసులకుసుఖకరమును, భూస్వాములకు రక్షకమును,అగుననియు,హెచ్చుగ పన్నులు కట్టి,అవిపూర్ణముగా వసూలు కాకపోవుటచే,ప్రజలను బాధించియు, వారినిదోరించియు,శ్రమకలుగచేయుట మానవధర్మము కాదనియు నుడివిరి. సెటిల్‌మెంటు ఎప్పటికిని మారకుండవలెనను ఆశయము కలవారయ్యెను మొదటి సెటిల్‌మెంటు మాత్రము పదిసంవత్సరములకు మాత్రమే యుండవలె ననుట వారియభిమత మయ్యెను. 1776 సంవత్సరమునందు ఫిలిప్పుఫ్రాన్సిస్సు చేసిన వ్యవహారోచితము లగునుపదేశము లన్నియును పదిసంవత్సరముల లోపలనే యెట్లు ఫలవంతము లయ్యెనో మనచదువరు లందరును 1786 సంవత్సరమున డైరక్టర్ల యుత్తరసంగ్రహమునుబట్టి తెలిసికొనవచ్చును. పదిసంవత్సరము లనుభవ మయినతరువాత బంగాళాదేశమునందలి ప్రజలు పడుబాధలను చూచి హేస్టింగ్సుదొరగారు చేసిన కఠినములగునట్టియు, నిమిషనిమిషమునకును మార్పులను చెందునట్టియు, పద్ధతుల యవివేకమును కనిపెట్టి,ఫిలిప్పుఫ్రాన్సిసుగారి యుపదేశములు చక్కగా ను

న్నట్టులెంచి అప్పటికి వానిని ఆలోచనలోనికి దెచ్చిరి.

ఈక్రొత్తపద్ధతి నమలులో పెట్టుటకు ఏర్పరుపబడిన యాతడు ఆపనికి తగిన యాతడే యై యున్నాడు. హిందూవ్యాపారములనుగూర్చి వారన్ హేస్టింగ్సునకు వివరముగా తెలిసినట్టు కారన్ వాలీసునకు తెలియదుగాని తాను పరిపాలనము చేయవలసిన ప్రజలయందు నిజమైన యభిమాన మీతనికి స్వతస్సిద్ధముగానే యుదయించి యుండెను. స్థానికానుభవము విశేషముగ కలిగియున్నను అభిమానము శూన్యమైన యెడల పరిపాలకులు తమకార్యములను నిర్వహింప లేకపోవుటయును, ప్రబలమై దయాస్వరూపం బగునభిమానము గలిగియున్న పరిపాలకులు జయప్రదముగ పనిచేసుకొనిపోవుటయు, హిందూదేశచరిత్రమునం దనేకపర్యాయములు కనిపించుచుండును. అందువలననే ఆంగ్లేయ హిందూపరిపాలన మైరోపాఖండమునందలి రాజకీయ వ్యవహార విషయములను బాగుగ తెలిసినవాని కొప్పగింపబడవలసివచ్చినది. ఈవిషయము పదునెనిమిదవ శతాబ్దమునం దనుభూతమైనట్టులె యిప్పటికిని అవసరమైనట్టుగా కన్పట్టుచున్నది.

ఇండియాకు చేరినపిదప కారన్ వాలీసుప్రభువు మామూలుగా భూములు సాగుచేయుపద్ధతులను శిస్తులను వీనినిగురించిన విచారణ చేయకయె పదిసంవత్సరముల సెటిల్ మెంటు చేయుట అసాధ్యమని కనిపెట్టి యందులకయి పట్టుదలగా విచారణలు జరిగించెను. రివిన్యూకమిటీ యనునది యిదివరకే రివిన్యూబోర్డను పేర మార్చబడి అంతకు పూర్వ మాకమిటీలో నున్న యధికారములే చెలాయించుచుండెను. కలెక్టరీయుద్యోగమును జడ్జీపనియు మేజస్ట్రీటుపనియు కూడకలిపి ఐరోపియను సివిలు యుద్యోగస్థునకు ఒక్కనికే యియ్యబడుచుండెను. క్రిమినల్ ఫిర్యాదుల పరిష్కారములుమాత్ర మింకను బంగాళాదేశపు డి



ప్యూటీ నవాబు అధికారమునం దుండెను. ఆకోర్టునకె ఇంగ్లీషుమేజస్ట్రీటు లందరు పెద్దపెద్ద నేరములను విచారణకు పంపుచు వచ్చెడివారు.

1790 సంవత్సరమున పరిపాలనమునందు విశేషమైన మార్పు కలిగెను. అన్ని రాష్ట్రములయందు నుండెడి క్రిమినల్ తగాదాల పరిష్కారములన్నియును, గవర్నరుజనరలు సభవారు తనిఖీచేయుట కంగీకరించిరి. ప్రధానమగు క్రిమినల్ కోర్టు అంతకుమున్ను మూర్షదాబాదునం దుండెడిది. అది యిప్పుడు కలకత్తాకు మార్చబడినది.

దేశాటనముచేయు కోర్టులు నాలుగు ఏర్పాటు చేయబడి,అవి యిద్దరు “కవినెంటెడ్డు” ఉద్యోగస్థులపై తనిఖీకి లోబడియుండుటకును, మేజస్ట్రీటుల యధికారమునకు మించిన నేరము లన్నియు వీరువిచారించుటకును ఏర్పాటై పనిచేయసాగెను. సివిలు,క్రిమినలు,రివిన్యూ డిపార్టుమెంట్లు రిగ్యులేషను లన్నియును సవరణచేసి ఇంగ్లీషుభాషయందును, ఇండియను భాషలయందును అచ్చువేయబడెను.

1793 సంవత్సరమున మిగిలిన పరిపాలనాసంస్కారములును ధర్మపాలనాసంస్కారములును జరిగినవి. కార్యనిర్వాహకవ్యాపారమును ధర్మపరిపాలనావ్యాపారమును విడదీయబడెను. రివిన్యూకేసులయందు రివిన్యూబోర్డువారికిని జిల్లాకలెక్టరులకు నుండెడు ధర్మవిమర్శనాధికారములు తీసివేయబడెను. కలెక్టరులకుండు మేజస్ట్రీటు అధికారముకూడ తప్పింపబడియెను. కలెక్టరుకన్న పెద్దయుద్యోగపదవిగల “కవినెంటెడ్డు” ఆఫీసరొకనికి ప్రతిమండలమునందును జిల్లాజడ్జీపనియును మేజస్ట్రీటుపనియును కూడ ఈయబడెను. ఆమండలమునందుండెడు పోలీసువారిపై యధికారముకూడ నీతనియందె యుండెను కలకత్తా, పాట్నా, డక్కా, మూర్షదాబాదా, పట్టణముల నాల్గింటియందును నాలుగు అప్పీలుకోర్టు లేర్పాటుచేయబడెను.

మైసూరుదేశమునందు టిప్పుసుల్తానుతో తటస్థమైన యుద్ధములో కారన్‌వాలీసుప్రభువు స్వయముగా కార్యభారమును పూనవలసివచ్చెను. మైసూరుదేశమునందలి ముఖ్యపట్టణమునకు తనశక్తిచే కారన్‌వాలీసుప్రభువు చొరుచుకొనిపోయి, ఆసుల్తానుతో 1792 సం॥రమున తనయిష్టమువచ్చిన షరతులతో సంధి యొనర్చెను. బ్రిటిషువారికి ఇప్పుడు కాలికట్టు, కొడగు దేశములు పశ్చిమమునను, బారామహాల్ జిల్లా తూర్పునను లభించెను. 1792 మొదలు 1799 సం॥రమువరకు యీబారామహాల్ జిల్లా రివిన్యూసెటిల్‌మెంటు చేయుటకై సర్ థామస్ మన్రో నియమింపబడెను. మదరాసురాష్ట్రమున రివిన్యూఉద్యోగస్థులలో పేరును ప్రతిష్ఠయును వచ్చినది ఈమన్రోగారి కిక్కడ లభించిన జయప్రదమయిన అనుభవమువల్లనే.

బంగాళాదేశమున రివిన్యూవిచారణలు త్వరత్వరగా ముగింపబడుచువచ్చెను. "టాన్‌మత్" ప్రభువనుపేరు పొందిన షోర్ అనునాతడు 1889 సం॥రము జూన్ 18 తేదీని బంగాళారాష్ట్రములలోని భూముల శాశ్వతపు సెటిల్‌మెంటునుగురించి యొకయభిప్రాయమిచ్చెను. ప్రఖ్యాతమైన ఆయభిప్రాయమే తూర్పిండియాకంపెనీవారికిని కారన్‌వాలీసుప్రభువునకును సెటిల్‌మెంటుకు పునాదిగా నేర్పడెను. దానినిబట్టి క్రమశః విజృంభణముగ పనిజరిగెను. ప్రసిద్ధికెక్కిన ఆతని అయిదవ రిపోర్టును, దానినిబంధనలును, అనుభావములును, గలిసి దగ్గర దగ్గరగ ముద్రింపించిన డెబ్బదిపుటలుండును. మిక్కిలి సమర్థతతో లోటులేకుండ వ్రాసిన యారిపోర్టును సంగ్రహముగ నుదహరించుటకైనను మన యీకొలదిసంపుటమునకు అసాధ్యమైన పనియగును. కాని యాతడు చేసిన కొదువలేని విచారణలో తేలిన కొన్నియంశములు మాత్రము తెలియచేయుట యవసరమై యుండెను.



1582 సంవత్సరమున తోడర్‌మాల్ చేసిన రివిన్యూసెటిల్‌మెంటును, 1722 సం।రమున జాఫర్‌ఖాన్ చేసిన సెటిల్‌మెంటును, షోరుగారుదహరించుచు ఇట్లు వ్రాసిరి. "ప్రథమమున తోడర్‌మాల్ కాలమునకును జాఫర్‌ఖాన్ కాలమునకును నడుమ దేశమున వర్తకమునకు క్రొత్త యాధారములు కల్పింపబడుటచేతను మొత్తముమీద వర్తకము మునుపటికంటె వ్యాప్తమై యుండుటచేతను దేశమున విశేషముగా ధన మభివృద్ధి యైనది. అక్బరు పరిపాలనమున అరుదుగా నుండిన వెండి బంగారు నాణెములు తరువాత క్రొత్త క్రొత్త మార్గములను దేశమున కురిసినవి. ఇందులకు విరోధముగా జనులను పీడించి ద్రవ్యమును లాగెడిమార్గముల కొకమేర కల్పించిన రాజకీయపరిజ్ఞానమును మనము గారవింతుము. ఆదరించి కొనియాడుదుము. రాష్ట్రములోని ప్రజలు తమపరిశ్రమలవలనను తమస్వంత యేర్పాటులవలనను కలిగిన ఫలితమును వారే యనుభవించుటకు మన మంగీకరించుచుంటిమి."

తదుపరి షోరుగారు, సుజాఖాన్, అల్వరెడ్డీఖాన్, మీయర్‌ఖాసిమ్ గార్లచే చేయబడిన తరువాతి యభివృద్ధినిగూర్చి ముచ్చటించెను. ఆతని రిపోర్టుయొక్క చివర చేర్పబడిన యనుబంధమువలన బంగాళాదేశమునందలి భూమిపన్నులు ఏయేకాలమునం దెట్లున్నవి తెలియగలదు.

తోడర్‌మాల్ సెటిల్‌మెంటు సం॥ 1582—రు 1,06,93,152
(కాసులు 10,70,000)

సుల్తాన్ సుజా సెటిల్‌మెంటు సం॥ 1658—రు 1,31,15,907
(కాసులు 13,12,000)

జాపర్‌ఖాన్ సెటిల్‌మెంటు సం॥ 1722—రు 1,42,88,186
(కాసులు 14,29,000)

సుజాఖాౝ సెటిల్‌మెంటు సం॥ 1728—రు 1,42,45,561
(కాసులు 14,25,000)

1722, 1763 సంవత్సరములమధ్యను ఏవియో చిల్లరపన్నులు కొన్ని కట్టబడుచువచ్చినను మహమ్మదీయప్రభుత్వము ముగియువరకు భూమిపన్ను మొత్తము విశేషముగ మార్పు చెందలేదని దీనివలన తెలియవచ్చుచున్నది.

బ్రిటిషు పరిపాలనము ప్రారంభించుటకు ముందు వసూలైన పన్నులను తెలియచేయుచు షోరుగారు 1762 మొదలు 1765 వరకును 4 సం॥రముల మొత్తములను తెలియచేసెను. "ఇందు ప్రథమసంవత్సరము మియర్‌ఖాసిమ్ అను పేర బరగు ఖాసిమాలి యనునాతని కాలము. రెండు మూడు సంవత్సరములు మీర్జాఫరు అధికారమునకులోబడిన నందకుమారుని కాలము. 4 వ సంవత్సరము మహమ్మద్ రజాఖాౝ కాలము. ఇదియే దివాని ప్రారంభమైన ప్రథమసంవత్సరము."

| | | రూపాయిలు. కాసులు. |
|---|---|---|
| 1762-63 | సిసలుగా అయిన వసూలు | 64,56,198—6,46,000 |
| 1763-64 | ,, ,, ,, | 76,18,407=7,62,000 |
| 1764-65 | ,, ,, ,, | 81,75,533=8,18,000 |
| 1765-66 | ,, ,, ,, | 1,47,04,875=14,70,000 |

పూర్వపు మహమ్మదీయ ప్రభుత్వముతో పోల్చి చూచినయెడల బ్రిటిషుప్రభుత్వమువారి చిత్రమైన యార్థికలక్షణము దేటపడగలదు. అది యేమనిన దేశమునుండి ఏటేటను ద్రవ్యము వంచుకొనిపోవుటయే. ఇది విదేశపరిపాలకులవలన ప్రవేశపెట్టబడినది. ఈవిషయము షోరుగారు ప్రస్తావింపక మానలేదు. "కంపెనీవారు దేశమునకు వర్తకులుగను ప్రభువులుగను కూడ నున్నారు. మొదటి శక్తిచే వాణిజ్య మంతయు గుత్తగొని రెండవదానిచే పన్నులమూలమున వచ్చెడు ద్రవ్య మెల్లవారు స్వంతోపయోగము గావించుకొను చుండిరి. దేశమున గొన్న సరకులన్నియును పన్నులలో సొమ్ముబెట్టి కొని ఐరోపాఖండమునకుపంపుచుండిరి."



దేశమున సరకులకర్చు యెక్కువయగునేని సరకులు ఎక్కువగ తయారు కావలసివచ్చును. ఆకారణమున దేశములోని ప్రజలచేతిపనుల యభివృద్ధి హెచ్చును. అట్టిహెచ్చుఎంతయున్నను అందువలన వారికి కలిగెడులాభములకన్న విదేశప్రభుత్వముతో వెన్నంటియుండు చెడుగులే హెచ్చుగా నున్నవని యెంచతగియున్నది.

బార్నియరుగారి కాలము మొదలు దివానీపదము సంపాదనయగువరకు గల సమాచారమును దేనినిబట్టి చూచినను హిందూస్థానమునందలి పైప్రదేశములకును మోరోసంయుక్తాగ్రిగుడమునకును, పారసీకసంయుక్తాగ్రిగుడమునకును మలబారుతీరమునకును బంగాళాదేశమునకును జరిగిన దైశికస్వదేశవర్తకము విశేషించియున్నట్లు కనిపించుచున్నది. అందుకు బదులుగా పంపబడిన నాణెములును పరకులును విదేశపు ఐరోపాకంపెనీలవలన ఈసముద్రమార్గములనుండి వచ్చుచుండెను. నల్లమందునకు బదులు బంగారు రజము తూర్పుతీరమునుండి వచ్చుచుండెను.

"కాని 1765 సం॥రము మొదలు దీనికి కేవలవ్యతిరేకమైనమార్పు ప్రారంభ మయ్యెను. కంపెనీవాణిజ్యమువలన కలుగవలసిన ప్రతిఫల మేమియును కలుగుట లేదు. విదేశపు కంపెనీల నాణెము లేవియును దిగుమతియగుట లేదు, సరికదా హిందూదేశమునందలి యితరప్రదేశముల నుండియైన బంగాళాదేశమున కేమియును వచ్చుట లేదు."

"మొత్తముమీద దివానీపదము కంపెనీవారికి లభించిన తేదీ

మొదలు దేశమున చలామణీ యగుచున్న నాణెములసంఖ్య విశేషముగ తగ్గిపోయిన దనియు, నీతగ్గిపోయిన దానిని తిరుగ పూర్తిచేయు దిగుమతీమార్గములు చాలభాగము కట్టిబడిపోయిన వనియును, చీనాదేశమునకును, మదరాసు, బొంబాయి దేశములకును గావలసిన సొమ్మును సప్లయిచేయు నవసరమును బట్టియు, అయిరోపాఖండవాస్తవ్యులు ఇంగ్లండుదేశమునకు చేయు నెగుమతీని బట్టియు, దేశమునందలి వెండి యంతయును, పూర్తిగ కర్చుపడువరకు నిదెజరుగుచుండు ననియును నే నిస్సంశయముగ చెప్పగలను.”

వెండి, దేశమునుండి తరలిపోవుటను గురించియే షోరుగారు ముఖ్యముగా వివరించినట్టు దీనినిబట్టి తెలియగలదు. ఆదమ్స్మిత్తుగారి కాలమునకు పూర్వము మేలగు నాణెములే యీదేశపునైశ్వర్యముగా నెన్నబడుచువచ్చెను. కాని యతడు బలముగా వివరించిన క్షయ మనెడునది నిజముగా జనులయొక్క యైశ్వర్యము, పంటలు, ఆహారము వీనియొక్క క్షయములు కాని వేరొకటికాదు.

బంగాళాదేశమునందు మూడువిధములగు సెటిల్మెంటున్నది. ఒకటి రైతులతో చేయబడునది. రెండవది రైతులకును దొరతనమువారికిని నడుమ యిజారాదార్లతో చేయబడునది. మూడవది జమీందార్లతో చేయబడునది. ఈమూడుపద్ధతులనుగూర్చి చర్చించుచు దేశముయొక్క యభివృద్ధియు దొరతనముయొక్క మంచితనమును గూడి రావలసివచ్చునెడల ఇందు మూడవదియే శ్రేష్ఠతమమైన దని నిష్కర్షగ ఋజువుచేసెను.

“భూమియందలి హక్కు జమీందారులకు చెందియున్నటుల మన మొప్పుకొని యుంటిమి...............హక్కుమాత్రమే యొప్పుకొని దానివిలువ యభివృద్ధి కాగల మార్గముల ననుసరింప కుండినయెడల దేశముయొక్క యభివృద్ధికి లేశమును ఉపయోగకారి కానేరదు. మనదొరతనమువంటి విదేశీయదొరతనము కట్టెడుపన్నులు స్వదేశీయ పరిపాలకులు కట్టెడుపన్నులకన్న నిశ్చయముగ నెక్కువ మితముగ నుండవలయును. మనకుండెడునది శాశ్వతముగా నుండుటకై మనకట్టెడిపన్ను ఇంత యని నిసబు చేయవలయును. మనదొరతనము వారి యాధిపత్య మెక్కడనో యొక యర్ధగోళము దూరము నందున్నది. అగత్యమైన యధికారమునకు లోటులేకుండ చేసి ఇండియాప్రభుత్వమునకు వలయు నిర్బంధము లన్నియును వ్యవహారయోగ్యముగ నుండునట్టు లుంచవలెను. నిర్బంధములు లేని యాధిపత్యమువలన కలిగెడు మార్పులకు లోనుగాకుండ దేశవాసుల యాస్తులను కాపాడవలయును.’’



జమీందారులకు వచ్చెడు నాదాయములో నూటికి తొంబదివంతున దొరతనమువారి పన్నులేర్పరుపబడెను. మిగిలిన దశాంశముతోడనే జమీందారులు తృప్తినొంది క్రమక్రమముగా వారివారి జాగీరులను వృద్ధిచేసి కొందురని యాపన్నుకట్టెడివారి యాశయమైయుండెను.

“జమీందారులకు వచ్చెడు నాదాయమువలనవారిప్రజలయోగక్షేమములను చూడదలంతుమేని వారికి వచ్చెడుదానిలో నూటికి తొంబదవవంతు నిశ్చయముగ దొరతనమువారు కోరతగినదియై యున్నది. ఈపైన చెప్పిన వంతనునది కర్చులును, దాని ననుసరించెడి లాభములును పోగా జమీందారునకు వచ్చెడు నాదాయపు మొత్తమని నా యభిప్రాయము. ఈజమీందారులకు వచ్చెడు లాభము భూములయభివృద్ధికి వారుతగిన శ్రద్ధతీసికొని వారు రైతుల కుత్సాహము కలిగింతురేని క్రమక్రమముగా వీరికి రాగలయాదాయ మభివృద్ధి కాగలదని నా యభిప్రాయము.’’

తరువాత తరువాత షోరుగారు బంగాళాదేశపు జమీందారుల

హక్కులన తనయభిప్రాయ మేమియో దానిని స్వచ్ఛముగను దృఢముగను వివరించెను. "జమీందారులు వారివారి స్వమతధర్మశాస్త్రములనుబట్టి వంశానుక్రమణికగ తమకు వచ్చెడు ఆస్తికి వారే కామందులనియు వారికి శాస్త్రసమ్మతమగు వారసు లున్నంతవరకును వారి వారసత్వమును తప్పించుటకు గాని మార్చుటకు గాని పరిపాలనాధికారులకు న్యాయమగు నధికార మేమియు లేదనియును నాయభిప్రాయము. ప్రాతిపదిక మగునీహక్కువలననే భూములను వారు విక్రయించుకొనుటకును, తనఖాలు పెట్టుకొనుటకును అధికారము కలిగియున్నారు. ఈయధికార మనునది మనకు దివానీపదము లభింపకమున్నే జమీందారులకు వాడుకగా నుండియున్నది."

"జమీందారుల హక్కులకు వ్యతిరేకముగను బాహాటముగను, ఏవిధమైనభంగమును కలుగకుండ వానిని తారుమారుచేయుట నిరంకుశప్రభుత్వమునకు సాధ్యమగును; కాని మొత్తముమీద చూతుమేని అట్టిహక్కులన్నియును, మొదటినుండియును వారి కనుకూలముగ నుండుటయే యాచారముగ నున్నది. అక్బరు కాలమున బంగాళాదేశములో జమీందారులు చాలమంది ధనవంతులుగనున్నారు. అక్బరు క్రింద జాఫరుఖానుడు పరిపాలకుడుగా నియమించినపుడును వానితరువాతివాతికాలమునందునను ఆజమీందారులందరు నిలిచియే యున్నవారు. వారివారి రాష్ట్రాధికారములు విశేషముగ వృద్ధియైనట్టు కూడ కనిపించుచున్నది. ఇంగ్లీషువారికి దివానీపదము లభ్యమగు నప్పటికి ప్రముఖులగు జమీందారు లందరును, పుష్టిగను దర్జాగను కన్పట్టుచు వచ్చినారు."

ఇట్లు జమీందారులను గూర్చి చెప్పి రైతులనుగూర్చియు వ్యవసాయదారులనుగూర్చియు కూడ షోరుగా రింతబింకముగనే పలికియున్నారు.



"బంగాళాదేశమునందంతటను ప్రతిమండలమునందును, ఈనిర్బంధ ధనాకర్షణ శాసనము వచ్చి నియతమైన యేర్పాటుల నెల్ల నణగద్రొక్కని చోట్లలో భూమిపన్నులకు నిరుకుపడిన రేటొకటి యున్నది. ఆరేటందరికిని తెలియును. కొన్ని జిల్లాలలో గ్రామమున కొక రేటున్నది. బీగాకింత యని ఆభూమిలో పండెడుపంటనుబట్టి రేటు లేర్పడినవి. బీగా యనగా యకరాలో మూడవవంతు. సాలునకు కొన్ని భూములు రెండుపంటలును, కొన్ని మూడుపంటలును పండును. ఆపంటలు వేరువేరు దినుసులవి. తమలపాకు, పొగాకు, చెరకు, మలబరీ (పట్టు ఉత్పత్తికాబడుచెట్టు) మొదలగు విలువగల పంటలు పండు భూములు వానివాని రకములనుబట్టి ధరలు కూడ హెచ్చుగా నుండును."

"ఖాడ్ ఖాస్త్ రైతులనగా గ్రామమునందే యుండి భూములను సాగుబడి చేయు రైతులు. వారికిచ్చెడు పట్టా లింతకాలమున కని నిరుకుపరచి యిచ్చుటలేదు. ఏసాలుశిస్తు ఆసాలున చెల్లించి భూములు దున్నుకొనుటయే వారికిని వారికిని ఏర్పాటు. దీనినిబట్టియే భూమియందలి శాశ్వతపు హక్కు లేర్పడినవి."

"ఇంక పాయికారీ రైతులనగా పొరుగూరి భూములు వ్యవసాయము చేయువారు. ఆరైతులకు భూముల యమరకము లింతకంటె అనిర్దిష్టముగా నున్నవి.వారి కిచ్చెడుపట్టా లిన్నిసంవత్సరముల కని యేర్పాటు గానీయబడుచుండెను.వారి కెప్పుడు షరతులు వ్యతిరేకముగా నుండునో అప్పుడు వారు మరియొక భూమిని చూచుకొందురు."

ఈముఖ్యవిషయమును పూర్తి చేయుచు చిట్టచివర తనయభిప్రాయమును షోరుగారు సంగ్రహముగ నిట్లువ్రాసినారు.

"ముందు సెటిల్ మెంటులో ముఖ్యముగా గమనింపవలసినవిష

యములు రెండు. గవర్నమెంటుకు రావలసిన పన్నుల బాధ్యత యొకటి. ప్రజలయొక్క సంరక్షణయును వారిబాధ్యతయును మరియొకటి.

"భూమికామందులకుగాని జమీందారులకుగాని శాశ్వతపు సెటిల్‌మెంటు నేర్పరచినయెడల ఇందు మొదటికార్యము బాగుగ జరుగును. అందువలన జమీందారుల ఆస్తియైన భూమియె గవర్నమెంటువారికి హామీ యగును."

"ఏలయినంతవరకు పన్ను హెచ్చురేటు ఇది యని చెప్పి యొప్పించి దాని నమలులో బెట్టిన రెండవకార్యము సానుకూలపడగలదు. రైతు తాను చెల్లించెడి పన్నుమొత్తము నిరుకుపడి యుండవలెను. చిత్తము వచ్చినట్లుండరాదు. చెల్లించవలసిన కాలము, మార్గము, మొత్తము, ఇవి చెల్లించు వానికిని తదితరులకును కూడ స్పష్టముగా తెలిసి యుండవలయును."

"ఇట్టి సెటిల్‌మెంటు శాశ్వతము చేయునూహతో ప్రస్తుతము పదిసంవత్సరములవరకును సిసలుపరచి యియ్యవలెను."

ఈపైన వ్రాసినది షోరుగారు సంపూర్ణముగ వ్రాసినయభిప్రాయముయొక్క కేవలసంక్షేపరూపము. అందాతఁడు ఫిలిప్ఫ్రాంశిస్సుగారు మొదట అనువదించినశాశ్వతపుసెటిల్‌మెంటుపద్ధతిని బలపరచెను. అయినను ఆసంవత్సరముననే వ్రాయబడిన రెండవవ్రాతలో పదిసంవత్సరములవరకును చేయబడినయీసెటిల్‌మెంటే శాశ్వతముగ నుంచబడు నని, జమీందారులకు పంపఁదలఁచినప్రకటన వదలివేయవలసిన దనునభిప్రాయమును కనఁబరచెను. కాని అయ్యది గవర్నమెంటువారినీతి నిలిచియుండునది కాదని సూచించిపోవునేమో యని కార్న్‌వాలీసుప్రభువు అట్లు వదలివేయుట కంగీకరింప లేదు. ఆప్రభువు వ్రాసి యుంచినయభిప్రాయములు మిక్కిలి యుక్తియుక్తములును, దృఢమైనవియును, స్పష్ట



ముగ తెలుపబడునవియును అయి యున్నవి. వానిని సంగ్రహముగ నైన నిచ్చట ముచ్చటింపక విడిచిపెట్టుట యసాధ్య మనిపించుచున్నది.

"నాబుద్ధినిబట్టి చూడ గడచినజూనులో షోరుగారు తెలియచేసినవిషయము మిక్కిలి జయప్రద మైనదియు, సమర్థతతో వ్రాయఁబడినదియు నై యున్నది. అందువలన భూములయందు జమీందారులకు హక్కు కలుగచేయునని తేలుచున్నది. ఇప్పుడు జరుగుచున్నయీసెటిల్‌మెంటులో శాశ్వతహక్కులయొక్క ప్రాధాన్యమును తీసివేయుదుమని జమీందారులహక్కులకై పోరాడినయాతనివాదము వారి కేమి యుపచరింపఁగలదు?

"భూమికి కామందు తానే యైయున్నపుడును, భూమియందు తనకు శాశ్వతమైనహక్కు కలిగియున్నపుడును, పదసంవత్సరములకు మాత్రమే ఆతనికి యిజారాకు యిచ్చి, అటుపైన మరల క్రొత్తపన్ను కట్టుదు మనిచెప్పటచే భూమి నాతఁడు వృద్ధిచేయకుండునను మాట యటుండగా దానిని పాడుచేయకుండ నుండునని మాత్రము ఎట్లు చెప్పగలము? (ఆక్రొత్తపన్ను అనునది తెలియకో, దురాశవలననో యేర్పాటు కాబడవచ్చును.)

"ఇప్పుడు కంపెనీవారికి హిందూస్థానమునం దున్నభూమిలో మూడవవంతు అడవిజంతువులు సంచరించునరణ్య మని లెస్సగా చెప్పగలను. మనము పదిసంవత్సరములకు మాత్రమే కవులు యిచ్చినందువలన జమీందారునికైనను అడవులు నరకించుటకు బుద్ధి పుట్టునా? ఏరైతైనను వచ్చి భూములు వ్యవసాయము చేయుటకు మనస్కరించునా? క్రొత్తగా తాము సాగుచేసినభూములపై పరతు అనంతరము వారు కట్టిన పన్నెల్ల నిచ్చుకొననైన నిచ్చుకొనవలెను. అంతటినుండి దానిఫలితము దొరకు నని ఆశతో నుండిన తనస్వకాయకష్టమువలనిఫలితము

వదలుకొని పోనైనను పోవలెను. ఈరాష్ట్రము లింతకొద్దిమరతులకు మాత్రమే అమరకపరచినయెడల భూము లన్నియు నిస్సారములై పాడుపడిపోవు నని నాకు గట్టినమ్మకము. ఈసంగతి నేను ఖండితముగా చెప్పక మరుఁగుపరుపజాలను.''

కార్న్వాలీసుప్రభువు ఈవిషయమున తరువాత చర్చవచ్చినప్పుడు కూడ రాజకీయవ్యవహర్తకు తగినమాదిరిని తనయభిప్రాయమును మరల వ్రాసివేసెను. " వారు పెట్టినపెట్టుబడికిని పడినకష్టమునకును ప్రతిఫలముగ నుండునట్లు భూములహక్కు జమీందారులయందె నిలుపుచున్నట్టు చట్టములు పుట్టునేని, సోమరితనమువలనను, అతివ్యయమువలనను కలుగునష్టములను అనుభవమువలన వారే పొందునట్లు మన మూరకుందుమేని వారిస్వంతవ్యాపారములు సమర్థతతో వారే కష్టించి చక్కచేసికొందురు. లేదా వారియవసరములనుబట్టి ఆభూములను వారితరులకు వినియోగము చేసికొందురు. అప్పు డట్టివినియోగములను పొందినవారే భూములను బాగుచేసి వ్యవసాయము చేయుదురు. జమీందారులను ద్రవ్యవంతులుగను, భూస్వాములుగను చేయదలతురేని, ప్రజలయోగక్షేమము లన్నియు వివేకము కలిగి కాపాడుటకై వీరికే యొప్పగింపదలంతురేని, యీప్రభుత్వముగాని మరియొకప్రభుత్వముగాని అవలంబింపవలసినదియు, ఉపయుక్తమైనదియు నిది యొక్కపద్ధతియే యని నాయభిప్రాయము.''

"ఇందునుగూర్చిన సంజాయిషీ సంపాదించుటకై యిరువదియేండ్లు పట్టినది. 1769 సం॥రమున "సూపరువైజ" ర్లేర్పడిరి. 1770 సం॥రమున రాష్ట్రీయసభ లేర్పడినవి. 1772 సం॥రమున ప్రసిడెన్సీ యంతకును అధికారమును చేత నుంచుకొని సెటిల్‌మెంటు చేయుటకై ఊరూరను తిరుగుకమిటీయొకటి యేర్పాటయినది. 1776 సం॥రమున



దేశమునందలి శిస్తులజాబితాలను తయారు చేయుటకై అమీనా లేర్పడిరి. 1781 సం॥రమున రివిన్యూతో సంబంధించినరాష్ట్రీయసభ లెత్తివేయబడెను. జిల్లాజిల్లాకును కలెక్టరులను నియమించిరి. అప్పుడే కలకత్తాలో నొకరివిన్యూకమిటీ నేర్పరచి, ఆరాష్ట్రీయసభలయొక్క అధికారములును, పన్నువసూళ్లయేర్పాటులును ఆకమిటీ కొప్పగింత చేయబడెను. మనవెనుకటివారివలె మనమును క్రొత్తసంజాయిషీ సంపాదనకై యారంభించి ఆసంపాదన మూడేండ్లనుండి చేయుచున్నాము. ముఖ్య మని తోచినయంశమున కెల్ల పెద్దపెద్దసంపుటములుగా రిపోర్టులు వ్రాసి ప్రతిజిల్లాకలెక్టరును పంపించి యున్నాడు.

" పైకారణములనుబట్టి విశేషముగ ద్రవ్యము వంచుకొనిపోవుచున్నదానికి తోడు స్వంతముగా ద్రవ్యము నార్జించుకొని అయ్యాదియింటికి పంపించుచుండుట ఇదివరలో ననేకసంవత్సరములనుండి జరుగుచున్నది. అందువలనచలామణీకి నాణెములు తగ్గిపోయినవి. దేశములోని వ్యవసాయములును, అన్నివర్తకములును, బలక్షీణమయిపోయినవి. ఆబాధ యిప్పుడును మిక్కిలిగ పొందుచున్నారు............

" కావున దేశము నభివృద్ధికి తేతలంతుమేని, బ్రిటిషువారిలాభమునకును వారి కీప్రాంతముల నున్నయధికారమునకును గట్టిబలము మనము కలుగచేయ తలంతుమేని, దేశపరిపాలనాపద్ధతి పూర్ణముగ మార్చివేసి క్రొత్తమార్గము నవలంబించుట యత్యవసరమైయున్నది.''

" జనులశ్రేయస్సునకు మిక్కిలి హానికరముగా నుండు అనర్థముల కేదో యొకపోకడ కనిపెట్టుట మనకు విధియైనకార్యమై యున్నది. భూములకు స్థిరమైనపన్ను కట్టి శాశ్వతపుకవుళ్లు నిచ్చెదమేని మనప్రజలలో నెల్ల హిందూదేశవాసుల మిక్కిలి సుఖులుగ చేసినవార మగుదుము.''

1791 సం॥రం నవంబరునెలలో పదిసంవత్సరములకు మితి యేర్పరచి సెటిల్‌మెంటుచేయుటకై గవర్నమెంటువారు సవరణచేసి సంపూర్ణమైననిబంధనలతో కోడ్డుఒకటి ప్రకటించిరి. 1793 సం॥రమున బంగాళాదేశమునందలి యన్నిజిల్లాలోను సెటిల్‌మెంటు పూర్తిగా జరిగెను. 1790-1791 సం॥రమున బంగాళము, బీహారు, ఒరిస్సా రాష్ట్రములయందు భూమిపన్నురూపకముగ వచ్చినమొత్త మంతయును చేరి రు 2,68,00,989 అయినది. ఆశతాబ్దప్రారంభమున జాఫర్‌ఖాన్ సుజాఖానులు కట్టినపన్నుకంటె నీమొత్తము ద్విగుణముగా నున్నది. మీర్జాఫరుపరిపాలనమునందు కడపటిసంవత్సరము (1764-65) లో మహారాజానందకుమారుఁడు చేసినవసూళ్లకంటె మూడురెట్లు. కంపెనీవారి దివానీ ప్రారంభమైనప్రథమసంవత్సరమున (1765-66) బ్రిటిషువారి యాజమాన్యముక్రింద మహమ్మదు రజాఖాను చేసినవసూలుకంటె రెండురెట్లు. దీనినిబట్టి చూడ పన్నెంతదారుణముగా కట్టబడినదో తెలియగలదు. అదియే స్థిరమైనపన్నియును కడపటిపన్నియును చెప్పుటచేత అంతమొత్తమువరకును కట్టుట సాధ్యమయ్యెను.

1792 సం॥రం సెప్టెంబరు 29 తేదిని వ్రాసినయుత్తరమున డైరక్టరు లీచర్య లన్నియును మిక్కిలిగా కొనియాడుచు శాశ్వతముగా భూమిపన్ను ఏర్పాటు చేయు సెటిల్‌మెంటునకు అంగీకరించిరి. ఈయుత్తరవులు చేరగనే కార్న్‌వాలీసుప్రభువు 1793 సం॥రము మార్చి 23 తేదిని అప్పుడు జరుగుచున్నసెటిల్‌మెంటు శాశ్వతమైనసెటిల్‌మెంటు అని ప్రకటింపజేసెను.

“1 వ షరతు. 1789 సం॥రము సెప్టెంబరు 18 తేదిని బంగాళాదేశమునను, 1789 సం॥రము నవంబరు 25 తేదిని బీహారునను 1790 సం॥రము ఫిబ్రవరి 10 తేదిని ఒరిస్సాలోను సర్కారుపన్నులకు పది



సంవత్సరములపరిమితి యేర్పడి సెటిల్‌మెంటు జరిగినది. అప్పుడు కొన్నినిబంధన లేర్పాటయినవి. ఆయేర్పాటులనుబట్టి అప్పుడు పన్ను లేర్పరచుకొనినభూస్వాములభూములమీద, నీషరతులతో నేర్పరుపబడినయీపన్ను, ఈస్టిండియాకంపెనీడైరక్టర్లు అంగీకరించినయెడలమాత్రమే పదిసంవత్సరములయనంతరము కూడ నిలిచియుండుననియు, లేకున్న లేదనియును తెలియపరచితిమి.

“2 వ షరతు-ఇప్పుడు గవర్నరుజనరల్ అధికారమును చలాయించుచున్న మార్క్విసు కార్న్‌వాలీసు పేరుగల (ఇంకను చాలబిరుదునామములుగల) నే నిందుమూలముగ బంగాళము, బీహారు, ఒరిస్సాదేశములందలి ఎల్లజమీందారులకును స్వతంత్రులగు తాలూకాదారులకును తెలియచేయునది యేమనగా:—ఈస్టిండియాకంపెనీవారిడైరక్టర్లు పైనచెప్పబడిన షరతులమీద, ఇదివరకు కట్టబడినట్టియు, ఇక ముందు కట్టబోవునట్టియు భూమిపన్ను లన్నియు శాశ్వతముగా నుండు నని ప్రకటింపు డని డైరక్టర్లు మా కధికారము నొసంగియున్నారు.

“3 వ షరతు-దానిబట్టి గవర్నరుజనరలుసభవారు పైషరతుల మీద పన్నుల నేర్పరచుకొనిన యావత్తుజమీందారులకును స్వతంత్రపుతాలూకాదారులకును తదితరభూస్వాములకును వారిదివరకు కంపెనీవారితో నేర్పాటుచేసుకొనినపన్నుల కిక నేవిధమైనమార్పులును కలుగవనియును, ఇక మీద నాయాభూములు, వారును వారివారసులును శాస్త్రవిహితమైన వారి స్థానీయులును అనుభవింపవచ్చు ననియును, ఇందుమూలముగా ప్రకటించు చున్నారము.” అని 1812 సం॥రము అయిదవరిపోర్టు 19 పేజీయందున్నది.

దీనినిబట్టి 1793 సం॥రము 1 వ రెగ్యులేషను శాశ్వతపుసెటిల్‌మెంటునిమిత్తమై యేర్పాటయ్యెను. బ్రిటిషుజాతివారు పరిపాలనకు

వచ్చిన నూటయేబదియేండ్లకును జనులయార్థికక్షేమమును సంరక్షించుచు చేసినకార్య మిది యొక్కటియే. ప్రజలు కాయకష్టమువలన పొందెడులాభము ప్రజలే యనుభవించవలె ననియును దొరతనమువారు పొందతలంచుపన్నులు వారిపరిశ్రామికములను నాశనము చేయునట్లు, అస్థిరముగాను, దినదినప్రవర్థమానముగను, ఉండరా దనియును, నాగరికనందినయన్ని జాతులవారియొక్కయు వర్తమానరాజనీతి యైయున్నది. ఈకార్య మొక్కటియును అట్టి రాజనీతి ననుసరించి యున్నది. గడచిన నూరుసంవత్సరములనుండియును బంగాళాదేశమున వ్యవసాయము వృద్ధి యగుచున్నది. 1793 సం॥రమున అమరకముశిస్తులో నూటికి తొంబదివంతున కట్టినభూమిపన్ను ఇప్పుడు భూస్వాములకు వచ్చెడునాదాయములో నూటికి 28 వంతున తేలినది. నూతనముగా రోడ్డులకును, పబ్లికుపనులకును కొన్ని సెస్సు లనిచెప్పి నూటికి 6¼ వంతున మరల పన్నులు కట్టినారు.

1793 సం॥రము మొదలు శాశ్వతముగా పన్నులు కట్టబడిన యీబంగాళారాష్ట్రమున విశేషజననష్టము కలిగినకాటకము లేవియును తటస్థించలేదు. భూమిపన్ను ఇంకను అస్థిరముగానే యుండి దారుణముగా నున్నహిందూదేశమునందలి యితరభాగములలో వ్యవసాయ మభివృద్ధి చేసికొనుటకు మనసు పోవుట లేదు. ఆర్జనకు వీలుకలుగుట లేదు. వేనవేలు జను లొక్కొక్కప్పుడు నష్టపడుకాటకములు వచ్చుచున్నవి. జనులయైశ్వర్యము, వారిసౌఖ్యము, అనునవి ప్రభువులయొక్క వివేకమును, విజయమును అనుకొందుమేని 1793 సం॥రమున కారన్వాలీసు చేసిన యీశాశ్వతపుసెటిల్‌మెంటే హిందూదేశమున బ్రిటిషుజాతివా రొనరించినవివేకతమ మైనట్టియు జయప్రద మైనట్టియును కార్యమని చెప్పవలయును.



బంగాళాదేశమునందు శాశ్వతముగ జరిగిన యీభూమిపన్ను సెటిల్‌మెంటు, అయిదుసంవత్సరములకు తరువాత అనగా 1798 సం॥రమున నింగ్లండులో జరిగిన భూమి సెటిల్‌మెంటుతో పోల్చి చూడక మన మీవిషయమును ముగింపజాలము.

మ్యాడవవిల్లియముగారిఆస్తిప న్నునది మొట్టమొదట మనుజునియుద్యోగముమీదను వానిసొంతమైనఆస్తిమీదను కట్టినది. సొంతయాస్తిపైన పన్ను తగ్గిపోగానే, అయ్యది యేటేట నిచ్చుభూమిపన్నని చెప్పబడుచు వచ్చెను. స్పెయిన్ దేశపువారసత్వమునకై యుద్ధము తటస్థమైనపుడు సాలునకు వచ్చెడు ఒకపౌనురాబడిమీద నాలుగుషిల్లింగులవరకును ఆపన్ను హెచ్చింపబడెను. అనగా వచ్చెడు నాదాయములో 20 వంతు ఇచ్చుకొనవలసి వచ్చెను. అయ్యది 1713 సంవత్సరమున జరిగిన "యూట్రెక్టు" సంధికి పిమ్మట పౌనునకు రెండుషిల్లింగునకు తగ్గింపబడియెను. 18 వశతాబ్దముయొక్క చివరభాగమువరకును అయ్యది పౌనుపై నాలుగుషిల్లింగులు మొదలు షిల్లింగువరకును మారుపు చెందుచు వచ్చెను. అనగా నూటికిరువదివంతు మొదలు 5 వవంతువరకును తగ్గుచువచ్చెను.

బంగాళాదేశమునందలిశాశ్వతపుసెటిల్‌మెంటు అయినయైదేండ్లకు మహామంత్రి యగువిలియమ్‌పిట్టుగారు చట్ట మొకటి చేసెను. ఆచట్టములో నిరూపణ చేయబడిన ఇంగ్లండుదేశములోని మండలములన్నిటియందును భూమిపన్ను ఎన్నటికినిమార్పు లేకుండ చేసెను. కొంతమొత్త మిచ్చి భూస్వాములాపన్నుకూడ లేకుండ చేసికొనుట కధికారమా చట్టమువలననే కలుగచేసెను. ఈగ్రంథము వ్రాయువరకు ఆదేశవాసులు 13,00,000 పౌనులపన్ను ఎన్నటికి సీయ నక్కర లేకుండ పైహక్కునుబట్టి వదలించుకొన్నారు. ఇంక 10,00,000 పౌనులుమాత్రము

వదలించుకొనవలసి యున్నది. ఈకడపటి మొత్తమే యెస్టేటులపై నిప్పుడును చెల్లింపవలసియుండు శాశ్వతమైనపన్ను. దీనికి లోబడియే క్రయ విక్రయములు జరుగుచుండును.

ఆంగ్లేయదేశమునందు చేసిన శాశ్వతపు సెటిల్‌మెంటునుగూర్చి పిట్టుగారివివేకమునకు సంశయమునైన పొందవచ్చునుకాని బంగాళాదేశమున కార్న్‌వాలీసు చేసిన శాశ్వతపుసెటిల్‌మెంటునుగూర్చి అట్టిసంశయ మేమియును పొందుటకు తగినకారణము లేదు. ఇంగ్లండుదేశములోని భూమిపన్ను సెటిల్‌మెంటువలన భూస్వాము లొక్కరే బాగుపడినారు. బంగాళాదేశమునందలి సెటిల్‌మెంటువలన వ్యవసాయదారులందరును బాగుపడినారు. ఈసాధనమువలన దున్నుకొనిబ్రదుకు ప్రజలకందరకును లాభము కలిగినది. అందువలన వారభివృద్ధిలోనికి వచ్చి యింతపరపతికలవారైనారు. జాతీయసంబంధమైన ఆదాయమునకాధారభూతమైన యనేకమైనపన్నులలో ఇంగ్లండుదేశమున నీసెటిల్‌మెంటువలన నీపన్నుమాత్రమే మితమగునట్లు చేసినారు. బంగాళాదేశమునం దన్ననో వ్యవసాయవృత్తి కంతకును నియ్యది రక్షకమైనది. జాతియజీవనమున కాధారము బంగాళాదేశమున వ్యవసాయ మొక్కటియే. ఇంగ్లండుదేశమున జాతీయలాభమునకై ప్రభువులు భూమిపన్నుపైన అదనమైనపన్నులు కట్టి దేశమున కర్చుపెట్టుట కిందువలన నాటంకము కలిగెను. బంగాళాదేశమునం దన్ననో దేశమునుండి యేటేటను వంచుకొనిపోవుచున్న ద్రవ్యప్రవాహము నభివృద్ధిగాకుండ నియ్యదియాపుచేసినది. ఇంగ్లండుదేశమునందలి భూస్వాములు క్రొత్తపన్నులు లేకుండ ఇందువలన సంరక్షితులైరి. బంగాళాదేశ మిందుమూలమున నుత్పాతకరము లగు దారుణక్షామములనుండి జాతి యంతయును సంరక్షిత మయ్యెను.

# హిందూదేశార్థికచరిత్రము.

## ఆఱవ ప్రకరణము.

### చెన్నపట్టణములోనిపన్నులయిజారా.

### (1763—1785)

ఇంతకు పూర్వప్రకరణములో 1757 మొదలు 1793 సంవత్సరము వరకు జరిగిన బంగాళాదేశమునందలి యార్థికచరిత్రమును దెలిపితిమి. ఇపుడు చెన్నపురిరాష్ట్రములోని వ్యవహారస్థితిగతుల నరయవలసి యున్నది. అచ్చట బ్రిటిషువారికిని, ఫ్రెంచివారికిని చిరకాలమునుండి జరుగుచున్న యుద్ధములు తుదకు 1763 వ సంవత్సరములో జరిగిన “పారిసు” సంధితో ముగిసినవి.

బహుకార్యవిశిష్టమైనయీయుద్ధచరిత్ర చాలసారులు చెప్పబడియెను. అయ్యది ప్రధానముగా దక్షిణహిందూస్థానస్వాతంత్ర్యమునకై కలిగినకలహము. ఆకలహము ఫ్రెంచివారిపక్షమున నున్నడూప్లేకిని, ఆంగ్లేయులపక్షమున రాబర్టుక్లైవునకును మధ్య కలిగినది. ఇందు మొదటియాతడు ఫ్రెంచివారిసామ్రాజ్యనిర్మాణము సేయ నారంభించెను. రెండవయాతడో, కట్టుచు కట్టుచున్న యాకట్టడమును గూలద్రోసెను. అనంతరము ప్రజ్ఞావంతుడగు “బుస్సీ” యును, సాహసికుండగు “లాలీ” అనువాడును ఫ్రాంసుదేశమున ఫ్రెంచివారిరాజ్యమును సంరక్షింప దలంచి దేశభక్తిపూరితులై పట్టుదలతో ప్రయత్నించిరి. కా

ని వాని నన్నిటిని “ఐరికూటు” కడముట్ట ధ్వంసము చేసెను. “ప్యారిసు” సంధివలన నింగ్లీషువారివిజయ మంగీకరింపబడియెను. అంతటినుండి, హిందూదేశమున నింగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని విరోధమే యావశ్యకత లేకపోయెను.

ద్విరుక్తిగా చెప్పబడిన నీయుద్ధగాథలనుండిజనులయార్థికస్థితిగతులకై మరల గలిగినచో మనపై నుండుగొప్పభార మొకటి తగ్గగలదు. హిందూదేశ చరిత్ర యనిన, ఆదేశపుప్రజలయార్థికస్థితియు, వారిధార్మికస్థితియు, వారి వాణిజ్యపరిశ్రామికవ్యవసాయికస్థితులు ననువీనిని గూర్చిన చరిత్రముగాని, ఫ్రెంచివారికిని, ఇంగ్లీషువారికిని కలిగినకలహచరిత్ర కాదు. ఈవాస్తవ్యచరిత్రనుగూర్చి యింతవర కెవ్వరును తగుశ్రద్ధ వహించినవారు కారు, అందువలన, నాటకగాథ లైయుండుయుద్ధకథలన్నియును, అధికప్రజ్ఞాధురంధరు లగుగ్రంథకర్తలయధీనము చేసి ఈగ్రంథ మంతయును మిక్కిలిగా తెలియదగియున్నయీవిషయమునకే వినియోగింప దలంచితిమి.

ఫ్రెంచివారికిని ఇంగ్లీషువారికిని, ఇరువదిసంవత్సరములనుండి జరగుచున్నకలహము మున్ను చెప్పినచొప్పున 1767 వ సంవత్సరమున గడముట్టెను. పుదుచ్చేరి వసతియును తదితరములగు మరికొన్నిస్థలములును ఫ్రెంచివారికి మరల చేరెను. కాని దక్షిణహిందూస్థానమున నింగ్లీషువారు నిరుపమానముగ నిలిచి యుండిరి. బ్రిటిషువారిచేతిలో కీలుబొమ్మవలె నుండుమహమ్మదాలీ యనునత డప్పుడు కర్ణాటరాజ్యమునకు నవాబుగా నుండెను. బ్రిటిషువారియాధీనమం దుండురాజ్య మెల్ల చెన్నపట్టణమును, దానిచుట్టుపట్టుల నుండుకొంతరాజ్యమును, తూర్పుసముద్రప్రాంతమున నుత్తరముగా బంగాళాదేశమువరకు వ్యాపించియున్నయావత్సముద్రప్రాంతస్థలములు మాత్రమే యయియుండెను.



కర్ణాటకనవాబుగా నుండినమహమ్మదాలీకిని, బంగాళానవాబుగానుండిన యతనిసమకాలికుం డగుమీర్ఖాసిమునకును, ఎంతయో వ్యత్యాస మున్నది. మీర్ ఖాసిమ్ పట్టుదల కలవాడును సమర్థుడైనపరిపాలకుడును. మహమ్మదాలీ బలహీనుడును,సుకుమారముగ పెరగినవాడును. మీర్ఖాసిమ్ బ్రిటిషువారియధికారమునకు లోబడకుండ ప్రభుత్వతంత్రము చక్క జేసికొనుటకై తనరాజధానిని వారికి దూరముగ నుండు మాంఘిర్ పట్టణమునకు మార్చెను. మహమ్మదాలీయన్నచో తనరాజధానియగు “ఆర్కాటు” పట్టణమును విడిచి బ్రిటిషుపట్టణమైన చెన్నపురికే సుకుమారజీవనము చేయబోయెను. మీర్ ఖాసిమ్ మిక్కిలి యూర్జితపరుడు. తాను సింహాసన మెక్కినరెండుసంవత్సరములకే బ్రిటిషువారికిని, తనకును గలసొమ్ముసంబంధమైనపూచీపేచీ లన్నియును వదల్చుకొనెను. మహమ్మదాలీ కంపెనీబాకీలను వదల్చుకొనలేక యారోజున కారోజు, అప్పులగుండములలో బడి మునిగిపోయెను. మీర్ ఖాసిమ్ బంగాళాదేశమునందలిదైశికవర్తక మంతయును, తనప్రజలచేతిలో నుండి పోకూడ దని పట్టు పట్టి బ్రిటిషువారితో పోరాడెను. మహమ్మదల్లీ తనభూమిప న్నంతయును బ్రిటిషుఋణదాతలకు వినియోగపరచి తనరాజ్యమంతయును ఋణదాతలయధీనము చేసెను. మీర్ ఖాసిమ్ రాష్ట్రమునుండి వెడలగొట్టబడియెను. అతడు దేశభ్రష్టుడై మరణించెను. మహమ్మదల్లీ అప్రతిష్ఠల పాలై, వారలకు దాసుడై ఋణపడి సుకుమారముగ బ్రతికి వార్ధక్యము నంది మరి మరణించెను. ప్రాగ్దేశమున గలయప్పటిబ్రిటిషువారిరాజతంత్రమున బలవంతు డగుపాలకునకు నిలువ నీడ లేదు. అసమర్థప్రభువు స్వేచ్ఛగా నుండవచ్చును. ఋణములు పుచ్చుకొనవచ్చును. తనరాజ్యముపై వచ్చెడుపన్నులలో నుండి వడ్డి చెల్లించవచ్చును.

అశక్తు డగునట్టియధిపతి ప్రభుత్వమున తమయధికారమును రాజ్యముచు వ్యాప్తము గావించుట కంపెనీవారికి సుకరముగా గనుపడియెను. 1765 వ సంవత్సరమున బంగాళాదేశమున నున్నట్టికంపెనీవారు కర్ణాటకపుదివానులై యుండలేదు. అట్టిదివానీపదమును నిజాముపదమును గూడ నామకముగ మహమ్మదల్లీయందే నిలిచి యుండినవి. వాస్తవమగునధికార మెల్ల కంపెనీవారే యనుభవించిరి. దివానీపద మనగా రివిన్యూపరిపాలన. నిజాముపద మనగా సైన్యపరిపాలన. దేశముయొక్క సైన్యసంరక్షణ యంతయును గంపెనీవారే చూచుచుండిరి. వారి కందులకై నబాబుగారిపన్నులు కొన్ని యిచ్చివేయబడెను. వారికి తటస్థమయినయుద్ధములతోపాటు కంపెనీఖర్చులు కూడవృద్ధి యయినవి. నబాబుగా రందులకై కంపెనీనౌకరులయొద్దనుండి, అప్పు పుచ్చుకొనియెడి వింతపద్ధతి యొకటి యవలంబించెను.

ఇంతకంటె చిత్రమైనదియు, ప్రాణముమీదికి వచ్చునదియును మరియొకటి యున్నది. సొంతపుబాకీ లన్నిటికిని నబాబుగారు 'హామీ' లిచ్చుటకు మొదలుపెట్టెను. తనబొక్కసమునందు సొమ్ములేకయు, ఉన్నను నది కదల్పలేకయు, తనరాష్ట్రముపై వచ్చుపన్నుల నీసొంతపుఋణదాతల కొప్పగించుచువచ్చెను. కర్ణాటదేశమునందలివ్యవసాయదారు లందరును నబాబుగారియేజెంట్లపాలనమునుండి వదలి, బ్రిటిషుఋణదాతలపాలనమున బడినారు. పొలములలోపండినపంట లన్నియును బ్రిటిషుఋణదాతలబాకీలకు లోనై యుండవలసివచ్చెను. నిర్బంధపెట్టియు, కొరడాదెబ్బలు కొట్టియు, నబాబునౌకరులు వసూలుచేసెడుపన్నులు యూరపుదేశమునకు కంపెనీవారికి బంపుటకై బ్రిటిషునౌకరులయధీనము చేయబడియెను. కర్ణాటదేశ మంతయును లోపల సార మంతయులాగివేసిన గుడ్డుడొలకవలె బ్రిటిషువారికి నుండెను. దక్షిణహిందూస్థానమునందలిగ్రామములును పొలములును గొప్పయిస్టేటయినది. అందు దున్నెడివారు దున్నుచుందురు. పాటుపడెడివారు పాటుపడుచుందురు. అందు పండెడిపంటలమూల్య మంతయును ఐరోపాఖండమునకయి పోయెడిది.

దేశమునకును దేశవాసులకును కూడ, ఒకసారిగనే యాపద తటస్థమయ్యెను. నబాబుగారివసూలుపద్ధతియెల్లపుడును, కఠినముగాను, క్రూరముగాను, ఉండినను, అయ్యది కొంచెము శక్త్యానుసారముగ కూడ నుండెడిది. సాలుసరికి పండినపంటనుబట్టి వారికి రావలసినది లాగుకొనుచుండెడివాడు. ఋణదాతలు కూడ నిందుకు సిద్ధపడినపుడు నబాబుయొక్క కాఠిన్యమునకు బ్రిటిషుచర్యలనిష్కృష్టతయును స్థితిగతులాలోచింపమియును వచ్చి తోడుపడియెను. నబాబుయొక్క ఋణదాతలు తమహక్కు లెల్లను నిష్కర్షగా నమలుజరిపిరి. వ్యవసాయదారు లందరు నిదివర కెన్నడు నెరుగని యొత్తుడుకు లోనైనారు. ఈపన్ను లన్నియును నబాబుగారిఖజానాకు యిరసాలగునంతవరకును, అవి దేశమునకే కర్చుపడుచుండెను. అకారణముగ నేదో యొకరూపమున నాసొమ్మంతయును ప్రజలదిక్కునకే మరల బ్రవహించెడిది. కాని యిపు డన్ననో బ్రిటిషుఋణదాతల కొప్పగింపబడినజిల్లాలలోనిపన్ను లన్నియును, వారికే హక్కుగా చెందియుండి, వారె వసూలుచేసికొనుచుండుటచేత, ఇక నెప్పటికైనను మరలివచ్చు నన్నయాశయైనను లేకుండ దేశమునుండి తరలి పోవుచున్నది. దేశము క్రమక్రమముగా పేదవడినది. పరిశ్రామికములును వాణిజ్యమును క్షీణించినవి.

హిందూదేశమునందలి ధర్మపరిపాలనమును విమర్శించుటకై 1782 వ సంవత్సరమున పార్లమెంటువారి సెలెక్టుకమిటి యొకటి యేర్పాటయినది. ఆకమిటీ యెదుట విచారణ యయినవారిసాక్ష్య మిందులకు నిదర్శనముగా నున్నది.

"జార్జిస్మిత్తు అనునాతడు మనయుత్తరవుల ననుసరించి హాజరయ్యెను. ఆత డిండియాలో, ఎన్నిదినములు ఏపనిమీద, ఎచ్చట నుండెనో యనుదానినిగూర్చి ప్రశ్నించిరి. 1764 వ సంవత్సరమున తా నిండియాకు వచ్చినట్టును 1767 వ సంవత్సరము మొదలు 1779 వ సంవత్సర మక్టోబరువరకును చెన్నపట్టణమున నుండినట్లును జెప్పినాడు. మొదట చెన్నపట్టణము నాతడు చూచునప్పటికి వాణిజ్యస్థితి యెట్లున్నది యని యడుగగా, అయ్యది మంచియభివృద్ధియం దున్న దనియు, రేవుస్థలములలో చెన్నపట్టణ మగ్రగణ్యముగా నున్నదనియు సమాధానము చెప్పెను. తాను మొదట చూచినపుడు కర్ణాటదేశముయొక్కలోతట్టున వర్తకవ్యవసాయము లేస్థితియం దున్న వని యడుగఁ కర్నాటకదేశము చక్కఁగా వ్యవసాయము చేయబడుచున్నట్లును, జనమయ మయియున్నట్లును తనకు బొడకట్టె ననియు, అందుమూలమున వర్తక సంబంధమైనసరకు లనేకములు కర్చగుచున్న వనియు, చెప్పెను. తానువిడచి వచ్చినపుడు వ్యవసాయమునుఁ జనసంఖ్యయును,ఆంతరవర్తకమును చెన్నరాష్ట్రమున నేస్థితియం దున్న వని ప్రశ్నించగా, వ్యవసాయస్థితి మిగులక్షీణించి యున్న దనియును, జనసంఖ్యకూడ నక్లేయున్న దనియును వర్తకస్థలమంతయును చుట్టుముట్టడియైయుండెననియును యుత్తర మొసంగెను." అని 1783 వ సంవత్సరములోని తొమ్మిదవరిపోర్టులో నున్నది.

మదరాసుసభలోనిసభ్యులును, కంపెనీనవుకర్లందరును నబాబున కప్పులిచ్చి పెద్దపెద్దయైశ్వర్యములను గావించుకొనినారు. తా మేమి చేయుచున్న వారో, ఆసంగతులు కంపెనీడైరక్టర్లకు దెలియ చెప్ప నక్కర లేదనుకొనుచున్నారు. కంపెనీడైరక్టర్ల యుత్తరవుల ననుసరించి



1767 వ సంవత్సరమున వారియప్పు లన్నియు నేకముచేసి మితముగా నూటికి పదివంతున వడ్డీ నేర్పరుచుకొనిరి. ఆసొమ్మంతయును నబాబెప్పుడో యొకనా డిచ్చుననియెడి యాశ యున్నట్లు చెప్పుచు వచ్చిరి. కంపెనీనౌకరులకు లాభకరము గాకపోవుటచే వారావ్యాపారమును గట్టిపెట్ట నిశ్చయించిరి. అసమర్థు డగునబాబును ఆపనికి తలంప డయ్యెను. ఇంక నది యెట్లు పట్టువడగలదు. 1769 వ సంవత్సరమున నీసమాచారమంతయు తెలిపెడురిపోర్టు ఒకటి డైరక్టర్లకు చేరెను. అందుపై వారికికలిగిన యాగ్రహమునకు మితి లేక పోయెను.

"ఈవ్యాపార మంతయును మాకు దెలియకుండ మరుగుపరచి మాధిక్కారమునకు పాత్రులైతిరి. మహమ్మదల్లీనిగురించి మీరువ్రాసినస్తోత్రవాక్యము లన్నియు, ఈయప్పులమూలముగనే యుత్పన్నమయ్యె నని మే మనుమానింపవలసివచ్చినది.అది నిజమైనను, అబద్ధమైనను ఆసంగతి మీరు కప్పిపుచ్చియుంట యనునది స్వామిద్రోహమున మేటియనుటనిశ్చయము" అని 1769 వ సంవత్సరము మార్చి 17 వ తేదీని సెంటుజార్జికోటసభకును దదధిపతికిని కంపెనీడైరక్టర్లు వ్రాసినారు.

"దాదాపు యిరువదేండ్లు నిలచియున్నయుద్ధమున నబాబును మనము సంరక్షణ చేసితిమి. నబాబు, అందుల కయ్యెడుసొమ్మంతయును మనకు వసూలియ్యవలసి యుండెను. బాహాటముగ తమయందుంచినయీనమ్మిక నెల్ల, అలక్ష్యము చేయక కంపెనీనౌకర్లు తమయందు గలవిధ్యుక్తధర్మములను విశ్వాసమును యెట్లు నిర్వహింపగలరు ? తమ స్వలాభము నిందులకై యెట్లు పోగొట్టుకొనగలరు ? కంపెనీవారిబలమును వారియధికారమును, వారిసామంతమును వినియోగించి, తమకు నబాబు తాకట్టుపెట్టినపన్నులను,వసూలుచేసికొన వారికిగుండెలెట్లు తాళెనో తెలియకున్నది." ఇదియు పైతేదీనే సెంటుజార్జికోటయం దున్న

సెలెక్టుకమిటీవారికి డైరక్టర్లు వ్రాసినమరియొకయుత్తరములోనిది.

ఇందు పాఠకులుగమనింప తగినవిషయ మొకటి యున్నది. ఫ్రెంచివారికిని ఇంగ్లీషువారికిని హిందూదేశరాజ్యస్థాపనకై జరిగినయిరువది యేండ్ల యుద్ధమును నబాబు కొరకే జరిగినట్లును, ఆకర్చు లన్నియు నబాబే భరించవలసినట్లును డైరక్టర్లు వ్రాయుచున్నారు.

“పైగవర్నరును సభవారును తమయందుంచిననమ్మకము నెల్ల భంగించి స్పష్టముగా కంపెనీలాభముకన్న తదితరులలాభమునే యెక్కువగా చూచిరి. నబాబు కొందరికి, విశేషమగు మొత్తములకు అమూల్యములగుజిల్లాలలోనిపన్నులు విలియాపరచెను. ఆసొమ్మంతయు కంపెనీవారికి నబా బీయవలసినబాకీలక్రింద రావలసినది. ఈవినియోగమునకు సభవారును ప్రెసిడెంటును, యెట్లంగీకరించిరో! ఈప్రవర్తనమందలియయోగ్యత ఇందువలననే స్పష్టముగా బయట పడుచున్నది. చాలభాగ మాపన్ను లన్నియును కంపెనీవారిసంరక్షణమువలననే నిలిచినవి. కర్నాటదేశమును సంరక్షించుకర్చు లన్నియును కంపెనీవారిమీదనే పడియున్నను, పన్ను లన్నియు నక్రమముగా పైవిధమున వినియోగపరచి నబాబువలనకంపెనీవారికి రావలసిన పెద్దమొత్తములన్నియును అట్టె పెట్టి యున్నవారు.” అని 1770 సంవత్సరం మార్చి 23 తేదీని కమీషనరులకు డైరక్టర్లు వ్రాసిరి. ఈపన్నులవిలియావలన డైరక్టర్లకు కనుపడిన యక్రమము దేశము పేదపడిపోవుచున్న దని కాదు. కంపెనీవారికి నబాబువలన రావలసిన యప్పు అట్టెపెట్టియుంచినారని.

బంగాళాదేశమందలి దైశికవర్తక మంతయును కంపెనీనవుకర్లు గుత్తచేయకూడ దని నిషేధించిన వారన్ హేస్టింగ్సు, అప్పుడు మదరాసుకౌన్సిలులో మెంబరుగానున్నాడు. ఆతడు మదరాసున,ఆర్కాటునబాబు కంపెనీనౌకర్ల కిచ్చిన పన్నులవిలియా లేకుండచేయవలెనని మనస్ఫూర్తిగా ప్రయత్నించెను. ఆవిషయమున స్పష్టముగా నొక గట్టి యుత్తరమును వ్రాసెను. ఆతనిశైలి పటుత్వమైనది. ఆపాటవ మంతయు నాయుత్తరమునందున్నది. డైరక్టర్లు వ్రాసిన యుత్తరము చేరినతోడనే చెన్నపట్టణమున జరిగిన వ్యాపారమంతయు నాయుత్తరమున వివరింపఁబడియెను. అందాతడును కౌన్సిలుమెంబరులు ముగ్గురును సంతకముచేసిరి.



“మీ యుత్తరవుల సారాంశమంతయును మాకిట్టు లర్థమయ్యెను. ‘కర్ణాటకదేశములోని కొన్నిపన్నులు తనదస్కతు మొహార్లతో నబాబు యొకరికొరకై కొందరుమనుష్యులకు విలియాపరచెను. అయ్యవి కంపెనీబాకీలను విడిచిపెట్టి తమసొంతబాకీలకు వినియోగపరచుట మీకంగీకారము లేదు. నబాబునకుగాని మీనవుకర్లకుగాని అట్టిపని చేయుటకు స్వతంత్రమే లేదు. అట్టి యభిప్రాయము వారికుండగిట్టదు. ఆపత్రములమూలమున వారికి విలియాయయిన హక్కు లన్నియు మీపేర తిరిగి వ్రాయించుకొనుమని మీయాజ్ఞ. అది జరిగిన పిమ్మట నబాబు కంపెనీవారికీయవలసిన యప్పు తీర్చుటాతనికి మొదటి విధియనియును, అది యయిన తరువాత నితరులకు విడివిడిగా నీయవలసియున్న బాకీలను తీర్చుటకు దగిన యేర్పాటులను కంపెనీవారు తమ యధికారమున శాంక్షన్ చేయు డనియును మా కనుజ్ఞనొసంగుచున్నవారు. ప్రెసిడెంటును, “డ్యూప్రి” యను నాతఁడును, ఆ విలియాపత్రమున తమకు గలిగినట్లు చెప్పెడు హక్కు లెల్లను ముందుగ విడుదల వ్రాయించి యిచ్చి తమయప్పుల నెల్ల రాబట్టిపెట్టుటకై కంపెనీవారిని వేడుకొనిరి. మీయుత్తరవు లన్నియును బహిరంగముగ నందరకును దెలుపగనే వీరివలెనే తక్కినవారునుకూడ చాలభాగ మనుసరించిరి.

కాని యిందులో చాలమంది మనము చెప్పినచొప్పున కంపెనీవారి యధికారమునకు లోబడి వారిబాకీలను రాబట్టుకొనుట కంగీకరించలేదు. ఆకారణమున మేమాకార్యము నిర్బంధించి చేయించు టనుచిత మని తలంచి యట్లు చేయలేదు." అని 1770 సంవత్సరం జనవరు 31 వ తేదీని డైరక్టర్ల పేర సెంటుజార్జికోటయం దుండెడు సెలెక్టు కమిటీవారు వ్రాసినారు.

ఆసంవత్సరముననే వారన్‌హేస్టింగ్సు మరియొక యుత్తరమును వ్రాసెను. అందు నబాబు తనసొంత బాకీదార్ల చేతిలో బొమ్మవలెను న్నట్లును అతడు తన ఋణదాతల కుపకారమగు నట్టుల కంపెనీవారికి వ్యతిరేకముగ నింగ్లండులో పనిచేయదలంచి నట్లును సూచించెను.

"మొన్నటివరకును నబాబు కంపెనీడైరక్టర్లనే శరణముగ నెంచికొని వారే కంపెనీగా భావించెను. ఇప్పుడు కొందరు దురాలోచనపరులు పోగుపడి యీయిల్లు విడిచిపోయినయెడల నతనికి మంచిలాభము కలుగు నని బోధించినారు. అతని సొంతపుఋణదాతల కందరకును, కంపెనీడైరక్టర్ల నతిక్రమించి పనిచేయగల రనియును, అందులకు వారికి శక్తియును, అవసరమును కలదనియును, అతనికి నమ్మకము పుట్టించిరి. ఇంతకంటెను నీచ మగునది మరియొక టున్నది. పార్లమెంటువారును, రాజుగారును, కలిసి కంపెనీవారికి వ్యతిరేకముగా తనపక్షమున పనిచేయుదురని గట్టిగా నాతనిమనస్సున నాటుకొనినట్లు గనుపట్టుచున్నది." అని 1770 వ సంవత్సరం ఏప్రియల్ 6 వ తేదీని డైరక్టర్లకు సెంటుజార్జికోట సెలెక్టుకమిటీవారు వ్రాసినారు.

నబాబునకు వచ్చినది తప్పుసమాచారము కాదు. అయన ఋణదాతలు తమకు విలియా యయిన జిల్లాలలో శిస్తుల నెల్ల వసూలు చేసుకొని విశేషద్రవ్యము నార్జించుకొనిరి, అందువలన వారు తమదే



శమున ననేకములయిన 'ఓట్లు' నిచ్చుట కర్హులై కంపెనీడైరక్టర్లపై సవారు చేయసమర్థులయిరి. ఏవిధమైన విచారణయును లేకుండగనే వారిహక్కులన్నియును, అంగీకరింపబడినట్లు ముందుముందు మనము తెలిసికొనగలము.

ఈనడుమ నబాబు ఋణదాతల కందరకును తనరాజ్యములోని యాధారముల నెల్ల ధారవ్రాసి, భాగ్యవంతమైన తంజావూరిరాజాగారి దేశమును గాంక్షించి తనదృష్టి నావైపులకు బరప నారంభించెను. 1769 వ సంవత్సరమున బ్రిటిషువారికిని హైదరాలీకిని జరగిన యొడంబడిక ననుసరించి తంజావూరిరాజు బ్రిటిషువారికి మిత్రుడుగా నేర్పడియెను. కాని కంపెనీడైరక్టర్లు తమమిత్రుని నైశ్వర్యమునుచూచి, యసూయతను జెంది తంజావూరు దోచి కంపెనీవారికి తాసీయవలసిన ఋణమును దీరుమానము జేసెద ననిననబాబుగారి యభిప్రాయమునకు దాము కూడ నిష్టపడిరి. ఆదేశమున కర్ణాటదేశసంరక్షణమునకు కావలసిన సైన్యమ్ము నంతను పోషించగలిగిన యాదాయము వచ్చును. దేశములోని ఫలవంతమైన విశేషభాగము నెల్ల తంజావూరిరాజు తానే యనుభవించుచున్నాడు. తద్రక్షణమున కేమియును సాయము చేయకుండుట చూడ మిక్కిలి యసంబద్ధముగ గనుపట్టుచున్నది. కావున నారాజా యుద్ధపుకర్చులకై న్యాయముగ దనవంతున కీయదగినంత సొమ్ము నీయకపోయె నేని, నబాబు దొరతనమునకు దగినన్యాయమును దర్జాయును చూపి, ఈనటనము చక్కగ నెరవేర్చుటకై యాత డవలంబించు మార్గములలో నెల్ల మీ రాతనికి దోడ్పడుండని యిందుమూలమున మీకనుజ్ఞ నొసంగుచున్నారము. ఈ పై యుత్తరవుల ననుసరించి తంజావూరురాజుగారివలన లభ్యమైన ద్రవ్యమంతయును కంపెనీవారికి నబాబీయవలసియుండు బాకీక్రింద జమకా

వలయును. అంతకంటె నదనముగా నుండెనేని యాతడితరులకు విడిగా నీయవలసిన బాకీలక్రింద పోవలయును." అని 1769 వ సంవత్సరము మార్చినెల 17 వ తేదీని సెంటుజార్జికోటయందున్న సెలెక్టుకమిటీవారికి డైరక్టర్లు వ్రాసిరి.

ఈసూచన సావకాశ మయినది. దీని ననుసరించి తంజావూరు 1771 వ సంవత్సరములో ముట్టడింపఁబడెను. దానిరక్షణకై 4 లక్షల కాసు లారాజు చెల్లించవలసి వచ్చెను. కాని యిందువలన నబాబుగారి యాకలి మరింత తీవ్ర మయ్యెను. అతని మిత్రులగు బ్రిటిషువారు ఇట్టి యధికార మొకటి దేశమధ్యమునం దుండిన తమకుహానియగునని సులభముగా ననుకొన వీలు చిక్కెను. తంజావూరును మరల ముట్టడించిరి. 16 సెప్టెంబరు 1773 వ సంవత్సరమున దానిని స్వాధీనము చేసికొనిరి. అదృష్టహీను డగునారాజును అతనికుటుంబమును చెరకు గొనిరాబడిరి. అతని రాష్ట్రము లన్నియు నబాబుగారి స్వాధీనమయ్యెను.

తంజావూరురాష్ట్ర మప్పటికి శ్రీమంత మైనదియును, ఉచ్ఛస్థితియం దున్నదియు నై యుండెను. అట్టిరాష్ట్రము నబాబుగారి దుష్పరిపాలనక్రిందకు వచ్చిన కొన్నిసంవత్సరములలో క్షీణదశకు వచ్చెను. అంతకొలదికాలముననే నింత విపరీతముగ క్షీణించిన దేశ మిఁకెద్దియును లేదు. అయ్యది విజితదేశమనియు, పగవానిరాష్ట్ర మనియును భావించి మహమ్మదాలీ ఆదేశప్రజలపైఁ బడి వేధింప నారంభించెను. ఆ దేశపుపన్ను లన్నియును తనబ్రిటిషు ఋణదాతలకు విలియా పరచెను. అందువలన వాణిజ్యమును పరిశ్రామికములును నాశన మయ్యెను. కొలదికాలములోనే దక్షిణహిందూస్థానమునకు పండ్లతోటవలె నున్న తంజావూరురాష్ట్రము తూర్పుసముద్రతీరమునందలి అన్నిప్రదేశములవలెనే పీడ కొట్లాడుచుండెను.



1782 వ సంవత్సరమున రహస్యపుకమిటీవారియెదుట "పెట్రి" యనునాతడు సాక్ష్య మిచ్చెను. అతడు "తంజావూరురాష్ట్రముయొక్క ప్రస్తుతస్థితినిగూర్చి ముచ్చటించుటకు పూర్వము హిందూస్థానమునఁ గల మిక్కిలిసమృద్ధమగు దేశములలో, బాగుగ వ్యవసాయ మయ్యెడు ప్రదేశములలో, జనసంకీర్ణమయిన మండలములలో, నియ్యది కొన్నిసంవత్సరములకు పూర్వ మగ్రగణ్యముగా నున్నట్లు చెప్పవలసియున్నది. 1768 వ సంవత్సరమున నీదేశమును నేను మొట్టమొదట చూచినాను. అప్పటిస్థితికిని, ఇప్పటిస్థితికిని, ఎంతో వ్యత్యాస మున్నట్లు కనుపడుచున్నది. తంజావూరు పూర్వము గొప్పదేశికవర్తకమునకును విదేశవర్తకమునకును స్థానమై యుండెను. బొంబాయి, సూరతులనుండి దూదియును, బంగాళాదేశమునుండి ముడిపట్టును, తయారైనపట్టును, సుమాత్రా మొదలగు తూర్పుద్వీపములనుండి, చక్కెర, లవంగములు మొదలగు పరిమళద్రవ్యములును, బంగారము, గుఱ్ఱములు, ఏనుఁగులు కలప పెగు నుండియును, చైనాదేశమునుండి పరి యనేకవిధములగు నితరవస్తువులును దిగుమతి యగుచుండెను. ఈతంజావూరు మూలముగనే చాలభాగము హైదరాలీరాష్ట్రములలోను, మహారాష్ట్రరాజ్యములో పశ్చిమోత్తరభాగములలోను, హిందూదేశమున దేశీయులందరును సామాన్యముగ దుస్తులుగధరించు బంగాళాదేశపు పట్టుసరకులును, అనేకవిధములగు ఐరోపియను సరకులును, సప్లయిఅగుచుండెడివి. మజిలినులు, చేరుమాల్లు, సన్ననిచుక్కలబట్టలు (చీటీలు) రంగువస్త్రములు, నేతచారలవస్త్రములు, మరియనేకవిధములగు సన్నవస్త్రములును, ఆఫ్రికాదేశమునను, వెస్టిండియను దేశమునను, దక్షిణ అమెరికాదేశమునను, విశేషముగా కర్చుపడుచుండుటచే డచ్చివారును, డేనులును విశేషముగ పెట్టుబడి పెట్టెడు ముదుకవస్త్రములును, ఇచ్చటనుండియె

గుమతి యగుచుండెడివి. ప్రకృతిసిద్ధముగ నిన్నిసదుపాయములుగల దేశములు తంజావూరికన్న మిన్నయగునవి యత్యల్పముగ నున్నవి. ఆదేశపుభూమి ఫలవంతమైనదియు, సమృద్ధిమంత మగునదియును; కావేరి, కొలరూను అనురెండునదులు, ఆదేశమున పాఱును. ఆనదులచే నాభూములన్నియును దడియుచున్నవి. ఆనదులనీరు, తూములు, కాలువలు, చెరువులు గుండ దేశములోని ప్రతిభూమికిని ప్రవహించుచుండును. తంజావూరుదేశ మింతఫలవంత మయినది యనుటకు నీకడపటిదియే కారణము. ఆదేశముఖ మనేకవిధముల సౌందర్యముగ నుండును. నేను చూచిన హిందూదేశములోని ప్రదేశములలోకెల్ల దీనిరూపము ఇంగ్లండుతో దాదాపుసమీపించు నని చెప్ప వచ్చును. కొన్నియేండ్లక్రిందట తంజావూ రిట్లుండెడిది. కాని దానికి నాశనము మిక్కిలి శీఘ్రముగ సంభవమయినది. ఇప్పు డనేకమండలములలో నాపూర్వపుసౌభాగ్యముల జాడమైనను గనుపడుట దుర్లభముగా నున్నది.

“ఈకాలమున (1771)చేతిపనులు సమృద్ధిగా నుండెడి వనియు దేశము జనసంకీర్ణమైన దనియు, భూములు బాగుగ సాగుబడి యగుచున్న వనియును, దేశవాసు లందరును శ్రీమంతు లనియును పనిపాటలు చేసుకొనువార లనియును నాకు తెలిసినది. మొదటిముట్టడి యారంభమైన 1771 సంవత్సరము మొదలు దేశము తిరిగి రాజునకు స్వాధీన మయ్యెడువరకును, దేశము రెండుసారులు యుద్ధములకు స్థానభూతమై యుండుటచేతను, పరిపాలనమున ననేకవిప్లవములు తటస్థమగుటచేతను వాణిజ్యము చేతిపనులు, వ్యవసాయము, పీనియందు శ్రద్ధలేకుండపోయెను. వేనవేలు దేశవాసులు సురక్షితమైన స్థలముల జూచుకొనుచు పోవుచున్నారు.” అని 1762 వ సంవత్సరమున రహస్యపుకమిటీవారి నాలగవరిపోర్టులో నున్నది.



చెన్నపట్టణమునకు గవర్నరును నియమించుతరుణము వచ్చినది. ఫ్రెంచియుద్ధములనాడు మదరాసునకు గవర్నరుగా నున్న “పిగాటు” అనునాతడు 1763 వ సంవత్సరమున నింగ్లండునకు మరలి పోయెను. క్రమక్రమముగా నతడు ‘బారనెటు’ బిరుదును, ఐర్లండుదేశపు ‘పీయరు’ పదవిని పొందెను. మదరాసురాష్ట్రమున పరిపాలనమును చక్కజేయునభిలాష గల్గి 1775 వ సంవత్సరమున నతనిని మఱియొకసారి గవర్నరుగా బంపిరి. మహమ్మదాలీకి తంజావూరురాష్ట్రమును కలుపవలె నని యిచ్చినసలహాను డైరెక్టర్లు అంగీకరించినారు కారు. వారియుత్తరవులనుబట్టి ‘పిగాటు’ ప్రభువు, ఆదేశమును తిరిగి రాజునకు స్వాధీనము చేయనిశ్చయించెను. మహమ్మదాలీ మరల తంజావూరురాష్ట్రమును రాజున కీయకుండ ననేకవిధముల బ్రయత్నించెను. కాని ‘పిగాటు’ ప్రభువు పట్టుపట్టి 1776 వ సంవత్సరం మార్చి 30 తేదిని ఆ రాజును మరల సింహాసనమున ప్రతిష్ఠించెను.

అప్పటికి గవర్నరుగారికి కూడ కష్టములు ప్రాప్తించెను. ఆర్కాటునవాబుగారి ఋణదాతలనేకులలో “పాలుబెన్ఫీల్డు” అనునాతడొకడు హద్దు పద్దు లేనియౌన్నత్యమును పొందెను. 1763 వ సంవత్సరమున నతడు కంపెనీవారితరఫున సివిలుకట్టడములను గట్టించుశిల్పియుద్యోగమునకు వచ్చెను. కాని యతడు కట్టడముల నిర్మాణమునందుకన్న మరమతువడ్డీలమూలమున తనయైశ్వర్యమును నిర్మించుకొనుటయందెక్కువజయప్రదముగ పని చేసె ననిన నుత్తమముగా నుండును. తంజావూరురాష్ట్రమున రాజును మరల సింహాసన మెక్కించునప్పటికి నవాబున కాతడు 1,62,000 కాసు లప్పు నిచ్చి యుండెను. ఆసొమ్మునకు తంజావూరిరాష్ట్రపుపన్నులు తనకు విలియావేయబడె ననియు, తంజావూరిప్రజలకు విడిగా నిచ్చినబహుళ్లలో 72,000 కాసులకు నిలువున

నున్న పంటలు తనకు హామీగా యున్న వనియును పేచీ పెట్టెను. ఈసంగతినిబట్టి యప్పటికాల మెట్లుండెనో మనకు దెలియగలదు. "బానుఫీల్డు" కంపెనీవారియుద్యోగములో సాలునకు కొన్నివందలరూపాయీలుమాత్రమే వేతనము సంపాదింపుచు క్రిందిమెట్టుయుద్యోగములోననే యున్నవాడు. అతనియొద్ద చక్కనిబంగళ్లున్నవి. నబాబుగారు లెక్కకు మిక్కిలిహెచ్చైనరొక్కము తనకు బాకీ యున్నట్లు పేచీలు పెట్టుచున్నాడు. తనబాకీ తీరుమానమునకై శ్రీమంత మైనరయొకరాష్ట్రములోనివన్నులును, ఒకవ్యవసాయికజాతివారిపంటమీద నున్నపైరు లన్నియును, తనకు హామీగా యుండిన ట్లెంచుచుండెను.

'పిగాటు' ప్రభువు 'బానుఫీల్డు' గారిపేచీ లన్నియును బోర్డువారియెదుట బెట్టెను. కాని యందులకు నిదర్శనమయినదస్తావేజొకటియును "బానుఫీల్డు" తేలేకపోయెను.నబాబు తనబాకీ యొప్పుకొనునని మాత్రము వాదించజొచ్చెను. బోర్డువారీసంగతులు పరిశీలించి విడివిడిగా తా నిచ్చినట్లుచెప్పినబాకీలు సరిగా ఋజువు చేయలేకపోయె ననియును, నబాబుచేసినవినియోగములు తంజావూరిపన్నులపై మోపువల కావనియును, బోర్డులో నెక్కువమంది తీరుమానించిరి. 'బానుఫీల్డు' అంతటితో తృప్తిచెంద డయ్యెను. అతనికి స్నేహితు లనేకు లుండిరి. ఆధారములు విరివిగా నుండెను. మరల నొకసారి యతనిహక్కు లన్నియును కౌన్సిలుయెదుటకు గొనిరాబడెను.అందులో సీతూరి నాతని హక్కులన్నియు నంగీకరింపబడియెను.తంజావూరునకు 'రస్సెలు' గారిని 'రెసిడెంటు' ఉద్యోగమునకు పంపు మనిన 'పిగాటు' ప్రభువుగారిశిఫారసు బోర్డువారిలో నెక్కువమందికడ పనికివచ్చినదికాదు. ఋణదాతలకుపయుక్తముగా తంజావూరివ్యాపారములను పరిపాలింప నొప్పుకొనిన 'కర్నలుస్టూఅర్టు' అనునాతనిని కోరి వేసిరి. పిగాట్టుగారియెక్కువ



మందియుద్దేశమును నిరాకరించిరి. అందుపై 1776 వ సంవత్సరం ఆగస్టు 24 వ తేదీని 'కర్నలుస్టూఅర్టు' గారతనిని బట్టి బంధించి చెరయందు దోసిరి.

"కర్నలుస్టూఅర్టు మధ్యాహ్నము నాతో భోజనము చేసెను.నేనున్నకంపెనీవారి భవనమునకు రాత్రికూడ భోజనమునకు రమ్మనియాతని నాహ్వానము చేసితిని..............రాత్రి యేడెనిమిదిగంటలకు నడుమ కర్నలుస్టూఅర్టును నేనును గలిసి తోటలోనియింటినుండి బండిలో బయలుదేరితిమి. రెండువంతెనలకును నడుమ నుండుద్వీపమున దక్షిణపుపక్కనుండి రోడ్డువెంబడి బండిపైపునకు లెప్టినెంటుకర్నలు 'యెడింగ్టను" అనునాతడు పరుగెత్తుకొని వచ్చుట నాకంట బడినది. అతడు నాతో ముచ్చటించుతలంపుతో వచ్చె ననిన నేను గుఱ్ఱములను పట్టియే యుంచితిని, "ఎడింగ్టను" గుఱ్ఱమునెదుట నిలబడి, యొరదీసినకత్తి చేతం బట్టుకొని సిపాయీలను విసరి బిగ్గరగా పిలిచెను. రెండవపైపున నుండుచెట్లచాటుననుండి సిపాయీలు చక్కవచ్చిరి. ఆపైపునుండి కెప్టను "లేసాటు" అనునాతడు చేతిలో పిస్తోలు పట్టుకొని నాబండియొద్దకు వచ్చి నాతో "నీవిప్పుడునాఖయిదీవైతివి" అని చెప్పెను....... అంతట నన్ను కెప్టను 'లేసాటు' వెనుకవచ్చుచున్న "బానుఫీల్డు"గారిబండిలోనికి దీసికొనిపోయెను." అని 1776 వ సంవత్సరము సెప్టెంబరు 11 వ తేదీగల 'పిగాటు' ప్రభువుయొక్క మదరాసుపరిపాలనవిప్లవకథనమున వ్రాయబడి యున్నది.

కంపెనీడైరక్టరు లీసమాచారమును విన్నంతనే నిర్విణ్ణులైరి. కాని వారిలోవారి కభిప్రాయభేదము కలిగెను. 'పిగాటు' ప్రభువును వెంటనే వదలివేయు డని యుత్తరవులు చేసిరి. కాని యుద్యోగమునుండి వెనుకకు రమ్మనికూడ ఆతనికి నుత్తరవు లంపబడెను. ఈయుత్తరవు లిండి

యాచేరువరకు మానావమానములు ప్రసక్తి లేకుండ నాతడు 1777 వ
సంవత్సరమున బందిఖానాలోనే మరణించెను. “సర్ థామస్‌రంబోల్డు” అ
ను నాతడాతనిస్థానమున 1778 వ సంవత్సరమున గవర్నరుగా వచ్చెను.

1770 వ సంవత్సరమున నిట్లు గడబిడ లన్నియును తెచ్చిపెట్టిన
నబాబుగారిఋణదాతలు తమస్వలాభమును మరచి యుండలేదు. ఇం
తకు మున్ను 1767 వ సంవత్సరములోని మొదటియప్పునుగూర్చి ము
చ్చటించితిమి. 1797 వ సంవత్సరమున నిప్పుడు రెండవయప్పుకూడ
నొకటి చేయబడియెను. పనికిమాలియున్న నబాబుగారిగుజ్జుపుదళమును
విసర్జింపు మని యాతని ప్రోత్సహించిరి కాని యాతనికడ వారికిచ్చుట
కు సొమ్మేమియును లేకపోయెను. కంపెనీవా రొప్పుకొనినయెడల “సై
లరు” “మెకెంజీ” “కాలు” అనువారలు 1,60,000 కాసు లప్పు
నిచ్చెద మనిరి. అందులకు కంపెనీవా రొప్పుకొనిరి. ఇందులకు పన్ను
లు విలియామే కావలసి యుండెను. అట్లే జరిగెను. రెండేండ్లకు పిమ్మ
ట నబాబు మేనేజరు “ఆజిల్లాల పన్ను లన్నియు దేనరవారియాజ్ఞాను
సారము, ఐరోపియనులతనఖాలను దీర్చుటకై వేరుగా నుంచితిమి. సై
లరుగారిగుమాస్తాలు ఈతనఖా లన్నియును వసూలు చేయుటకు కని
పెట్టుకొని యున్నవారు. వసూలైనపన్ను లన్నియును వారే పుచ్చుకొ
నినయెడల దేనరవారిసైన్యమున కేడెనిమిదినెలలజీతము లీయవలసియు
న్నది. అది ముట్టచెప్పుటకు వీలు కనుపడదు.” అని మొజ్జి లెత్తెను.

1777 వ సంవత్సరము బహుకార్యవిశిష్టమైనది. ఆసంవత్సర
మున మూడవయప్పొకటి ఇరువదిలక్షల కాసులకు సైగా చేయబడి అ
ది మొత్తమునుతో కలుపబడియెను. “సర్ థామస్‌రంబోల్టు” గారు చె
న్నపట్టణము చేరినతోడనే యత్యాగ్రహభరితులై యీక్రొత్తయప్పు
నుగూర్చి యిట్లు వ్రాసిరి.



“గుజ్జుపుదళమునకైన 1,60,000 కాసులును, పూర్వపుఋణదా
తల కీయవలసినమొత్తములును, కంపెనీవారి కీయవలసినదియు, గాక
మరల నబాబు 25,20,000 కాసు లప్పు చేసినాడు. ఈయప్పుమొత్త
ము దారుణముగ నున్నది. నా కీసంగతు లన్నియును దెలియుసరికి నా
కు కలిగినయాశ్చర్యము నేమని మీకు నే వ్రాయగలను! ఈఋణదా
త లందరును కంపెనీనౌకరులే యయి యున్నారు. అందువలన కంపెనీ
పక్షమున నేజేయుకార్యముల నసూయచే విఘాతములు కల్పించుచుం
దురు. ఈసంగతు లన్నియును మీకు దెలుపుటలో నాకు కంప మెత్తు
చున్నది.” ఈయుత్తరము 1778 వ సంవత్సరము మార్చి 15 తేదీని
డైరక్టర్ల పేర వ్రాయబడియెను.

కర్ణాటదేశమునం దిట్టి దుస్థితిలో నున్నవ్యాపారములనుండి
రంబోల్డుగా రుత్తర సర్కారులపై తనదృష్టి పరపెను. ఆదేశము
ఉత్తరముగా వ్యాపించినసముద్రప్రాంత మయియుండి బ్రిటిషువారియ
ధీనమం దున్నది. దేశ మనేకజమీందారీలక్రింద విభాజ్యమైయున్నది.
వా రందరును వారివారిజమీలలో పరిపాలకులును వంశానుగతముగ ను
న్నభూస్వాములునై యున్నవారు. కంపెనీవారిపరిపాలన ఈజమీందారు
లయెడల మిగుల కాఠిన్యముగ నున్నది. వారిజమీ లన్నియును పేదప
డి పోయినవి. వారిపూర్వపుఐశ్వర్యమునకును బ్రస్తుతస్థితికిని సర్ థా
మసే సాక్ష్యమై యున్నాడు.

“దేశమున నుండు పేరుగలదేశవాసులనందరను తరిమివేయుట
వారిరాజనీతిలోని ముఖ్యాంశమైనట్లు గనుపట్టుచున్నది. హిందూదేశ
మున కంపెనివారి పరిపాలన మున్నంతవరకును శాశ్వతమగు నీనింద ని
లిచి యుండగలదు. బంగాళాదేశములును సర్కారులును సుఖముగా
నుండురోజులకును, ఇప్పటి వారిపాడుస్థితికిని నాశనయోగమునకును గల

వ్యత్యాసమును గాంచి వారిపేరు ప్రఖ్యాతులన్నియును నశించిపోయిన ఈజాతివారియెదుట నిలిచి దేశమున నేమూల చూచినను కుప్పతిప్పలుగ నుండు వారిరాజు లందరు నేమయిరో, వారినాయకులును శ్రీమంతులగువారి భూస్వాములును, వీ రందరిగతి యేమైనదో, ఎవ్వరినేని చెప్పమనుడు!

“కంపెనీడైరక్టరు లీనడుమ నవలంబించినవ్రాతలనుబట్టి కంపెనీవా రీదేశమున రాజ్యసంబంధమైనకొన్ని హక్కులనుమాత్రమే గాక భూమి కంతకును వారు ప్రత్యేకపుహక్కుదారులుకూడ నయినట్లు తెంచవలసి యున్నది. ఈభూము లన్నియును దరతరములనుండి యాదార్యవంతు లగుజమీందారులకు చెందియుండి వారే యీభూములకు ప్రత్యేకపుహక్కుదారులై యుండిరి. ఈసంగతులు వినిన నైరోపాఖండమున చిత్రగాథలవలె నుండును. అట్టివా రందరును నిముసములో కంపెనీవారిపొలములలో పనిచేసి దున్నుకొని బ్రతికెడువారుగను, ఇజారాదారులుగను మారిపోయిరి. మొగలాయివిజయుల కీనాయకు లందరు నిచ్చెడిది శిస్తుకాదు. కొంత కప్పము. అదియే వారికి పూర్వమునుండి యున్నస్వాతంత్ర్యము నొప్పుకొన్నందులకు మూల్యము (ఈమొగలాయివిజయులు వారి దేశము నెప్పుడును పూర్ణముగా జయింప సమర్థులు కాలేదు) అదియే వారియాస్తియును, వారియధికారములును వారియాచారవ్యవహారములును వారికి నుండనిచ్చినందులకు ప్రతిఫలము. దేశములోని వారియభిప్రాయమునుబట్టి అట్టిస్థితియందును అట్టిదర్జాయందునుఉన్నవారి కుండవలసిన విశేషముగుపరివారమునుఖర్చులును న్యాయముగ విచారించి తగురీతి నాకప్పమును గట్టుచుండిరి. మొగలాయిచక్రవర్తికడ రాజప్రతినిధి యగు “సుబా” ఆజమీందార్లతో నామొత్తమును నిరుకు పరచుకొనును. వసూళ్లలో వారి కేమియు జోక్యములే



దు. కంపెనీవారికి సర్కారులు లభ్యమైనతరువాత కూడ వివేకముగనున్న నామార్గములనే యనుసరించి యుండినయెడల నుభయపక్షముల వారికిని సుఖముగ నుండియుండును. దేశ మంతయు నుచ్ఛదశయందుండియుండును. వారిసామంతులయౌన్నత్యముతోడ తామును నౌన్నత్యమును బొందియుందురు.” అని రంబోల్డుపై మోపినయభియోగముల కాత డిచ్చినసమాధానగ్రంధ మందున్నది.

దేశ మంతయు తిరిగి దర్యాప్తుచేసి, ఉత్తరసర్కారులలోనిజమీలపై చెల్లవలసియుండుపన్నులను శిసలుపరచుటకై సరిక్యూటుకమిటీ యొకటి ఏర్పాటు చేయ సిద్ధాంత మయ్యెను. “రంబోల్డు” ఈకమిటీని నిలుపుచేసి జమీందారుల నందరిని చెన్నపట్టణము రానుత్తరవులు చేసెను. ఇందుమూలమున వారి కలజడి కలిగెను. అట్లు పిలువసంపినముప్పదియొక్కజమీందారులలో పదునెనుమండ్రాయుత్తరవుల ననుసరించి వచ్చిరి. ఐదేండ్ల కొకయమరకము వారితో నేర్పడెను. “సర్కారులు కంపెనీవారియధీన మైనది మొదలు, అప్పుడప్పుడు కట్టినపన్ను లన్నియు మొత్తముచేసినచో పూర్వపుదానికన్న నూటికేబది వంతున నదనముగా నున్నది.” అందులకు నిదర్శనము చూడుడు. మొగలాయిలకాలమున పెద్దాపురముసంస్థానము 37,000 కానులు కప్పము కట్టుచుండెడిది. అదియిప్పుడు 56,000 లకు రంబోల్డుగారు వృద్ధిచేసిరి. ఒక్కబీదసంస్థానమునకు దక్క తక్కినవాని కన్నిటికిని ఇట్లే అదనముగా పన్నులు కట్టబడియెను.

కాని డైరక్టర్లకు దృప్తి కలుగలేదు. సరిక్యూటు కమిటీవలన నింతకంటె నెక్కువతృప్తికరముగ పనిజరుగు నని వారి కొక గొప్పనమ్మిక ముదయించెను. అందుపై “రంబోల్డు” గారు కమిటీని నిలుపుచేసి వారియుత్తరవులను దిరస్కరించినా రనియు, జమీందారుల నందరి

ని చెన్నపట్టణము రప్పించి వారి కందరకును గష్టమును కలిగించినా రనియును నాయనపై నేరము మోపిరి. పైపెచ్చు అతడు లంచము పుచ్చుకొన్నా డనియును రెండుసంవత్సరములలో సైరోపాకు 1,64,000 పౌనులు పంపినా డనియును జూపసాగిరి. ఆకారణమున 1781 వ సంవత్సరము జనవరిలో కంపెనీనౌకరీలోనుండి యాతనిని తొలగించిరి.

1781 వ సంవత్సరము జూను నెలలో "లార్డుమాకార్టనీ" యనునాతడు మదరాసుగవర్నరుగా వచ్చి చేరెను. ఈతడు శిష్టాచారసంపత్తి గలవాడు. వినయసంపన్నుడు. ఉచితజ్ఞుడు, రాజకీయవ్యాపారానుభవము కలవాడు. నిస్సంశయముగ ప్రజ్ఞావంతుడు. రాష్ట్రమంతయును అనర్థకములతోడను దుర్గతులతోడను మునిగి యున్నది. ఉచితకాలమున ప్రభుత్వమునకు దోడు మైసూరుపరిపాలకు డగుహైదరాలీతోటటస్థమైనగొప్పయుద్ధపుటనర్థక మొకటి వచ్చి చేరెను. అతనిగుఱ్ఱపుదళము దేశమును నాశనము చేసెను. చెన్నపట్టణము చుట్టుప్రక్కల చాలమైళ్లదూరము వరకును గలప్రదేశము లన్నియును జనశూన్యము చేసి పాడు చేసెను. కర్ణాటదేశమంతయు నుడికిపోయెను. జను లందరు నడవులపాలై పోయిరి. పొలములు గయాళు పడిపోయెను. గ్రామము లన్నియును.........భస్మీపటలము గావింపబడెను. ఒకజడుపువెనుక మరియొకజడుపు ప్రారంభమయ్యెను. మదరాసుకౌన్సిలువారీ ఘోరశత్రువు నెట్లు దాకుదుమా యని వ్యూహములు పన్నుచు నూగిసలాడుచుండిరి.

యుద్ధకార్యప్రసంగముతో మన కీగ్రంథమున ప్రసక్తి లేదు. అప్పుడు గవర్నరుజనరలుగా నున్న "వారన్ హేస్టింగ్సు" దక్షిణహిందూస్థానమును మరల గాపాడుటకై "సర్ ఐరీకూటు" అను అనుభవజ్ఞుడైన సేనానాయకుని పంపెను. హైదరాలీ వెనుకకు మరలి పోయెనే



కాని యాతడు విజితుడు కాడయ్యెను. 1782 సంవత్సరమున "ఐరికూటు" మదరాసు విడచి బంగాళమునకు బోయెను. 1782 సంవత్సరము డిశంబరు నెలలో హైదరాలీ మరణించెను. 1783 వ సంవత్సరమున నతనికుమారు డగుటిప్పుసుల్తానుతో నొడంబడిక యయ్యెను.

కుప్పతిప్పలుగా నున్నయీయనర్థములును జనులదారిద్ర్యమును కలియ 1783 వ సంవత్సరమున మద్రాసులో నతివ్యాప్తమగుభయంకరక్షామ మొకటి సంభవించెను. కంపెనీవారి పన్ను లెప్పుడును నదనుగానే యుండుచు వచ్చెను. కాని (వారి పెట్టుబడి యనగా) పన్నులలో ద్రవ్యము పెట్టి ఐరోపాదేశమున నమ్ముకొనుటకై సరకులు కొనుటనూలమున ఆజాస్తియంతయును కమిస్సామయ్యెను. ఆఫీసురికార్డులోనుండి యీక్రిందిమొత్తములు కైకొనబడినవి.

చెన్నరాష్ట్రమున పండ్రెండు సంవత్సరముల జమాఖర్చు.

| సంవత్సరము. | మొత్తమునికరాదాయము. | కంపెనీవారు చెల్లింపవలసియుండు పెట్టుబడికి ఖర్చులు. | జాస్తి. | కమిస్సా. |
|---|---|---|---|---|
| మే. ఏప్రిల్. | కాసులు. | కాసులు. | కాసులు. | కాసులు. |
| 1767-1768 | 3,81,330 | 4,89,012 | ... | 1,07,682 |
| 1768-1769 | 3,69,720 | 6,91,471 | ... | 3,21,751 |
| 1769-1770 | 5,00,110 | 4,67,492 | 32,618 | ... |
| 1770-1771 | 5,62,359 | 4,34,393 | 1,27,966 | ... |
| 1771-1772 | 5,58,860 | 4,07,446 | 1,51,414 | ... |
| 1772-1773 | 5,29,233 | 3,09,138 | 2,20,095 | ... |
| 1773-1774 | 5,24,762 | 4,07,144 | 1,17,618 | ... |
| 1774-1775 | 5,03,629 | 4,54,589 | 49,040 | ... |
| 1775-1776 | 5,14,591 | 3,45,867 | 1,68,724 | ... |
| 1776-1777 | 5,63,349 | 5,33,182 | 30,167 | ... |
| 1777-1778 | 2,83,198 | 4,85,830 | ... | 2,02,632 |
| 1778-1779 | 4,94,208 | 8,03,924 | ... | 3,09,716 |
| మొత్తము. | 57,85,349 | 58,29,488 | 8,97,642 | 9,41,781 |

అదనముకానీ, లోటుకానీ, పెట్టుబడి సరకులను కొనుట యెప్పుడును మానలేదు. ఈకాలమున నైరోపాకు పంపబడినసరకులవెలమొత్తము మొదటిధరప్రకారము కట్టి చూచినచో నిరువదిలక్షలకాసు లగును.

కాని తమయప్పులకై పన్నులవిలియాను పొందినబ్రిటిషుఋణదాతల యొత్తుడు కంపెనీవసూళ్లవలన గలిగెడుబాధలకన్న పదిరెట్లధికముగా నుండెను. పార్లమెంటులో నీవ్యాపారము కడముట్ట పరిష్కారము కావలసివచ్చెను. అప్పుడాసభలో నీఋణదాతలయధికారబలము హెచ్చయి న్యాయమయినదికానీ, అన్యాయమైనదికానీ, వారిబాకీలన్నియు నేవిధమయినవిచారణయును లేకుండగనే యంగీకరింపబడియెను.

ఈఋణదాతలతో ఘనుడును, జయప్రదముగ బనిచేసినవాడును అగు “పాలుబెన్ఫీల్డు” అనునతడు పార్లమెంటులో పలుకుబడిని సంపాదించుటకై హిందూదేశమున తాను పోగుచేసినవిశేషద్రవ్యమంతయును ఇంగ్లండున వినియోగపరచెను. తన్మూలమున తానును మరియేడుగురును పార్లమెంటులో సభికులైరి. అతడు బలవంతుడును పలుకుబడిగలవాడునై యుండుటచేత మంత్రిబలగముకూడ వానిమనస్సు నొప్పింప వెనుదీయు చుండిరి.

“ఆర్కాటునవాబుగారిఋణదాతలును వారిచేతులలోని కీలుబొమ్మలవలె సంచరించు నితరులును ఋజువర్తనులుకానీ, దగాకోరులుకానీ, పార్లమెంటులో ద్రవ్యమూలమున దెచ్చినవిశేషాభిమానముచే, వారిలాభమును నిలుపుటకై, 1784 వ సంవత్సరములోని మంత్రులబలగము, న్యాయమయినదయినను కాకున్నను వారు రావలె నని కోరుచున్నసొమ్మంతయును వారు వసూలుచేసుకోవలసినదేయని తీరుమానించిరి.” ఇత్యాది మిల్లుగారి బ్రిటిషు ఇండియాచరిత్ర 6 సంపుటమున నున్నది.



బ్రిటిషుహిందూదేశమునుండి మే మిది వ్రాసితిమి. ఆచరిత్రకారుడు బ్రిటిషుపార్లమెంటుచరిత్రలో మిక్కిలి యవమానకర మగునీయుపాఖ్యానమును గూర్చి “యెడ్మండుబర్కు”గారిచ్చినయుపన్యాసమునుండి యీక్రిందిభాగము నెత్తి వ్రాయనారంభించెను. ఆవాక్యములు సదా జ్ఞాపక ముంచుకొనదగినవి.

“పాలుబెన్ఫీల్డు”పార్లమెంటును సంస్కరణముచేయుమహాపురుషుడు. ఈతడు సకలకష్టముల వడి సంబంధము కలుగచేసుకోని దీరాజ్యమున నేప్రదేశ మున్నది? ఏనగర మేపరగణా, ఏమండల మేరాజ్యమేన్యాయసభ యీతనికి సంబంధము లేకున్నది? హిందూదేశమోక్షమునకై ధర్మార్థముగ నాతడనేకకష్టముల బడుచున్నవాడు. ఆకష్టములనడుమ బహుజనహితోత్సాహపరుండగునీఋణదాత తనస్వదేశమున జీర్ణమయియున్న రాజ్యాంగతంత్రము నేమరడయ్యెను. ముందు చేయబోవు సంస్కరణముల నన్నిటి నొకచోట గుమిగూర్చి నిలువచేసెను. అందులకై యీభవనము నలంకరింప క్రొత్తక్రొత్తయలంకారముల సంపాదించు ఘనకార్యములలో దిగుట కీషత్తును సిగ్గుపడియెరుంగడు. ఆతనిప్రయత్నము, ఇతరభవనముల కలంకారసూచకముగనో అవమానకరముగనో ఉండి, పూర్వమునుండి వన్నెయును వాసియును గాంచి, యిప్ప డిప్పడు కనుమాయుచున్న పూర్వపుబొమ్మలచే నలంకరించవలెనని కాదు. యథార్థ మగువర్తమానసుగుణసంపత్తికి స్థానమై యెప్పుడుజీవనిదర్శనములు సమకూర్పవలె నని యాతనియాశయము. “పాలుబెన్ఫీల్డు” తనతోపాటు గడచిన పార్లమెంటులో నెనమండ్రుసభ్యులను కావించినాడు. ఎంతెంత స్వచ్ఛరక్తప్రవాహముల నీప్రస్తుతసభానాళముల ప్రవేశపెట్టునో?

“బెన్ఫీల్డు” గారి పనికిమాలినయనుభవశాలియగు ఏజంటు లం

డనువివాదలను దుమ్ము నేలలో ప్రవేశింపుడని మీమంత్రిగారితో నివేదించినాడు. ఈసద్వ్యాపారమునకే యీతడు బరితెగి బహిరంగముగ కచ్చేరి పెట్టి ఖజానాకొట్టు తెరచుటకు తెగించినాడనియును, గడచిన పార్లమెంటు యెలెక్షనువ్యాపార మంతయును, అచ్చటనే జరుగునటుల నేర్పాటు జేసెననియు, మీరు జ్ఞాపక ముంచుకొనవలసి యున్నది. అది యంతయును బహిరంగముగ "బెన్ఫీల్డు" గారిపక్షమున పనిచేయుచున్న, ఏజంటుచే ప్రత్యక్షముగా నెరవేర్పబడెను. ఈపను లెల్ల హిందూదేశలాభమునకై ఆదేశములో జరుగుచున్నకట్టుబాటుల ననుసరించి జరిగెను. చాలమంది ఈదేశములోని యూదార్యపురుషులును, అనేకులగు ప్రజలును హేయ మగునీబంగారుపాత్రమున పోసినసార మంతయును పీల్చివేసినారు. కేవలలజ్జాకర మగునీవ్యభిచారము గణనలోనికి రా దనుకొంటిరా. బాహాటముగద్రాగి వ్యభిచరించిన జాతీయవ్యభిచారమునకును తత్సంబంధ మగునల్లరులకును దగినప్రతిఫలము కోరువాఁడుండ రనుకొంటిరా? అదియే యిది. ఇప్పుడు మీయెదుటకు వచ్చినది. ఈయెలెక్షనును చిత్రవిచిత్రముగా నడపినయసలుదారుడు వచ్చి తనలోటులను దీర్చుమనుచున్నాడు. అందువలన "బెన్ఫీల్డు" గారితగాయిదాలును ఆయనసిబ్బందియొక్క పేచీలును విచారణ లేకుండ తీర్మానము కావలెను" అని ఆర్కాటునబాబుగారి యప్పులను గూర్చి బర్కుగారు ఉపన్యసించిరి.

బంగారుపాత్రమున పోసినసార మంతయును ఇంగ్లండుదేశసామంతులును ప్రజలును పీల్చివేసినారు. దానిమూల్యము హిందూదేశముపై బడినది. "బెన్ఫీల్డు" గారిబాధ్యత లన్నియును కర్నాటదేశవ్యవసాయికులు తీర్పవలసియున్నది. ఆకారణముచేత నాయనహక్కుబేహక్కులవిచారణకే నిమిత్తము లేకుండ పోయినది. ఏవిధమైనవిచా



రణయును లేకుండ నాతనిహక్కులన్నియు నంగీకరింపబడుటచే, అనర్థకములు మరింత మెండైనవి. బ్రిటిషుఋణదాతలు కుప్పతిప్పలుగ వచ్చి యదేరీతిని శీఘ్రముగ నైశ్వర్యవంతు లగుటకై కర్నాటదేశమునం దంతటను మూగిరి. కర్ణాటనబాబుగారు 2,03,90,570 కాసులమొత్తముగలబాకీలు మరికొన్నియున్నట్లు క్రొత్తతగాయిదా వచ్చెను. ఈహక్కుబేహక్కు లన్నిటిని దీర్చుటకై కమీషనరులను నియమించిరి. ఈలోన కర్ణాటరాజ్యము "వెలిస్లీ" ప్రభువుగారు బ్రిటిషుపరిపాలనముక్రిందికి తెచ్చిరి. ఈయప్పు లన్నియు నంగీకరింపబడినయెడల కంపెనీదొరతనమువారే యిచ్చుకొనవలసి వచ్చెను. అందువలన విచారణ జరిగెను. ఆవిచారణలో 13,46,796 కాసులమొత్తము మాత్రమే న్యాయమైన యప్పుగా నంగీకరింపబడియెను. తక్కిన 1,90,00,000 కాసులపైచిల్లరయును దగాసొమ్మనియును అది రాబట్టుకొనుటకు వల్లపడ దనియును దీరుమాన మయ్యెను.



# హిందూదేశార్థికచరిత్రము.

## ఏడవ ప్రకరణము.

### నూతనస్వాస్థ్యములు. పూర్వస్వాస్థ్యములు.

(1785-1807)

పిట్టుగారి యిండియాబిల్లు 1784 సంవత్సరమున చట్టమైనట్టు లిదివరకే చెప్పియుంటిమి. ఆతేదీవరకు మదరాసురాష్ట్రమున ఈస్టిండియాకంపెనీవారికి గలస్వాస్థ్యములు మదరాసుపట్టణమును సముద్రతీరమున గల యుత్తరసర్కారులను పొడుగుపాటి దేశభాగమును. ఆకారణమున మదరాసురాష్ట్రమున మొట్టమొదట స్థిరవసతులన్నియును నీసర్కారులలోనే చేరియున్నవి.

క్లైవుప్రభువు కంపెనీవారికి బంగాళాదేశమున దివానీపదమును సంపాదనచేసినపుడే సర్కారులలోని శ్రీకాకుళము, రాజమహేంద్రవరము, ఏలూరు, కొండపల్లి, యను నాలుగుప్రదేశములకును మొగలాయీచక్రవర్తి కడనుండి పట్టాను పొందెను. కొంతకాలము స్వదేశపరిపాలనమునం దుండినపిమ్మట 1769 సం॥రమున నీసర్కారులన్నియును, రాష్ట్రీయనాయకులయొక్కయు, వారిసభలయొక్కయు ఏలుబడికి లోనయ్యెను. పరిపాలనాపద్ధతి బంగాళాదేశమునందెట్లో ఇచ్చటనునట్లే.

1795 సం॥రమున కంపెనీడైరక్టరులు సరిక్యూటుకమిటీ యనగా సంచారసభ యొకటి యుత్తరసర్కారులయొక్క స్థితిగతుల విచా



రించుటకై నియమించిరి. జనసంఖ్య పంటపైరులు చేతిపనులస్థితిగతులు రాష్ట్రమునకు వచ్చెడు మొత్తమురాబడిపన్నులు జమీందారులకును, రైతులకును గలహక్కులు మొదలగువాని నీసభవారు నిర్ధారణచేయవలయును. జమీందారులకు వారిరాబడి నిలుపుటయును, రైతుల ననవసరముగ పీడింపకుండ సంరక్షించుటయును, తమయభిలాషయైనట్టు కంపెనీడైరక్టర్లు తెలియపరచిరి. బంగాళాదేశమున స్థాపనచేసిన శాసనములన్నియును నిచ్చటగూడ నమలు జరుపుటకు సాధ్యపడునేమో యోచింపు డనికూడ కోరిరి. అందులకై కమిటీయొకటి యేర్పడినది. క్రిందటిప్రకరణమున మనము ముచ్చటించిన తెన్నూన రంబోల్డుగారు 1778 సంవత్సరమున ఆకమిటీని రద్దుపరచిరి. 1783 సంవత్సరమున నయ్యది పునరుజ్జీవింపచేయబడెను. 1788 వరకు విచారణ జరుగుచునేయుండెను.

కంపెనీవారు చేసిన రిపోర్టులనుబట్టి ఉత్తరసర్కారులలోని భూములన్నియును, చాలభాగము జమీందారుల స్వాధీనమునందున్నట్లే తేలినది. మన్యప్రాంతములందున్న కొన్నిప్రదేశములలోని జమీందారులు ఒరిస్సారాజుగారి సంతతివారు. వారు వారిరాష్ట్రములలో నన్నివిధములను స్వతంత్రపరిపాలకులుగా నుండిరి. కాని మహమ్మదీయప్రభువులకుమాత్రము కొంత కప్పము కట్టుచుండిరి. సమప్రదేశములయందుండెడుజమీందారు లందరును ఇంతకంటె స్వతంత్రత తగ్గినవారై యుండిరి. అయినను వారియెస్టేటుపై వచ్చెడుశిస్తులన్నియును వారియిష్టమునచ్చినట్టు లుపయోగించుకొనవచ్చును. దొరతనమువారికిమాత్రము పన్నులు చెల్లించుచుండవలెను.

జమీందారీభూములుకాక హవేలీభూము లని దొరతనమువారికి మరికొన్ని స్వంత శేరీభూము లుండెడివి. అవి ముఖ్యపట్టణములకు చేరి

యుండుప్రదేశములు. మహమ్మదీయప్రభువులసైన్యములకును సివిలుద్యోగస్థులకును సప్లయిలకని యివి యుంచబడును.

“బ్రిటిషుదొరతనము వచ్చినదిమొదలు ఈహవేలీభూములన్నియును జమీందారులస్వాధీనమున లేవు. ఆప్రదేశములన్నియును దొరతనమువారి యధీనమునందే యుండి రైతులకును వారికిని కుదిరినషరతులపైన అమరక మగుచుండెను. ఈభూములపన్నులవసూళ్లవిషయమై తమచిత్తమువచ్చినపద్ధతి నవలంబించుచు వచ్చిరి.”

అప్పుడు కాదలంచినపద్ధతిమాత్రము ఏమియును వివేకముగలపద్ధతి కాదు. ఈహవేలీభూములన్నియును ఏజంట్లకో లేక ఉన్నవిలేనివి ఊహించి గుత్తచేసెడు ఇజారాదారులకో యియ్యబడుచుండెను. ఇందుచే ప్రజలను వారిచిత్తమువచ్చినట్లు నొత్తుడుచేయుటకు సావకాశముండెడిది.

జమీందారీలలోను హవేలీలనుకూడ అనాదిసిద్ధముగ గ్రామసంఘములు కొన్నియుండెడివి. ఈసంఘములు, జమీందారులుగాని దొరతనమువారుగాని గ్రామములోనిరైతులను ఒత్తుడుచేయకుండ సంరక్షించెడికొద్దిపాటి స్వరాజ్యములవంటివి. మనువునకు పూర్వమునుండియు నున్నయీసనాతనపద్ధతి ఎన్నిసామ్రాజ్యములు నాశనమైనను, ఎన్నివంశము లంతరించినను, నిలిచియున్నది. యుద్ధసమయముల వీనిమూలముననే ప్రజలనెమ్మదికిని నారిఏర్పాటులకును భంగములేకుండ నుండినది. పదునెనిమిదవశతాబ్దమున ఈస్టిండియాకంపెనీవారినౌకర్లకందరకు నీసంఘము ఉత్తమమైనదిగను నిరుపమానమైనదిగను గనిపించెను.

“భూగోళశాస్త్రానుసారముగ చూచితిమేని సేద్యపుభూమియును గయాళుభూమియును కలిసి కొన్నివందలో వేలో యకరములుగలప్ర



దేశమునకు గ్రామమని పేరు. రాజకీయమార్గమున చూచినచో నదియొకసంఘమనికాని నాగరికస్థానమనిగాని చెప్పనొప్పును. దానికి గలయుద్యోగస్థులును నౌకరులును నీక్రింద వివరముగ తెలుపబడియెను. పటేలు అనునాతడు గ్రామమునకు పెద్దకాపు. సామాన్యముగ గ్రామయాజమాన్యమంతయు నాతనిది. గ్రామస్థులతగాదా లన్నియును పరిష్కరించువాడతడే. రక్షకభటులయధికార మతనిది. గ్రామములోని పన్నులన్నియును నతడే వసూలుచేయువాడని యిదివరకే చెప్పియుంటిమి. జనులయోగక్షేమములును స్థితిగతులును పూర్ణముగ నెరింగినవాడితడే యైయుండుటచేతను అతడే గ్రామమున పలుకుబడి గలవాడగుటచేతను, అంతకంటె నాపనిచేయుటకు తగినవాడు మరియొకడుండడు. కరణ మనునతడు గ్రామములోని వ్యవసాయపులెక్కలు వ్రాసి దానితో చేరిన యావత్సంగతులను రిజిష్టరీచేసియుంచును. తలారి యనువానిపని అచ్చటచ్చట జరుగు ఫిర్యాదులును నేరములును వాకబుచేసి చెప్పుటయును ఒకయూరినుండి మరియొకయూరికి ప్రయాణము చేయుబాటసారులను సంరక్షించుటయును. తోటి యనువానిపని యెల్ల పంటపైరులను కాపాడుచు వానికొలతలో సహాయము చేయుటయును, మరి గ్రామములోని యితరవ్యాపారములను చూచుటయును. ఎల్లరి యనగా గ్రామసరిహద్దుల కాపాడుచు తగవులువచ్చునపుడు అందులనుగూర్చి సాక్ష్యములను చెప్పునాతడు. నీరుగంటి యనునాతనిపని చెరువులు నీటికాలువలు వీనిలోనినీరు వ్యవసాయమునకై పెట్టుకొననిచ్చుట. గ్రామపూజ బ్రాహ్మణునిది. గ్రామములోని పిల్లలందరకు ఇసుకలో వ్రాయుట చదువుట నేర్పునాతడు బడిపంతులు. విత్తనములు చల్లుటకును చేలుకోయుటకును, మంచిచెడ్డలు యోచించి చెప్పువాడు పంచాంగపుబ్రాహ్మణుడు. ఈతనినే జ్యోతిష్కు డందురు. కమ్మరియును, వడ్రంగి

యును వ్యవసాయపుపనిముట్లు చేయుదురు. రైతుల కిండ్లుకట్టుదురు. కుమ్మరి, చాకలి, మంగలి, గోరక్షకుడు, వైద్యుడు, సంతోషసమయముల వచ్చుచుండుభోగకాంత గాయకుడు, కవి, ఈయుద్యోగస్థులును నౌకరులును కలిసి గ్రామసిబ్బంది యగును. కొన్నిభాగములలో నీసిబ్బంది కొంచెము తగ్గియుండును. అతగ్గియుండుచోట్ల ఈపనులన్నియును ఉన్నవారలే సర్దుకొందురు. కొన్నిగ్రామములలో నీపైనచెప్పినవారలే హెచ్చుగానుందురు.''

''కొలదిరూపమున నున్నయిట్టి మునిసిపలుగవర్నమెంటు నేర్పరచుకొని దేశవాసు లందరును అనాదిసిద్ధముగ జీవించుచున్నారు. గ్రామసరిహద్దులు సామాన్యముగా చెడిపోవుటయే లేదు. యుద్ధమువలన గాని కాటకమునవలనగాని రోగమువలనగాని గ్రామమంతయు జనశూన్యమై నాశనమైపోయినను గ్రామసరిహద్దులుమాత్రము సామాన్యముగ చెడిపోవుటలేదు. ఆపేరే, ఆహద్దులే, ఆలాభనష్టములే, ఆకుటుంబములే, యుగములనుండి వచ్చుచున్నవి. రాజ్యములు విడదీయుటయందుగాని, కలుపుటయందుగాని గ్రామస్థు లేమియును, పేచీలు పెట్టరు. ఆగ్రామమంతయును కలిసియున్నంతవరకు అయ్యది యేయధికారము క్రింద నుండినను, ఏరాజేలుచుండినను వారికి లెక్కలేదు. వారిలోపలి యర్థలాభము లెవ్వియును మార్పు చెందవు. పటేలే యిప్పటికిని గ్రామపెద్ద. ఇప్పటికిని అతడే న్యాయాధికారి. అతడే దండనాయకుడును, వసూలుదారుడును ఇజారాదారుడును.''

హిందూదేశమునందలి గ్రామముల స్వరాజ్యతంత్రపరిజ్ఞానమొసంగు నీపైముఖ్యాంశము మనకు మిక్కిలి యుపయుక్తమైనది. ఇయ్యది పూర్వపుహిందూరాజుల పరిపాలనమునాటిది కాదు. పదునెనిమిదవ శతాబ్దమునాటిది. మనుస్మృతి మొదలగు సంస్కృతగ్రంథములలో వ్రా



యబడినది కాదు. ఈస్టిండియాకంపెనీవారు పూర్ణముగ పరిశీలించి ఆఫీసురికార్డులలో వివరించివ్రాసినది. ఇయ్యది మనముచూచుమాత్రమున వేనవేలుసంవత్సరములనుండి యెన్నిసామ్రాజ్యములు వృద్ధిక్షయములు కాంచినను, ఎన్నివంశములు గడచిపోయినను, సమస్తసదుపాయంబులు గలిగిన నీచిన్నస్వరాజ్యములలో హిందూదేశమునందలి భూమి యెట్లు దున్నుకొనెడువారో వర్తకపుసరకు లెట్లు సరకుచేయబడుచుండెనో తెలియగలదు. బ్రిటిషుదొరతనమువారీపూర్వపు సంఘములన్నిటిని కాపాడియు వృద్ధిచేసియు, సంస్కరించుచు, ఈస్వయంనిర్మితసంఘముల మూలమున ప్రజల పరిపాలించుచుండిన యెంతసౌఖ్యప్రదముగ నుండియుండునో? బ్రిటిషుపరిపాలనము ప్రారంభమైనది మొదలు ఈపూర్వపుసంఘముల క్షీణింపజేయుటకు రెండుకారణము లున్నవి. భూమిపన్నును చేయగలిగినంతయభివృద్ధి చేయుటకై ప్రతివ్యవసాయకునితోడను స్వంతముగ మాటలాడుకొనవలెనను అభిలాషము హెచ్చైనది. ధర్మపరిపాలనా వ్యాపారమును కార్యనిర్వాహక వ్యాపారమును ఒక్కయెడనే యుంచవలెననుఅవ్యక్తకుతూహలముచేత చిరకాలమునుండి తమతమ పొలిమేరలలోపలనే యుండియుండు తమయధికారములనెల్ల నడుపుచుండిన యీగ్రామోద్యోగస్థుల బలమునెల్ల రూపుమాపిరి. వారివారినియతకృత్యములెల్లను పోవుటతోడనే యీగ్రామసంఘము లన్నియును క్రమక్రమముగా క్షీణించినవి. హిందూదేశపరిపాలనము కొన్నివిధముల పూర్వముకంటె నిప్పుడు పెక్కుకట్టుదిట్టములతో నున్నను పూర్వముకంటె నెక్కుడునిరంకుశమైపోయినది. జనులకూడిక పూర్వముకంటె చాల తగ్గిపోయినది.

మన మిక నీకథను విడిచి ఉత్తరసర్కారులలోని జమీందారీలపరిపాలనావిషయమునకు మరలవలయును. 1778 సం॥రమువరకును

ఈభూములు ఏటేటను అమరకములు చేయబడుచుండెడివి. ఆసంవత్సరము రంబోల్డుగారు పూర్వప్రకరణమున చెప్పినచొప్పున అయిదుసంవత్సరములకు అమరకము చేసెను. మరల 1783 సంవత్సరమున ఏక్సాలా అమరకపుపీడ యనుదురభ్యాసము మరల ప్రారంభమై 1786 సంవత్సరమువరకు సాగినది. అప్పుడు రివిన్యూబోర్డువారు పన్నులువృద్ధిచేసి మూడుసంవత్సరములకు అమరకము చేసిరి. 1789 సం॥రమున మరల మూడుసంవత్సరములకును తరువాత అయిదుసంవత్సరములకును, అమరకములై జమీందారులకు వచ్చెడు మొత్తముఆదాయములో ⅔ వంతు పన్నుగా నేర్పడియెను. 1788 సంవత్సరమున కంపెనీవారికి స్వాధీనమైన గుంటూరుమండలము కూడ నట్లే యమరకమయ్యెను.

1794 సంవత్సరమున లార్డు హోబర్టు అనునాతడు గవర్నరుగా నియమింపబడియెను. ఆతడు కంపెనీవారి నాయకులను సభలను, తప్పించివేసి జిల్లాజిల్లాకు పన్నుల పరిపాలనమునకై కలెక్టరుల నేర్పాటుచేసెను. వీరు రివిన్యూబోర్డువారియధికారమునకు లోబడియుండవలెను. ఇది యాతడొనరించిన యొక గొప్పసంస్కారము. జమీందారీభూములఅమరకము పూర్వమువలెనే జరుగుచుండవలెను. హోబర్టుగారితరువాత లార్డుక్లైవు అనునాతడు గవర్నరుగా వచ్చెను. ఈక్లైవుగారు పలాసియుద్ధమున విజయము నొందినప్రఖ్యాతపురుషునికుమారుడు.

ఈతనిపరిపాలనాకాలమున 1793 సం॥రమున బంగాళమున చేయబడిన శాశ్వతపుసెటిల్మెంటు పద్ధతివంటి పద్ధతి యేర్పడియెను. 1802 1804 సంవత్సరములనడుమ నీపద్ధతి యుత్తరసర్కారులలో వ్యాప్తమయ్యెను. ఈపన్నులు కట్టుట కేర్పాటయిన ప్రమాణము రైతులవద్దనుండి వసూలు అయ్యెడుమొత్తము రాబడిలో ⅔ వంతుగా నున్నటు



కనబడుచుండెను.

ఉత్తరసర్కారులలోని హవేలీభూముల చరిత్ర కేవలమును భేదముగా నుండెను. ప్రథమమున కలెక్టరులు నియామకమైనది 1787 సం॥రము. వారీభూములమీద పన్నులను రెండువిధముల వసూలుచేయ నవలంబించిరి. కొన్నిస్థలములలో రైతులవద్దనుండి తాము స్వంతముగనే పన్ను వసూలుచేసిరి. పండినపంటలో కొంతభాగము దొరతనమువారిభాగము. మరికొన్నిస్థలములయందు మొత్తములు సిసలుపరచి యిజారాల కిచ్చుచుండిరి; కాని సామాన్యముగా కలెక్టరులు గ్రామములలోని పెద్దకాపులకు అమరకములు చేయుచువచ్చిరి. వారాభూములను రైతులకు వేరువేరుగా అమరకములు చేసికొనుచువచ్చిరి. 1794 సంవత్సరమున కంపెనీనాయకులును, వారిసభలును, ఎత్తివేయబడినపుడు ఈయమరకములన్నియు కలెక్టర్లపూచీమీదనే జరుగుచుండెను. ఈకలెక్టరు లందరును బోర్డువారికి తాబేదారులై యున్నవారు. 1802 1804 సం॥రముల నడుమ జమీందారీభూముల శాశ్వతపుసెటిల్మెంటు జరిగినపుడు హవేలీభూములుకూడ వీలయినంత పరిమాణములేర్పరచి ముఠాలక్రిందను ఖండములక్రిందను సాలుకు 1,000 మొదలు 5000 ల (నక్షత్ర) పూలవరహాలశిస్తు వచ్చెడులాగు కేటాయింపబడెను. అవి యన్నియును శాశ్వతపుజమీందారీలవలెనే యేలము కాబడినవి. చెన్నపట్టణమునకు చుట్టునున్న జాగీరుభూములు కూడ ఆకాలమునందే శాశ్వతముగా అమరకములు చేయబడియెను.

కంపెనీవారిపూర్వపుస్వాస్థ్యములు చెన్నరాష్ట్రమున ఉత్తరసర్కారులు, చెన్నపట్టణము చుట్టునుఉండిన కొంతప్రదేశమును, మాత్రమే. 1765 సం॥రము మొదలు 1805 వరకును వీనిపరిపాలనాచరిత్ర మిటున్నది. ఈనడుమ కడమప్రదేశములుకూడ కంపెనీవారికి స్వాధీనము

యినవి. ఇంక నా క్రొత్తస్వాస్థ్యములకు మరలుట యావశ్యకమై యున్నది.

లార్డుకార్నువాలీసు టిప్పుసుల్తానులకు కలిగినయుద్ధము శ్రీరంగపట్టణమునందితో 1792 సంవత్సరమున ముగిసెను. అప్పుడు బారామహాలులో చేరిన సేలముజిల్లా కృష్ణగిరి కంపెనీవారికి వచ్చెను. వెలస్లీ ప్రభువుగారికిని టిప్పుసుల్తానునకును కలిగిన కడపటియుద్ధము 1779 సం॥రమున ముగిసినది కదా! కోయంబుత్తూరు బాలఘట్టమును తదితరప్రదేశములును లభ్యమయ్యెను. 1799 సం॥రమున లార్డువెల్లస్లీగారు తంజావూరు కలుపుకొనిరి. 1800 సంవత్సరమున డక్కనునైజామువద్దనుండి కృష్ణాతుంగభద్రానదుల నడుమనుండు దేశమంతయును కంపెనీవారిస్వాస్థ్యములో చేర్చెను. 1792-1802 సంవత్సరములనడుమ రాజ్యములోని మిక్కిలిశ్రీమంతమైనట్టివియు మేలైనట్టివియు అగుప్రదేశములన్నియును సంపాదన అయినవి. ఈప్రదేశములన్నియు చేరినదియే యిప్పటి మదరాసురాష్ట్రము. ఈ నూతనప్రదేశములసంపాదనతో క్రొత్తయమరకములపద్ధతి వృద్ధియయ్యెను.

1792 సంవత్సరమున బారామహాలుజిల్లాలు కంపెనీవారికి లభ్యమైనపుడు కెప్టను ‘‘రీడ్డు’’ నునాతడును మరి ముగ్గురు మిలటరీ యుద్యోగస్థులును ఆప్రదేశములందున్న కంపెనీవారి యితరనౌకర్లకన్న నెక్కువ దేశభాషాజ్ఞానము కలవారును దేశాచారవ్యవహారములను తెలిసినవారును, అయి యున్నవారు. కార్నువాలీసుప్రభువు పరిపాలనము వారి కొప్పగింతపెట్టెను. కెప్టన్‌రీడ్డు అనునాతడు వ్యవసాయదారులందరితోడను విడివిడిగా అమరకములు చేయ మొదలుపెట్టెను. ఈపద్ధతియే క్రమక్రమముగా వృద్ధియై ఆతనికి సహాయుడుగా నున్న థామస్ మన్రో గారిచే నితరప్రదేశములకు కూడ వ్యాపింప చేయబడెను. ఈథా



మసు మన్రోగారే తరువాత మదరాసుగవర్నరుగా నుండినయాతడు. ఇతడు చేసిన యీ సెటిల్‌మెంటే రైతువారీ సెటిల్‌మెంటు. బంగాళాదేశమున జమీందారీ సెటిల్‌మెంటుతో కార్నువాలీసుపేరున కట్టిసంబంధ ముండియున్నట్లో ఈరాష్ట్రమున సెటిల్‌మెంటుతో నీతనిపేరున కట్టిసంబంధ మున్నది.

థామస్‌మన్రో అనునాతడు 1780 సం॥రమున పందొమ్మిదవయేట చిన్నవయసున చెన్నపట్టణమునకు వచ్చెను. హైదరాలీతోడను టిప్పుసుల్తాన్‌తోడను కలిగిన యుద్ధములలో నీతడు కూడ కొంత పని చేసెను. తరువాత మహారాష్ట్రులతోడి యుద్ధములలో మిక్కిలి వన్నె కెక్కెను. అందులకై బ్రిటిషుపార్లమెంటువారిచే, ఆతడు ధైర్యసామర్థ్యములకును విజయమునకును, మిక్కిలి కొనియాడబడెను. కాని యిండియాయం దీతనిపేరు స్మరణకు తెచ్చునవి యీతని విజయసైనికకార్యములు కావు. జనుల యోగక్షేమముల నభివృద్ధిచేయుటకై కంపెనీవారినౌకర్లలో పనిచేసినవారు బహుస్వల్పముగ నున్నారు. అందులో నీత డొకడు. అందుచేత కార్నువాలీసుపేరు బంగాళమునందును ఎల్ఫిన్‌స్టన్‌పేరు బొంబాయియందును, ఎట్లో యట్లే యీతనినామము నేటివరకును చెన్నరాష్ట్రమున జనులు స్మరించుచుందురు.

కెప్టన్‌రీడ్డుగారీతనిని బారామహాలుజిల్లాలలో భూముల అమరకమునకై నియమించిరి. ఆతని దృష్టి కంపెనీవారి పరిపాలనపద్ధతిలోని లోపములమీదికి ప్రసరించెను. ఆలోపము లన్నియును రూపుమాప అతనికి ప్రజలయందు అభిమానముకలిగెను. ఆయభిమానముచే ఆలోపములన్నియు రూపు మాపగల మేలైన యుపాయములు ఆయనకు కొన్ని పొడకట్టినవి.

కర్ణాటదేశమునుగురించి ఆత డిట్లు వ్రాసెను. ‘‘నబాబుగారిపన్నులలో

చాలభాగము నెలకు నూటికి మూడువంతుననో నాలుగువంతుననో యేజంట్లుద్వారా పంపబడుచుండెను. దేశమునందలి కవుళ్లన్నియును ఒక్కొక్కసంవత్సరమునకే. కొన్నిప్రదేశములలో శిస్తులు పండినపంటలనుబట్టి ఒక్కొక్కపంట కొక్కొక్క మాదిరి నేర్పడెను. కొన్నిచోట్ల పండినపంటయే తీసికొనబడుచు వచ్చెను. పంటనుబట్టి శిస్తు లేర్పడినచోట భూము లేటేటను కొలత వేయుచున్నారు. రిపోర్టులను చేయు సర్వేయరులు లంచములను తిని తమ చిత్తమువచ్చినట్లు చేయుచుండిరి. ఇజారాదార్లను గవర్నమెంటును గూడ దగాచేయుచున్నారు. గల్లాలే వసూలు చేసెడి భూమిలోని పంటయంతయును ఎక్కడ లేని ధరలు కట్టి రైతుల కంటదీసి కట్టుచుండిరి. లేదా దేశములోని ధాన్య మంతయును, అమ్మక మగుటకు సావకాశము లేని ధర యొకటి యేర్పరచి ఆప్రకారము అమ్ము మనుచుండిరి. ఈపాడు ఏర్పాటు లన్నియును దేశమును శీఘ్రముగ నాశనము చేయు నని ప్రతివానికిని తోచక మానదు." అని 1895 సంవత్సరము జనవరి 31 తేదీ యుత్తర మందున్నది.

ఇక్లే బ్రిటిషురాష్ట్రమును గూర్చి కూడ వ్రాసెను. "కొంత కాలముక్రిందట రివిన్యూ బోర్డువారు కలెక్టరులకె జీతములు వృద్ధిచేయు డని దరఖాస్తు చేసిరి. ఆదరఖాస్తు గైరుమంజూరు చేయుచు మీరనేకములగు ఆగ్రహవాక్యములనుగూడ వ్రాయించిరి. కాని యీవిషయమున వారికి రాజనీతి గాని మనుజులస్వభావము గాని తెలిసియున్నట్టు కానిపింపదు. వారి కిచ్చెద మనిన ప్రతిఫలముతో, వారు స్వతంత్రముగ జీవనము చేయలేనట్టి స్థితియం దున్నపుడును, నిమిషములో ప్రజలను దోచుకొని అట్లు జీవనము చేయగలిగి నపుడును, ఇం దేపక్షము మనలంబింతమా యని యోచించువారిసంఖ్య మిక్కిలి స్వల్పముగా నుండును. తమ జీతములకు మించి జీవనము చేయు కలెక్టరులలో విశేష



ద్రవ్యముల పోగుచేయు వారి నెంతమందిని మనము ప్రతిదినమునుచూచుచుండలేదు? ఇది జరిగెడు మార్గముకూడ మిక్కిలి తేలికయైనదే. శిస్తు రొక్కముగ చెల్లినపుడు గవర్నమెంటువారికి తక్కువసొమ్ములు వేసి లెక్కల వ్రాసి యిచ్చుట యొకపద్ధతి. ధాన్యాదులు వసూలైనపుడు భూమిపంట తక్కువవేయుటకాని అమ్ముధరలుతక్కువవేయుటగాని చురియొక మార్గము. కలెక్టరు లందరును చదువుకొన్నవా రనియును అట్టి దురభ్యాసములకు దిగరనియు చెప్పుట నట్టిభ్రమ. జరుగుచున్న దానిని బట్టి అట్లు యోచించుటకుకూడ వల్లపడదు." అని కూడ పైయుత్తరమునందే యున్నది.

1798 సంవత్సరముతో క్రొత్తగా సంపాదన మైన బారామహలుజిల్లా రైతువారీ సెటిల్మెంటు పూర్తి యైనది.

"బారామహాలు పూర్ణముగ సర్వే యైనది. పన్నులు కట్టుటయును పూర్తి యైనది...............బారామహాలులో ఇజారాదార్ల సంఖ్య హెచ్చు. అందువల్ల పన్నులు మిక్కిలి వివరముగా పనిచేసి వసూలు చేయుట అవసరమగును. అయినను నిది యొకకష్టము కాదు. ఈవిషయమున నెక్కువ శ్రద్ధతో పనిచేయుట తప్ప కావలసినది మరియేదియును లేదు. అట్టి శ్రద్ధ వహించితిమేని అది దేశమునకు క్షేమకర మయినదియును, లెక్కల కెక్కువ సులభమైనదియు నగును........., పది పండ్రెండుగురు జమీందారుల మూలముననో, లేక భూస్వాముల ద్వారానో వసూలు చేయుటకన్న ప్రత్యేకించి 60 వేలమంది యిజారాదార్ల వద్దనుండి పన్నులు వసూలుచేయుటయే సులభము. నాయధికారముల క్రిందనున్న దేశభాగముమీద నిరుడు వచ్చినపన్ను 1,65,000 పూలవరహాలు. ఈసొమ్మంతయును ఏవిధమైన కష్టమును లేకుండ ఒక్కవరహాయైన దిగబడకుండ 20,000 మంది యిజారాదార్ల

యొద్దనుండి సంవత్సరములోపలనే వసూలైనది." అని 21 సెప్టెంబరు 1798 సంవత్సరము తేదీ యుత్తరమున నున్నది.

ఈయుత్తరమున వంశపారంపర్యముగ జమీందారీ హక్కులు లేని ప్రదేశములలో రైతువారీ పద్ధతి నవలంబించుటయందు మన్రోగారి కెట్టిపక్షపాతము కలుగుచున్నదో కనపడుచున్నది. బంగాళాదేశమునందును ఉత్తరసర్కారులందును భూము లన్నియు పెద్దపెద్ద భూస్వాముల యధీనమం దుండుట మామూలు పద్ధతి. ఆపద్ధతిని సాగనిచ్చి గవర్నమెంటువారు జమీందారులకు స్థిరమైన అమరకములు చేసినారు. రైతులుగాని వ్యవసాయదారులుగాని దొరతనమువారికి ప్రత్యేకించి పన్నులు చెల్లించెడు స్థలములలో నెల్ల ఆపద్ధతినే నిలిపి యుంచి రైతులతో సెటిల్‌మెంటు చేసెను. ఈరెండు పద్ధతులయందునుగూడ జనుల యైశ్వర్యమునకును వ్యవసాయాభివృద్ధికిని యుపచరించుటకై గవర్నమెంటువారు పుచ్చుకొనెడు పన్నులకు కొంత నిలకడ యుండవలెను. ఇయ్యది బంగాళాదేశమున కార్న్‌వాలీసుగారు చేసినారు. ఇట్టి పద్ధతిని నీరాష్ట్రమున అవలంబింపు డని థామస్‌మన్రోగారు కోరి సిఫార్సుచేసినారు కాని అది మాత్రము జరుగలేదు. దక్షిణహిందూస్థాన మందలి భూమి సెటిల్‌మెంటులోని ప్రాణసంకట మిచటనే యున్నది.

బారామహాలునుండి మన్రోను కనరాకు మార్చిరి. ఆతని మామూలు శక్తిసామర్థ్యములతో ఒక సంవత్సరములోపల సెటిల్‌మెంటుపని యంతయు పూర్తి చేసెను. ఆసెటిల్‌మెంటు భూస్వాములతో జరిగినది.

1800 సంవత్సరమున నాత డిట్లు వ్రాసెను. "దేశమున వాస్తవముగా వచ్చెడు నాదాయమును నిర్ధారణము చేయగలవాడ నని చెప్పి ఆపనిని మీదపెట్టుటచే నే నిచ్చటకు వచ్చితిని. ఇయ్యది నా యు



ద్యోగధర్మము నుల్లంఘించుట కాకుండునేని నే నీపనికి రాకయే యుందును. కాని యిది యిప్పుడు పూర్తియైనది. బారామహాలులో పన్ను లెంత క్రమముగ వసూలైనవో యిచ్చటను అట్లే వసూలైనవి. అంతకంటె బాగుగకూడ నైనవి. కొన్నిచోట్ల మాత్రము యుద్ధయాత్రలు వచ్చి చెరిపివేసినవి. నాపని పూర్తియైనదని నానమ్మకము." అని 1800 సంవత్సరము జూలై 13 తేదీ యుత్తరమునం దున్నది.

"భూముల సెటిల్‌మెంటు యావత్తును భూస్వాములతో చేసితిని. భూస్వాములు లేనిచోట భూము లెవ్వని యాక్రమణలో నుండిన వానితో చేసితిని............పంటలు పూర్ణముగ నిర్ధారణ చేసితిని. ఏమందు రేని లెక్క లన్నియును ఉభయపక్షములవారును కూడ తెచ్చినారు. సర్కారుభాగము మూడవవంతునకు మించిన దిచ్చుటను లేదు. చాలచోట్ల మొత్తము పంటలో అయిదవవంతుగాని ఆరవవంతుగా కూడ కాదు. కొన్నిచోట్ల పదవవంతు కూడ కాదు." అని 1800 సం॥రము అక్టోబరు 7 తేది యుత్తరమునం దున్నది.

1800 సంవత్సరమున కంపెనీవారికి దక్కను నైజాము కృష్ణాతుంగభద్రానదుల నడుమనుండు దేశ మిచ్చి యున్నవాడు కదా! బారామహాల్ కనరాదేశముల సెటిల్‌మెంటు పని చేసిన థామసుమన్రోగారినే యీదేశపు సెటిల్‌మెంటుకూడ పనిచేయుమని కోరిరి. అందుచే మన్రోగారి సివిలుపరిపాలనమున కీసీడెడ్డుజిల్లాలు మూడవస్థానమయ్యెను. ఆతనికి నైజముగ నుండు శక్తిసామర్థ్యములతోడను తెలివిచేటలతోడను తన పనిని మన్రోగారు నెరవేర్చినా రనుట నిర్వివాదాంశము గాని ఆతనికి రివిన్యూ అధికారుల యొత్తుడు హెచ్చైనది. అందువలన ప్రజల యోగక్షేమమునకై యాతడు చేయదలంచినంత పని చేయుట కిది యడ్డంకి యయ్యెను. ఈవిషయము నాతడు స్పష్టముగా నొప్పుకొనినా

డు. అదియే యీతనియందేవిధమైన దోషాపాదనమును చేయుటకు తా వొసంగకున్నది.

“రివిన్యూ బోర్డువారును గవర్నమెంటువారును ముందు సిఫార్సుచేసిన శిస్తులు మెల్లమెల్లగా ముందుముందు క్రమాభివృద్ధి చేసిరేని అయ్యెది నిస్సంశయముగ నాకును సమ్మతమే. కాని యట్లు మాత్రము జరిగినదాక నమ్మకము లేదు. సామాన్యముగా ఇప్పుడు వ్యవహారముల నడుపుచున్నవారి యందరియభిలాషయును దేశాభివృద్ధియును రాజకీయ ద్రవ్యాభివృద్ధియునుకూడ తమ ఆధిపత్యముక్రిందనే జరుగవలె నని. ఆ కారణముచేత నే నతిత్వరితముగా కార్యముల నడుపవలసిన వాడ నగుదును..........పెద్దవాడ నైన కొలది నాకు ఒడలు కంప మెత్తవచ్చును. పదిమందియును తిట్టిపోదు రనుభయము పుట్టవచ్చును. నాతరువాత వానికి పన్ను లభివృద్ధిచేయుటకు సావకాశ ముండనిచ్చితి నేని దొరతనమువారిని మోసముచేసి దేశవాసులకు సాయముచేసినా నందురు............రాజకీయ కార్యములకై కావలసిన సొమ్ము సర్దుబాటు నిమిత్తము రైతులను చేయవలసిన దానికంటె నెక్కువ యొత్తుడు చేయుదును గాని వ్యాపార మెప్పు డొక్కసారిగ నధఃపతనము చేయవలె నను తలంపు లేదు.” అని 1802 సం॥రము సెప్టెంబరు 5 తేది యుత్తరమం దున్నది.

అప్పుడు కర్ణాటదేశమున పన్నులు మిక్కిలి తక్కువ కట్టినందులకై రివిన్యూ బోర్డువా రాతని మిత్రుడగు “జి”అనువానిని నౌకరీనుండి తొలగింప నాయత్తపడు చున్నారు. ఆసంగతి మన్రోగారీయుత్తరము వ్రాసినపుడు మనస్సునందున్నది. కంపెనీ గవర్నమెంటువారు తమ రివిన్యూ అధికారులపై నిట్టి తగని యొత్తుడు తెచ్చిపెట్టి తమకు క్రొత్తగా సంపాదనమైన యీప్రదేశముల లోని పన్నులు భూమి దున్నుకొని



బ్రతికెడు వారికి మిగుల దారుణముగను, పీడాకరముగను నుండు నంతటి వృద్ధి చేసిరి.

“కర్ణాటదేశపు సెటిల్‌మెంటులో నాతడు తొందరపడి నాడనియును, పన్నులు మిక్కిలి తక్కువగా నున్న వనియును, ఆతడు తనపూర్వమిత్రుడైన లక్ష్మణరావును ఎక్కువగ నమ్మి యట్లు చేసినాడనియును, బోర్డువా రభిప్రాయపడినట్లు రిపోర్టులో నున్నది. “జి”యనునాతడు ముందుముం దభివృద్ధి చేయ వీలుపడు ననియెడు నుద్దేశముతో తక్కువపన్నులు ఉద్దేశపూర్వకముగనే కట్టితి నని చెప్పుచుండెను. నా కాతడు పూర్వపు మిత్రుడు. అందువలన నాతనియందు నాకు గౌరవ మున్నది. అది యటుండనిండు. ఆతడు చాలకాలము రివిన్యూ ఉద్యోగము చేసి పెండ్లియాడినాడు. ఆపెండ్లితోడనే ఆతనిదగ్గర నేమియును లేకుండ పోయినది. ఈకారణములచేత నాతనిని పనిలోనుండి తప్పింతు రేని అది నాకు మిక్కిలి విచారమును కలిగించును. మరి యొకటికూడ నున్నది. విమర్శనాజ్ఞానము తప్పుగా నున్న దన్నంత మాత్రముచేత ఎవనినిగాని ఉద్యోగమునుండి తొలగించుట మంచిపని కాదు. ఇది నాయభిప్రాయము. ఆగ్రహించిన చాలదా? పైగా నాతని తప్పైనను సత్యమార్గమున నున్నది.” అని 1802 సం॥రము సెప్టెంబరు 28 తేదీ యుత్తరమున నున్నది.

ఏడేండ్లు సీడెడ్డుజిల్లాలు పరిపాలించిన వెనుక థామసు మన్రోగారు 1807 సంవత్సరమున విశ్రాంతికై యిండియాను విడిచి పోయెను. ఆతడు పడినపాటు ఆతనికి పేరు కీర్తులను తెచ్చెను. ఆతడా యేడుసంవత్సరములలోను పన్నులు 4,02,637 కాసులనుండి 6,06,909 కాసులకు క్రమశః వృద్ధిచేసెను. ఈవృద్ధి నూటి కేబదివంతున తేలినది. పై యధికారులును మిక్కిలి సంతసించిరి. కంపెనీవారు తమ యుద్యోగస్థు

ల పనుల నిట్టి ఫలితములనుబట్టియే కనిపెట్టు చుండిరి.

ఈనడుమ నితరజిల్లాలలో మరికొందరి యుద్యోగస్థులవలన సెటిల్‌మెంటు జరిగెను. 1792 సంవత్సరమున మలబారు దేశము కంపెనీవారి వశ మయ్యెను. కొంతకాలమువరకు నయ్యది బొంబాయిరాజధానిలో చేరి యుండెను. బొంబాయి గవర్నమెంటువారు మలబారు రాజాలకును, నాయరు నాయకులకును రెండు సాలుసరి సెటిలుమెంటులును తరువాత నొక అయిదుసంవత్సరముల అమరకమును చేసిరి. ఆ రాజాలును నాయరునాయకులును పన్నులు సిసలుగా చెల్లించ లేకపోయిరి. వారిభూములను వారియొద్దనుండి లాగివేసిరి. ఆపైని వారందరును తిరుగబడిరి. బొంబాయి గవర్నమెంటువారి పరిపాలన మిట్లు సరిగా పని చేయకపోవుటచే 1800 సంవత్సరమున మలబారు, మదరాసు రాష్ట్రమునకు బొంబాయినుండిమార్పు చేయబడియెను. మదరాసున కప్పుడుగవర్నరుగానుండిన లార్డుక్లైవు దేశపరిపాలనమునకొక పెద్దకలెక్టరును కొందరు క్రిందికలెక్టరులను నియమించెను. కొన్నిభూములు భూస్వాములకును, కొన్ని రైతులకును అమరకములు చేయబడెను. పన్నులు కట్టుటకై అధికారుల కందరకును ఆదరముగానున్న రైతువారీ పద్ధతియే సర్వత్ర అమలు జరుపబడినది. బ్రిటిషు పరిపాలనమునకు పూర్వము తరతరములనుండి యున్న రాజులును, నాయరు నాయకులును, క్రమక్రమముగా తొలగిపోయి తుదకు వా రదృశ్యులైరి. వాస్తవమగు రాజ్యతంత్ర పరిజ్ఞానము గలవారైనయెడల పూర్వపు స్థితిగతుల నున్నట్లుంచి, రాజులను నాయరుప్రముఖులను బ్రిటిషుగవర్నమెంటువారి యెడల రాజభక్తులుగను ప్రజలకు నాయకులుగను చేయవలసినది. కాని యేండ్లు గడచిన కొలది ప్రత్యేకించి రైతులకు తామే భూముల నమరకము చేసి భూములపై నచ్చి సంతపన్ను రాబట్టవలె నను నభిలాష వృద్ధియై



నది. అదియే కంపెనీ గవర్నమెంటువారి రాజనీతిని క్రమక్రమముగ వశపరచుకొన జొచ్చెను.

1799 సం॥రమున తంజావూరు వెల్లెస్లీ ప్రభువు కలుపుకొనెను. దేశములోని రైతులందరును రాజాగారికి తమ పన్నులన్నియును పెద్దరైతులద్వారా చెల్లించుచుండిరి. ఆపెద్దరైతులకు పత్తకదారు లనిపేరు. ఒక్కొక్క పత్తకదారునిక్రింద ఒకగ్రామము మొదలు 128 గ్రామములవర కుండెడివి. ఈ పత్తకదారులే నిజముగా జమీందారులు. బ్రిటిషుదొరతనమువారీపత్తకదారుల నందరిని ఒక్కసారి శుభ్రముగా తుడిచివేసి 1804 సం॥రమున రైతువారీ సెటిల్‌మెంటు చేసినారు. భూములను సర్వేచేసి దాని విలువనుబట్టి పన్నుకట్టుటకు మారుగ పండిన పంట లన్నియును కలిపి దామాషాయీ చేసి దానిమీద కట్టిరి.

మొదట 1792 సంవత్సరమున నబాబుగారితో కార్న్‌వాలీసుగారు చేసిన సంధివల్లను వెల్లస్లీప్రభువుగారు 1801 సం॥రమున దేశము కలుపుకొనుటవల్లను కర్ణాటదేశ పరిపాలనము కంపెనీవారి వశమయ్యెను. అనేక తరములనుండియును అనేక శతాబ్దములనుండియును యీదేశములోని చాలఖండములు ప్రదేశసైన్యనాయకుల పరిపాలనమునందున్నవి. ఈనాయకులనే పాళెగాండ్రందురు.

పాళెగాండ్రు గ్రామములకు పెద్దలో, లేదా మరి యితరవిధముగా సర్వజనోపయోగమైన నౌకరులో అయి యున్నారు. దక్షిణహిందూస్థానమున విప్లవములు తటస్థమైనపుడు వారి స్థితిగతు లన్నియును సైన్యపరిపాలకులుగ మారిపోయెను. వారు దేశము నాక్రమించుకొనుటకు సహాయభూతు లగుచుండిరి. ఇట్టిపని యీద్వీపకల్పముయొక్క దక్షిణభాగమునం దెక్కువగా జరిగినది. వారికి కొందరికి సనదు లుండెడివి. ఆసనదులలో యీపాళెము (యెస్టేటు) వీరికెందుకిచ్చిరో వానివివర

ములు లేవు గాని వారందరు చక్రవర్తిగారి యాశ్రయమునం దున్నట్లును, కర్ణాట సుబాదారులకు వారందరును లోబడి యున్నట్టును ఆసుబాదారులకు వారు కప్పము కట్టుచున్నట్టును వారు పిలువబంచినపుడెల్ల వారు వారి ముకాములకు తమ అధికారమునం దున్నంత సైన్యముతో హాజరగు నట్లును తగినంత సాక్ష్య మున్నది.

వారన్ హేస్టింగ్సు కాలమునుండియును ఈపాళెగాండ్ర స్థితిగతులనుగూర్చి విశేషముగ ఉత్తరప్రత్యుత్తరములు జరుగుచుండెను. కర్ణాటకనబాబు ఈప్రదేశనాయకుల రూపుమాప పదేపదే తనబ్రిటిషు మిత్రుల సహాయము గోరుచువచ్చెను. అందుమూలమున ప్రజలపై తన యధికారము హెచ్చుచేయవలె నని యాతని యూహ. కాని కంపెనీ డైరక్టర్లు ఈపాళెగాండ్రపై నబాబునకు సహాయము చేయ సైన్యము లొసరించు సేవనము కేవలము హేయముగ జూచుచుండిరి. ఆకారణమున వారు దేశనాయకులగు పాళెగాండ్రి రూపుమాపకూడ దని ఖండితముగ నుత్తరవులను చేసిరి. పాళెగాండ్ర నట్టి దారుణస్థితికి దింపునంతటి దురాగతమున కొడిగట్టుట మానుషకృత్యము కాదని తలంచిరి. నబాబు దొరతన మేమియును మెత్తనిది కాదనియును పన్నులు వసూలునందు ఎక్కువ యొత్తుడు కలుగుచున్న దనియు భయపడసాగిరి. కర్ణాటదేశప్రజలు చాలకష్టముల పొందినారని వారెరింగిన వారయ్యును కర్ణాటనబాబుయొక్క పీడ వీనిని మించినదని వారు తలంచుచుండిరి.

1792 సం॥రమున కార్న్‌వాలీసు గారికిని కర్ణాటనబాబునకును సంధి జరిగినతరువాత 1795 సంవత్సరము జూను 10 తేదిని వారువ్రాసిన యుత్తరమున ఆసంధితో సంబంధించిన గుణాగుణములను పూర్ణముగ చర్చించి వ్రాసిరి. అందుపైన ఇండియాలో కూడ చర్చలు జరిగెను. 1797 సం॥రమున మదరాసుగవర్నరుగా నుండిన హోబర్టుప్రభువు



ఈపాళెగాండ్రను బ్రిటిషుప్రభుత్వము వారికి ఉపయుక్తులు గాను, విధేయులుగాను, సామంతులుగను చేయవచ్చు నని అందుకు తగిన సాధనముల కొన్నిటి వ్రాసిపోయెను. 1799 సం॥రము జూను 5 తేదిని డైరక్టరు లొక ప్రత్యుత్తరము వ్రాసిరి. అందు వారు పాళెగాండ్ర కున్న సైన్యాధికార మంతయును తగ్గింపు మనియును వారు పూర్వము చెల్లించు చుండెడు కప్పమునకన్న ఎక్కువ పన్ను చెల్లించునట్లు చేయు మనియును వ్రాసిరి.

ఈవ్రాత నాధారము చేసికొని మదరాసు అధికారులు న్యాయమును వివేకమును అతిక్రమించి వర్తించిరి. 1799-1800 సంవత్సరములలో వారొక సెటిల్‌మెంటు పూర్తి చేసిరి. అందు పాళెగాండ్రకు గ్రామాంతరములయం దుండెడు భూములను లాగుకొని తమయధీనము చేసికొనిరి. పూర్వము పన్నుకంటె నూటికి 117 వంతున అదనముగ పన్నులు కట్టజొచ్చిరి. అందుపైన దక్షిణమున నుండు పాళెగాండ్రందరును తిరుగబడిరి. ఆతిరుగబాటు శీఘ్రముగనే యణచి వేయబడెను. తిరుగబడిన వాండ్రందరి యెస్టేటులను నూడదీసికొనిరి. కొందరిని ఉరిశిక్షలకు పాత్రులను జేసిరి. పన్నులు కొంతకాలమువరకే యభివృద్ధి చేయబడు ననియు, అటు పిమ్మటమార్పు చెందవనియును, ఎప్పుడైనను మొత్తము రాబడిమీద క్షి వంతుకంటె పన్ను హెచ్చుకాదనియును చెప్పిరి. తుట్టతుదకు 1803 సంవత్సరమున దక్షిణమున నున్న పాళెగాండ్రకడ నింకను నిలిచియున్న పదునాలుగు ఎస్టేటులకు శాశ్వత సెటిల్‌మెంటు చేసిరి. 1799-1800 సంవత్సరములలో దారుణముగ కట్టిన పన్నులకంటె, ఈమాటు కట్టినపన్నులు మిక్కిలి మితముగా నుండెను. మొత్తము రాబడిలో నూటికి 41 మొదలు 51 వరకును హెచ్చినది. ఈయెస్టేటులలో ముఖ్యమైన వన్నియును తిరునల్వేలి

జిల్లాయందలివి. శివగంగ, రామనాథ పాళెగాండ్రతో కూడ నిట్టి సెటిల్ మెంటు చేయబడియెను.

1802 సం॥రమున పశ్చిమమునసుండు పాళెగాండ్రతోకూడ శాశ్వతపుసెటిల్ మెంటు చేయబడియెను. కర్ణాటకదేశ సంపాదనముతో బ్రిటిషువారి పరిపాలనము క్రిందికి వచ్చిన చిత్తూరు పాళెగాండ్ర యవస్థ యింతకంటె చెడ్డది యయ్యెను. బ్రిటిషుదొరతనమువారి హక్కులకు వారాటంకము కలుగచేయుటచే వారిని వారికోటలనుండి తరిమివేసిరి. వా రడవులను పట్టిపోయిరి......... ... ... ...ఏవో కొన్ని వినా చిత్తూరులోని పాళెగాండ్ర యెస్టేటు లన్నియు నూడదీసికొని రైతులకు ప్రత్యేకించి అమరకము చేయబడియెను.

ఇప్పటి కీపని జరిగి నూరుసంవత్సరము లైనది. ఈవ్యాపారములను మన మిప్పుడు వెనుకకు తిరిగి చూచితిమేని కర్ణాటదేశమునందలి పాళెగాండ్ర నందర పూర్ణముగా నాశనము చేయ తలపెట్టిన ఆక్రూరకృత్యము లన్నియు, విచారము కొలుపక మానవు. కంపెనీ డైరక్టరులు వారికడ సైనికబలమంతయు లాగివేయుట సవ్యముగానే యున్నది. ఏమందురేని ప్రస్తుతపరిపాలనాపద్ధతినిబట్టి ఆబల మంతయును దొరతనమువారి యధీనమునందే యుండి తీరవలెను. కాని గ్రామాంతరములయం దున్నవారి జమీలను లాగివేయుటయును పన్నుల నొక్కసారి అమితముగ కట్టుటయును వారు తిరుగబడినారని వారిని నేలంటద్రొక్కుటయును న్యాయమైన పనిగాదు. అది వివేకమైన రాజనీతియును కాదు. ఈపాళెగాండ్ర 17, 18 శతాబ్దములలో దక్షిణహిందూస్థానమున సంభవమైన పీడాకరములగు యుద్ధపుచిక్కులలో వారివారి జమీలలోని కట్టుబాటులను ప్రజలనెమ్మదియును పోకుండ నిలిపిరి. నేతకాండ్రను చేతిపనులను కాపాడిరి. దేశమున కట్టుబాటుగల రాచరిక



మేమియును లేనపుడు వ్యవసాయదారులను సంరక్షించిరి. వారు దక్షిణహిందూస్థానము నందంతటను పెద్దపెద్ద చెరువులను త్రవ్వించిరి. మొదట కర్ణాటక యుద్ధములలో ప్రెంచివారు చెన్నపట్టణమును లాగుకొనినపుడు బ్రిటిషువారికి వారే శరణొసగినారు. పాళెగాం డ్రెల్లరికి రేగి రనుకొందము. పీడించి రనుకొందము. 17-18 శతాబ్దములలో ఆసియా, అమెరికాఖండములయం దంతటనుగల యితరసామంతనాయకులకడను ఎట్టిలోపము లున్నవో అట్టిలోపములే వీరియొద్దను ఉన్నవి. ఈపాళెగాండ్ర నిర్మూలము చేయుటకంటె వారి నందరిని సరియయిన కట్టుబాటులలోనికి దెచ్చుట ప్రాజ్ఞతగల రాజ్యతంత్రజ్ఞుల ధర్మమై యుండెను. ఏదొరతనమునకును దేశములోని పూర్వసంఘము లెల్ల తారుమారు చేయుట వివేకము కాదు. ఆస్తియందున్న వారి హక్కులన్నియు పోగొట్టి ఒక జాతివారి నందరినణగద్రొక్కి భూమి దున్నుకొనువారితో ప్రత్యేకించి సెటిల్ మెంటు చేసి ఆదాయమును వృద్ధి చేసికొనుట విదేశీయపరిపాలనమునకు కనికరముగల రాజనీతి కానేరదు.

బంగాళాదేశమునందలి కారన్వాలీసుప్రభుని రాజనీతికిని మదరాసునందలి వెల్లస్లీ ప్రభువుయొక్క పరిపాలననీతికిని ప్రతికూలమైన వ్యత్యాస మెంతయో గలదు. కారన్వాలీసు తరతరములనుండి జమీందారులక్రింద వ్యవసాయదారు లందరు బ్రతుకుచున్నట్టు కనిపెట్టెను. ఆజమీందారీసంస్థానముల బలపరచి శాశ్వతముగ నుండునట్లు చేసెను. వెల్లస్లీప్రభువుయొక్క దొరతన మన్ననో కర్ణాటకదేశములోని చాలప్రదేశములు పాళెగాండ్ర యధికారముక్రింద నున్నట్టు కనిపెట్టెను. ఆజనుల నందరను తమ ప్రత్యేక యాజమాన్యముక్రిందకు తెచ్చుటకై వారి నందర నిర్మూలము చేసెను. పూర్వపు కూటముల కారన్వాలీసు ప్రభువు గౌరవించి బంగాళాదేశమున మధ్యతరగతి ప్రజల

ననేకుల కాపాడి వారి నందర నభివృద్ధి చేసెను. సంతుష్టి పరచెను. వెలెస్లీప్రభువు నీతి యిట్టితరగతి వారి నందర మదరాసురాష్ట్రమున లేకుండ మాడ్చివేసెను. ఆనష్ట మిప్పటికి బ్రిటిషుదొరతనము వచ్చి నూరుసంవత్సరము లైనను కూడివచ్చినది కాదు. విదేశీయ ప్రభుత్వమునకును, వ్యవసాయదారులకును నడుమ కొక్కెమువలె నుండు పలుకుబడి గలిగినట్టియు స్వస్థులైనట్టియు మధ్యమ తరగతివారు మదరాసున లేనే లేరు.

చెన్నరాష్ట్రమునందలి వెల్లెస్లీప్రభువుగారి ప్రభుత్వనీతి ఫ్రెంచి విప్లవమునకు పూర్వము ఫ్రాంశుదేశమున గల రాష్ట్రీయశ్రీమంతుల యధికారముల నెల్ల నిర్మూలించిన నీతి ననుసరించి యున్నదనిన లెస్సగా నుండును. కాని ఫ్రాంశుదేశమునం దట్టి సామంతులకు కలిగిన నష్టమెల్ల ఫ్రెంచిజాతివారికి లాభకరముగా నుండెను. ఇచ్చటనో, పాళెగాండ్రకు పోయిన దేమియో విదేశీయవర్తకసంఘమునకు లాభకరముగా నున్నది. తమయధికారమునకు లోబడియుండు జనులయొద్ద పాళెగాండ్రు సంపాదించెడు పన్నులు జనులకే కర్చుపడినవి. వారివర్తకమును, వారి చేతిపనులును, వారి పరిశ్రమికములును, వృద్ధి యైనవి. పాళెగాండ్రందరును పూర్ణముగా నిర్మూలమైన పిదప కంపెనీవారికి వచ్చెడు భూమిపన్ను లన్నియును, పరిపాలనకయ్యెడు ఖర్చు లెల్ల పోను మిగతసొమ్మంతయును దేశమునుండి విదేశీయవర్తకులకొరకై తీసికొని పోబడు చుండెను. "గవర్నమెంటువారికి భూములపైని రాతగినంతపన్నును రాబట్టుటయే యీ రైతువారి పద్ధతియొక్క యుద్దేశము. ఇది కాదని చెప్పలేము. దాచిపెట్టుటకు వీలులేదు." అని సమర్థుడగు కంపెనీడైరక్టరొకడు చెప్పెను.

1807 సంవత్సరమువరకు మదరాసురాష్ట్రమున జరిగిన భూమి



సెటిల్ మెంటులయొక్క చరిత్రము సంగ్రహముగ నీవెనుకటిపుటలయందు చేర్చి చెప్పితిమి. 1802-1805 సంవత్సరములతో ముగిసిన ఉత్తర సర్కారులలోని శాశ్వతపు సెటిల్ మెంటునుగూర్చి విమర్శించితిమి. బారామహాలు, కనరా, సీడెడ్డు జిల్లాలలో థామసు మన్రోగారు కావించిన సెటిల్ మెంటులను పేర్కొంటిమి. మలబారు తంజావూరుల లో జరిగిన కార్యములను వివరించితిమి. కర్ణాటదేశమున మిగిలియున్న పాళెగాండ్రతో జరిగిన శాశ్వతపు సెటిల్ మెంటును గూర్చియు తదితరస్థలము లన్నిటియందును రైతులతో ప్రత్యేకించి జరిగిన సెటిల్ మెంటులను గూర్చియును గూడ ముచ్చటించితిమి.

ఈ సెటిల్ మెంటులయొక్క పర్యవసాన మొకపట్టికగా నీ చివరను చేర్చిన బాగుగ నుండును.

శాశ్వతపు సెటిల్ మెం టైనవి.

| | |
|---|---|
| చెన్నపట్టణము చుట్టునున్న జాగీరు. | 1801-2 |
| ఉత్తరసర్కారులు | 1802-5 |
| సేలము, పశ్చిమపుపాళెగాండ్ర యెస్టేటులు, చిత్తూరుపాళెగాండ్ర యెస్టేటులు, దక్షిణపాళెగాండ్రయెస్టేటులు | 1802-3 |
| రామనాథము | 1803-4 |
| కృష్ణగిరి | 1804-5 |
| దిండిగల్లు | 1804-5 |
| త్రివేంద్రము, జాగీరుగ్రామములు | 1806-7 |

శాశ్వతపుసెటిల్ మెంటుకానివి.

మైసూరు ... { మలబారు, కనరా / కోయంబుత్తూరు / బాలఘట్టము

| | | |
|---|---|---|
| కర్ణాటదేశము | ... | పాలనాడు<br>నెల్లూరు, ఒంగోలు<br>ఆర్కాటు<br>సాటివాడ<br>తిరుచినాపల్లి<br>మధుర<br>తిరునల్వేలి |

ముందు చెప్పినదానినిబట్టి జమీందారులతోడను పాళెగాండ్ర తోడను మిగిలిన పెద్దమనుష్యులతోడను జరిగిన సెటిల్‌మెంటుపద్ధతి మదరాను గవర్నమెంటువారిచే నిరాదరముగా చూడబడె ననియు, రైతులతోడను వ్యవసాయదారులతోడను, ప్రత్యేకముగ జరిగిన సెటిల్‌మెంటు ఆదరమును పొందె ననియు, కనిపించుచున్నది. ఈరాష్ట్రమున కంతకును రైతువారీ సెటిల్‌మెంటే కట్టకడపట కంగీకరింపబడెను. ఆచారిత్ర మిక ముందు రాబోవు రెండుప్రకరణములయందును చెప్పబడును.



# హిందూదేశార్థికచరిత్రము.

## ఎనిమిదవ ప్రకరణము.

### గ్రామసముదాయములు-ప్రత్యేకవ్యవసాయదారులు.

### మదరాసులోనిచర్య.

### (1807-1820)

వెనుకటిప్రకరణము చివరను చేర్చబడిన లెక్కవలన మదరాసురాష్ట్రమున 1807 సంవత్సరమున శాశ్వతపుసెటిల్‌మెంటు చేయబడిన జిల్లాలును అట్టిసెటిల్‌మెంటు చేయని జిల్లాలును, తెలియుచున్నవి. ఈకడపటి వానిని శాశ్వతముగా నిలుపుట కేమియేర్పాటులుచేయవలెనో వానిని గూర్చి చర్చలు జరిగెను.

బంగాళాదేశమునందు కారన్‌వాలీసుప్రభువుచేసిన శాశ్వతపు జమీందారీ సెటిల్‌మెంటువంటి యేర్పాటు ఈప్రదేశములకుకూడ వ్యాపింపచేయుట యుచితమా?

థామస్ మన్రోగారిచే సిఫార్సుచేయబడిన శాశ్వతపు రైతువారీ సెటిల్‌మెంటు చేయుట యుక్తమా?

రివిన్యూబోర్డువారు సిఫార్సుచేసినప్రకారము కట్టకడపటకు శాశ్వతపు ముజావారీ సెటిల్‌మెంటు చేయవలయునా? ముజావారీ సెటిల్‌మెంటు అనగా గ్రామ మందరితోడను కలిసి మొత్తముగా శిస్తు ఏర్పాటు చేసికొనుట.

ముఖ్యమైన యీవిషయమున జరిగినచర్చలను తెలిసికొనుటకంటె నభిరుచిగల ప్రకరణ మీహిందూదేశార్థికచరిత్రమున మరియొకటి యుండదు.

సీడెడ్డుజిల్లాలలో ఏడుసంవత్సరములు పాటుపడి 1807 సంవత్సరమున అయిరోపాఖండమునకు పయనమైపోవునపుడు థామస్ మన్రోగారాజిల్లాలకు శాశ్వతమైనరైతువారీ సెటిల్ మెంటు కావింపుడని సిఫార్సుచేయుచు సుప్రసిద్ధమయిన రిపోర్టు ఒకటి చేసి పోయెను. పండిన పంటలోనూటికి 45 వంతున తాను పన్నులను దారుణముగ వృద్ధిచేసితి నని వివరించెను. పన్నులు శాశ్వతముగ నేర్పాటు చేయుమని సలహా యిచ్చెను.

“ కావున భూమిహక్కుల కేమియును నష్టము లేకుండ సర్వత్ర పండినపంటలో పన్ను మూడవవంతు కట్టుటయే హెచ్చు. వ్యవసాయదారులు కానివారు సర్కారుభూములను నష్టములేకుండ ఆక్రమించుకొందురేని, ఆ వరబడిని పన్ను తగ్గింపవలయును. పన్నులావరబడిని తగ్గిననేకాని దేశవాసు లన్నితరగతులవారును భూములు వ్యవసాయము చేయుటకుగాని, వారి కప్పటికైనను, ఆస్తియందు హక్కు కలుగుటకుగాని, రైతు స్థితిగతులు వృద్ధియగునట్లును, సర్కారుపన్ను లభివృద్ధియగునట్లును, ఏదైనను శాశ్వతమైన సెటిల్ మెంటు చేయుటకుగాని, వీలుపడదనుట స్పష్టము. ఈకారణమువలన సీడెడ్డుజిల్లాలలో చేయు శాశ్వతపు సెటిల్ మెంటులో పండినపంటలో గవర్నమెంటువారిపన్ను దాదాపు మూడవవంతుండవలె నని నాయభిప్రాయము. ఇప్పటి పన్ను నూటికి 45 వంతు. నేను చెప్పిన వరబడికి గొనిరావలయునేని యీ క్రింద చూపిన తెన్నున నూటికి 25 వంతున తగ్గింపవలయును.

మొత్తము పంటకిమ్మతు. 100 అనుకొందము.



| | |
|---|---|
| ఇప్పటి శిస్తుప్రకారము గవర్నమెంటువారి భాగము | 45 |
| ఇందులో నూటికి 25 మినహాయింపుడు | 11¼ |
| నేను చెప్పిన శాశ్వతపుశిస్తుప్రకారం దొరతనమువారిభాగము | 33¾ |

“ సీడెడ్డు జిల్లాలలో శాశ్వతపు రైతువారీ సెటిల్ మెంటు ఎట్లు చేయవలెనో నాయభిప్రాయ మిప్పుడు చెప్పబోవుచున్నాడను.

“ 1. సెటిల్ మెంటు రైతువారీగా నుండవలెను.”

“ 2. సాగుబడి చేసిన పరిమితమునుబట్టి పన్ను ప్రతియేటను వృద్ధిక్షయము లగుచుండవలయును.”

“ 3. సర్వే తరమునుబట్టి కట్టిన పన్నులో భూమి అంతటిమీదను నూటికి 25 వంతున తగ్గింపవలెను.”

“ 4. నూతి నీటివలన తడుపుకొనిన భూములకును, యంత్రసహాయమువలన నదులు నల్లాలులోని నీరుపెట్టుకొన్న భూములకును పన్నులలో నూటికి 8 వ వంతున గాని మొత్తముమీదనూటికి 33 వంతుకాని అదనముగా తగ్గింపవలెను.” ఈమొదరా అనునది నూతులుగాని గట్లుగాని వారి స్వాంతపుకర్చుమీద మరమ్మత్తు చేసినపుడే; రైతులు మరమ్మతుకర్చులు తాము భరింతు మని ఒప్పుకొనినయెడల చిన్నచిన్న చెరువుల నీటివలన తడిసిన భూములన్నిటిపైన నిట్లే పన్ను తగ్గింపనలయును”

“ 5. దానిస్థితిగతుల ననుసరించి రైతులకందరునుసంవత్సరముఆఖరున తమసేద్యములో నున్న భూమిలో కొంత విడుదల యిచ్చుటకుగాని మరికొంత పుచ్చుకొనుటకుగాని స్వేచ్ఛయైన యధికార ముండవలయును. విడుదల యిచ్చినపుడుగాని పుచ్చుకొన్నపుడుగాని మంచిది నిలుపుకొని చెడ్డదిమాత్రమే వ

నల వల్లకాదు. మంచిచెడ్డలు కలిపి పుచ్చుకొనుటగాని విడుదలయిచ్చుటకాని చేయవలయును.”

“6. ప్రతిరైతును భూమిపైన పన్ను చెల్లించినంతకాలము భూమికి పూర్ణస్వాతంత్ర్యము కలవాడుగా భావింపబడవలయును. ఆతడు స్వేచ్ఛగా ఆభూములను ఎంతపన్నునకైన అమర్చుకొనవచ్చును. లేదా తనయిచ్చవచ్చినట్లు అమ్ముకొనవచ్చును”

“7. సామాన్యముగా పంటనష్టమునకుగాని యితర దైవికరాజికములకుగాని యేవిధమైన ముదరాలను కోరరాదు. బాకీదారుని ఆస్తివలనగాని భూమివలనగాని ఆపన్ను రానపుడు మిగిలిన రైతులు తమపొలములమీద చెల్లించెడు పన్నులపైని నూటికి పదివంతున ఆగ్రామములోని వారందరును అదనముగా చెల్లింపవలయును. అంతకంటె కోరరాదు.”

“8. గయాళుభూము లన్నియును గవర్నమెంటుస్వాధీనమునందుండవలెను. తరువాత సాగుబడిలోనికి వచ్చెడు భూమిపైనిచెల్లెడుపన్ను లన్నియును పబ్లీకుపన్నులకు చేరవలెను.”

“9. ఇండ్లు, దుకాణములు, వృత్తులు, సరకులుపన్నులు, లైసెన్సులు, మొదలగుపన్ను లన్నియును, ప్రత్యేకము దొరతనమువారికే చెందవలెను. ఏ రైతుభూమిలో నైనను, ఇండ్లు, దుకాణములు, కట్టబడునేని అతడాభూమి సర్వేపరిమితముపై నేర్పడియుండు పన్నునకు మించి అదనముగా పుచ్చుకొనుటకు హక్కుదారుడు కానేరడు.”

“19 అదనముగా పన్ను ముదరా యిచ్చుటమూలమున సొంతపు ఆస్తిగా ఘార్చుకొన చెరువులమరమ్మతులును, దేశబంధపు యీనాముల మరమ్మతులును దొరతనమువారి కర్చున జరు



గవలెను.”

“11. తుక్కావి క్రమక్రమముగా తగ్గవలెను.”

“12. పటేళ్లు, కరణములు, తదితరగ్రామసేవకులు కలెక్టరు అధికారముక్రింద పూర్వమువలెనే యుండవలెను.”

“13. రైతుల ఆస్తులను జప్తుచేయు సొంతపుబాకీదార్లు గవర్నమెంటువారికి రైతులు బాకీయుండు పన్నులను చెల్లించవలెను. జప్తు చేయకపూర్వము అట్లు చేయుటకు జామీ నీయవలెను.”

అని 15-8-1807 సంవత్సరమున వ్రాసిన రిపోర్టులో నున్నది.

ఇంతమట్టుకు ఎత్తివ్రాయుట కపసరమే ఘుందురా? రైతువారీసెటిల్మెంటు మొదట యేర్పరచినవారి యభిప్రాయ, మేమియో స్పష్టముగా తెలిసికొనుటకై యవసర మయ్యెను. థామస్ మన్రోగారు విడివిడిగా రైతు లందరితోను సెటిల్ చేయు మనియెను. వ్యవసాయమునకై పుచ్చుకొనిన భూమి హెచ్చుతగ్గులనెంబడిని పన్నులుకూడ చెల్లించుచుండుపద్ధతిని ఆసెటిల్మెంటు శాశ్వతముగా నుండవలె ననియెను.

1803 సంవత్సరమున లార్డు క్లైవుగారిస్థానే మదరాసునకు గవర్నరుగా వచ్చిన విల్లియం బెంటికు ప్రభువును ఖచితముగా ఆయభిప్రాయమునే పొందెను. 1806 సంవత్సరమునం దాతడు వ్రాసిన “సభాసారాంశములో” బంగాళాదేశమున తరతరములనుండి జమీందారు లుండుటచే నచ్చట జమీందారీసెటిల్మెంటు సాగె ననియు మదరాసున అట్టి భూస్వాములుమొదటినుండియును లేకపోవుటచే నీప్రాంతముల కదిపనికిరా దనియు వ్రాసెను.

“జమీందారీల నేర్పరుచుట దొరతనము వారికిగాని ప్రజలకు

గాని లాభకారికాదని నాకు తృప్తియైనది. శాశ్వతపుసెటిల్‌మెంటు పద్ధతియును ఆసంబంధమైన షరతులును నాకు నచ్చినవి. ఈదేశమునందును ప్రపంచమునందలి యితరదేశములందునుకూడ అవి వర్తింపతగినవని నానమ్మకము."

ఆసంవత్సరముననే మరియొకనూరు వ్రాయబడిన "సభాసారాంశమున" ఆగవర్నరుగా రిట్లు చెప్పిరి.

"స్థిరమైన షరతులతో రైతులకు ఏటేటను కవులు ఇచ్చినయెడల నిశ్చయముగ లాభము కలుగును.కదా! ఇందలి ముఖ్యాంశము రైతు సంవత్సరమువరకును పడినపాటువలని ఫలితము అతనిచేపొందనిచ్చుట. రైతుల కింతకంటె అదనముగా లాభము కనబడునిమిత్తమై ఆషరతులమీదనే శాశ్వతపు సెటిల్‌మెంటు చేయబడునేని అయ్యది మొదటిదానికన్న చాలరెట్లు ఉపయోగకరముగ నుండదా!"

ఈపైవాక్యములనుబట్టి విలియమ్‌బెంటింకుగారును, థామసుమన్రోగారునుకూడ రైతువారీపద్ధతినిగూర్చియే వాదించిరి. ప్రధాన మగువా రిరువురి తలంపులునుకూడ శాశ్వతపుసెటిల్‌మెంటుకావలెననియే. ఇండియా విడిచిపోయిన ఆరుసంవత్సరములకు అనగా 1813 సంవత్సరమున కంపెనీకి కవులు తిరిగి యిచ్చెడునపుడు పార్లమెంటు కమిటీవారు థామసు మన్రోగారిని తనిఖీ చేసినారు. అతడు కమిటీయెదుట తనయభిప్రాయమును నిర్దుష్టముగను ప్రబలముగను ఇట్లు వివరించి చెప్పెను.

"మీరు కలెక్టరుగా నుండిన సీడెడ్డుజిల్లాలలో శాశ్వతపు రివిన్యూ సెటిల్‌మెంటు పద్ధతి యేర్పడినదా?

"నేను ఇండియానుండి వచ్చునప్పటికి శాశ్వతపు సెటిల్‌మెంటు జరుగలేదు, కాని రైతుల భూములమీద స్థిరమయిన పన్నులు కట్టియును శిస్తు చెల్లించినంతవరకును, ఏరైతు సేద్యము చేయుచున్న భూమి



ఆరైతే చేయుటకును,శిస్తులు వృద్ధిచేయకుండుటకును తగిన ఏర్పాటులు చేసి భూమిల యనుభవమునకు వారి కేమియును భంగము లేకుండ చేసియును కాపాడు చుంటిమి."

"రైతువారీపద్ధతి యనగా మీయభిప్రాయ మేమో దయచేసి కమిటీవారికి తెలియచెప్పెదరా?"

"రైతువారీ పద్ధతియొక్క సారాంశ మేమో తెలియచెప్పెదను గాని వాని వివరము లన్నియును చెప్పిన విపులముగా నుండును. రైతువారీ పద్ధతిలో దేశములోని భూమి యంతటిపైని శిస్తు సినలు పరచవలెను. ఆశిస్తు శాశ్వతముగా నుంచవలెను. భూమికి హక్కుదారులై వ్యవసాయము చేసికొనెడి వారందరిని తమ చిత్తమువచ్చినంతకాలము స్థిరమైన శిస్తు చెల్లించుచు భూమి యనుభవింప నీయవలెను. ఆతనియాధీనమందున్నన్నినాళ్లును భూమి కదియే పన్ను. అదనము కట్టరాదు. గయాళుభూమిగాని, భూమి అదనముగా గాని, ఆక్రమించుకొనినయెడల ఆభూమిపైని కట్టబడిన పన్ను మాత్రమే ఆత డిచ్చుకొనవలెను.అదనముగా నీయ నక్కరలేదు. అతని పన్ను మార్పకూడదు."

"బంగాళాదేశమునందలి శాశ్వతపు సెటిల్‌మెంటునకును ఈ రైతువారీ పద్ధతికిని శాశ్వతస్థితినిగూర్చి భేదమేమియు లేదనియే మేమనుకొనవచ్చునా?

"శాశ్వతముగ నుండుటనుగూర్చి రెండుపద్ధతులకు నేమియును భేదము లేదు. కాని రైతువారీ పద్ధతిలో గయాళుభూమి, సేవ్యమైనకొలది దొరతనమువారికి వచ్చెడుపన్ను వృద్ధియగుచుండును." అని 1813 సంవత్సరమున తూర్పు ఇండియా సంఘమువారి వ్యాపారములనుగూర్చి పార్లమెంటు కమిటీయెదుటను, సెలెక్టుకమిటీయెదుటను, ఇచ్చిన సాక్ష్యమునం దున్నది.

భాష కర్థమనునది యున్నదందు రేని థామస్ మన్రోగారు చేసినట్టియు, మదరాసు రాష్ట్రమున మిగిలియున్న ప్రదేశములలో చేయదలంచినట్టియు రైతువారీ సెటిల్‌మెంటు పద్ధతి ఏమనగా, తిరిగి ఆక్రమించుకొన్న క్రొత్తభూములకు తప్ప, నిదివరకే రైతాధీనమునందుండు భూమికి హెచ్చుపన్ను చెల్లింప నక్కరలేకుండ శాశ్వతముగా రైతులు భూము లనుభవించు పద్ధతియే. మాటల కేమైన నిర్దిష్టమైన యర్థ ముండెనేని కార్న్‌వాలీసుప్రభువుగారి జమీందారీ సెటిల్‌మెంటునకును, మన్రోగారి రైతువారీ సెటిల్‌మెంటునకును గలభేదము, రైతువారీ పద్ధతిలో గయాళుభూములు సాగుబడిలోనికి వచ్చినపుడు వానికగుపన్ను చెల్లించుటయే కాని పన్నులు స్థావరముగ నుండువిషయమున భేదమేమియును లేదనుట స్పష్టము. ఈవిషయమును స్పష్టముగా తెలిసికొనుట అవసరమైయున్నది. ఏమనిన, మదరాసు గవర్నమెంటువారీనడుమ మన్రోగారి రైతువారీ సెటిల్‌మెంటుయొక్క మొదటినిబంధనను అగౌరవపరచిరి. మదరాసు రైతులకు తమభూములపైనుండు మార్పు చెందరాని శాశ్వతపు పన్నుహక్కు లన్నియును లేవనిరి.

శాశ్వతపు జమీందారీ సెటిల్‌మెంటనిన నిరాదరమును, శాశ్వతపు రైతువారీ సెటిల్‌మెంటనిన సమాదరమును, మన్రోగారి హృదయమున చూపట్టుచుండగా మదరాసు రివిన్యూబోర్డువారు మూడవపద్ధతి యొకటి మొదలుపెట్టిరి. ఇదియే శాశ్వతపు మౌజావారీ పద్ధతి. ఇయ్యది గ్రామము మొత్తముమీద అమరకము చేయుపద్ధతి. 1807 సంవత్సరము ఆగష్టు 15 తేదీని ఇదివరకపరిమితముగా నేర్పడియున్న పన్నులో నూటికి 25 పంతున తగ్గింపవలె నని మన్రోగారు తెలియచేసిన యోచనలపైన రివిన్యూబోర్డువారీక్రొత్తపద్ధతిని ప్రస్తాపించిరి.

“29 కర్నల్ మన్రోగారి పద్ధతియొక్క స్వభావ మిది. అది సీ



డెడ్డుజిల్లాల కేరీతి వర్తించునో కడమజిల్లాలకును అంతియే వర్తించును. ఇప్పుడు ప్రమాణముగా నేర్పరుపబడిన పన్నులలో నూటికి 25 వంతు నగాని అధమము నూటికి 15 వంతుగాని తగ్గించుటకు దొరతనమువారి ప్రస్తుతస్థితిగతులనుబట్టి వీలుపడునేని, ఈసాధనము మిక్కిలి యుపయుక్తమైనదియు, ముందు ముందు మంచిలాభకరమైనదియు నగును. వ్యవసాయదారుడు కష్టించి పండించిన పంటలో మన మెంత తక్కువగ పుచ్చుకొందుమో ఆతడంత ఉచ్ఛగ నుండు ననుట నిర్వివాదాంశము.”

“30. ఇప్పటి యవసరములనుబట్టి గవర్నమెంటువారింతటి నష్టమున కోర్వలే మందురేని, ఈతరుణముననే స్వంత ఆస్తిని కలుగచేయు లాభమును రైతులకు కలుగచేయలే మందురేని, ఇజారాపద్ధతియందువలెనే భూమియందు కొన్ని సొంతహక్కులను స్థాపనచేయుటతోనైన సంతుష్టిచెందవలసి యుండెను. భూమికామందులు శిస్తుపాలు వదలుకొనలేరేని అధమము వారు కరుణాళురయినను అయి యుండగలెను.”

“31. ఈసంగతిసందర్భములనుబట్టి దొరతనమువారిపన్నులు సురక్షితముగా నుండుటకును, దేశము సుభిక్షముగా నుండుటకును, హాడ్సనుగారిచే ప్రస్తాపింపబడిన రైతువారీ పద్ధతినుండి గ్రామశిస్తులపద్ధతికి మార్పుచేసిన మేలుగా నుండునని స్ఫురించుచున్నది.”

“38. ప్రతిగ్రామమును దానితో చేరియుండు 12 గ్రామములును కలిసి యొక చిన్నప్రజాస్వామికమువలె నుండును. ఈగ్రామములకు ఆగాగంద్యా లని పేరు. ఈప్రజారాజ్యములకు పెద్ద, మొకద్దము, పటేలు, రావాడు, రెడ్డి, పెద్దకాపు వీరిలో నెవ్వరో యొకరై యుండును. యుద్ధసమయములయందు గ్రామస్థులందరును వారివారి పెద్దకాపులకై చూచుచుందురు. వారి గ్రామము వారికి విడిపోకుండ నుండు

నంతవరకు, రాజ్య మెట్లుచీలిపోయినను, ఎన్ని ఖండములై పోయినను, వారి కక్కర లేదు. అది యే యధికారము క్రిందకు వచ్చినను సరే ఎవరి యధీనమైనను సరే వారికి లెక్క లేదు. ఆంతరపరిపాలన మెప్పటివలెనే యుండును కాని మారదు. ఎప్పుడును వారికి కలెక్టరనినను, మేజస్ట్రేటన్నను, పెద్దయిజారాదారన్నను పెద్దకాపే.

“39. మనువుకాలము మొదలు నేటివరకును ఆభూముల అమరకము లన్నియును పెద్దకాపులతోనో వారిద్వారాగనో జరుగుచుండెను.” పన్ను హెచ్చుగా నున్నదనుకొనినప్పుడు పెద్దకాపు అందుల కొప్పుకొననేని మామూలుగా రైతులతో జరుగు నేర్పాటులన్నియు నాతనికే విడిచిపెట్టబడుచుండెను. పన్ను మిక్కిలి తక్కువగా నుండి పెద్దకాపు హెచ్చుకట్టుకొనుటకు ఒప్పుకొనకుండెనేని అమాలుదారుడు రైతులతో వానియెదుటనే పరిష్కరించుచుండెను. ఈపద్ధతి యనేకయుగములనుండి చాలదెబ్బలు తిని గట్టిపడి చెదరకుండ నున్నది. ఈపద్ధతిక్రింద అన్ని రాష్ట్రములయందును వ్యవసాయ మభివృద్ధియగుచుండుటచే వ్యవసాయాభివృద్ధి కావలయునేని మనకార్యమున కీపద్ధతి లెస్సగా పనిచేయునని చెప్పవచ్చును.” అని 1808 సం॥రము ఏప్రిల్ 25 తేది యుత్తరమునం దున్నవి.

మదరాసుగవర్నమెంటువారు రివిన్యూబోర్డువారికి ప్రత్యుత్తరముగా ఇంకను అమరకము గాకుండు జిల్లాలలో మూడుసంవత్సరములు మితియేర్పరచి శాశ్వతపు గ్రామసెటిల్‌మెంటుకు సన్నాహము చేయు సాధన మని చెప్పి గ్రామసెటిల్‌మెంటు చేయు నధికార మొసంగిరి. ఈమూడు సంవత్సరముల మరతు ముగియగనే పదిసంవత్సరములకు మరియొక సెటిల్‌మెంటు చేయునట్లును అది అంగీకార మగునేని అదియే శాశ్వతముగా నుండునట్లును, కంపెనీ డైరక్టర్లపేర వ్రాసిన యుత్తర



మునందు సంప్రతింపునకు తెచ్చిరి.

శాశ్వతపు సెటిల్‌మెంటు అనుపేరు చెప్పటతోడనే డైరక్టర్లు అదరపడి పదియేండ్ల సెటిల్‌మెంటు చేయు హక్కు లేనిదే కలుగచేసికొని మీరు పనిచేసినారని రివిన్యూబోర్డువారిపై నేరస్థాపనచేసిరి.

“ఈసమాచారము మీకు చేరుసరికి సెటిల్‌మెంటు జరుగని అన్ని రాష్ట్రములలోను రైతువారీ పద్ధతియే యవలంబించి పనిజరుపవలెను. మరి యేయితరపద్ధతి మీదనైనను, గ్రామశిస్తులు కట్టబడియున్నయెడల అవి యన్నియు నిప్పుడు ఈయబడిన మరతుకాలము సరిపోగానే మర్తబు అయిపోవునట్లు ఖచితముగా తెలియచేయవలయును.” అని 16-12-1812 సంవత్సరము ఉత్తరమునం దున్నది.

మదరాసు గవర్నమెంటువా రీడైరక్టర్ల తీరుమానమును నిషేధించిరి.

“జాతీయైశ్వర్యమునకును, అభివృద్ధికిని వ్యవసాయమే మూలాధారముగా పరిగణింపబడుచుండెను. భూములహక్కులపై దొరతనమువారు పుచ్చుకొనెడు సొమ్మునకు హద్దు ఏర్పడియుండుట వ్యవసాయవ్యాప్తికిని అభివృద్ధికిని ముఖ్యమని తలంచుచున్నారు. ఇందుమూలమున దొరతనమువారిని నష్టపడుమని కాదు. అట్టిలాభము లేకుండిన వ్యవసాయము వృద్ధిపొందుటకాని విరివియగుటకాని సంభవింపదు. దేశములోని యాధారములు వర్ధిల్లవు ... ... ... ఈవెనుకటియభిప్రాయములను తెలుపునపుడు శాశ్వతపు సెటిల్‌మెంటు ద్రవ్యసంబంధమగు నీతియనుసంగతి నిష్కర్షగా యోచించితిమి. వ్యవసాయమే జీవనముగా నుండు జనసామాన్యమునకు మనదొరతనము స్థిరముగా నిలిచియుండుటయందు మనస్పూర్తి యగు శాశ్వతమైన యభిమానమును పుట్టించుటయందుకూడ నియ్యది ప్రాణావసరమగు విషయ మని తెలుపవలసి

న పనిలేదు.

మరుసటి సంవత్సరమున మదరాసు గవర్నమెంటు వారి శాశ్వతమైన గ్రామసెటిల్మెంటుల కనుకూలముగను, శాశ్వతమగు రైతువారీ సెటిల్మెంటునకు ప్రతికూలముగను, వాదించుచు కంపెనీడైరక్టరులింతకంటె నెక్కువ బలముగ మొరలెత్తిరి.

« శాశ్వతపు సెటిల్మెంటువలని ప్రధానోద్దేశము జనులు వారివ్యవహారములను వారు చక్కబెట్టుకొనిచ్చుటయే యైనయెడల ఆయుద్దేశము రైతువారీ సెటిల్మెంటు వలన నీషత్తు అయినను, నెరవేరునా? వారివ్యాపారములను సర్కారుఉదోగస్థులు చక్కబెట్టుటకంటె వారే యెక్కువ చక్కగ చూచుకొందురను గట్టినమ్మక మున్నది. అట్టివ్యాపారము లెవరివద్దనుండి తప్పింపబడగలె ననియున్నదో వారియొద్దనే ఆయేర్పాటు లన్నియు పూర్ణముగ నిలిచిపోవును కదా! భూమిహక్కుదారుల హక్కు స్వాతంత్ర్యముల సంరక్షించుటకై యుద్దేశింపబడిన యీపద్ధతివలన వారే సంవత్సరమైనను, దేశవైపరీత్యమువలనగాని, ప్రత్యేకవిపత్తువల్లనగాని, సోమరితనమువలనగాని, తెలివిలేమివలనగాని వ్యవసాయము చేయలేకపోయిరేని ఆసంవత్సరముతో వారిహక్కులన్నియును నశించి గవర్నమెంటుకు చెందిపోవలసివచ్చును.''

భూవసతియందు నిజమైన హక్కులుగల చోట్ల ఇక నేపద్ధతిక్రిందను నింతదారుణమైన యక్రమ మెన్నడును జరిగియుండదు.

« రైతువదలిపెట్టిన భూమి కాని, ఆక్రమించుకొన్న పరిమితిగాని, యింతయున్నదని చెప్పువిషయమున వానికేవిధమయిన కాపుదలయును లేదు. ఈబాధలనుండి తప్పించుకొనుటకై తనభూమిపరిమితమును మార్పులేకుండ చేసికొనుననుకొందుము. ప్రస్తుతవ్యవసాయస్థితియును నీటితడుపు ఆధారములును, పన్నుల అర్జింపును. తుక్కావి



యేర్పాటుచేయుటయు, కాలవైపరీత్యమును బట్టి పన్నుతగ్గించుటయు, ఇవియన్నియును భూమియందు హక్కులేనట్టివారు రైతునందభిమానములేనట్టివారును చేయవలసియుండెను. స్వాభిమానము చెడ్డమార్గములకు దింపకుండ సురక్షితముగా వనిజరుపగలుగునేని నిరుపయోగులగునట్టియు, తప్పుత్రోవలకు బోవునట్టియు నీసర్కారు ఉద్యోగస్థుల బారిని పడకొట్టి వారియొత్తుడునకును, వారికార్యమునకును లోనుచేయుటకంటె, జనులయందే నమ్మకముంచుటయును, దేశము జనుల చిత్తము వచ్చినట్టు జనులనే యభివృద్ధిచేసుకొననిచ్చుటయును, నిశ్చయముగ మేలైనమార్గము. ఏది యెట్లున్నను కర్నల్ మన్రోగారు యోచనలోనికి తెచ్చిన రైతువారీ పద్ధతికే భూమిపన్నుల శాశ్వతపు సెటిల్మెంటు పద్ధతియనిపేరుపెట్టుట యేవిధముచేతను పొసగదని చెప్పెదను. దీనియందున్న భూమిపన్నును, భూమియందలి హక్కులను పూర్వమెంత యస్థిరముగ నున్నవో అట్లే యుండిపోవును. అనవసరవ్యాపారములయందు జోక్యము కలుగ చేసుకొనెడు పబ్లికుఉద్యోగస్థుల బాధ ప్రజలకు తప్పకపోవును. అట్టివారి యాధిపత్యమున స్వంతవ్యాపారములేవియును స్వస్థత గననేరవు.... ... ... ... ...

« హిందూదేశమునందలి భూమిపన్నుగురించి ఇంగ్లాండునందిప్పుడు కలిగియున్న యభిప్రాయములకును, ఇక్కడియభిప్రాయములకును, గలగొప్పవ్యత్యాసమొకటి కలదు. ఆంగ్లేయదేశమునందుండెడువారు హిందూదేశమునందలి యాధారములపై చెల్లవలసియుండు పన్నులు, దాని యౌన్నత్యమునకు తగినంత చెల్లవేమో యని యలజడిపడుచున్నట్టు కాన్పించుచున్నది. ఇక్కడ నన్ననో, దేశముయొక్క స్వస్థత పబ్లికుపన్నుల భారముచే క్రుంగిపోవుచున్నదనియును, ధారాళమైనట్టియు, వివేకము కలిగినట్టియు, కట్టుదిట్టము లుండిననేగాని దే

మునందలి యాధారము లన్నియు త్వరత్వరగ వృద్ధిపొందు నను నాశకంటె, అవి క్షీణించుపోవు నను భయమే హెచ్చుగా నున్న దనియును, సర్వే సర్వత్ర యుద్దేశమును కలిగియున్నారు. ఇట్టి యుద్దేశము లేని వారే లేరు. ఈయుద్దేశము దేశమునం దెంత దృఢముగా నున్నదో దానిని తమకు విశదపరుప మాకు శక్తి చాలదు. మీవివేకమును ధర్మబుద్ధియును, దాక్షిణ్యభావమును, వినియోగింపవలెను. ఇయ్యది వేలకొలది జనుల యోగక్షేమములతోడను, విశాలమైన దేశముయొక్క సుభిక్షతతోడను మీదొరతనమువారి జయప్రద పరిపాలనముతోడను సంబంధించి యున్నది. ప్రకృతిసిద్ధముగ దేశము అనుకూల మైనది. విదేశీయుల దాడియును, అంతఃకలహములును లేకుండ సురక్షితమైయున్నది. ఇంక దేశము సిరియును, స్వస్థతయును, పొందవలె నన్న అయ్యది దొరతనమువారు దానియాధారములపై విధించెడు పన్నులపరిమితినిబట్టి యుండును." అని 12-8-1814 తేదీ యుత్తరమునం దున్నది.

ధర్మపరిపాలనమునందును ప్రభుత్వవ్యాపారమునందును సంస్కరణములు శీఘ్రముగ జరుగవలసి వచ్చుటచే మన్రోగారి మనసంతయు నావైపునకు మరలి అవలంబింపవలసినది రైతువారీ సెటిల్‌మెంటు పద్ధతియా, గ్రామ సెటిల్‌మెంటు పద్ధతియా, యను సంగతి తీర్మాన మగుట యాలస్య మయ్యెను. థామస్ మన్రోగారు 27 సంవత్సరములు హిందూదేశమున కష్టించి పనిచేసెను. అనంతర మింగ్లండున 7 సంవత్సరములు గడపెను. ఆవెనుక ధర్మపరిపాలనాపద్ధతిని సవరించు విషయమున విచారణసంఘ మొకటి యేర్పడెను. అందునకు పెద్దగా నాతనిని,ఇండియాకు మరల బంపిరి. 16--9--1814 తేదీని అతడు ఇండియాకు వచ్చి చేరెను. ధర్మపరిపాలనాపద్ధతి అభివృద్ధి చేయుటకును ఆయుద్యోగములందు పూచీగల అధికారములు హిందూదేశవాసుల కి



ప్పించుటకును అత డెంత పాటుపడెనో యయ్యది మరియొకచోట చెప్పబడును. మహారాష్ట్రయుద్ధమున హిందూదేశవాసులయందు విశ్వాసమును నమ్మకమును చూపుటచే యుద్ధరంగమున ఆతని శౌర్యసాహసములకది యెంతగా తోడ్పడి ఆతనికి పేరు ప్రఖ్యాతులను తెచ్చెనో వానిని తెలుపుట యీగ్రంథముయొక్క యుద్దేశము కాదు. ఈయుద్ధము ముగిసిన పిదప 1819 సంవత్సరము జనవరి నెలలో మన్రోగారు తిరుగ నింగ్లండునకు పోయిరి. భూమి సెటిల్‌మెంటు పరిష్కార మిప్పుడు తటస్థమయ్యెను.

మదరాసు రివిన్యూ బోర్డువా రిప్పటికిని గ్రామము మొత్తము మీదనే సెటిల్‌మెంటు చేయవలెననుతలంపు కలిగి యుండిరి. 1818సంవత్సరమున వారు, కొదువ లేనట్టియు హిందూదేశమునం దెన్నటికిని మరచిపోవ నట్టియును సారాంశము మరియొకటి వ్రాసిరి.

జమీందారీ పద్ధతినిగూర్చి ముచ్చటించుచు వా రిట్లు చెప్పిరి. "పన్నులు మునుపటికంటె సుకరముగాను క్రమముగాను వసూ లగుచున్నవి. దేశీయులగు రివిన్యూ అధికారులు సేయుదారుణమైన అక్రమము లన్నియును, తొలగిపోయినవి. ఏటేట చేయు అమరకములవలన కలెక్టరులద్వారాగను తనిఖీ కమిటీల ద్వారాగను దొరతనమువారిపై బడియుండు యేటేట జరుగుఅమరకముల అవిధి యంతయును తొలగిపోయినది. ఆపన్నులు వసూలయ్యెడుపట్ల జరిగెడు దగానేరములును, సొమ్ము హరించు నేరములును, దర్యాప్తుచేయ నక్కరలేకపోయెను. ఉత్తరసర్కారులలో దొరతనమువారికి రావలసిన పన్నులవసూలునకై వినియోగించెడు పూర్వపు నిష్ఫలప్రయత్నములును, జమీందారులును పాళెగాండ్రును జరిగించు మోసకృత్యములును, ఎగవేయుప్రయత్నములును, తగ్గిపోయినవి. జమీందారుల పాళియము భూములమీద రావలసి

నపన్నులకై తరచు సైన్యబలసహాయమును బెదరింపులును కావలసివచ్చెడివి. దేశీయపు సిబ్బందీలలో పూర్వము బలముగా నుండు వేనవేలు దురభ్యాసము లన్నియును అంతరించినవి. అట్టి దుండగము లన్నియును అస్థిరములగు అమరకములుగల జిల్లాలలో అవమానకరముగ నిప్పటికిని నిలిచి యున్నవి..............

“పూర్వపు జమీందారులును, పాళెగాండ్రును నిశ్చయముగా దేశములోని సామంతజన మైయున్నారు. వారి భూమిహక్కుల ప్రాతిపదిక విడదీసి పరీక్షించినచో నిలువక పోవచ్చును. వారికిని ప్రజలకును కలిగియుండు సంబంధములను విడదీయుటకన్న వానిని బలపరచుటయే యెక్కువ న్యాయముగను, ఎక్కువ ధారాళముగను, ఎక్కువ లౌక్యముగను ఉండును. ఆరాష్ట్రములు మనకు సంపాదన మైనప్పటికన్న తరువాత తరువాత మనకు సర్కారులలో కలిగినబలము, సీడెడ్డు జిల్లాలు మనకు వచ్చిన కాలమందే యుండి యున్నయెడల పూర్వపు జమీందారుల కందరకును, ఈ కడపటి దేశమునందలి పాళెగాండ్రవలెనే వారి యౌదార్యమునకొలది యుపజీవితముల నిచ్చి, వారి భూము లన్నియును లాగికొని యుందుము. దేశీయ నాయకులకును ప్రజలకును ఉండెడి అనుబంధములును, జమీందారుల కనేకులకు తమతమ దేశములందుగల సామంతమును, మనము తలంచుకొనిన యెడల, ఈప్రక్రియ అవివేకమైనదియును దయాశూన్యమైనదియును కాదా యని మిక్కిలిగా సంశయముకూడ పొడమును.”

రైతువారీ సెటిల్‌మెంటునుగూర్చి వా రిట్లు వ్రాసిరి. “1792 సంవత్సరమున కంపెనీవారి కియ్యబడిన బారామహాలు సేలముజిల్లాలలో రైతువారీ పద్ధతి మొట్టమొదట ఆరంభమైనది. ఆదేశము మనకు చేరిన వెంటనే ఒప్పగించుకొనుటకు “కర్నల్‌రీడ్డు” అను నాయన అధికారిగా నియమింపబడెను. అప్పుడు లెప్టినెంటులుగా నున్న “కర్నల్ మన్రో” “కర్నల్ మెక్లియాడ్డు” “కర్నల్ గ్రాహాము” అనువారు కర్నల్‌రీడ్డుగారికి సహాయులుగా నుండిరి.........

“ఆర్కాటుదేశమునందలి ఉత్తరభాగమున మిరాసీదార్లకును వంశపరంపరానుగతముగ నుండు భూమిఖామందులకును గల ప్రత్యేకపు భూమిహక్కు లన్నియును తప్పించివేయబడి సర్కారురివిన్యూలో కలిపివేయబడెను. వేయేల? సర్వోపరిమితముమీద కట్టిన పన్ను లమితములై భూమిఖామందులకు వచ్చెడు స్వల్పమగు నాదాయము కూడ గ్రాస్యమై పోయెను. వ్యవసాయదారునకును దొరతనమువారికిని నడుమ మరియొక రెవ్వరును లేకుండ పోయిరి.........

“ఈరైతువారీ సెటిల్‌మెంటు తరుచుగా క్రిందితరగతి యుద్యోగములలో నుండు తహాశ్శీలుదారులును సిరస్తాదారులును ఏటేటచేయుచుండెడివారు. సామాన్యముగా పైరు వేసెడువరకును పూర్తి అయ్యెడిదే కాదు. అప్పటి పద్ధతిప్రకారము పన్నెంతవరకు వసూలు చేయుటకు వీలుపడునో అంత హెచ్చుగ పన్నుకట్టుటయే. పంటపండెనా సర్వోత్తరమునుబట్టి రైతు ఇచ్చుకొనగలిగినంత హెచ్చుగ పన్నుకట్టబడుచు వచ్చెను. పంటపాడైనను, దొరకినంతవరకు పన్ను వసూలుచేయుటయును, రైతు చెల్లింపలేకపోయిన తప్ప ఏవిధమైన ముదరాయును ఇయ్యకపోవుటయును జరుగుచుండెను. ఈవిషయమున దారుణమైన దర్యాప్తు చేయుచువచ్చిరి. అట్టివారి యుపపత్తిని దర్యాప్తు చేయుటకై ఏర్పడిన కలెక్టరుగారి సిబ్బందీల మాట యటుండగా వాని యిరుగుపొరుగువా రందరునుగూడ విచారణకర్త లగుచుండిరి. ఏ మందు లేని ఆతని కేదైనను ఆస్తియైనను చూపవలెను. లేదా యాసొమ్ము తామైన నిచ్చుకొనవలెను.”

“వ్యవసాయదారునకు రివిన్యూ అధికారి ఏపాలములు ఏర్పరచి

యిచ్చునో వానినే పుచ్చుకొనితీరవలెను. “శేకరీ” యనునాతడు వక్కాణించినట్లు ఆభూమి నాతడు దున్నుకొనినను, దున్నుకొనకుండినను దానిపైని కట్టిన శిస్తులిచ్చుకొనవలసినదే. బళ్లారి కలెక్టరు గారగు “ఛాప్లిను” గారు కర్నల్ మన్రోగారికి సహాయులై యుండిన వారిలో సమర్థుడు. ఇప్పటికిని ఆతడు రైతువారీ పద్ధతినిగురించి పూర్ణప్రయత్నముతో పనిచేయుచున్నాడు. “ఇప్పటి నిబంధనల ననుసరించి తమస్థితిగతులకు తగినంతవరకు కాపురస్థులు వ్యవసాయముసేయ బాధ్యులైయుయున్నవారు. అట్టి నిబంధనలకునరిపడని విశేషాధికారమును చలాయించుట యీపద్ధతియొక్క యాచారమై యున్నది.” అని ఆయన చెప్పియున్నాడు. కలెక్టరును ఆతనిక్రింద నుండు దేశీయులగు రివిన్యూనౌకరులును, మనుష్యులనుబట్టి చెర యందుంచి వారిని శిక్షించుటయే యీ యధికారమును చలాయించుమార్గ మని ఆతడు వివరించినాడు. ఈబాధలవలన రైతు తాను దున్నుకొనెడి పొలములను వదలి పెట్టి పోయెనేని ఆవలాయితు దెచ్చుట కేగిన నచ్చటికి వెంబడించుటయును ఆక్రొత్తవాసస్థలమున కలిగెడి సదుపాయములను ఆతనికి లేకుండజేయుటకై తమచిత్తము వచ్చినరీతిని పన్ను కట్టుటయును చిరకాలమునుండి జరుగుచున్న ఆచారమై యున్నది.

“క్రొత్తగా సంపాదనమైన దేశముయొక్క వాస్తవమైన ఆధారములు కాని, భూములయందు వారికి గలహక్కుల స్వభావములు కాని తెలియకయే విదేశవిజయులు కొందరు, అనేకజాతుల జనులచే నిండియుండి ఆచారవ్యవహారాదులచే అనేకవిధముల భేదపడియుండు విరివియైన ప్రదేశములు తమకు స్వాధీనమైనతోడనే, ఐరోపాఖండమునందు మిక్కిలి నాగరికతనందిన దేశములలో సైతము కల్పనావ్యాపారముల వలెను, భగీరథప్రయత్నములవలెను ఉండుకార్యములకై ప్రయత్నపడు



చున్నవారు. ఐరోపాఖండమునందు దేశస్థితిగతులు తెలియు వివిధములగు మెట్టులెక్కలు దొరకును. జనులకును దొరతనమువారికిని సంబంధమున్నది. ఈప్రయత్నమనునది, భూమిపన్నుల నిర్ధారణకొరకు. ఆనిర్ధారణ యొక రాష్ట్రముపై కాదు. ఒక మండలముపై కాదు. ఒక దేశముపై కాదు. ఒక జమీనుపై గాదు. ఒక యిజారాపొలముపై కాదు. తమరాష్ట్రమునంగల పొలము లన్నిటిపై విడివిడిగా నిర్ధారణచేయవలెను. ఇట్టి మిథ్యాభివృద్ధికై వారిలోవారికిగల పూర్వపు అనుబంధము లన్నియును ఎరుగక త్రెంచివేయుచున్నారు. గ్రామగ్రామమునకుగలిగి హిందూప్రజాపరిభుత్వమున కాధారభూతమై యుండు పూర్వాచారములన్నియు నశింపజేసినారు. ఏదో భూమిశాస్త్రి మొకటి కల్పించి అనాదినుండియును, గ్రామసముదాయమున కంతకును మొత్తముమీద చెందియుండు భూములన్నియును, చీల్చి క్రొత్తగా పన్నులు కట్టుచున్నారు. ఈసాముదాయపు హక్కు విశేషాధికారముగల ఒక్క మిరాసీదార్లకును ఖదీములకే కాదు. పైకారు లనుపేర నొప్పు చిన్నచిన్నరైతాంగమునకు గూడ ఈహక్కు లుండియున్నవి. ఇవి యన్నియును తెలివిలేమిచే నిరాకరించుటయు అట్టినిరాకరణమువలన పల్లీకసంఘమునకు చెందియుండు గ్రామమాన్యము హక్కులన్నియును లాగుకొనియును భూముల యందుండెడు స్వంతహక్కు లన్నియు నశింపుచేసియు అందుకు బదులుగ నెవనికో యొకనికి రొక్క రూపముగ కొంత వేతనము నొసంగుటయును మనము కనులార కనుచున్నారము. తమపన్ను పొలము పొలమునకును ఏర్పాటుచేయుటయే కాని వాస్తవముగా వారేర్పరచిన మితి యెప్పటికిని చేరరాని పరిమితి. రైతులకు చిత్తమువచ్చినరీతిని పన్నులు కట్టుచున్నారు. వీరికి పూర్వమందున్న ముసల్మాను దొరతనమువలెనే రైతులను బలవంతముగ నాగలికి కట్టి వేయుచున్నారు. ఎక్కువ పన్నులు కట్టి భూముల వ్యవసాయము చేయ నిర్బంధించుచు

న్నారు. ఆతడు తప్పించుకొని పోయెనేని తిరిగి లాగుకొనివచ్చి మరల దానికే కట్టిపెట్టుచున్నారు. పైరు పంటముఖమునకు వచ్చువఱకును తమ పన్నులను నిలుపుచేసి ఆపంటవలన రాగలిగినంత ఆదాయమును లాగుకొనుచున్నారు. వానికి ఎడ్లును, విత్తనములు తప్ప ఏమియును మిగుల నిచ్చుటలేదు. ఈ దుఃఖకరమైన వ్యవసాయవ్యాపారమును మరల చేయుటకై కొన్నియెడల ఈవిత్తనములును మరల వారే తెచ్చి యీయవలసి వచ్చుచుండెను. ఈవ్యవసాయము దొరలకొఱకెగాని తననిమిత్తమయి కాదు.''

శాశ్వతమైన పన్నులుకాని మితమగు శిస్తులుగాని యేర్పడని రైతువారీ సెటిల్‌మెంటు పద్ధతిక్రింద వ్యవసాయదారుల స్థితిగతు లిట్లున్నవి. ఈపద్ధతికే మన్రోగారు శిఫార్సు చేసినది. ఇంతకంటె ప్రబలమగు ద్విపాదపశుక్షేత్రము వేరొకటి యెన్నడైన చిత్రింపబడి యుండునా?

కడపటికి గ్రామపద్ధతినిగూర్చి బోర్డువా రిట్లు వ్రాసిరి. ‘‘ఈపద్ధతి అన్నిజిల్లాలలోను ఒక్కమాదిరిని జయప్రదముగ లేకపోయినను (ఎక్కడికో పోవనేల బళ్లారిలో బాగుగ పనిచేసినది కాదు) దేశములోని వ్యవసాయదారుల స్థితిగతులను చక్కగా వృద్ధిపొందించె ననియు ఈ గ్రామ సెటిల్‌మెంటువలన ముఖ్యముగా బాగుపడినది మన మెవ్వరి కమరకపరచితిమో వారొక్కరే కాక మొత్తము రైతులందరును గూడ బాగుపడినా రనియును కలెక్టరు లందరు నేకగ్రీవముగ చెప్పుచున్నారు రైతువారీ తీర్వాలు అన్నిచోట్లను విశేషముగ తగ్గింపబడినవి. పెద్దరైతులు క్రిందివారిని ఒత్తుడుచేయుట లేదు సరికదా క్షీణించిన పెద్దరైతుల యధికారమునకు న్యాయము చేయ కలెక్టరులు తహశ్శీలుదారులను పంపవలసిన వారగుచున్నారు. వారి రిపోర్టు లన్నియును, ఈప్రధాన విషయమునం దేవిషయమునను మినహాయింపులేకుండ సర్వత్రఒక్కటే మాదిరి ననువదించుచున్నవి. ఈపద్ధతి మొదట స్థాపించినవారి యుద్దే



శముల కనుకూలముగా పనిచేసిన దని చెప్పుటకు నమ్మకముగా నుంచతగిన సంపూర్ణ సాక్ష్యమై యున్నది. కాని ఈ సెటిల్‌మెంటు బాగుగ నడుపబడిన కడపజిల్లాలోను ఆర్కాటుజిల్లాలోని యుత్తరభాగమునందును దేశ మెంతసుభిక్షముగా నున్నదో దాని కుపమానముగా చూపుటకైన నీరాష్ట్రమునందలి రివిన్యూ రికార్డులో మరియొక సాదృశ్యమును కానరాకున్నది.'' అని 1818 సం॥రం జనవరి 5 తేదీని బోర్డువారు వ్రాసిన సారాంశమునున్నది.

ఈకడపటిమొఱ్ఱ వ్యర్థమై పోయినది. రైతువారీ పద్ధతికి మూలకారకుడును ఇప్పుడు ‘‘సర్. కె.సి.ఐ.''అను బిరుదులను పొందినవాడును అగు థామను మన్రోగారు కడసారి మూడవమాఱు మదరాసుగవర్నరుగా వచ్చిరి. జమీందారులతోడను పాళిగాండ్రతోడను, ఇదివరకు జరిగిన జమీందారీ సెటిల్‌మెంటు తప్ప రాష్ట్రమున కంతకును రైతువారీసెటిల్‌మెంటె వర్తింపవలెనను ఫయిసలా యుత్తరవులు పుట్టెను. ఎనుబది యేండ్లు పైన గడచిన తరువాత సంస్మరణీయమైన యీచర్చలకేసి మరలి చూచిన హిందూదేశ విద్యార్థి కెవ్వనికి దుఃఖకరమైన యభిమాన ముదయింపదు? ఎవ్వనికివి తలంపునకు రాక యుండును? సర్ థామస్‌మన్రోగారి నైజప్రవర్తనము అట్టివిద్యార్థి కెంత శ్లాఘాపాత్రముగ నున్నను, ఈవివాదాంశమున రివిన్యూబోర్డువారిదే న్యాయమనియెడి యభిప్రాయ మెట్లు పుట్టకుండును? దేశమున పూర్వమునుండియును, ఉన్నసంఘములు వర్తమానాభివృద్ధికి అసందర్భముగ లేవేని, వివేకముగల దొరతనము దానిని పోషించి వృద్ధిచేయ ప్రయత్నింతురుగాని దానిని తుడిచి వేయ ప్రయత్నింపరు. హిందూదేశగ్రామములందు ఆంతరంగిక వ్యాపారములన్నియును తహశ్శీలుదారులకంటెను, సిరస్తాదారులకంటెను, రక్షకభటులకంటెను, గ్రామస్తులే తృప్తికరముగాను జయప్రదముగాను పనిచేసికొని రనుట నిస్సంశయము. చేత నగుచో

ట చాలమంది జనుల వ్యాపారములను వారిని నడుపుకొననిచ్చుట భూతదయాలక్షణము. బారామహలు, కనరా, సీడెడ్డుజిల్లాలలో మొదటమన్రోగారు సెటిల్‌మెంటు చేసినపుడు గనుక గ్రామసముదాయములు పనిచేయు స్థితిలో నుండియుండె నేని, అతడే ఆపద్ధతి యుండితీరవలె నని బలముగా వాదించియుండును. ఆయాప్రదేశములలో రైతులతోడనే అమరకములు ప్రత్యేకించి చేసియుండుటచేతను, మదరాసు గవర్నమెంటువారి యెదుటను పార్లమెంటువారి యెదుటను ఈపద్ధతి మంచిదని వాదించి యుండుటచేతను, ఇదివరకు సెటిల్‌మెంటుకాని జిల్లా లన్నిటిలోను ఈపద్ధతియే అమలుజరుగవలె నని డైరక్టర్లచేత ఉత్తరవులు, పొంది యుండుటచేతను, అతనిజీవితమునందుత్తరభాగమున తనయభిప్రాయమును మార్చుకొనుటకుగాని 1812 మొదలు 1818 వరకు రివిన్యూబోర్డువారు పోషించిన గ్రామసముదాయముల మూలమున జరుగు భూమిపరిపాలనమును మెచ్చుకొనుటకుగాని మన్రోగారు శక్తుడు కాకపోయెను. మదరాసు గవర్నరుగా నుండి మన్రోగారు గ్రామసంఘముల నుద్ధరింప చాల పనిచేసెను. ఆతడాసముదాయములను కట్టుబాటులోనికి తెచ్చెను. వానికి ధర్మపరిపాలనము చేయ నధికారము లిచ్చెను. హిందూదేశమునందలి గ్రామసముదాయము లన్నిటిని పునరుజ్జీవింపజేసి పూర్వము పనిచేసినట్టువలెకట్టుదిట్టముగా పనిసాగింప ప్రయత్నించెను. కాని యీయత్నము లన్నియు నిష్ఫలము లయ్యెను. పూర్వపు సంఘముల కుండవలసిన బలమెల్లనుపోయినపుడు అధికారముమాత్ర మెట్లు జీవనము నిలుపగలుగును? ప్రతి రివిన్యూ అధికారియును, దుర్మార్గుడగు ప్రతిరక్షకభటుడును, వచ్చి గ్రామస్తు లందరను బాధించుచున్నపుడు పూర్వము నిలిచినట్టు సాంఘికభావ మెంతవరకు నిలుచును? బ్రిటిషు పరిపాలనము ప్రారంభ మైనది మొదలు హిందూదేశమునకు అనేక మార్పులు సంప్రాప్త మయ్యెను. అందులోని వనేకములు అభివృద్ధికిని, ఉన్నతికిని,



కేవలమును ఉత్పాతకరమైనవి. అన్నిటికంటెను విచారకరమైనసంగతి పూర్వమునుండి యున్న స్వరాజ్య స్వరూపములను, గ్రామసాముదాయములను, ఉన్మూలించుటయే. ఇట్టి సంఘముల కీ హిందూదేశమే ప్రపంచములోని దేశముల కెల్ల జనస్థానము.

రివిన్యూబోర్డువారిచే ననుకరింపబడిన గ్రామపద్ధతి కడమట్ట, నిరాకరింపబడుట వర్తమానపాఠకునకు విద్యాసంబంధమైన యభిరుచిని మాత్రమే కలిగించును. పైపెచ్చు వ్యవహార లక్షణములను బట్టి విచారించినచో మన్రోగారిచే ననుసరింపబడిన రైతువారీ పద్ధతియైనను పూర్ణముగా సాగనిచ్చిన మేలైయుండును. అదియును సాగనిచ్చినారు కారు. 1807 సంవత్సరమునను 1813 సంవత్సరమునను, థామసు మన్రోగారు చేతనైనంతవరకు దృఢముగ నొత్తి చెప్పిన దేమనగా రైతువారీ పద్ధతియొక్క సారాంశము పన్నులు శాశ్వతముగ నిలిచియుండవలెననియే. బంగాళమున జమీందారీ పద్ధతి యెంతశాశ్వతమైనదో గయాళుభూములవిషయమునతప్ప రైతువారీ పద్ధతి యిచ్చట అంత శాశ్వతమని. మదరాసురాష్ట్రమున సెటిల్‌మెంటు కాకుండ నిలిచియుండిన అన్నిజిల్లాలలోను ఈపద్ధతి 1820 సం॥రమున కడమట్ట వర్తింపచేయబడెను. మదరాసు గవర్నమెంటువారిచేసంగీకరింపబడి 1862 సం॥రమువరకును అమలుజరుపబడుచున్న పన్నులశాశ్వతస్థితిమాత్ర మప్పటినుండి నిరాకరింపబడియెను. సెటిల్‌మెంటు సెటిలుమెంటుకును దొరతనమువారికి చెల్లెడు పన్నులమార్పులో కలుగుచున్న నిత్యచాంచల్యమును ఆపన్ను లెట్లుకట్టబడునో ప్రజలకు ఆకారణము తెలియక పోవుటయును, మదరాసునందలి వ్యవసాయికులనందరకును శాశ్వతమైన సందేహములోను నిత్యదారిద్ర్యములోను ముంచివేయుచున్నవి.



# హిందూదేశార్థికచరిత్రము.

## తొమ్మిదవ ప్రకరణము.

### మన్రోగారు, మదరాసురాష్ట్రమునందలి రైతువారీ సెటిల్‌మెంటు. (1820-1827)

1820 సంవత్సరము మే నెలలో సర్ థామస్ మన్రోగారు మదరాసురాష్ట్రమునకు గవర్నరుగా వచ్చెను. దొరతనమువారు ఆ నెలలో రైతువారీపద్ధతిని సర్వత్ర వర్తింపచేసినట్లు ప్రకటించిరి. వీలు కలిగిన పుడెల్ల జమీందారీలును ముఠాలును స్వాతంత్ర్యములుగల తదితరభూములును వేలములమూలముగను అతిక్రమణదోషములమూలముగను సర్కారువారు మరల సంపాదించిరి. అట్టిచోటులందెల్ల రైతువారీపద్ధతి వర్తింపచేసి, ఊరిమొత్తముఅమరకము లన్నియు శీఘ్రముగ తప్పించివేసిరి. జాయంటుహక్కు లున్నచోటులందెల్ల నశింపుచేయుటకును రైతురైతునకును విడివిడిగా అమరకము చేయుటకును కలక్టర్లకు ప్రోత్సాహము కలిగించిరి. భూమిపంటలో దొరతనమువారు పన్నుక్రింద నిర్ణయించి పుచ్చుకొనెడిపన్ను నూటికి 45, 50 లేక 55 వంతున హెచ్చుతరముశిస్తు ఏర్పడి అందువలన దురంతమైన బాధ కలుగుచువచ్చెను. సర్ థామస్ మన్రోగారు మొత్తముమీద ఈబాధ కొంతవరకు యోచనాపరు డగుటచే తగ్గించుకొనుచువచ్చెను.

మదరాసురాష్ట్రమున రైతువారీపద్ధతి యేయేజిల్లాలలో యెప్పుడెప్పుడు వర్తింపచేసినదియు ఆచరిత్ర యంతయును వరుసగా చెప్పుట



యీప్రకరణముయొక్క యుద్దేశము కాదు. సంపుటములకొలది యుండిన ఆకాలపుదొరతనపురికార్డులోని కొన్నిముఖ్యభాగములను మాత్రము మన మెత్తి వ్రాసినచో ఆసంవత్సరములలో జరిగిన చర్యలను మదరాసురాష్ట్రమునందలిజనులయార్థికస్థితియును కొంతవరకు మనకు తెలియగలదు.

నెల్లూరు:—1818 సంవత్సరమున నెల్లూరుకలెక్టరు ఈమండలమున కోవూరుగ్రామమున భూములు సర్వే చేయించి తరములు యేర్పరచి శిస్తులు కట్టి ప్రయత్నించి చూచునిమిత్తమై రైతువారీసెటిల్‌మెంటు ప్రారంభించెను. రివిన్యూబోర్డువారి ప్రొసిడింగ్సువల్ల మొదటిలో శిస్తు ఎట్లు ఏర్పరచినదియు తరువాత నది యెట్లు సవరణ చేసినదియు బోధపడగలదు.

పల్లపుభూములు:—"దామాషాయీ అమ్మెధరప్రకారము పుట్టి యొకటింటికి 20 రూపాయిలచొప్పున ధాన్యమునకు ధరకట్టగా 34,373 రూపాయిలు తేలినది. అందులో మామూలుకాలవాసము రూపాయికి 0-1-0 వంతున మినహాయించిన 2234 రు. అగును. అది పోను వ్యవసాయదారులకును దొరతనమువారికిని పంచవలసినమొత్తము రు 32,139 మాత్రము మిగిలియుండును."

"ఇందులో రైతులకు ఇరువదింట తొమ్మిదిపాళ్లు అనగా నూటికి 45 వంతున యగును. అది ర్పు 14,462 లు. సర్కారుకు రావలసినమొత్తము రు 17,667."

మెరకభూములు:—మెరకభూములమీదను తోటపంపులమీదను ఈరీతినే ఆర్జించి పుట్టికి రు 25 లువంతున ఖరీదు కట్టిరి. మెరకభూములమీద దొరతనమువారికి నిలిచియుండునది రు 768 లు. తోటలమీద రు 205 లు."

కలెక్టరు కట్టినలెక్కలకును ఆత డవలంబించిన ధాన్యపుఅమ్మె

ధరలకును వ్యవసాయదారులు పేచీలు పెట్టిరి. కొన్ని మినహాయింపు లంగీకరించి బోర్డువారు కోవూరుపైన సోలుసరి పన్ను మొత్తము మట్టముగా రు 15600 లు తేల్చెను." అనగా లెక్కప్రకారము గ్రామమున పండుపంటలో అర్ధభాగ మీక్రొత్తపద్ధతిక్రింద దొరతనమువారికి రావలసినభాగముక్రింద చెల్లింప నిర్ణయము చేసిరి.

తిరుచునాపల్లి:—తిరుచునాపల్లికలెక్టరు తెరతలూరు గ్రామములోనిభూములు కొలతవేయించి తరములు ఏర్పరచి పన్నులు కట్టెను. మామూలు మినహాయింపు లన్నియును పోగా పండినపంట 5816 కళ్లములు తేలినది. "ఈమొత్తము మామూలు పాలిపద్ధతిని సర్కారునకును రైతులకును పంచగా సర్కారువారిపాలికి 2908 కళ్లములు వచ్చినవి. కలెక్టరుగారు సిఫార్సుచేసినచొప్పున గడచినమూఁడు సంవత్సరములలోనిధరలును ఆర్జించి దామాషాయి చేయగా 3232 రూపాయిలైనది. ఇంకను మరికొన్ని మినహాలును జాస్తీలును చేసి తేల్చగా నిర్ణయమైనపన్ను రు 3211 లు. భూమిలో పండినపంటలో అర్ధభాగము భూమిపన్నుక్రింద పుచ్చుకొనుటవలన దేశము పేదవడిపోవును. కాని మదరాసుబోర్డువారు వారిపన్నును మూఁడవవంతునకైనను కుదించుటకు నిడివిమీఁదగాని యొప్పుకొనరైరి. అదియె మిక్కిలి మితముగా నున్నదని చెప్పుచువచ్చిరి. మొత్తముపంటలో మూఁడవవంతు సర్వత్ర పన్నులుకట్టుటకై ఖరీదు లేర్పరచిరి. నగదుగా చెల్లించుటకిది సర్వసామాన్యప్రమాణముగా నంగీకరింప వల్లపడదు గాని కలెక్టరులు పన్నులు మితముగా కట్టవలెనని చెప్పుటకది మార్గదర్శకముగానుండగలదు."

కోయంబుత్తూరు:—ఈకోయంబుత్తూరుజిల్లాయందు అతిదారుణముగ కట్టినపన్నులచెడుగునకుతోడు సిగ్గుమాలిన లంచగొండితనమువలనియనర్థములు కూడ వచ్చి చేరినవి. ఈయక్రమము లన్నియును



విమర్శించుటకై సంఘమొకటి యేర్పాటైనది. "కోశాధిపతి "కాజిచిట్టి" యనునతఁడు ఈదేశమునకు వచ్చినదిమొదలు దేశమున గలప్రతిమనుజుని ప్రతివస్తువును తనస్వంతలాభమునకై యుపయోగించుకొనుచున్నాఁడనియును, ఆతఁడావిషయమున సత్యాతురితతోఁడను సతిశ్రద్ధతోఁడను పనిచేయుచుండెననియును ఆసంఘమువారు రిపోర్టు చేసిరి. "గోరో" అనుకలెక్టరుకూడ నిట్టిలంచగొండియే యని యనుమానపడి కంపెనీడైరెక్టరులు మదరాసుగవర్నరుగానుండిన సర్ థామస్ గారిపేర మండిపడుచు 1821 సంవత్సరమున నొకయుత్తరము వ్రాసిరి.

ఈయక్రమములు ప్రత్యేకించి చూచిన దారుణముగా నున్నవి. మనసంఘములలోనుండు లోపములకివి సాక్షీభూతములుగ నుండినచో అది తలచుకొనినపుడు మనస్సున కెంతకష్టముగ నుండును? కోయంబుత్తూరులో జరిగినచర్యలు మరియొక్కజిల్లాలో సంభవము కావని నిశ్చయ మెట్లుచెప్పగలము? కలెక్టరు బోర్డువారివిశ్వాసము నందక తానే వంచకుడగుటయును జిత్తులమారులును దగాకోరులు నగుదేశీయులకు తానే సహకారి యగుటయును చూడ దొరతనమువారి యధికారమునందినదుర్మార్గులు కొందరియేలుబడి క్రిందబడిన రాష్ట్రమంతయును నలిగిపోవలసినచ్చును. కలెక్టరుయొక్క అక్రమప్రవర్తనవలనగాని చేతకానితనముచేతగాని కోయంబుత్తూరులో కలిగినయక్రమములవంటి యక్రమములు సంభవించి ప్రజలయాస్తులును దివాణమువారి పన్నులసొమ్ములును కూడ దొరతనమువారి కొలువులోని తక్కువజీతగాండ్రదయకు పాత్రములయియున్నసమయములో దొరతనమునందలి వ్యాపారములన్నిటిని వివరముగ తనిఖీచేయుటకై నియమింపబడినయుద్యోగస్థులు ఆలోపములను కనిపెట్టి అవి మరలపుట్టకుండ తగినశ్రద్ధపుచ్చుకొనరేని, దేశమున దారుణములైన అనర్థములు సంభవించు నని

భయము కలుగక మానదు. అందులకై యెక్కువబాధ్యత గలయేర్పాటులను చేయవలసిన అవసరము వచ్చును. "గారో" గారు మరణించియుండుటచే అతని నింకను మనకొలువులో నుండనిచ్చుట యుక్తమా యనుసంశము విచారించుట యనవసర మయ్యెను. ఆతని నేరముయొక్క స్వరూపస్వభావము లెట్టివి యనుసంశము తెలిసికొనుట యనావశ్యక మయ్యెను.

పల్లీకుఉద్యోగస్థుడే మాత్రము కనుగలిగి సంచరించినను వాని క్రింద నింతదీర్ఘకాల మేయక్రమములును విజృంభింపనేరవు. అట్టి యక్రమములు వారిననుసరించి యుండువారిం జేరనైన నేరవు. ఇట్టి వన్నియును కనపడుచున్నపుడీపై యుద్యోగస్థుడుకూడ నీదుర్మార్గమున పాలుగొని యుండుననుట కిదియే సాక్షిభూతముగ నుండుననుట నిశ్చయము. ఇది 31-10-1821 సంవత్సరమున గవర్నరుగారికి డైరక్టర్లు వ్రాసిన యుత్తరమునం దున్నది.

మరుచటి సంవత్సరమున వ్రాసిన మరియొకయుత్తరమున కంపెనీడైరక్టరులు యీయక్రమోద్దేశములవలని పీడనుగురించియే గాక కోయంబుత్తూరున కట్టినజాస్తిపన్నులను గురించి కూడ వివరముగా తెలిపిరి.

"ఆచారమునుబట్టి పూర్ణమైన శిస్తు అనునది సాగుబడి చేయతగిన యావత్తు భూమిపైన కట్టినశిస్తుమాత్రమే యైయున్నది. అనగా తోటలమీద వచ్చునది కాదు. దున్నకుండ నిలిపియుంచినవియు బీడుగా నుంచినవియు పైరుపంటలతో నిండియున్నవియు పన్ను కట్టతగిన భూములై యున్నవి. గోగ్రాసమున కని బీడుపెట్టినభూములపైనివచ్చు పూర్ణమైనశిస్తులో మూడవవంతు గాని లేక నాలవవంతు గాని పన్ను కట్టుటయును తోటభూములపైన పూర్ణమైన శిస్తులకంటె అదనముగ



పన్నులు కట్టుటయును జరుగుచున్నది."

1816 సంవత్సరము సెప్టెంబరు 7 తేదీ యుత్తరమున కలెక్టరు సల్లివనుగారు ఇట్లు వ్రాసిరి.

"భూములను రెండు సంవత్సరములు రైతు తన అధీనమందుంచుకొని పన్ను చెల్లించునేని అతడే దానికి హక్కుదారుగా భావింపబడును. అంతటినుండి అతడు చెల్లించగలిగినన్నాళ్లు ఆశిస్తు అతనిపై బడుచునే యుండును. దీనినిబట్టి దొరతనమువారి లాభమునిమిత్తమై ఆతడు హక్కుదారుడుగా అంగీకరింపబడినాడు గాని అతని లాభమునిమిత్తమై కాదని కనబడుచున్నది. అది యంతయును ఆతనిని కొంత సొమ్మునకు బాధ్యునిగా చేయుట కొరకే.

"నూతిసీటివలన తడిసినభూములపైని గాని తోటపయిర్లు వేసినభూములపైని గాని కట్టబడుజాస్తిపన్ను దానిపైని చేసినమరమ్మత్తుల నిమిత్తమై కట్టినపన్నని కలెక్టరులు చెప్పుదురు. అది న్యాయమే. హిందూదేశమునందలి ఆప్రాంతమున గలభూములకు చేయతగినగొప్పమరమ్మతు నూతుల నేర్పాటు చేయుటయే యని యతడు వివరించుచున్నాడు. హిందూదేశమున కాలవైపరీత్యమువలన పంటలలో అనేకవిధములైన మార్పులు కలుగుచుండును. తరచు పంటలన్నియు నష్టమే యగును. ఒక్కనూయిగనుక నుండెనా దానిక్రింద తడియతగినంతభూమి కట్టి కాలవైపరీత్యము లెవ్వియును కలుగనేరవు. ఆకారణముచేత నూతులు త్రవ్వుకొనుటకు చేయుప్రోత్సాహమునకన్న వేరెయుపయోగకరమైన పని మరియొకటి లేదు. వారికి చేయతగినప్రోత్సాహ మంతయును వారు పడ్డపాటువలని ఫలితములను వారిని అనుభవింపనిచ్చుటయే." అని ది 2-1-1822 సంవత్సరమున కంపెనీడైరక్టర్లు మదరాసుడైరక్టరులకు వ్రాసినయుత్తరమునం దున్నది.

ఈసంవత్సరములలో జరిగిన యుత్తరప్రత్యుత్తరము లన్నియును పన్ను లెక్కువగా కట్టినారనుపేచీలతోనే నిండి యున్నవి. డైరక్టర్లు మాత్రము గతించిన "గారో" గారి యక్రమములను గూర్చి ఆయనను నోటికొలది నిందించుటయె కాని తమవల్ల కలిగినలోపముల నిట్లు సవరించుమని తెల్పుట కాని అవి సవరించుటకై శీఘ్రముగ తగినపని చేయుట గాని జరిగింపకపోయిరి. పైయుత్తరమునకు మూడువారములకు ముందు డైరక్టరు లొకయుత్తరము వ్రాసిరి. దానియం దిట్లున్నది.

"హెచ్చుపన్నులను కట్టుటవలన స్వతస్సిద్ధముగ అనర్థములును దారిద్ర్యమును కలుగుచుండును. వీని యవలక్షణము లన్నియును తిరుచునాపల్లిలో కనబడునంత మరియొకచోట కనుపింపవు. అని తిరుచునాపల్లి కలెక్టరనుచున్నాడు' వ్యవసాయదారులు భూములకు తగినమరమ్మతులు చేయక నాశనము చేయుచున్నారనుటకు సాక్ష్యము భూములవెలలు తగ్గుటయె. వేలకొలది కానులభూమి పూర్వము యిజారాచేసెడుగిరాసిదార్లందరును ఇప్పుడు అన్ని పందలైనను ఇజారా చేయుటలేదు. భూమిపన్ను మార్పు చేయుటయో నిలిచియున్న బాకీ లన్నియును నిలిపి యుంచుటయో జరిగించనియెడల నీయున్నవికూడ నీయేడో ముందునాడో అమ్మవలసి వచ్చును. నేను బోర్డువారి నొక్కవిషయమును మాత్రము ముఖ్యముగా గమనింపుమని కోరెదను. ఈపన్నులీమోస్తరున నిలిపియుంచుట యసాధ్య మనునదియేఅది. అదియే నా గట్టి నమ్మకము."

"ఇప్పుడు మిక్కిలి పీడించుచున్న యీబాధ లన్నిటికిని మీరు (మదరాసుగవర్నమెంటువారు) ఎక్కడెక్కడ కలెక్టరులకు అగత్యమని తోచునో అక్కడ నెల్ల తగినరిమీషను (పన్నుముదరా) ఇమ్మనిమా కధికారమిచ్చుటయే మందమనుకొనుచున్నారు. కవుళ్లపద్ధతులను మా



ర్చుకొనుట కొప్పుకొనకున్నారు. ఇప్పుడు జరుగుచున్నది నిశ్చయముగా సాలుసరి. సెటిల్మెంటే కాని ఇందువలన కలుగు ఫలితము సిస్తైనసాలుసరి డిమాండు లేకపోవుటక్రింద తేలును. దాని నాపుటకు మీా రెంతో కష్టపడవలసి వచ్చును. అనగా కొన్ని స్థలములలో రైతులనెక్కువ బాధించుటయును మరి కొన్ని స్థలములందు గవర్నమెంటువారిలాభమును విశేషముగ వదలుకొనుటయును జరుగుచుండును. అది కలెక్టర్ల యుత్సాహము, భూతదయాళుత్వము, అలక్ష్యము, క్రౌర్యము వీనిననుసరించి యుండును." ఇది 12-12-1821 సం॥రమున మదరాసు డైరక్టర్లు వ్రాసిన యుత్తరమునం దున్నది. అనగా శిస్తులు చెల్లించలేనంత హెచ్చురేటున నిలిపియుంచి యేటేటను వ్యవసాయదారులు చెల్లించగలిగినంత సొమ్ము వసూలు చేయవలసివచ్చును. డైరక్టర్లు అదియే ప్రజలస్థితి నభివృద్ధిచేయుటకు తగియున్నట్టు యోచించిరి.

తంజావూరు:—మున్ను సుభిక్షముగా నుండిన తంజావూరురాజ్యమునందు నిట్టికథయే వినవచ్చుచున్నది.

"తంజావూరి కవులుపరతు 1229 ఫసలీ (1820) తో ఆఖరైనది. ధాన్యాదుల ధర లన్నియును విశేషముగ తగ్గిపోయినవి. అవి ముందుకూడ హెచ్చెడునట్టు కనిపించలేదు. తగ్గిన ధర లట్లే యుండునట్లు కనిపించెను. శిస్తులు మొదట యనుకొనినదానికన్న హెచ్చయినవి. అది నిలుపుచేయుటకై తగినంత సాక్ష్యము తెచ్చిరి,

"పంటలో భాగము పుచ్చుకొను పూర్వపుపద్ధతులందు జనులకెంత యభిమానమున్నను మదరాసుగవర్నమెంటువారు చేసిన సిస్తైన నగదుశిస్తుల యేర్పాటే యుపయుక్తముగా నుండుననుట నిస్సంశయము."

"ధాన్యాదుల ధరలు నూటికి పదివంతున హెచ్చిననే కాని ప

న్నభివృద్ధి చేయరాదనియు ధర నూటికి 5 వంతుల తగ్గినచో ధరలహెచ్చుతగ్గులనుబట్టి పన్ను హెచ్చు తగ్గు లగుచుండ వలెననియు ఇట్టి ఆగంతుకములకు మీ రేర్పరచిన పద్ధతి యుక్తమైనదే యనియు మాయభిప్రాయము.'' అని 18-8-1823 సం॥రమున మదరాసుకు కలెక్టరుగారు వ్రాసినారు.

ఆర్కాటు :—అర్కాటునందు కూడ నిట్టి దుఃఖకరమైన కథయే వినబడుచుండెను.

"కలెక్టరుగారు సూచించిన యభిప్రాయము ననుసరించి బోర్డువారు పన్ను తగ్గించినారు. మరియొక విషయమును గూడ పట్టుదలతో యోచనకు పెమ్మని వాదించుచున్నారు. ఈ విషయమే మామనస్సులకు నెక్కువగా గమనించవలసిన విషయమైనట్టు కన్పట్టుచున్నది. కలెక్టరుగారికిని బోర్డువారికిని మాపన్నుల నంగీకరించుట కిష్టము లేకున్నది. దేశమంతయును శోషగొట్టి యున్నదనియు పన్నులు చాలహెచ్చుగా నున్నవనియు అట్టి హెచ్చుపన్ను దేశము సహింప నోపదనియు వారు ఖండితముగా చెప్పుచున్నారు. కాని యట్టి పన్ను వసూలుకావచ్చునను నాశమాత్రము కల దని నమ్మకముగ చెప్పెదరు. అట్టి పన్ను లుండినయెడల దేశము వృద్ధిలోనికి రా నేరదనియు అందులకై నూటికి 7 మొదలు 10 వరకు పన్నులు తగ్గింపవలెననియు వాదించుచున్నారు.''

"అందుపైన మీరును (మదరాసుగవర్నమెంటువారు) హెచ్చుపన్నులవలన కలుగు అనర్థములను గూర్చి గట్టిగనే చెప్పుచున్నారు కాని పన్నులు తగ్గించునవసరము ఇతరజిల్లాలలో లేనపు డొక యుత్తరఆర్కాటు జిల్లాలో మాత్రమే కల దని వాదించుటకు తగిన కారణము లేవియును కనపడవని చెప్పుచున్నారు. అనగా నట్టి యవసరము దేశమునం దంతటను కూడ కలిగియున్నట్టు స్థిరపడుచున్నారు. సర్వత్ర



పన్నులను తగ్గింపుడనియును దొరతనమువారి భాగముక్రింద మొత్తముపంటలో మూడవవంతు ప్రమాణముగా నేర్పరచుకొని పని జరుపుడనియును మీరు ప్రస్తావించుచున్నారు.''

"కాని మూడవవంతుగాని మరి పంటలో నేవంతయినను గాని పన్నునకు స్థిరమైన ప్రమాణముగా గైకొనుట యుచితమా యనువిషయమున మాకు సంశయము కలుగుచున్నది.'' అని 12-12-1821 సం॥రమున డైరక్టరులు మదరాసునకు యుత్తరము వ్రాసినారు.

గ్రంథములనుండి గ్రహింపబడిన భాగము లివి చాలును వీనినిబట్టి కంపెనీడైరక్టర్ల యత్యాశవలనను ప్రదేశాధికారుల కాఠిన్యమువల్లను దక్షిణహిందూస్థానమునందలి జనులు పందొమ్మిదవ శతాబ్ద ప్రథమభాగమున నెట్టి బాధలను పొందిరో యెట్టి దారిద్ర్యము ననుభవించిరో ప్రతి పాఠకునకును బూర్ణముగ దెలియగలదు. సర్ థామస్ మన్రోగారు చేసిన యేడు సంవత్సరముల పరిపాలనమునందును మిక్కిలి కష్టించి పన్నులు తగ్గించెను. అతని ప్రయత్నము లన్నియును రాష్ట్రమునం దంతటను జయప్రదముగ నెరవేరినవి. అందుల కాతని మనము కొనియాడవలసి యున్నది. 31-12-1824 తేదీని ఆతడు వ్రాసిపెట్టిన సారాంశమునందు అతనియాశయములును అతనిప్రయత్నములును పటుత్వమయిన శైలితో వివరముగ వ్రాసియుంచినాడు. కార్న్ వాలీసు కాలమునుండి యిండియాలో అంత రాజనీతినైపుణ్యముతోడను అంత యోచనతోడను వ్రాసినవిషయము మరియొకటి కనిపించదు. అది మిక్కిలి పెద్ద గ్రంథము. ఈస్టిండియాగ్రంథములందు ముప్పది పేజీలుండును.

ఈ కొలదిగ్రంథమునం దాగ్రంథమునందలి యంశము లన్నియు సంగ్రహముగా నైన తెలుపుట యసాధ్యమైన కార్యమగుటచే ఆగ్రం

థము నుండి జనులస్థితిగతులను గూర్చిన కొంతభాగము మాత్రమె వ్రాసెదము.

మితమగు స్థిరమైన భూమిపన్నులు.

“భూములను విక్రయించుకొనుటకును రైతులకు భూములను వృద్ధి చేసికొన మనసుకొలుపుటకును అది తమకు స్థిరమైన వసతి యనుకొనుటకును భూమిపన్ను స్థిరపడి యుండవలెను. మొత్తము మీద నిప్పటికంటె నెక్కువ మితముగ నుండవలెను. ఇవి యన్నియు నటుండగా అధికారుల తెలివితేమిచేత గాని చలచిత్తతచేత గాని అట్టి పన్ను లేవియును వృద్ధి గాకుండ స్పష్టమైన యేర్పాటులు చేసియుంచవలెను.”

“రైతు భూమికి అసలైన హక్కుదారుడు. దొరతనము వారిది కానిభూమియంతయును రైతులదే. కొన్ని కొన్ని స్థలములయందు కొన్ని కాలములలో పన్నులు హెచ్చుచుండుట ఆతనిభాగమునకు నష్టము తెచ్చును. ఆతడు పెట్టినపెట్టుబడి మాత్రమే మిగిలి యున్నను, భూమిఖామందునకిచ్చు పన్నుక్రింద నేమైనను సీమత్తు మిగిలియున్నను ఆతడే దానికి నిజమైన హక్కుదారుడు. దొరతనము వారి పన్నులక్రింద గైకొనకుండ వదలివేసిన దంతయును వానిదే.

“పన్ను లెల్లప్పుడును మారుచుండుటచేత భూమి విలువగల యాస్తి యగుట లేదు. అది మారుచుండుట అటే యుండినయెడల ముందును కానేరదు. పన్నులు మిక్కిలి తక్కువగా నుండుచోట్లను గూడ యెప్పుడైనను పన్నులు మారిపోవచ్చు ననెడుతలంపు మనస్సున పారినతోడనే భూములను విక్రయపదార్థముగా చేసికొనగలమనెడు యాశ యంతరించి పోవును. ఏపంపుపైన చెల్లవలసియుండుపన్ను దానిమీద ముందుగ నిర్ధారణ చేసిననే గాని దాని కుండతగినంత విలువ దానికి కలిగింపనేరము. దానినిసులభముగా అమ్ముకొనుటకుగాని తనఖా



లుపెట్టుకొనుటకు గాని తగిన సొంతఆస్తిని చేయలేము. అది స్థిరపడినయెడల నీవిషయమైన సందిగ్ధము లన్నియు తొలగిపోగలవు. పన్ను ఏవిధముచేతను హెచ్చుకాని భూము లన్నిటికిని విలువ యేర్పడును. ఆవిలువ దినదినమును చేయుమరమ్మత్తులతో వృద్ధి పొందును. అట్టి మరమ్మతు లన్నియును చేయుటవలన కలుగుఫలితము లన్నియును తామే పొందవచ్చు ననునిశ్చయముతో చేయబడును.

ఇండియనులను పరిపాలనాకార్యముల నియోగించుట.

కోటి తొంబదిలక్షల జనసంఖ్యగలదేశమున దేశీయు నొక్కనికిని బాధ్యతగలయుద్యోగ మీయకయు, తుదకు కొరడాతో నొక్క దెబ్బ కొట్టించుశిక్ష విధింపగలయధికారమైన నైరోపియనులకే యొప్పగించుటయు, మొన్నటివరకును జరుగుచునే యున్నది. ఇట్టి మనపరిపాలనము పితృపరిపాలనమువంటిదని యేమొగము పెట్టుకొని చెప్పగలము! అట్టి నిషేధము జాతినంతయును న్యూనతచేయు శిక్షయనిపించుకొనును. ఆకొరత మన మేమిచేసినను తీరునది కాదు. ఇంత న్యూనతపరచుశిక్ష ప్రపంచమునం దేజాతికిని నిదివరకు విధింపఁబడినట్టు దృష్టాంతము కానరాదు. వారు దాక్షిణ్యస్వభావము కలవారనియు, అయ్యది తప్పుదారులను మనసు దిట్టములేని మార్గములను పోవుచున్నదనియును, అదియే యిందుకు మూలమనియును చెప్పుచున్నారు. కాని దేశవాసులపై వచ్చెడు చిన్నచిన్న నేరములను సైతము వారు విచారించుట కనర్హులని వారిని త్రోసివేసి మీరు వారికి చేసిన యవమానమునకిది సరియైన కారణమని దేశీయులు తలంపరు. మనము వారివృద్ధిని కోరుచున్నామందుము కాని మన మవలంబించుమార్గము లందుకు వ్యతిరేకముగ నున్నవి. అభివృద్ధికై పనిచేయువారు దాని కాశ్రి

యము లగుపెద్దయాధారములను గనలేకున్నవారు. వారందరును దేశీయులయెడ నేవిధమైన విశ్వాసమును నుంచవల్లపడ దనుచున్నారు. వారికధికార ముండరా దనుచున్నారు. వీలయినంతవరకు వారినుద్యోగములయం దుండనీయరా దనుచున్నారు. కాని సర్వత్ర జ్ఞానము వెల్లివిరియ చేసి వారిని బయటకు దీసికొని రావలెనని మనస్ఫూర్తిగ గోరుచున్నారు.

“ అనాగరికయుగములయందైనను ఎప్పుడును నిట్టి పిచ్చియూహలును, నిట్టి వ్యర్థపుతలంపులును పుట్టి యుండవు. ఏ యుగమునందు గాని యే దేశమునందుగాని కీర్తియును, ధనమును, అధికారమును అనునవియే జ్ఞానము సంపాదింపవలెనని కోరిక పుట్టించుచుండును. దేశపరిపాలనమునగల వివిధధర్మములయందు తమతమశక్తిసామర్థ్యముల నుబట్టి తమ కున్న ప్రజ్ఞ యంతయు వినియోగింపరేని, దేశసేవ సేయుమహాత్కార్యమునకు తమశక్తి యెల్ల ధార వోయరేని, ఎవ్వరెన్ని విద్యల నేర్చిన నేమి ప్రయోజనము ?

“ కేవలమును గ్రంథములవలన గలుగుప్రయోజన మేమియును లేదు. వట్టి గ్రంథసామగ్రియే జాతియోగ్యతను వృద్ధిసేయనేరదు. ఈపని జరుగవలయునన్న ద్రవ్యసంపాదనమునకును గౌరవసంపాదనకును, రాజకీయోద్యోగసంపాదనమునకును, వారికి గూడ నవకాశము కలుగచేయవలయును. అట్టి ప్రతిఫలముల యాశ కలుగదేని ప్రకృతిశాస్త్రము లెన్నిటియం దెంతప్రజ్ఞ యుండినను జనులయోగ్యత యెప్పుడును వృద్ధికాజాలదు.

“ ఇయ్యది యన్ని జాతులవారికిని నెట్లో ఇండియాకును నట్లే. అది మనకును వర్తించును. రేపు విదేశీయరాజ్యము వచ్చి బ్రిటనుదేశమును స్వాధీనము చేసికొన్న దనుకొనుడు. దొరతనములో గాని రాజ



కీయగౌరవములలో గాని యెక్కువ బాధ్యత కలిగినట్టియు, నెక్కువ ప్రతిఫలము కలిగినట్టియు నుద్యోగమునందు గాని మన కేవిధమైన సంబంధము లేకుండ చేసెననుకొనుడు. ఏవ్యాపారమునందును మీరు విశ్వాసపాత్రులు కారని యందురనుకొనుడు. మీజ్ఞానమును, మీయాపవిత్ర గ్రంథసామగ్రియును, మీజాతినంతయును నొకటి రెండు తరములలో మిక్కిలి నీచమైనదిగను, వంచకమైనదిగను, అయోగ్యమైనదిగను కాకుండ కాపాడగలుగునా ?

“ పెద్ద యుద్యోగములును చిన్న యుద్యోగములును గూడ నైరోపియనులకె యిచ్చి దేశీయుని సహాయ మొక్కనిదైన లేకయే దేశములోని వ్యాపారము లన్నియు నిర్వహించుట మనకు వీలుపడినను అట్లుచేయరాదు. చేసిన లౌకికముగను, ధార్మికముగను గూడ తప్పుగా నుండును. రాజకీయోద్యోగములలో దేశీయు లెంతమంది యెక్కువగ నియమింపబడిన వారికి దొరతనము సందంత సంబంధ మెచ్చగుటకు బలవత్తరమైన కారణమగును. మన మెంతవారిని చేరకుండ జేయుదుమో వారిమీద మనకంత యధికారము తగ్గిపోవును. అంత మనము పూర్ణముగ వెలియగుదుము. వారికి మనయందు అనురాగము కలుగుటకు మారుగ అసూయ కలుగును. వారి మనోవికారములనే జనులకందరకును దేశీయసైనికులకును వ్యాపింప జేయుదురు. అంతట అసంతుష్టి యుద్రేకమగును. దాని నెదిరించుటకు గాని, అణచివేయుటకుగాని మన మశక్తుల మగుదుము. పోనిమ్ము. వారందరుమ కదలకుండ మెదలకుండ మనకొదిగియే యుందు రనుకొందము. అప్పుడు వ్యాపార మింతకంతెను చెడిపోవును. వారి యోగ్యత యంతయును అడుగంటును. రాజకీయోద్యోగములయందును, పేరు ప్రఖ్యాతుల యందును వారికి ఆశపోయినట్లే మంచి మంచి యుద్దేశము లయం

దు గూడ వారి యాశ యడుగంటి పోవును. జాతి యంతయును సోమరులును నీచులును అయిపోవుదురు. కేవల కుక్షింభరత్వమునకు తప్ప వారికి మంచి యుద్దేశములే పుట్టకుండ పోవును. మన ప్రభుత్వపద్ధతివలన జాతి యంతయును అధములై పోయినారని చెప్పుకొనుటకన్న దేశమునుండి మనము లేచి పోవుటయే నిశ్చయముగ కోరతగిన విషయము.

### పన్నులు కట్టుటయును, శాసన నిర్మాణమును.

“స్వతంత్రముగల దేశము లన్నిటి యందును జనులయొక్క ముఖ్యమైన హక్కు తమ యంగీకారము చొప్పున పన్నులు కట్టించుకొనుటయే. అన్ని హక్కులలో నిదియే మేటియైనదిగా నెన్నబడును. అదియే మనుజుని మనస్సునకు విశేషముగ పరిశ్రమను కలుగచేయునది. స్వతంత్రతను సంరక్షించు వారందరును చాల తడవలు దీనిని నిర్ధారణగ చెప్పుచు వచ్చినారు. స్వాతంత్ర్యము లేని దేశములందు కూడ పన్నుల విషయమే దొరతనమున మిక్కిలి బాధ్యతగల వ్యాపారము. అదియే సర్వత్ర జనులయొక్క సౌఖ్యములకును సదుపాయములకును ప్రతిబంధకముగ పనిచేయును. అందు మూలముననే జనులు చాల సారులు ఉద్రేకమును చెంది యెదిరింతురు. దాని వలన గొన్ని యెడల లాభకరముగా నుండును. కొన్ని యెడల హానికరముగా నుండును. ఆకారణముచేత నెంత నిరంకుశ ప్రభుత్వమునందైనను పరిపాలనమునందు దేశమునందలి సమర్థులగు వారిని నియోగింప నవసరము కలుగుచున్నది.

“ఇతర దేశములలో దొరతనమువారును, వారి యుద్యోగస్థులును వారి ప్రజాసంఘములో చేరిన వారేయైయుందురు. అందు వలన



దేశమున జరిగెడు రాజకార్యము లన్నియును అందును గూర్చి దేశవాసులకు గల యభిప్రాయములును వారికి తప్పక తెలియుచునేయుండును. ఇక్కడ నన్ననో యీసదుపాయము దొరతనము వారికి లేకుండ పోయెను. జనులకై దొరతనమువారే చట్టములను చేయుదురు. అందు జను లేమియును నోరెత్తువీలు లేదు. జనులను గూర్చి దొరతనమువారికి తెలిసినది మిగుల స్వల్పము. అందు వలన చురుకుదనము గలిగినట్టియు తెలివితేటలు గలిగినట్టియు ప్రదేశాధికారుల నియమించుటయు వారిచేత జనుల స్థితిగతులను మనోభావములను శ్రద్ధగలిగి విచారణ చేయించుటయును, ఆమూలమున వాస్తవమైన సమాచారమును సంపాదించుటయును జరుగని యెడల నీచట్టము లేవియును జనుల స్థితిగతుల కుపచరింపనేరవన్నట నిశ్చయము. ఈ యుద్యోగస్థులైనను అనుభవజ్ఞులగు దేశీయులను నౌకరులుగా నియమించుకొనిననే యిట్టి సమాచారమంతయును సంపాదించ గలుగుదురు. ఆనౌకర్లు తమకు నియమితమైన యుద్యోగ ధర్మములను బట్టి యితరు లందరికంటెను నిట్టి సమాచారమును సంపాదింప నెక్కువ సమర్థులగుదురు.”

### బ్రిటిషు పరిపాలనము వలని యుపయోగములు అనుపయోగములు.

“ఇందువలన మన పరిపాలనముచే దేశీయులకు కలుగు లాభనష్టములను మనము సంగ్రహముగ పోల్చి చూచికొనవలసివచ్చునేని వారి కదియుండవలసినంత యనుకూలముగా లేదని చెప్పవలసివచ్చుచున్నది. విదేశీయుల యుద్ధముల మూలమునను, అంతఃకలహములవల్లను కలుగు విపత్తులన్నియును పోయి మునుపటి కంటె జనులు సురక్షితముగా నున్నారు. వారి యర్థప్రాణములకు ఏవిధమైన యపాయము

లేకుండ నెక్కువ స్వస్థత పొందినారు. ఆతతాయి తనముగా వారికి శిక్షలు పడుటలేదు. అధికారులైన వారిచే వారియాస్తులు పరాధీనము లగుటలేదు. మొత్తముమీద వారి పన్నులును తేలికగనే యున్నవి. కాని వారికి చట్టములు చేసికొనుటలో జోక్యములేదు. వాని నమలు జరుపుట యందంతకన్న లేదు. మిక్కిలి యల్పమగు నుద్యోగములతో నైన వారికి సంబంధము లేదు. సివిలు ఉద్యోగమునందుగాని మిలటరీ యుద్యోగమునందుగాని వారే పెద్ద యధికారమును పొందుటలేదు. వారినందర మనము తక్కువజాతివారిగా చూచుచున్నారము. దేశమునకు వారు పూర్వపు హక్కుదారులనియును, వారే దాని ప్రభువులనియును, తలంచుటకు మారుగ వారిని క్రింది వారిగను, నౌకరులుగను భావించుచున్నారము.

"దేశీయులకు కలుగచేయు లాభములు న్యాయమైన చట్టములు చేయుటయు మితముగ పన్ను కట్టుటయును మాత్రమే కాదు. మనము వారి ప్రవర్తనను చక్కచేయుటకు ప్రయత్నింపవలయును. దేశీయులు విదేశీయ ప్రభుత్వము క్రిందపడి నలిగిపోవుటకు అనేక కారణములున్నవి. వారియోగ్యత నడుగంటకుండ నాపుట సులభసాధ్యము కాదు. స్వతంత్రము పోయిన మనుజుడు తనసద్వర్తనను సందర్భభాగము గోల్పోవునని యనుశ్రుతముగ బూర్వమునుండియును వచ్చుచున్నది. అది మనుజుల కెట్లు వర్తించునో జాతియంతకు నట్లే వర్తించును. మనుజున కాస్తి లేనియెడల నధముడగును. జనుల కేమియును సంబంధము లేక విదేశీయ పరిపాలనము వారి యధీనమున ఆస్తియుండిన జాతియు నట్లే కృంగి పడియుండును. స్వతంత్రముగల మనుజునికున్న హక్కు లన్నియును బానిసవానికడ లేనియట్లే, ఒకని కొదిగి బానిసవలెనుండు జాతివారికిని స్వాతంత్ర్యపు హక్కులన్నియును నంతరించును.



తనకు తాను పన్నుకట్టుకొను నధికారము పోవును. చట్టములు చేసికొను హక్కులు లేకుండబోవును. ప్రభుత్వమునందు గాని సామాన్య పరిపాలనమునందు గాని సంబంధము లేకుండబోవును. బ్రిటిషిండియాకు యీహక్కు లేవియును లేవు.

"మనప్రభుత్వము వలన నిండియాకు కలిగెడు గొప్ప యనర్థమేమనగా సంఘమునందలి పెద్ద పెద్ద తరగతులలో వారినందరి రూపుమాపుట. వారినడుగున కంటద్రొక్కుట. జనులందరి నొక్క మాదిరిని తేకూడని స్థితిలోనికి దెచ్చుట. దేశము యొక్క యాంతరపరిపాలనమున కుపయోగకరులై యుండువారి పూర్వపు పలుకుబడియును వారి పూర్వపు గౌరవమును నశింపచేయుట. ఇట్టిది దానికి స్వభావమై యున్నది. స్వదేశీయ ప్రభుత్వమున శ్రీమంతులగు పెద్దమనుష్యులు కొందరు సివిలు మిలటరీ యుద్యోగస్థులలో గలిసి జాగీరుదార్లుగను ఈనాందార్లుగను ఉండి యున్నారు. వీరును వైశ్యవర్తకులును రైతులును కలిసి పెద్దసంఘముగా నేర్పడి యుండువారు. వారు స్థితిమంతులైననై యుండిరి, లేదా కష్టము లేవియును లేకుండ కాలము జరుపుకొను వారుగ నైన యుండిరి. ఒక రాజుయొక్క జాగీరులును యీనాములును మరియొకడు తరుచుగ లాగుకొనుచుండెడివాడు. సివిలు మిలటరీ యుద్యోగస్థులలో తరుచు మార్పులు కలుగుచువచ్చెనుగాని జాగీరులును క్రొత్తయీనాములును క్రొత్తహక్కుదారులకు నీయబడుటచేత దేశమునం దెడతెగకుండ ద్రవ్యముగల మనుష్యులు సమీకరణమగుచుండెడి వారు. ఆకారణమున వ్యవసాయమును చేతిపనులును ప్రోత్సహింపబడుచువచ్చెను. మన పరిపాలనమున నీసదుపాయములన్నియును నించుమించుగా నంతరించినవి. బాధ్యతగల యుద్యోగ మెట్టిదియైనను సివిలు మిలటరీడిపార్టుమెంటులలోనివియైన యూరోపియనులకే యియ్య

బడుచుండెను. వారి యాదాయ మంతయును వారిస్వదేశమునకే పోవుచుండును."

## హిందూదేశము యొక్క భవిష్యత్తు.

మనము చేయునేర్పాటు లన్నిటియందునను ముఖ్యముగ మనము యోచింపవలసిన విషయ మొక్కటి యున్నది. మన యీప్రభుత్వమూలమున జనుల ప్రవర్తనమునకు చివరకు కలుగు ఫలితమేమి? అభివృద్ధిసేయునా? అధోగతికి తెచ్చునా? మనయధికారములను సురక్షితముగా నిలుపుకొనుటతోడను దేశవాసుల సంరక్షించుటతోడను సంతుష్టిచెంది దేశవాసులందరును క్రమక్రమముగా తమ తమ ప్రవర్తనముసం దధోగతిని పొందుచుండ చూచుచు నూరకుండుటయా? లేక వారి ప్రవర్తనము చక్కచేయు తెరవూహించి వారిదేశమును వారు పరిపాలించుకొను పెద్దపెద్దయుద్యోగములకు వారర్హులై యుండునట్లు వారిని బాగుచేయుటయును, అందులకు తగిన మార్గముల నాలోచించుటయునా? వారినున్నతస్థితికి కొనిరావలెననియును, ఎన్నటికైనను ఇండియాతో మన సంబంధము విడిపోవు నేని మన రాజ్యమువలన మనకును వారికిని సంబంధము కలిగినప్పటికన్న పరిపాలనాకార్యములందు తామెక్కువ యశక్తులమై యధములమై యుండినారమని వారెప్పుడును తలంచుకొనరాదనియును, అదియే మనరాజ్యము వలన వారికి గలుగు ఫలితముకాకూడదనియు, నెల్లప్పుడును మన యభిప్రాయమై యుండవలయును. వారి ప్రవర్తనను చక్కచేయుటకై యనేక విధములగు నుపాయములు స్ఫురింపచేయవచ్చును. వారిని వృద్ధిజేయుటయే మన రాజనీతిలోని ముఖ్య నిబంధనమై మాత్రముండవలయును. అది మొట్టమొదట మన మవలంబింపమేని యవి యెవ్వియును పనిచేయనేరవు. నీతిసూత్ర మొకసారి మనము నెలకొల్పితిమేని పట్టుదలతో దానినిగూర్చి కొంతకాలము



పనిచేసినయెడల ఆయుద్దేశము పరిపూర్ణముగా నెరవేరు నని నమ్మవచ్చును. వారి యభివృద్ధికి యేమార్గము సుకరమైనది యనునది ప్రయత్నములు చేయకుండ మొదటనే నిర్ణయించి యవలంబించుటకు మనకు దేశీయులతో గల సంబంధము మిక్కిలి తక్కువ. మన కనుభవమును విశేషము లేదు. అనేక విధములైన మార్గముల యోచించుచుండవలెను. అందులో కొన్ని పనిచేయవచ్చును. కొన్ని పనిచేయక పోవచ్చును. వారిశక్తియందు వారికి మంచి యభిప్రాయమును కలిగించుట, వారియందెక్కువ నమ్మకముంచుట, బాధ్యతగలయుద్యోగములను వారిని నియమించుట, దొరతనమునందలి ఇంచుమించు ప్రతియుద్యోగమును వారికిచ్చుటకు స్వతంత్రమును కలుగచేయుట, మున్నగునవి యీవిషయమున జయప్రదముగ పనిచేయదలచువారి ప్రయత్నములు. యోచనాపరునకింతకంటె మేలిమార్గములున్నట్లు కనిపించవు. వారి యర్హతకు మితి యేర్పరచి నిరూపించుట ప్రస్తుతము సాధ్యముగ కనిపించదు. కాని మన యాధిక్యమునకు భంగము లేకుండ కాపాడుకొనగలిగినంతవరకు వారు చేయదగిన యుద్యోగ మెల్ల వారికేల యియ్యకూడదో దానికి కారణము కనిపించదు.

"మన మొక్కసారి యోచించి చూచితిమేని జాతులయొక్క యోగ్యతాయోగ్యత లెప్పుడును దొరతనమువారి స్థితిగతులను బట్టి యెంతవరకు పనిచేయుచుండునో తెలియగలదు. ఒకప్పుడు మిక్కిలి యున్నతినందిన జాతివారెట్లు కేవల మడుగంటిపోవుదురో పూర్వము మిక్కిలి పనికి మాలిన వారుగా నుండెడి వారందరు నెట్లు మిక్కిలి నాగరికులై యుందురో తెలియగలదు. నిబ్బరముగా మనము యుక్తమైన మార్గముల నవలంబించితిమేని మన యిండియను ప్రజల ప్రవర్తనమంతయును చక్కచేసి స్వతంత్రపరిపాలకులై వారికి వారె సంరక్షకులై

యుండునట్లు చేయగలమనుటకేమియును సంశయములేదు.

సర్ ధామస్ మన్రోగారు గడచి ముప్పాతిక శతాబ్ద మైనది. మన్రోవంటి పరిపాలకులు స్వల్పముగా నున్నారు. మదరాసురాష్ట్రమునం దన్ని జిల్లాలయందును 1,50,000 మంది రైతు లున్నారు. వారివద్దనుండి న్యాయముగ భూమిపన్ను వసూలుచేయుకష్టకార్యము తృప్తికరముగ పని జరిగియుండలేదు. మన్రోగారు గతించిన 25 సంవత్సరములకు హిందూదేశపరిపాలనమునందు మహోన్నతపదవికి మరియొక సమర్థుడైన స్కాచియతడు నియోగింపబడెను. ఆతడు మదరాసుపద్ధతిని గూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

“ఇది యొక్కటి తలంచి చూడుడు. ఒక్క కలెక్టరు 1,50,000 రైతులతో వ్యవహరించుచున్నాడు. ఒకనికిని కవులు లేదు. ప్రతిరైతును తాను పైరుచేసిన పంటనుబట్టియు తన కున్నపశువులు, గొర్రెలు, పిల్లలు వీనినిబట్టియు పన్ను చెల్లించుచుండును. వారందరును కూడ తగినకారణము చూపిరేని పన్ను తగ్గించుటకు ఇరవు కలుగును. ఇట్టి స్థితి యింగ్లండునందుగాని మరి యేయితరదేశమునందు గాని యుండినచో పెద్దపెద్ద కుటుంబములలో నీవ్యవసాయపుస్థితిని గూర్చి యెంత గోల వచ్చియుండునో? ఒక్కరైతైనను తనభూమి మీద నేమి వచ్చునో తన పశువులవల్ల నేమి వచ్చునో తన భార్యకు పిల్ల లెంతమంది యుండిరో చెప్పునా? కలెక్టరెంత దైవజ్ఞుడైనను ఎన్నాళ్లు ఆజిల్లాయందె వసియించి యుండినను, ఈపని కత డర్హుడు కానేరడు. అతడును సామాన్యమానవుడే. పైగా విదేశీయుడును. అత డొకచోటినుండి మరియొకచోటికి తరుచుగ మార్పబడుచుండును. ఆకారణముచేత దేశీయులగు క్రిందియుద్యోగస్థులు తమ చిత్తమువచ్చినట్లు చేయకపోవుటయును అధికారముండినచో దానిని దుర్వినియోగము చేయకనుటయును ఆశ్చర్య



మయినవిషయము. ఆకారణమున నీపద్ధతియందు సర్వత్ర గలయనర్థములును అందునను ముఖ్యములగు రిమీషను విషయమైన యనర్థములు మిక్కిలి భయంకరముగ నుండెనని యెల్లెడ నంగీకరించిరి. మిథ్యావాదములును అన్ని విధములైన కుట్రలును అపరిమితమై యుండును. మదరాసుకలెక్టరు తనకు కావలసిన సంజాయిషీనిమిత్తమై యితరులను నమ్మి యుండుటచే నాతడీవ్యవహారముల నేవిధముచేతను చక్కజేయ నేరడు.” అని 1852 సంవత్సరమున కాంపుబెలుగారు ప్రచురించిన “వర్తమానహిందూదేశము” నుగ్రంథమునం దున్నది.

సర్ ధామస్ మన్రోగారు మదరాసురైతుకు స్థిరమైన సిస్తు నేర్పాటుచేయుటకై బ్రతికినన్నాళ్లును పాటుపడియెను. ఇందువలన రైతు పడిన కష్టములఫలిత మాతనికి దొరకు నని యాతనియూహ. ఆశిస్తులశాశ్వతస్థితి కని ప్రత్యేకించి యేచట్టమును, ఏప్రకటనయును చేయకపోయినను ధామసు మన్రోగారు గతించినతరువాత నలుబదిసంవత్సరములకు మదరాసుగవర్నమెంటువారు దీనిని వాస్తవముగా నంగీకరించినారు. 1855–56 సంవత్సరముల పరిపాలనావిషయమగురిపోర్టులో “మదరాసురైతు తనకు నియమితమైనశిస్తు చెల్లించినంతకాలమును భూమినుండి గవర్నమెంటువా రాతనిని తొలగింపరు.........ఆపద్ధతినిబట్టి రైతు వాస్తవముగా హక్కుదారుడై యున్నాడు. ఆతని కందుసంపూర్ణస్వాతంత్ర్య మున్నది. ఆతనికి శాశ్వతపుకవులు పొందినవానికున్న షరతులన్నియు నున్నవి.” అని వ్రాసినారు. 1857 సంవత్సరమున రివిన్యూబోర్డువారు “మదరాసురైతు పన్నేవిధముగను వృద్ధికాకుండగ నే భూమిని శాశ్వతముగా నిలుపుకొనుటకు సమర్థుడైనాడు” అని వ్రాసినారు. 1862 సంవత్సరమున మదరాసుగవర్నమెంటువారు ఇండియాగవర్నమెంటువారికి “రైతువారీపద్ధతియందలి పునాది యంతయును భూ

మిమీద గవర్నమెంటువారు కట్టినపన్నెప్పటికిని మార్పులేకుండ నుండుటయే." అని చెప్పియున్నారు.

ఇన్నిసారులు చెప్పిన యీనిశ్చితవాక్యము లన్నియును చెప్పగలిగినంత బలవత్తరముగ చెప్పబడియెను. కాని వీని నన్నింటిని స్మరింపక త్రోసివేసినారు. 1855 సంవత్సరమున సర్వేపనులు ప్రారంభమైనది. మొదలు సెటిల్మెంటు వచ్చినపు డెల్ల రివిన్యూఅధికారులు తమచిత్తమువచ్చినట్లు పన్నులు కట్టుచున్నారు. మదరాసురైతుకు స్థిరమైన పన్ను లేదు. అదనము చేయుటకు కావలసిన రక్షక మేదియును లేదు. భూములు మరమ్మత్తుచేయుటకు తగినకారణమును కనిపించదు. సందిగ్ధమగు భూమిపన్ను వారితలపై నెల్లప్పుడును వ్రేలాడుచునే యుండును.

భూమిపన్ననేమి? 1856 సంవత్సరమున కంపెనీడైరెక్టరులు దొరతనమువారివలన నిర్ణయించినది వ్యవసాయపుకర్చులును వ్యవసాయపుపెట్టుబడి కయ్యెడు లాభమును పోను మిగిలిన పంటయే గవర్నమెంటువారు శిస్తసికాను. భూమిపన్నునకు గవర్నమెంటువారికి హక్కుకలదనిమాత్రమే చెప్పినారు. మరి రెండుసంవత్సరములకు ఈస్టిండియాకంపెనీ రూపు మాపబడినది. రాజుగారి క్రింద కీరాజ్యము వచ్చిచేరినదిమొదలు స్టేటు సెక్రటెరీగారైన "సర్ ఛార్లెస్ వుడ్డు" అనువారు గలహాలిఫాక్సు ప్రభువు భూమిపన్నుక్రింద పంటలో సామాన్యముగా అర్థభాగము దొరతనమువారు పుచ్చుకొందు రని చెప్పినారు.

ఇది మిక్కిలి యెక్కువ మొత్తమే కాని స్వస్థమైన మితి యొకటి వివరముగా నేర్పడియెను. వ్యవహారమున నీమితికూడ నతిక్రమించి పోవుచున్నారు. మదరాసున భూమిపన్నుగా పుచ్చుకొనబడునది శిస్తురూపకముగ నుండుయావద్ధనమును తుడిచిపెట్టుచున్నది. గవర్నమెంటువారు శిస్తుక్రింద నిర్ధారణచేసిన హెచ్చురేటు పండినపంటలో మూడవవం



తు. ఇదియే భూమిపై వచ్చెడుయావత్తు పన్నును. సాలుకు 12 పౌనులు పంట పండెడుచిన్నచిన్న పంపులపైని వ్యవసాయపుకర్చులును వ్యవసాయపుపెట్టుబడి లాభములును నేడెనిమిదిపౌనులగును, అందులో దొరతనమువారు 4 పౌనులు పుచ్చుకొన్నచో అది భూమిపై వచ్చెడునికరపుశిస్తులో నూటికి 50 వంతుగాక నూటికి నూరవవంతు అగుచున్నది.

ఏండ్లు గడచినకొలది దొరతనమువారి అనిశ్చితపు డిమెండువలని యనర్థములు వృద్ధి యగుచున్నవి. మదరాసురైతు లాధారము తేకుండ పోవుచున్నారు. 1877 సంవత్సరముపట్టిన కాటకమున వారు నిరాధారులై యుండి ఆరాష్ట్రమున 50 లక్షలజనమును తుడిచిపెట్టెను. రిప్పను ప్రభువుగారు మూడేండ్లకు వెనుక గవర్నరుజనరలుగా వచ్చి మదరాసుభూమివ్యవహారమును గూర్చి విచారించెను.

1856–1862 సంవత్సరములలో మదరాసుగవర్నమెంటువారు మదరాసురైతుహక్కు లన్నియును నంగీకరించి భూమిపన్నువిషయమై జరిగిన సంపూర్ణనిర్ధారణను రిప్పనుప్రభువుగా రంగీకరింపక ఒకసారి సర్వేయై సెటిల్మెంటు అయినజిల్లా లన్నిటియందును ధరలుహెచ్చి న్యాయమైనకారణము కనబడిననే గాని పన్ను వృద్ధిచేయరాదని యుత్తరవు చేసెను. ఇందువల్ల వృద్ధిచేయువారికి వృద్ధిచేయ నవకాశమును రైతునకు పండినపంటకు ధరలుహెచ్చిననే గాని పన్ను వృద్ధికాదనియెడునిశ్చయమును కలిగెను. ఒకసారి పూర్ణముగా నిర్ణయమైన పన్నువిషయమైన శాశ్వతస్థితి గడచిపోయినవెన్కక నిదియే యుభయులకును సహేతుకమైన సమాధానము. మదరాసురైతున కిందుమూలమున నొకరక్షక మేర్పడియెను. అదియే లేనియెడల ప్రపంచమునందేదేశమునను వ్యవసాయము వృద్ధి పొందనేరదు.

1884 సంవత్సరము డిశంబరునెలలో రిప్పను ప్రభువుగారు ఇం

డియానుండి తరలిపోయిరి. 1885 సంవత్సరము జనవరినెలలో స్టేటుసెక్రెటరీగారీ న్యాయమైన యుత్తరవును రద్దుచేసిరి. ఈరీతిని ఇండియా ఆఫీసువారును కంపెనీడైరక్టర్లవలెనే యిండియనురైతులయెడల దయాశూన్యులై కఠినముగ పనిచేసినారు. 1901 సంవత్సరమునుండి జరుగుచున్న ప్రస్తుతపు సెటిలుమెంటులో అన్యాయముగా చేయుజాస్తీలకును అనిశ్చితముగా నుండు దొరతనమువారి డిమాండులకును మదరాసువ్యవసాయదారునకు రక్షకమే లేకపోయెను. ఆర్జనచేసికొనుటకు గాని తనస్థితిని వృద్ధి చేసికొనుటకు గాని వీలు కలుగకపోవుచుండెను.



# హిందూదేశార్థికచరిత్రము.

## పదియవ ప్రకరణము.

### వెల్లస్లీప్రభువును ఉత్తరహిందూస్థానమునందలి జయములును.
### (1795-1815)

ఇప్పుడు పశ్చిమోత్తరపరగణాలును, ఔడ్ అని మనము చెప్పుకొనెడు రాష్ట్రము బ్రిటిషువారిపరిపాలనముక్రిందకు వేరువేరు గాలములయందు వచ్చియున్నది. 1775 సంవత్సరమున అయోధ్యనవాబు మరణించిన వెనుక వారన్ హేస్టింగ్సు అతనితర్వాతివానిని సమాధానముచేసి కాశీయును దానిం జేరియుండు మరికొన్ని జిల్లాలును సంపాదనచేసెను. 1801 సంవత్సరము వెల్లస్లీప్రభువుగారి యొత్తుడు పడలేక అలహాబాదును మరికొన్ని జిల్లాలును అయోధ్యనవాబు బ్రిటిషువారి కిచ్చెను. ఆగ్రాయును గంగాయమునానదుల మధ్యప్రదేశమ్మును 1803 సంవత్సరమున మహారాష్ట్రయుద్ధమున "లేకు" ప్రభువు జయించెను. ఔడ్డులోనుండు మిగిలిన భాగము డాల్హౌజీ ప్రభువు 1856 సంవత్సరమున కలుపుకొనియెను.

1793 సంవత్సరముతో బంగాళాదేశమున పూర్తియయిన శాశ్వతపు జమీందారి సెటిల్మెంటు పద్ధతియే కాశీదేశమునకు వర్తింపఁజేయవలె నని కారన్ వాలీసు ప్రభువును షోరుగారును కుతూహలపడిరి. అందులకై 1787 మొదలు 1794 వరకు కాశీరాజుగారితో రాయబారములు నడచెను. 1794 సంవత్సరము అక్టోబరు 24 తేదీని అందులకు కావలసిన యొప్పందలకూడ పూర్తి యయ్యెను. తనకుటుంబమునకు పిత్రార్జితమైన కొలదీ ప్రదేశమునందు తనజమీందారీ హక్కులను దిగ

దొఱకుకొని రాజ్యమంతటను అతడిదివరకు చలాయించుచుండిన అధికారము లన్నియును బ్రిటిషువారికి వదలివేసెను. ఈయొడంబడిక పుట్టినతరువాత ఇండియాకు అప్పుడు గవర్నరు జనరలుగా నుండిన "సర్ జాన్‌షోరు" గారు యీవిడుదల యియ్యఁబడిన ప్రదేశములయందలి గ్రామములలోను జమీందారీలలోను భూమి పన్ను సెటిల్‌మెంటు చేసెను.

రాజా పరిపాలనమున పోయిన యెస్టేటులను పూర్వపు జమీందారులకు మరల నిచ్చివేసెను. పండినపంటలలో దొరతనమువారికిని రైతునకును ఉండెడు పాలులో మార్పులు కొంచెమైనను, దేశమునందలి వేరువేరు ప్రదేశములయందు వేరువేరు విధములుగా నుండెను. అదియే నిర్ధారణచేయు నిబంధన లేర్పరచుటకు మార్గదర్శక మయ్యెను. 1795 సంవత్సరమున కాశీదేశమునందంతటను శాశ్వతపు రివిన్యూసెటిల్‌మెంటు చేయఁబడియెను. బంగాళము బీహారు, ఒరిస్సాదేశములయందుండెడు నిబంధనలే కొలది మార్పులతో నీదేశమునకు గూడ నర్పింపచేయఁబడెను. సివిల్ క్రిమినల్ ధర్మము లన్నియును ఆమాదిరినే యుండెను.

ఇది జరిగినయారేండ్లకు వెనుక అయోధ్యనవాబు యీస్టిండియాకంపెనీవారికి అల్లహాబాదు జిల్లాయును సీడెడ్డుజిల్లాలని చెప్పఁబడు జిల్లాలును నిచ్చివేసెను. ఈవిషయమున వెల్లస్లీగారికిని నవాబుగారికిని దీర్ఘకాలము జరిగిన రాయబారములును ఉపబలద్రవ్యమునకు ప్రత్యామ్నాయముగ నీజిల్లాలను పొందుటలో నాతడు పెట్టిన యుల్లంఘనములును ఈవ్యాపారములనుగూర్చి యాతనిపై మోపబడిన పెద్దనేరములును, అధర్మప్రవర్తనలును రాజకీయచరిత్రతో సంబంధించి యుండినవి. అందువలన వానికిప్రస్తుతగ్రంథమునం దెడమీయ వలనుపడదు.



ఈసంబంధమున వెల్లస్లీ ప్రభుత్వముతో చేరిన రాజ్యసంపుటములు గూడ జూడతగినవై యున్నవి. నాయదృష్టవశమున నాకు వెల్లస్లీప్రభువుగా రుపయోగించిన రాజ్యగ్రంథసంపుటములే నాలుగు లభించినవి. ఆతఁడు మరణించినవెనుక ఆసంపుటము లితరగ్రంథములతోపాటు విక్రయించిరి. అందు మధ్య చిన్నచిన్న షరాలును, మధ్యమధ్య హంసపాదులును గూడ నున్నవి. ఆతనికి తరువాతివారైన కారన్‌వాలీసు బార్లో గార్ల పాలనముపై నతడు వ్రాసినషరాలు మిక్కిలి చిత్రముగ నుండును. పై వారిద్దరును నీతడు చేసినవానిని తారుమారొనరించిరి. "మిక్కిలి నింద్యమైనది." "రద్దుచేయుటయే విచారణీయము." అనుషరాలు కోపిష్ఠియైన యీప్రభువుగారు ఆతని తరువాతివారిని గూర్చి వ్రాసిన షరాలు.

అయోధ్యనవాబునకును వెల్లస్లీకిని జరిగిన యొడంబడిక ప్రకారము ఉపబలద్రవ్యముక్రింద నవా బిచ్చివేసినది 76,00,000 లుండెను. అదనముగా నాతని కంటఁగట్టిన సైన్యపుకర్చు సాలుకు 54,12,929 ఇది యంతయును జేరి 1,30,12,929 ఇందులకై బ్రిటిషువారికి శాశ్వతరాజ్యాధికారములతో కొంతదేశ మిమ్మనిరి. ఏవిధమైన పంటలుపండని యేరోజులలో నందుపై వచ్చెడు నాదాయము పన్నువసూలునకై వలయు కర్చు లన్నియును పోను ఈమొత్తమునకు సరిపోవును. ఈదేశము మరమ్మత్తులు చేయుటకు అనువైనది. ఇది మినహాయింపు కాఁగా నవాబునకు వచ్చెడు ఆదాయము మొత్తము కోటిరూపాయిలు. అనఁగా అప్పుడు నవాబు వదలుకోవలసివచ్చిన రాజ్యము తనరాజ్యములో సగమునకు మించియున్నది. దాదాపు మూడుపాళ్లలో రెండుపాళ్లుండును ఇందుల కాతఁ డంగీకరింపక పోవునేని అవసరము కలుగునెడల తమ యధికారబలముచూపి దానిచేత నయ్యది యమలుజరుగునట్లు చేయుదు

మని చెప్పిరి." అని మిల్లుగారి బ్రిటిషిండియా చరిత్ర 6 వ సంపుటము 9 వ ప్రకరణమునం దున్నది.

నీడెడ్డుజిల్లాలు కంపెనీవారి యధీనముగావించిన యీయొడంబడిక వెలిస్లీప్రభువు అంగీకరించినరోజుననే ఆజిల్లాలపరిపాలనకును సెటిల్ మెంటునకును, విచారణసంఘ మొకటి యేర్పడియెను. ఆసంఘములో ముగ్గురు సివిలు ఉద్యోగస్థులను కమీషనరులుగా నియమించిరి. గవర్నరుజనరలుగారి సోదరుఁడగు హెన్రీ వెల్లస్లీ యను నాతఁడు ఈక్రొత్త రాష్ట్రమునకు లెఫ్టినెంటుగవర్నరుగను ఈబోర్డునకు అగ్రాసనాధిపతిగను, పేర్కొనఁబడియెను. ఈహెన్రీ వెల్లస్లీగారు జమీందారులతోను, రైతులతోను భూమి పన్నులకు మూడు సంవత్సరముల మితితో నొక యమరకము చేసెను. 1803 ఫిబ్రవరి 10 తేదీ గల యీతని ప్రథమ సెటిల్ మెంటు రిపోర్టువలన హిందూదేశమునందు క్రొత్తగా సంపాదనమైన రాష్ట్రము లన్నిటియందునను కంపెనీ నౌకర్లు హెచ్చుపన్ను లెట్లుకట్టిరో యట్లే యిచ్చటను జరిగినట్లు తెలియగలదు.

" 3. నేను " బెరిలీ " కి చేరకపూర్వమే నవాబుదొరతనమువారేరేటున కట్టిరో కలెక్టరులు ఆసిస్తుతో సమానముగనే సిస్తు లేర్పరచిరి. ఈరాష్ట్రమంతయును సెటిల్ మెంటు చేసినారు. దేశమునందలి యిప్పటి యాదాయమునుగూర్చి తప్పులెక్కలు వేసి యీపన్నులు కట్టినట్లు నన్నొకసంశయము బాధించుచున్నది. ఆసొమ్ము వసూలు అగుటయును దుర్ఘటముగనే యున్నది. కాని కలెక్టర్లు మొన్ననే పూర్తిచేసిన యీయేర్పాటులు నేను రద్దుచేయ తలంచుకొనలేదు. నే నింత శీఘ్రకాలముననే యిందుతో సంబంధము కలుగఁజేసికొన్నచో అది వారి యధికారమునకు బలక్షీణముగ నుండును. ఇట్టి యసందర్భసమయములలో వానిని బలపరచుటయె యవసరమై యున్నది."



" 18. నాకు దొరకిన దస్తావేజులనుబట్టి మొగలాయి ప్రభుత్వముక్రింద నీరాష్ట్రము లున్నపుడు సాలుసరికి 2¼ కోట్లరూపాయిలు పన్ను వచ్చెడునట్లు కనబడుచున్నది. బ్రిటిషుదొరతనము వారి న్యాయమైన సాధుపరిపాలనమున నీరాష్ట్రము లన్నియును పూర్ణముగా సాగుబడిలోనికి వచ్చినపుడు ఆమొత్తమునకు రావచ్చునని నేను నిస్సంశయముగ చెప్పెదను."

" 24. ఈనడుమ క్రొత్తగా చేసిన నిబంధనలను బట్టి ఆబుకారీ యని చెప్పబడెడు మత్తుపదార్థముల యమ్మకమువలన వచ్చెడు పన్ను యీస్టేటుమెంటులో అప్పు తెచ్చిన మొత్తముగా నమోదు చేయఁబడిన మొత్తమునకు సరిపోవచ్చును."

" కంపెనీవారియొద్దనుండి ఉప్పుకొని యమ్మకముచేసెడు ప్రత్యేకాధికారమునకై నే నవలంబించిన యేర్పాటు ప్రభువులకు విన్నవింపఁబోవుచున్నాఁడను." అని 1806 సంవత్సరమున ఈస్టిండియా కంపెనీ వారికి సంబంధించిన కాగితములం దున్నది.

ఈరిపోర్టుతో నున్న స్టేటుమెంటులో నీక్రింది మొత్తములు కనిపించుచున్నవి.

| | | |
|---|---|---|
| నవాబుయొక్క భూమిశిస్తు మొత్తము | | రు 1,35,23,474 |
| మొదటి సంవత్సరము బ్రిటిషువారిపన్ను మొత్తం | | 1,56,19,627 |
| రెండవసంవత్సరము | ... | 1,61,62,786 |
| మూడవసంవత్సరము | ... | 1,68,23,063 |

ఈయంకెలనుబట్టి చూడగా మదరాసునందును బంగాళమునందును చేసిన పెద్దతప్పితమునే యీరాష్ట్రములను సంపాదించిన ప్రథమదినములలో నుత్తరహిందూస్థానమునను మరల చేసినట్లు కనబడుచున్నది. తరుచు యుద్ధముల పీడ నొంది కఠినముగా పన్నులు పిండివేయు

టవల్ల పేదవడిన దేశమునందలి విపులమైన ప్రదేశము లన్నియును మిక్కిలిగా నాగరికత నందిన దేశపరిపాలనక్రిందకు వచ్చినవి. సాధువులును పరిశ్రమశీలురు నగు నీజనులకు తగిన విశ్రాంతి యొసంగ తరుణము వచ్చినది. కాని హెన్రీ వెల్లస్లీగారి పరిపాలనముక్రిందికి వచ్చిన ప్రథమ సంవత్సరముననే యీ "సీడెడ్డుజిల్లాల" పై కంపెనీవారు నవాబుకట్టిన పన్నులకంటె 20 లక్షల రూపాయిలు హెచ్చుపన్నులు కట్టిరి. మూడవ సంవత్సరము వచ్చుసరికి మరియొక పదిలక్షలు వృద్ధిచేయబడియెను. నవాబుగారి డిమెండు పేరునకు మాత్రమే యంత యుండెడిది కాని వసూళ్లు మాత్రము పంటలస్థితినిబట్టి అయ్యెడివి. ఇంక కంపెనీవారి డిమెం డన్ననో ఇండియాయందలి జను లిదివర కెన్నడును నెరుంగని కాఠిన్యముచే వసూ లయ్యెను. "డంబిల్టన్" అను కలెక్టరొకఁడు 1801 సంవత్సరమునందలి సెటిల్మెంటు సహేతుకముగ నుండు మితిని మించిన దనియును నవాబుదొరతనమునందలి హెచ్చురేటుల నీబ్రిటిషుదొరతనమువా రనుసరించినారనియును వారు వసూలునందుచూపెడు మార్దవమును చూపకుండఁ బోవుచున్నారనియును వ్రాయఁజొచ్చెను.

ఇతరవిషయములో నీక్రొత్తగా సంపాదనమైన రాజ్యమునందలి పరిపాలనమును కట్టుదిట్టములలోనికిఁ దెచ్చుటకై సర్వవిధములైన ప్రయత్నములు జరిగెను. 1803 సంవత్సరము మెయి 24 తేదిని దీనికి బంగాళమునందలి రెగ్యులేషను లన్నియును వర్తింపఁజేసిరి. దేశమంతయును ఏడు జిల్లాలుగా విభజించిరి. ప్రతిజిల్లాకును సివిలుఉద్యోగస్థు నొకనిని జడ్జీపనికిని మేజస్ట్రేటుపనికిని నియమించిరి. మరియొకనిని కలెక్టరుపనికి నియమించిరి. అప్పీలుకోర్టొకటియు సర్క్యూటుకోర్టొకటియు బెరిలీపట్టణము స్థాపింపఁబడెను. తమయధికారమునఁగల దోపిడి



కాండ్ర పట్టుకొనుటకును ప్రజల నెమ్మదిని కాపాడుటకును కాశీయందువలెనె తహశీలుదారులకును భూస్వాములకును అధికారముల నిచ్చిరి.

ఇదివరకు జరిగిన మూడేండ్ల సెటిల్మెంటు నామోదించుచు ముఖ్యమైన నిబంధన మరియొకటి పుట్టెను. అందులో ఆషఁతు ఆఖరైన తరువాత మరియొక మూడేండ్ల సెటిల్మెంటు జరుగు ననియు నీరెండును గడచిన పిమ్మట శాశ్వతపు సెటిల్మెంటు జరుగు ననియు ప్రకటించిరి.

హెన్రీ వెల్లస్లీ చేసిన ప్రథమ సెటిల్మెంటు మొదలు మొత్తము పది సంవత్సరములు గడచిన వెనుక భూమికామందుల కందరికి శాశ్వతపు సెటిల్మెంటొకటి చేయబడు నని సర్వాధికారముగల గవర్నమెంటువారు వాగ్దానము చేసియున్నా రని పార్లమెంటువారికి సెలెక్టు కమిటీవారు వ్రాసియున్నారు.

1803 సంవత్సరమున గవర్నరు జనరలుగారి మరియొక సోదరుడైన జనరల్ వెల్లస్లీ యను నతఁడు (ఇతఁడే తరువాత వెల్లింగ్టను ప్రభువు అను బిరుదును పొందెను) దక్షిణమున మహారాష్ట్రులతో యుద్ధముచేసి ప్రసిద్ధి కెక్కిన "అస్సే" యుద్ధములో వారి బలమెల్లను హత మార్చెను. ఉత్తరమున లోస్వారీ యుద్ధమున "లార్డులేక్" అను నాతడు వారిబలమునే నిర్మూలము గావించెను. గంగాయమునానదులకు మధ్యనుండు దేశము దీనితరువాత సంపాదన యయ్యెను. రెండేండ్ల క్రిందట నయోధ్యనవాబిచ్చిన సీడెడు జిల్లాలకును నీనికిని భేదము తెలియుటకై ఈదేశమును విజితరాష్ట్రము లనిరి. 1803 సంవత్సరమున బుందేలుఖండము కటకము కూడ వచ్చిచేరెను.

ఈవిజితరాష్ట్రములు మొదట లేకు ప్రభువుగారు పరిపాలించిరి. కాని 1805 సంవత్సరమున ఈప్రదేశ మంతయును అయిదుజిల్లాలుగ

విభజింపఁబడి ధర్మపరిపాలనకును రివిన్యూపరిపాలనకును వేరువేరు ఉద్యోగస్థులను నియమించిరి. సీడెడ్డుజిల్లాలవలెనే యివియును కలకత్తాయందుండు సుప్రీము గవర్నమెంటువారి యాధిపత్యమున చేర్చబడియెను. మున్నమున్నసే సీడెడ్డుజిల్లాలలో వర్తింపచేయఁబడిన నిబంధనలన్నియును నీజిల్లాలకును వర్తింపఁజేసిరి. పూర్వదేశములోని భూమిఖామందుల కెట్టిహక్కు లీయబడినవో వీరికిని అట్టిహక్కులే కలుగచేసిరి. ఒకటి రెండు నాలుగు సంవత్సరముల సెటిల్‌మెంట్లు వరుసగా చేసిరి. భూమిఖామందుల కంగీకార మయ్యెనేని ఆఖరు సెటిల్‌మెంటు శాశ్వతముగా నిలిచి యుండుట కేర్పాటయ్యెను. రెండేండ్లకు వెనుక నీప్రతిజ్ఞనే మరల నెలకొల్పిరి.కాని శాశ్వతపు సెటిల్‌మెంటున కొసంగెడు పూర్ణాంగీకారము మాత్రము కంపెనీడైరక్టర్ల చేత నుండు ననిరి.

1803 సంవత్సరమున ఉత్తరహిందూస్థాన మంతయును మహారాష్ట్రులచే నాశనము చేయఁబడెను. కంపెనీ నౌకర్లు కట్టిన దారుణమైన భూమిషన్నులవలన జనులు వారిస్థితిని చక్కజేసి కొనుటకు సావకాశము కలుగ దయ్యెను. అందువలన 1804 సంవత్సరమున క్షాటకము తటస్థ మయ్యెను. గవర్నమెంటువారు భూమిపన్నులో విశేషముగా రిమిషను ఇయ్యవలసి వచ్చెను. మరికొందరికి పెట్టుబడి పెట్టవలసి వచ్చెను. కాశీ, అలహాబాదు, కాన్‌పురము, ఫతేఘర్, వీని కెగుమతీ చేయబడు ధాన్యముపై యీక్షామమునకై కొంతధర్మము నీయఁజూపిరి. 1807 సంవత్సరమున జరిగిన సెటిల్‌మెంటు తనిఖీ చేయుటకై ప్రత్యేకముగ కమిటీ యొకటి యేర్పాటయ్యెను. ఇదివర కేర్పాటయిన నిబంధనలనుబట్టి శాశ్వతము కావలసినది యీసెటిల్‌మెంటే.

ఇఁక మన ముత్తరహిందూస్థానమున జరిగిన ప్రసిద్ధవాదముల లో ప్రవేశింతము.



స్పెషలుకమీషనర్లుగా నేర్పడిన "కాక్సు" "జార్జిటక్కరు" అను వారిద్దరును శాశ్వతపు సెటిల్‌మెంటువలన లాభమే కలదని రిపోర్టు వ్రాసిరి.కాని దత్తరాష్ట్రములలోను విజితరాష్ట్రములలోను నీసెటిల్‌మెంటు నింత శీఘ్రముగ స్థిరపరచకూడ దని ఖండితముగ వ్రాసిరి.

"230 భూములమీద దివాణమునకు చేరదగిన పన్ను మితి యేర్పరచుటవలన కలుగులాభములు మాకును పూర్ణముగ దెలియును. పదేపదే మార్పు కలుగుచుండు సెటిల్‌మెంటువలన రైతులకు పీడకలుగు ననుటయును, అందువలన దగాలును, అనర్థములును మెండుగ కలుగుటకు వీలువడుననుటయును గూడ మే మొప్పుకొందుము. సర్కారునకు రావలసిన పన్నులు క్రమక్రమముగా వృద్ధియగు చున్నపుడును ప్రజ లెక్కువ కష్టపడినప్పటికిని దానివలన కలుగుఫలితములను వారు అనుభవింప వీలులేనపుడును దేశ మేమైన నభివృద్ధిలోనికి రావీలుపడునా యని ప్రశ్నింతురు. అది న్యాయమైన ప్రశ్నమే యగును. శాశ్వతపు సెటిల్‌మెంటుయొక్క మంచిని గూర్చి మన కిదివర కెంత మంచి యభిప్రాయ మున్నను, విజితరాష్ట్రములతోడను, దత్తరాష్ట్రములతోడను సంబంధించినంతవరకు నీపద్ధతి వర్తింపచేయబడుట కింకను తగుణము రాలేదని మేము వక్కాణించు చున్నారము.ఇప్పుడీజిల్లాలకును అది పనికి రాదు.ఇది పూర్ణయోచనమీఁద మాకు కలిగిన యభిప్రాయము. ఈమాయభిప్రాయము సమగ్ర మైనది. ఈయకాలప్రయత్నము వలన సర్కారువారి ద్రవ్యాధారములకు విశేషమైన నష్టము తప్పక సంభవ మగును. ఈసాధనమును స్థావరమైన యాధారముగా జేసిన నెవ్వరి యభివృద్ధికి ముఖ్యముగా నుపచరించు నని తలంతుమో అట్టివారికే కొన్నికొన్ని చోట్లనిది హానికరముగా బరిణమింపఁగలదు" అని 13-4-1808 తేదీని వ్రాసిన రిపోర్టులో నున్నది.

ఉత్తరహిందూస్థానమున శాశ్వతపు సెటిల్‌మెంటును గూర్చిన మొదటియలజడి యిదియే. పబ్లీకు పన్నులకు విశేషముగ దండుగ వచ్చు ననియెడి భయమే యీయలజడికి కారణ మయ్యెను. ఈస్పెషలు కమీషనరులు చెప్పిన యంశముల కన్నిటికి కోలుబ్రూకుగారు పరిపూర్ణమైన సమాధానము నిచ్చిరి.

"3. 1802 సంవత్సరము జూలై 4 తేది, 11 జూలై 1805 సంవత్సరము తేదీలను జారీ చేయబడిన ప్రకటనమున, అందుదహరింపబడిన షరతు ఆఖరునుండి భూస్వాములకు శాశ్వతపు సెటిల్‌మెంటు చేయబడు నని గవర్నమెంటువారు వాగ్దానము చేసిరి. సవ్యమై న్యాయమైన షరతులు దొరకకేనేని వారిసాధనమువలన భూములను పూర్ణముగా మరమ్మతులు చేసికొని వృద్ధిచేసికొందురని అట్టి షరతులేర్పాటుచునవి. ఈవిషయ మంతయును పూర్ణముగా యోచింపబడి నప్పుడు మీ రనువదించిన సంగతి సందర్భము లన్నియు పూర్ణముగా దెలిసినవి కావనియు, ఈషరతుకాలమును ముందుగానే యోచించి యుంచుట యుపయుక్తముగా నుండు ననియు తీరుమానింపఁబడియెను. ఆకారణమున గవర్నరు జనరలు సభవారు 1807 సంవత్సరము జూన్ నెలలో జమీందారులకును నితర ప్రొప్రయిటర్లకును 1807 సంవత్సరము 10 యవ రిగ్యులేషనును బట్టి అంతకు పూర్వపు సంవత్సరాంతమునకు నిలిచి యుండు సిస్తు యెప్పటికిని స్థిరముగానే యుండు ననియును ఇష్టముండునెడల నాషరతుల కంగీకరించి భూస్వాములు తగినయేర్పాటు చేసికొనవచ్చు ననియు అట్టియేర్పాటు లన్నియును కంపెనీడైరక్టర్ల అంగీకారముపై కావచ్చు ననియును ప్రకటించి యుండిరి."

"4. అట్లు యథావిధిగ చేయబడిన ప్రతిజ్ఞను మనము భంగించితిమేని మనయెడల ప్రజలకుఁ గలవిశ్వాస మంతయును, నీదారుణ



ప్రతిజ్ఞాభంగమువలన నశింపఁగలదు. అట్లు నశించుటయును తగినదియె."'

"9. నాయభిప్రాయము తప్పుకాదేని ముందు చేయఁబోవు మరమ్మతు లన్నిటివలన కలుగులాభమున మనకుగూడ కొంచెము హక్కునిలుపుకొనక విడువరా దనియును, గవర్నమెంటువారును యీపెద్దయెస్టేటునకు ఒకతరహా భూస్వాములును, ప్రొప్రయిటర్లును అనియును పూర్వపు కమీషనర్ల వాదమైనట్లు కన్పట్టుచున్నది.

"26. బంగాళము బీహారు దేశములలోను, తూర్పుసముద్రతీరప్రదేశములలోను శాశ్వతపు సెటిల్‌మెంటు జరిగిన ముఖ్యావసరములయందు నిండుయోచనలను చేసి దత్తవిజితరాష్ట్రములలో మనకు రాగలవని పూర్వపు కమీషనర్లు లెక్కచేసిన హక్కులకంటె గయాళు భూములకు ముందుచేయఁబోవు మరమ్మతులలో మనకు రావలసిన హక్కులన్నియు హెచ్చుగనే వదలుకొంటిమి.

"27. ఈపద్ధతివలన గలుగు ఫలితమును సౌఖ్యమును బంగాళాదేశమునందు కనబడుచున్నది. దేశమున మరలనుత్పన్న మగుచున్న సుభిక్షతయు, అభివృద్ధినందుచున్న దానియైశ్వర్యమును, త్వరత్వరగ జరుగుదాని యభివృద్ధియును నిస్సంశయముగ శాశ్వతపు సెటిల్‌మెంటువలననే కలిగినవి. దీనిని అమలు జరపునపుడు మన మెంతెంత పెద్దత్యాగము లొనరించినను తుదకు మనమొదటి యభిప్రాయమునకు మోసము కానేరదు. ఇదియే దీనియందలి సుగుణము.

"32. మీ రూహలమీఁద వాదముచేయుటకన్న ననుభవమును చూచి మాట్లాడిన బాగుగ నుండును. గయాళుభూములు సాగుబడి యగుటవలన జమీ లభివృద్ధియై భూమిఖామందునకు మామూలుగవచ్చు రాబడి హెచ్చి భాగ్యవంతుఁ డగును. అందువలన నతితృప్తి,

అనావృష్టిదోషములను కాలవైపరీత్యములను తప్పించుకొనుట కతఁడు సమర్థుఁడగును. ఆతనికి పన్ను రిమీషను నిమ్మని కోరుట కవసరము లేకుండఁబోవును. ఇవి యన్నియు మొదట ననుకొనినవే.

"33. మన మనుకొనిన వన్నియును అనుకొనినట్లు జరిగినవి.

"38. హిందూప్రజల కందరకును బ్రిటిషుపరిపాలన మనిన సామాన్యముగా నిష్టము లేనట్టు దేశమంతటను వ్యాప్తమైనట్టు కన్పట్టుచున్నది. ఈయభిప్రాయమంతయును కేవలము నిరాధారమైనదే యనుకొందము. దీనినిబట్టి మనపరిపాలనాపద్ధతిలోని రసవిహీనమైన భాగములుతప్ప వారియభిరుచికి దగినవి మఱెవ్వియును లేనే లేవనియును వర (Boon) ప్రాయముగ నంగీకారమైన యీరాయొక్కవిషయమును వారికి మనము లేకుండఁజేయుచున్నవార మనియును దేలుచున్నది. ఇందువలన భూస్వాములును వారినిబట్టి జనులును దొరతనమువారి పయినుండి అనుదినమును వేసికి బోవుచుందురు. వారికి కలిగిన యాశలనుబట్టియును వారివారి కనుభవమగుచున్న ఆయాశాభంగమునుబట్టియును దొరతనమువారికి దూరస్థ మగుచుందురు.

"63. స్థైర్యమును, సమభావమును, న్యాయమును దొరతనమువారి పరిపాలనమున కుండవలసిన లక్షణములని కమీషనర్లకు కలిగిన యభిప్రాయముతో నేనును ఏకీభవించుచున్నాడను. ఇది నేను ఖండితముగఁ జెప్పుచున్నాఁడను. ఈస్థైర్యము నిలఁబెట్టుట యనునది ప్రజలకు లాభకరముగ నుండునని యోచించి యోచించి తుదకు మనము నిశ్చయించిన ప్రక్రియల నెల్ల రద్దుపరుచుకొనుటచే కాదు. మనము సమభావమును గనఁబరుచుట కట్టఁగలిగినంతశిస్తును గట్టి కాపువాండ్రనుండి వచ్చినంత శిస్తును రాఁబట్టుటచేతఁ గాదు. మనము వారియెడ కనఁబరుచు న్యాయవృత్తి యెల్ల చిన్నచిన్న భూస్వాముల వంశ



కులకు జన్మతః కలిగియున్న హక్కుల నెల్ల లేకుండ చేయుటచేతను కాదు."

ఈయభిప్రాయమును కౌన్సిలులోని మరియొక సభ్యుఁడగు "లమ్సుడెను" అనునాతని యిట్టియభిప్రాయ మొకటియును అప్పటి గవర్నరు జనరలుగారైన మింటోప్రభువుగారు కంపెనీడైరక్టర్లకు విశదపరచియున్నారు. మింటోప్రభువుగారును తమయభిప్రాయమును నీమాదిరినే వివరముగ తెలిపియున్నారు.

"బంగాళము, బీహారు, ఒరిస్సా, కాశీరాష్ట్రములయందును చెన్నరాష్ట్రములో చేరియున్న ప్రదేశములలోను జరిగిన శాశ్వతపు సెటిల్‌మెంటుతో సంబంధించిన లిఖితపూర్వకమైన గ్రంథము యావత్తును "దత్త" "విజిత" రాష్ట్రములకు వర్తింపఁజేయుటకై ప్రస్తుతము యోచనలో నున్న శాశ్వతపు సెటిల్‌మెంటు బాపతు రిపోర్టులును అందలి ముఖ్యాంశములును పూర్ణముగ బరిశీలించి చూచి, ఇయ్యది యత్యవసరమైన తరుణ మనియును, యీనీతి పరిపక్వమైన నీతి యనియును పూర్ణముగా సంతుష్టుఁడ నయ్యెను." అని 15 సెప్టెంబరు 1803 తేదీ యుత్తరమునం దున్నది.

కాని డైరక్టర్లు ఇదివరకే తమమనస్సు నిశ్చయపరచుకొని యుండిరి. ముందు తమకు కలిగెడిలాభమును, యభివృద్ధియును అప్పటి సంగతిసందర్భములనుబట్టి దేశక్షేమమునకై వారు మొదట వదలుకొనవలసినవారైరి. పిమ్మట కారన్‌వాలీసు ప్రభువుగారు కాలధర్మము నొందిరి. అప్పుడు డైరక్టర్లు చూపినదాక్షిణ్యము, ఎప్పుడును మరల చూపు పాపమునకు వారొడిగట్టినారు కారు. కట్టగలిగినంత పన్ను కట్టుటయును, రాఁబట్టగలిగినంత పన్ను కాపువాండ్రనుండి రాఁబట్టుటయును నిప్పటి వారి నీతి యయ్యెను.

“కటకమునగాని యితరరాష్ట్రములందు మరియెచ్చటను గాని మీరిప్పుడు చేయుచున్న యేయావత్తుచర్యలును పూర్ణముచేసి మాకు పంపి మాయేకీభావమును మాయంగీకారమును బొందువరకు నిక సెటిల్‌మెంటు నెచ్చటను శాశ్వతమని చెప్పవల్లకాదు.” అని వారుత్తరవుల నిచ్చిరి. మరి తొమ్మిదినెలలకు పిమ్మట “ఇప్పుడు మీకు మేముబ్రాయుదానివలన మీరు గమనించు విషయ మేమనఁగా బంగాళాదేశమునందు వ్యాప్తమైన పన్నులశాశ్వతస్థితి మాకు నూతనముగ దఖలుపడిన రాష్ట్రములయం దెచ్చటను ప్రయోగింపకూడదని మీకు ఖండితముగ తెల్పుటయే.” యని మరల వ్రాసిరి.

గవర్నరుజనరలుగా రీయావత్తు ఉత్తరప్రత్యుత్తరములు చేరిన తోడనే నిర్విణ్ణుఁ డయ్యెను. హిందూదేశజనుల క్షేమమునకై అగత్యమైయుండు ప్రక్రియల నెల్ల వదలివేయు మనియును, జనుల కిదివరకు రెండుసారులు నిరాఘాటముగ నొసంగఁబడినట్టియు, 1803-1805 సంవత్సరముల రెగ్యులేషనులలో చేర్చబడినట్టియు పవిత్రమైన వాగ్దానమును భంగింపుఁ డనియును, నుత్తరవు చేసిరి. దత్తరాష్ట్రముల కేర్పడిన 1803 సం॥రం 25 రెగ్యులేషను 29 సెక్షనునకు భాగముగా నుండిన ప్రకటనలో నీక్రిందివాక్య మున్నది.

“ఈపదిసంవత్సరముల యనంతరము (నిదివర కమరకమునకు పుచ్చుకున్న వారి కిస్తముండి అంతకంటె నెక్కువ హక్కుదారు లెవ్వరును రాకుండిన యెడల) నీసాధనము మంచిదియే యని చెప్పుటకై పూర్ణముగ వ్యవసాయ మభివృద్ధిలో నుండిన భూము లెల్ల దొరతనమువారికి సవ్యముగను న్యాయముగను నుండిన వని తోచిన షరతుల మీద వారికే యియ్యబడును.”

విజితరాష్ట్రములకై యేర్పడిన 1805 సంవత్సరము 10 రెగ్యు



లేషనులో చేర్చబడిన ప్రకటనలలో నీవాగ్దాన మీషరతులతోనే యేకరవు పెట్టబడెను.

“1222 ఫసలీతో అంత్యమయ్యే పదిసంవత్సరముల షరతు అనంతరము (ఇదివర కమరకమైన వారి కిస్తముండి యింతకంటె నెక్కువహక్కుదారు లెవ్వరును రాకుండినయెడల) నీసాధనము మంచిదని చెప్పుటకు పూర్ణముగ వ్యవసాయములో నుండిన భూము లెల్ల దొరతనమువారికి న్యాయముగను సవ్యముగను నున్నట్టు తోఁచిన షరతుల మీఁద శాశ్వతపు సెటిల్‌మెంటు సమాప్తముగా చేయఁబడును.”

ఈవాగ్దానము లన్నియును బాధ్యతగల కంపెనీనౌకర్లును వారి యేజంట్లును హిందూదేశప్రజల కప్రతిబంధకముగ నిచ్చియుండిరి. ఆకారణముచే కంపెనీవారు వాని కన్నిటికిని బద్ధులై యున్నారు. దత్తవిజితరాష్ట్రములు రెంటికిని ఏర్పడిన 1807 సంవత్సరము 10 రెగ్యులేషనులో నీవాగ్దానమే మరల నేకరువుపెట్టఁబడెను. కాని యీమాటు “ఘనతవహించిన కంపెనీడైరక్టర్లు ఈయేర్పాటుల కంగీకరించినయెడల” శాశ్వతపు సెటిల్‌మెంటు సమాప్తముగా చేయబడు ననియెడు షరతు చేర్చబడియెను.

1811 సంవత్సరమున సాదరు చేయబడిన డైరక్టర్ల యాశాసనములు (అంతకు పూర్వమునందు పుట్టిన) పైవాగ్దానముల నెట్టు నతిక్రమింప గలుగును? “ఘనతవహించిన” కంపెనీడైరక్టర్లు 1803-1805 సంవత్సరములలోని రెగ్యులేషనులనుబట్టి స్థాపనమైన యేర్పాటులు తమ కసమ్మతముగానుండెనేని ఆరెగ్యులేషనులు శాసనములుగా చేయబడిన తరుణముననే తమయభిప్రాయమును తెలుపవలసి యుండెను. ఆరెగ్యులేషనులలో డైరక్టర్ల యంగీకారము కావలెనని చెప్పుటకు ఏవిధమైనచోటును లేదు, గాని ప్రభువులగు తమకు నైసర్గికముగ నున్న

యధికారమునుబట్టి తమయసమ్మతమును బలపరచుచు వాదించుటకు సావకాశముండియుండును. కాని యిప్పుడో దత్తరాష్ట్రములలో నియ్యబడిన షరతు యావత్తును సమాప్తమయ్యెను. విజితరాష్ట్రములలోని షరతు రెండువంతులైనది. ఇంతకాలమైనతరువాత దీనిని రద్దుపరచుమనుట మేమిదివరకు విశదపరచినట్లు లౌకికమార్గమున యోచించినను, ధార్మికమార్గమున యోచించినను సమంజసముగా నుండనేరదని మేము జంకుచున్నారము." అని 9-10-1812 తేది యుత్తరమున యిండియను గవర్నమెంటువారు వ్రాసిరి.

మింటోప్రభువు "అంతబాహాటముగను యథావిధిగను దొరతనమువారు భూస్వాములకొసంగిన వాగ్దానములతో" నీప్రస్తుత యుత్తరవుల సమన్వయించి మూలమునకు సమంజసమయిన అర్థము చెప్పలేక తనకు తోచిన యర్థమొకటి కల్పించి చెప్ప ప్రయత్నించెను. ఈప్రయత్నము లన్నియును 11-7-1812 తేదీని వ్రాసిన సారాంశమునందున్నది.

1813 సంవత్సరమున మింటోప్రభువు ఇండియానుండి మరలిపోయెను. ఈలోగా మరియొకసారి డైరక్టర్ల యుత్తరవులను ప్రతిరోధించి వ్రాసిపోయెను. శాశ్వతపు సెటిల్‌మెంటువలన పన్నుల కేమియును నష్టములేదని చూపెను. భూమిపన్ను మార్పుచెందుట భూములకు మరమ్మత్తు చేయువిషయమున నిరుత్సాహమును కలిగించుటయని "ఆడముస్మిత్తు" అను నాతడు తనజాతీయార్థశాస్త్రమను గ్రంథమున గర్హించి యున్నాడనెను. ఉత్తరహిందూస్థానమున భూస్వాముల స్వాధీనమునందున్న భూములకు గయాళుభూములను చేర్పక శాశ్వతపు సెటిల్‌మెంటు చేయవచ్చుననియెను. మంచిదొరతనముయొక్క యుద్దేశము తుదకు దేశీయుల స్థితిగతుల నభివృద్ధిచేయుటయే యగునేని యట్టి ముఖ్యోద్దేశముల నెరవేర్చు విషయమున త్వరితముగను జయప్రదముగను పనిచేయుసాధనముగాని యేర్పాటుగాని యీశాశ్వతపు సెటిల్‌మెంటుతప్ప మరియొకటి లేదనెను.



కాని కంపెనీడైరక్టర్లు కఠినహృదయులైరి. హిందూదేశజనుల మంచినిమిత్తమై వారి కున్నట్టు చెప్పెడి యభిలాష లన్నియు తమస్వలాభమును పోగొట్టుకొను విషయమున వారిమనస్సును కదలింపలేకపోయెను. 1803–1805 సంవత్సరములలో వారు చేసిన వాగ్దానములనుండి తప్పించుకొనుటకు తగిన యుపాయములను నిశ్చలముగ నేర్పరుచుకొనియే యుండిరి. న్యాయసభలలో శాస్త్రసమ్మతమైనదని చెప్పవీలులేని తప్పుదారి యొకటి ద్రొక్కుమని సూచించిరి. ఆదారి సామ్రాజ్యముల పాలించు ప్రభువులమాటయటుండ యోగ్యముగవర్తించు వర్తకులకు సైతము తగనిదియై యుండెను.

"మూడేండ్ల షరతుకవుల్లనుబట్టి యంతరాయములేకుండ భూము లనుభవించుటయును క్రమముగ సకాలమున దొరతనమువారి బాకీలన్నియు చెల్లించుటయును, భూస్వాములకు శాశ్వతపు సెటిల్‌మెంటు చేయుటకై శపథముచేసిన షరతులలో నొక్కభాగముమాత్రమే యై యున్నది. ఈషరతులకన్న నెక్కువ ముఖ్యమైనది మరియొకటి యున్నది. అది యేమందురేని దానిపై మనము సిసలుపరచఁబోవు పన్నులను నిరుకుపరుచుటకై ఈషరతాఖరులోగా భూములు మంచి యున్నతస్థితిలోనికి కొనిరావలసియుండు ననుటయే. భూమి యెంతవరకు వృద్ధిచేసిన నట్టిసాధనముల వర్తింపచేయుటకు వీలుపడునో దానిని 1803 సంవత్సరము రెగ్యులేషనుగాని 1805 సంవత్సరము రెగ్యులేషనుగాని నిశ్చయించి యుండలేదు. అట్టిది యిక ముందు మరియొక రెగ్యులేషను సాధనమువలన నిశ్చయించుటకు సావకాశము లేదు. అది

యెట్లు నిర్ధారణ కావలయు ననియెడి విషయము పూర్ణముగ దొరతనమువారి పరిశీలననుబట్టి యుండును. వారి పరిశీలనమున కీమత్తయిన సంతరాయము కలిగించు కట్టుబాటు లైనను ఆచట్టమునందు కొనరావ"ని 16-3-1813 తేది యుత్తరమునం దున్నది.

ఇట్టివాదము సమద్దేశముతోడను యోగ్యతతోడను జరిగియున్నయెడల పూర్ణముగ నభివృద్ధిలోనికి వచ్చిన కొన్ని యెస్టేటులలో తరుణముననే శాశ్వతపు సెటిల్‌మెంటు జరుగుటయును కొన్నిటిలో కొంచెము ఆలస్యముగ జరుగుటయును సంభవించియుండును. కాని అది యిదివర కొసంగిన నియతవచనమును భంగించుటకై పన్నిన పన్నాగమై యుండెను. దానినిబట్టి ఆనియతకృత్యమును తప్పించుకొనిరి. 1813 సంవత్సరమునగాని తరువాత మరియెప్పుడుగాని యేజమీలకును శాశ్వతపు సెటిల్‌మెంటు జరుగలేదు.

మింటోప్రభువుగారి యనంతరము "మార్క్విసుహేస్టింగ్సు" అనుపేరు పొందిన మాయిరా ప్రభువు గవర్నరు జనరలుగా వచ్చెను. ఆతని ప్రభుత్వమున నేపాళయుద్ధమును, పిండారీలయుద్ధమును, కడపటి మహారాష్ట్రయుద్ధమును తటస్థమయ్యెను. చరిత్రమున ఆయన కిందు మూలమున బ్రఖ్యాతియు వచ్చెను. ఈయుద్ధములవల్లనే 1817 సంవత్సరమున బొంబాయిరాష్ట్రము సంపాదన మయ్యెను.

ఈసంక్షోభములనడుమ ఉత్తరహిందూస్థానమునందలి భూమి సెటిల్‌మెంటునకై తగు శ్రద్ధ తీసికొనుటకు తీరిక లేకపోయెను.



# హిందూదేశార్థికచరిత్రము.

## పదునొకండవ ప్రకరణము.

### హేస్టింగ్సుప్రభువు, ఉత్తరహిందూస్థానమునందలి మహల్వారీసెటిల్‌మెంటు.

(1815-1822)

కడపటి మహారాష్ట్రయుద్ధ మయ్యెను. 1818 సంవత్సరమున పీష్వాలలో కడపటివాఁడు విజితుఁ డయ్యెను. మహారాష్ట్రసేనలతోడను, పిండారీదండులతోడను కలిగినకష్టములకన్న ఉత్తరహిందూస్థానమునందలి భూమిపరిపాలనాపద్ధతితోడ ఎక్కువకష్టములు పొందగలసి వచ్చెను.

మంచిశిక్షపొందిన సైన్యములు యుద్ధరంగమున శత్రుముఖ మెరుంగని దండుల నెదుర్కొనునేని, విజయకార్యములును, సంపాదనకార్యములును పూర్ణముగ సుకరములైనవే యగును. కాని యట్టివిజయకథనము హిందూదేశచరిత్ర కాదు. పరిపాలనచరిత్రము క్రొత్త ప్రభుత్వమునందలి జనులస్థితిగతులు ఇవి మాత్రమే దేశముయొక్క వాస్తవమైన చరిత్ర యగును.

ఉత్తరహిందూస్థానమునందలి దత్తరాష్ట్రములకును విజితరాష్ట్రములకును నేర్పడిన కమీషనరుల సంఘములో "ఎడ్వర్డు కోలుబ్రూకు"అనునతఁడును "ట్రాంటు" అను నాతడును కమీషనరులుగా నుండిరి. మొరాడబాదా బెరిలీ, షాజహానుపురము, రోహిలాఖండ

ము అను వేర్వేరుజిల్లాలలోని భూమి సెటిల్మెంటునుగూర్చి ఒకరిపోర్టువ్రాసి, కట్టెడుపన్ను లన్నియును శాశ్వతముగా నుండవలయునని మరల నిర్బంధించిరి.

“దత్త విజితరాష్ట్రములలోని జనులందరును మిక్కిలి యాతురతతో తమకు శాశ్వతపు సెటిల్మెంటు లాభముకలుగునని చాలకాలమునుండి యెదురు చూచుచుండిరి. అట్టిలాభముల నరికట్టుట ఈదేశపాలనమున బ్రిటిషు దొరతనమువారి కనర్థక మని మేము చెప్పక తీరదు. అట్లు చేయమేని దొరతనమువారు మాకేర్పరచిన కృత్యధర్మమును మేము నెరవేర్పనివార మగుదుము.

“ఇందువలన రాష్ట్రమునకు ద్రవ్యలాభ మున్నదని మాకు తృప్తికరమైనది కాని యీక్రియవలన దొరతనమువారికి కలుగు ద్రవ్యలాభమునుగూర్చి మేము చర్చలోనికి దిగఁబూనుకొన లేదు. ఏమందురేని కంపెనీడైరక్టర్లతో శాశ్వతపు సెటిల్మెంటునుగూర్చి యిదివరకొకసారి పూర్ణమైన చర్చ జరిగినది. అటుపిమ్మటనే పై నుదాహరింపబడిన రెండురెగ్యులేషనులను బ్రకటించి దొరతనమువారియెడ విశ్వాసము కలుగఁజేసితి రని తలంచుచున్నారము. ఆతీర్మానమే ఈదేశమందునను, ఐరోపాదేశమునను గల పెద్దపెద్దయుద్యోగస్థుల కడపటి తీర్మానముగాను నిర్వివాద మైనదిగాను యోచింపవలసి యుండెను.

“ఈరాష్ట్రము లన్నిటియందుఁను కలభూముల సెటిల్మెంటులకు శాశ్వతపద్ధతి యేర్పడదేని మరియేసాధనములవల్లను భూస్వాముల యాశలు కొనసాగనేరవు. ఈయాశ లన్నియును దొరతనమువారి విధ్యుక్తవచనముచే కలిగినట్లు వారందరును దలంచుచున్నారు. ఈ విషయమున మాకొక్కొక్కరికిని కలిగిన యభిప్రాయమైనను ఏకగ్రీవముగ నందరికిని కలిగిన యభిప్రాయమైనను నిదియే. మాకుఁగల యీ



వృథావిశ్వాసమును దెలుప సాహసించెదము.” అని 27-10-1818 సంవత్సరమున రిపోర్టు వ్రాసిరి.

ఆమఱుచటిసంవత్సరమున “డౌడస్వెల్లు” అను నాతఁడు చిరకాల మిండియాయందు ప్రఖ్యాతమైన యుద్యోగముచేసి విశ్రాంతికై పోవునప్పుడు ఈవిషయమునుగూర్చి మరల వ్రాసిపోయెను.

“ఇంక నేను సిద్ధాంతీకరించునది యేమనిన జనసంఘమున కంతకును శాశ్వతపు సెటిల్మెంటువలని లాభము కలుగచేయుదు మని దొరతనమువా రభయహస్తమిచ్చి రనియు, అది తిరుగు లేని దనియు పైని చెప్పబడిన వేర్వేరు కొలఁది మినహాయింపులు తప్ప మన విజయమునాటినుండి విజితరాష్ట్రములలోను ప్రదానకాలమునుండి దత్తరాష్ట్రములలోను పదిసంవత్సరముల యనంతరమువరకు నిది వ్యాప్తము కాలే దనియును విన్నవించుచున్నాను.

“కొన్ని జరిగిన సంగతులను కొన్ని యభిప్రాయములను ముఖ్యముగ యోచనకు తే నుద్దేశించితిని. అవి చెప్పక తీర దయ్యెను చెప్పిన కష్టముగా నుండు నని యెఱుంగుదును. నామనస్సు నావేశించి యున్నయుద్దేశము లన్నిటిని ఘనతవహించిన కంపెనీడైరక్టరులు కొనసాగింపవలె నని మరిమరి చెప్పుచున్నాఁడను. నాయిష్టము వచ్చినట్టు చేయుటకు నాకు స్వాతంత్ర్యమే యుండెనేని నాకిప్పు డొసంగిన పనిని చేయనని నేను మిక్కిలి యుత్సాహముగ చెప్పి యుందును. నామనస్సులో నున్న యుద్దేశము లన్నియును బయటబెట్టుట యిట్టిసమయమున కేవల సామాన్య ధర్మముమాత్రమే గాక విధ్యుక్తధర్మమై యున్నకారణముచేత నే నీయుద్దేశముల నెల్ల కాగితమున కెక్కింపవలసినవాఁడ నైతిని.

“దేశములోని వ్యవసాయముయొక్క యభివృద్ధిని బ్రోత్సహిం

చుట ఈసాధనమువలన జరుగుననియు నయ్యది దొరతనమువారి లాభమునకే యనియును అందు ముఖ్యముగ సర్కారువారి యాధారములకు విశేషముగ దంపుగ లేకుండ బ్రిటిషువారికి బలమును, అధికారమును నిండుమూలమున జనుల యనురాగముతో నెనసిపోవు ననియు జూపకలుగుదునేని సాహృదయమునందుఁగల యుద్దేశము లన్నియు సనుకూలపడఁగలవు. మనము సెటిల్‌మెంటు చేసిన జమిలో చేరిన పరగణాలలోను, మజాలలోను తదితరభాగములలోను నిదివరకు వ్యవసాయమైన భాగమున కలిసియున్న చిన్నచిన్న పొలము లన్నిటిని క్రమక్రమముగా వ్యవసాయము చేసుకొని భూస్వాము లందరును తమతమ యుపత్తు లన్నియు వృద్ధిచేసికొందురు. ఇందుకు నాకేమియు సందియములేదు. పైపేరాలలో చెప్పబడిన మాదిరిని మిగతభూములన్నియును నస్తుతః దొరతనమువారికే చెందియుండగలవు.

"ఇందుకు భిన్నముగా దొరతనమువారు భూములమీఁదిపన్నులను క్రమక్రమముగా వృద్ధిచేసి చెల్లింపఁగలిగినంతపన్నును ఆకర్షించుట వివేకమనికాని న్యాయమనికాని నీతియనిగాని తలంపఁబోను. మొత్తముమీఁద పరిశీలించి చెప్పవలసివచ్చినచో నిదివరకు కట్టిన పన్నులే వ్యవసాయకుల క్షేమమునకును దేశముయొక్క క్రమాభివృద్ధికిని సరిపడినంత హెచ్చుగనే యున్నవని నానమ్మకము.

"ఇంక నేనీవిషయమును పూర్ణముగా విడిచిపెట్టెదను. బహుశః ఎప్పటికిని దీనిని మరల నెత్తఁబోను. ఇందుమూలమున దేశముయొక్క మేలికట్టుబాటులనుగూర్చియును జనుల నెమ్మదినిగూర్చియును కొంతవఱకు పనిచేసినా ననుకొనుటకును, సివిలు క్రిమినలు పరిపాలనకును తదభివృద్ధికిని చేత నైనంతవరకు కష్టించి పనిచేసినాడననుకొనుటయును నేను పరిపాలనము చేసినందువలన సర్కారువారి యాధారము లేవి



యును క్షీణించలేదనుకొనుటకును, వానినెల్ల తడవిచూచికొని సంతుష్టి నొంది, గర్వపడుటకును నాధారము కలుగును. చేయవలసినపని చాలనున్నది కావున నేను దేశమునుండి తరలిపోయెదులోపల నీపశ్చిమరాష్ట్రములలో శాశ్వతపు సెటిల్‌మెంటు వ్యాపించుట నాకేనులార నేను చూడఁగలిగితినేని నేను చేయగలిగిన పని మిగిలిపోయినదే యను విచారము లేకుండపోవును." అని 7-10-1819 తేదీని వ్రాసెను.

ఇంతకంటెను విఖ్యాతి చెందిన యుద్యోగస్థుఁడగు "ఎడ్వర్డు కోలుబ్రూకు" అను నాతఁడు 42 సంవత్సరములు దేశమున కుపయుక్తమై పేరు ప్రమోసిన యుద్యోగము చేసి, ఇప్పుడిండియానుండి తరలిపోవు చుండెను. ఆతడును తాను విశ్రాంతి నొందఁబోవు తరుణమున దేశప్రజలకు ముందుముందు భూమిమీఁద కొంచెము లాభము కలుగుటనుగూర్చియును, అయ్యది ఫలవంత మగుటనుగూర్చియును తగినకృషి చేసి వారికి తగినయాశలను సంరక్షించుటకును దినదినమును నభివృద్ధియగుచు దేశమును పేదవరచుచున్న కంపెనీడైరక్టర్ల ఆకర్షణములను ప్రతిరోధించుటకును మరియొకప్రయత్నము చేసెను. 1820 సంవత్సరమునందాతడు వ్రాసిన సారాంశముతో 1807 మొదలు 1818 సంవత్సరము వరకు పండ్రెండు సంవత్సరములలో దత్తవిజితరాష్ట్రములలో భూములు క్రమక్రమముగా నెట్లు వృద్ధిచేయఁబడినవో దానిని తెలుపు లెక్కయొకటిపంపెను. మీరిదివర కనినప్రకారము భూమిపన్నునకు మితి యేర్పరచు డనియును, అందువలన మరమ్మతులకై భూస్వాములు పడిన కష్టములవలని ఫలమువారికి నిలిచిపోవు ననియు నుపదేశించెను.

ఈక్రిందిమొత్తములు క్రోలుబ్రూకుగారి పైలెక్కనుండి యెత్తి వ్రాయఁబడినవి.

ఉత్తరహిందూస్థానమునందలి దత్త విజితరాష్ట్రములు.

| సంవత్సరము. | భూమిపన్ను. | మొత్తముపన్ను. |
|---|---|---|
| 1807 | 2,008,955 | 2,065,396 |
| 1808 | 2,042,437 | 2,304,004 |
| 1809 | 2,254,791 | 2,579,949 |
| 1810 | 2,392,852 | 2,782,643 |
| 1811 | 2,414,737 | 2,741,728 |
| 1812 | 2,274,709 | 2,646,858 |
| 1813 | 2,508,681 | 2,931,906 |
| 1814 | 2,502,223 | 2,815,579 |
| 1815 | 2,483,133 | 2,891,045 |
| 1816 | 2,665,667 | 3,130,853 |
| 1817 | 2,626,761 | 2,926,923 |
| 1818 | 2,892,789 | 3,262,366 |

ఎడ్వర్డు కోలుబ్రూకు హిందూదేశప్రజలతో కలిసి చాలకాలముండెను. ఆతడు పైసంవత్సరముననే హిందూదేశవాసుల యభివృద్ధి నిగూర్చి మరియొక సారాంశమునం దిట్లు వ్రాసెను.

“చిరకాలముక్రిందట 1780 సంవత్సరప్రారంభమున వారన్ హేస్టింగ్సుగారు నాయందలియభిమానముచేత నన్ను గవర్నమెంటువారికి పరిషియను భాషాకార్యదర్శిగా నియమించి యున్నారు. 42 సంవత్సరములనుండియును నేను నివసించియుండిన దేశమును విడిచిపోవు సమయము వచ్చినది. నాపదునెనిమిదవ యేటనుండియును బాధ్యతగల యుద్యోగమునే సమర్థింపవలసినవాఁడనైతిని. కడపటి పండ్రెండు సంవత్సరములు నేను కదలికగా పనిచేసిన బ్రిటిషురాష్ట్రములలో నుండెడు ప్రజల శిస్తుల కొకమితి యేర్పరచు నుపకారము నేను చేయగలిగితినేని నే నుద్యోగము చేసినందులకు కడపటి కింతటికార్యము చేయఁగలిగితి నని వాస్తవమైన సంతుష్టి చెందగలను............ఈరాష్ట్రమునందలి భూమికామందులు సర్వత్ర సత్ప్రవర్తన కలవారై యున్నారు. అట్టివారి ప్రవర్తనమే నేను పడినకష్టములు ఫలించుట కాధారమైనది. ఈఋణమును నేను మరచిపోనేరను. ఈసాధనమువలని యుపయోగ మింతకంటె తక్కువగా నుండినను వారియెడ మనకు భూపు కృతజ్ఞతకైనను ఈయుపకారమును మనము చేయవలసియుండెను.”



ఈయుద్దేశము మిక్కిలి యౌదార్యమైనదే కాని కొనసాగినది కాదు. హిందూదేశప్రజల మెత్తని వృత్తియును, రాజభక్తియును, తమ స్వలాభమును తగ్గించెడుపట్ల దొరతనమువారికడ పనిచేసినవి కావు. ఈవృత్తినలనఁ దరుచుగ నందునకు వ్యతిరేకమైన ఫలమే కలుగుచువచ్చెను. బ్రిటిషువారి పరిపాలనమువలన దేశ మెంతసురక్షితముగను, నెమ్మదిగను, ఉండినను జను లెంతపాటుపడువారును, ఓర్పితపరులును ఐనను దేశ మంతయు నెంత శ్రీమంతమైనదియును, ఎంత సారవంతమైనదియు నైనను జను లెల్లరును నిరాధారులై నిరుపేదలై పోవువరకును, వారికడగల సర్వస్వమును రాఁబట్ట దొరతనమువారికి ప్రవృత్తి గలుగుచువచ్చెను.

బోర్డు కమీషనర్లును “డౌడేస్ వెలుగారును” “ఎడ్వర్డు క్రోలుబ్రూకుగారును” “స్టూఅర్టు” “ఆదము” “పెండల్” గార్లు వ్రాసిన రిపోర్టులను రికార్డుచేసిన సారాంశములను ఆధారపరుచకొని గవర్నరుజనరలుగా రగు హేస్టింగ్సు ప్రభువుగారు కూడ దేశాభివృద్ధి కవసరమైనట్టియు బ్రిటిషుదొరతనమువారిచే యథావిధిగ వాగ్దత్తము చేయబడినట్టియు శాశ్వతపు సెటిల్మెంటు సాధనమును అంగీకరింపు

మని కోరుచు కంపెనీడైరక్టర్లకు తన కడపటి విన్నపమును చేసికొనియెను.

“ఇప్పుడు మొత్తము సిస్తు ఇంతయని నిరుకుపరచి ఆపద్ధతిని గాని లేదా తరి మొకటి యేర్పరచి ఆరేటున కెన్నటికిని మార్పులేకుండు సిస్తు నేర్పరచి ఆపద్ధతినిగాని ఈదత్త విజితరాష్ట్రములలో భూమి పన్నులకు శాశ్వతపు సెటిల్‌మెంటు వ్యాప్తము చేయుమని మేమందరమును నేకగ్రీవముగ చెప్పుచున్నారము.” అని గవర్నరుజనరలును, కౌన్సిలు మెంబరులును కలిసి సంతకముచేసి 16-9-1820 సంవత్సరమున కంపెనీడైరక్టర్ల కుత్తరము వ్రాసిరి.

అప్పుడుసామ్రాజ్యమునకు స్వాములగు వర్తకసంఘనాయకులు తమసొమ్ముతో సంబంధించిన లాభము చూడవలసివచ్చినపుడు జనులయొక్క సౌఖ్యమునుగూర్చి యీషత్తయినను యోచనసేయక హేస్టింగ్సు ప్రభువుగారి యుపదేశముల నన్నిటిని రెండుముక్కలతో సంక్షేపముగా త్రోసిపుచ్చిరి.

“మొత్తముశిస్తు ఏర్పాటుచేయుపద్ధతినిగాని స్థిరమైన రేటునేర్పరచి యది మార్పులేకుండ సిస్తు లేర్పరచుపద్ధతినిగాని దత్త విజితరాష్ట్రములలో శాశ్వతపు సెటిల్‌మెంటును నెలకొల్పుమని మీకందరకును నేకగ్రీవముగ కలిగినట్టు చెప్పెడి యభిప్రాయమును మేమంగీకరింపఁజాలమని నిష్కర్షగ మరల చెప్పుచున్నారము. భూమిపన్నునుగూర్చిన శాశ్వతపు సెటిల్‌మెంటునకు ప్రతికూలముగ 15-1-1817 తేదీని ఈడిపార్టుమెంటువారు వ్రాసిన యుత్తరముయొక్క 6 వ పేరలో నుదాహరింపబడిన యుత్తరవునే ఖండితముగ మరల సాదరుచేయుచున్నారము. మేము మిమ్మును కోరునది యేమన, నట్టి సెటిల్‌మెంటు చేయరాదనుట యొక్కటియే గాక యింక ముందైనను అట్టిశాశ్వతపు



సెటిల్‌మెంటు చేయబడునను నాశ వారికి కలిగింపరాదనికూడ మిమ్ము నే వేఁడికొనుచున్నారము.” అని 1-8-1821 తేదినుత్తరము వ్రాసిరి. ఇట్టి చర్య నలుబది సంవత్సరములకు ముగిసినది.

ఈనడుమ 1819 సంవత్సరమున బోర్డు సెక్రెటరీగా నున్న “హోల్టుమెకంజీ” అనునాయన విఖ్యాతమైన యంశ మొకటి వ్రాసి యుంచెను. అందు ఉత్తరహిందూస్థానమునఁగల గ్రామసంఘములను గూర్చి ముచ్చటించుచు, అట్టిసముదాయము లుండెడిచోట్ల నెల్ల భూములను యథావిధిగ సర్వేచేసియు, దర్యాప్తుచేసియు పన్నులు కట్టవలె నని సిఫార్సుచేసెను. ఆయాజిల్లాల విమర్శనచేయుచు గ్రామము లన్నియు నిపుడు సర్వేచేయవలెననియును, వారవారిహక్కులకన్నిటికిని రికార్డు తయారుచేయించవలె ననియును, గ్రామసముదాయము లన్నియును లంబరుదారు లనియెడి పెద్దకాపుల పరిముఖమున నుండవలె ననియు, దొరతనమువారికి పన్ను చెల్లించవలసినవారిపేరులు కలెక్టరు రిజిస్టరులో వరుసనెంబరువేసి వ్రాయించి యుంచవలె ననియు, వ్రాసెను. పన్నుల రేట్లు వృద్ధిచేయుటకన్న సమానముగా భాగించుట యుత్తమముగా నుండు ననికూడ సూచించెను. పన్నులు చెల్లించువారి పూర్వపు హక్కు లన్నియును సంరక్షింపఁబడవలె ననియెను.

1821 సంవత్సరమున శాశ్వతపు సెటిల్‌మెంటునుగూర్చిన యాలోచన లన్నియును విడువఁబడుటచే “హోల్టు మెకంజీ” గారి యభిప్రాయమే సెటిల్‌మెంటునకు ఆధారముగ గైకొనఁబడెను. దీనియభిప్రాయ మేమనగా భూస్వాము లున్నచోట అట్టిభూస్వాములతోడను సముదాయముగా భూము లనుభవించెడుచోట గ్రామసముదాయములతోడను అమరకములు జరుగవలె ననియును ఇన్నిటికిని ముఖ్యముగా కోరినది భూమిపన్ను మితమైనరేటున నేర్పాటుచేయవలె ననియును 1822

సంవత్సరమున గవర్నమెంటువారి తీర్మానమునందొత్తి వ్రాయబడెను.

"87. పూర్వపు హిందూధర్మశాస్త్రములనుబట్టి రాజునకు పంటలో కొంత మితమైన భాగముమాత్రమే నియతమై యుండినట్లు కనబడుచున్నది. ఇప్పుడిప్పుడు బయలుదేరిన హిందూరాష్ట్రములలోని యాచారమునకును, పూర్వకాలపు ఆచారమునకును భేదము విమర్శింతుమేని వ్యవసాయదారులకడనుండి వాస్తవముగా వసూలుచేయబడు మొత్త మెల్లప్పుడును రేట్లవారీని మితముగ నియతమై యుండలేదని చెప్పవలసివచ్చును.

"88. గ్రాంటుగారు మొగలాయీపద్ధతికూడ నిట్లే యున్నట్లు చెప్పుచున్నారు. వారు పండినపంటలో నాలగవవంతునకు దామాషాయీ విలువకట్టి నగదుగా వసూలుచేసిరని కూడ, చెప్పుచున్నారు.

"మనకు పూర్వముండిన స్వదేశపరిపాలకులు తమసొమ్ముతో సంబంధించిన వ్యాపారమునందు సైతము పూర్వాచారముల కెంతఘనగౌరవము చూపినను, తరువాత రోజులలో తమకు న్యాయముగ రావలసు బాకీలనైనను వసూలు చేసికొనుట కెంత యసమర్థులై యుండినను, రైతుయొక్క స్థితిగతులకు తగినసదుపాయమును వారికి కనపరచి తమకు రావలసిన పన్నులను తాము నిరుకుచేసికొను హక్కులు దొరతనమువారికి లేవని చెప్పిరనుటకు సావకాశము లేదు. మొత్తముమీద విచారించిచూడగా ప్రభువుగారికిని వారిసభవారికిని వాస్తవముగా కనిపించిన పర్యవసాన మిదియే.

"101. దొరతనమువారీవిషయమున ముఖ్యముగా జాగరూకతతో చూడవలసినది హెచ్చుమొత్తములను కోరకుండ కాపాడుటయే. లేకున్న వారికి వచ్చెడు నికరాదాయములో మాత్రమే మనము కొంతపుచ్చుకొన్నా మనుకొని వ్రాసపడిన పాటున కయ్యెడు కూలియును, పెట్టుబడిలాభములును కూడ మనమే వేసికొన్నవారల మగుదుము. ఈరెంటిభయమును లేకుండ మనము కనిపెట్టిచూడవలెను.



"129. రైతులు చెల్లించవలసిన శిస్తురేట్లను నిర్ధారణచేసి నడుమనుండు మేనేజర్లకును తదితరభూమికామందులకును కలుగచేయవలసిన సదుపాయముల పరిమితియును, వానిమాదిరియును, గవర్నమెంటువారికి నియతమై యుండు మితమగు నికరాదాయమును రాబడియును, యేయేరీతిని పంపకముకావలసినదియు నిర్ణయింపవలసియుండును.

"373. ఇతరసమయములలో లభ్యమైన సాక్ష్యమునుబట్టిచూడగా దేశీయులగు రివిన్యూ అధికారులు గౌరవసూచకములగు బహుమానములం దెంతయును మక్కువగ నుండిరని ఈసభవారు మిక్కిలి సంతోషముతో తెలిసికొన్నారు. అట్టికోరికను వర్ధిల్లజేయుట మిక్కిలి ముఖ్యమై యుండెను. దొరతనమువారి యుద్యోగము నందుండెడి యధికారులకే విపులమైన బాధ్యతలను మీదబెట్టి వారికి సరియైన ప్రతిఫలమును ముట్టచెప్పకుండుటయును, అందుమూలమున వారు నిరుపేదలగుటయును, వారయోగ్యముగ ప్రవర్తించుటయును, యీదొరతనమువారి యుద్దేశమై యుండరాదు. అట్టి మితవ్యయము కేవలము తప్పువ్యయ మని నాయాశయము. అట్టి విషయముల మంచియాశల వర్ధిల్లజేయుట మిక్కిలి ముఖ్యమై యున్నది. దొరతనమువారి యుద్యోగమునందుండు వారేతరగతివారైనను వారిమీద బాధ్యత హెచ్చుగానున్నపుడు అట్టివారియెడ గుప్తహస్తులై వారికి దుష్ప్రవర్తనలపై మనసు పోనిచ్చుటగాని లేమిడిచేత బాధపడనిచ్చుటగాని దొరతనమువారి యాశయమై యుండరాదు. అట్టి మితవ్యయమార్గ మెప్పుడును కుచ్ఛితమార్గమని నాయభిప్రాయము."

ఈతీరుమానమైన యొక్కవారమునకు 1822 సంవత్సరము 7 వ

రెగ్యులేష నేర్పరుపబడినది. అందు కటకమునకును, పాలనపురమునకును దానిలో చేరియుండు తదితరరాష్ట్రములకును దత్తవిజితరాష్ట్రములకును వర్తించెడు భూమిపన్ను సెటిల్‌మెంటునుగూర్చిన నిబంధనలన్నియుఁ బ్రకటింపఁబడియెను.

ఈ సెటిల్‌మెంటు సవరణ యూరూరికిని జమీజమీకిని జరుగవలసి యుండెను. ఇండియనుభాషలో జమీకి "మహాలు" అని పేరు. అందుమూలమున నుత్తరహిందూస్థానమున జరిగిన నీసెటిల్‌మెంటుకు మహాలువారీసెటిల్‌మెంటు అని పేరు వచ్చెను.

భూస్వామికివచ్చెడు నాదాయము పన్నులో స్పష్టముగా అయిదవవంతుకు మించినసే గాని యేజమీలోను భూమిపన్ను జాస్తీ చేయరాదు. "జమీందారులకును పైనచెప్పబడిన తదితరులకును పన్నుగా నేర్పడిన మొత్తములో నికరముగా నూటికి ఇరువదవవంతున లాభము చూపి పన్ను లేర్పాటు చేసికొనవలయును." అనగా 1200 కాసులు సిస్తుచెల్లెడు జమీపైని దొరతనమువారి పన్ను 1000 కాసులవరకు కట్టి యందులో అయిదవవంతు అనగా 200 కాసులు భూస్వామికి మిగిలెడులాగున నుండవలయును. దీనినిబట్టి యెస్టేటుపైన చెల్లెడు శిస్తులలో దొరతనము వారిపన్ను నూటికి దాదాపు 83 వంతు అని తేలుచున్నది.

వ్యవసాయదారులతో షరతు లేర్పాటుచేసి వారికి పట్టాలిచ్చు అధికారము రివిన్యూకలెక్టరుల కీయఁబడియెను. జమీలు భూస్వాముల స్వాధీనమందు లేక ప్రత్యేకించి వ్యవసాయదారుల స్వాధీనమందే యుండినయెడల అమరకపు శిస్తులో నూటికి 95 వంతువరకును పన్నుకట్టవచ్చును. అనగా మొత్తము రాఁబడిలో మాలిఖానానిమిత్తమై నూటికి 5 వంతునగాని 5 కు తగ్గకుండ గవర్నమెంటువారి చిత్తమువచ్చిన



వంతునగాని కొట్టవచ్చును. అట్టిస్థితిగతులలో రివిన్యూకలెక్టరుకు గ్రామభూములను తిరిగి విభజించుటకుఁగాని లేక ఆగ్రామముపై నేర్పాటయిన సర్కారువారిపన్ను వంతులవరబడిని విభజించుటకుగాని అధికారము కలుగ చేయబడియెను.

ఈ రైతులకును భూస్వాములకును మధ్యనుండెడు వ్యాజ్యములు విచారించుటకును, పిస్తుల నిర్ధారణ చేయుటకును, లెక్కలు సిసలుచేయుటకును, భూస్వాములకును రైతులకును మధ్యనుండెడి భూముల శిస్తులు, కవుళ్లు, కదపాలు, షరతులు మొదలగు సర్వవిధములైన తగాయిదాలు తీర్చుటకును రివిన్యూకలెక్టర్లకు అధికారము కలుగుచేయఁబడియెను. కలెక్టర్ల తీర్పులపైని బోర్డువారికి అప్పీలు చేసికొనవచ్చును. కడపట సివిలుకోర్టులో వ్యాజ్యముకూడ వేసికొనవచ్చును.

ఉత్తరహిందూస్థానము బ్రిటిషువారికి లభ్యమైన తరువాత 20 యేండ్లకు ఆదేశమునం దేర్పాటు అయిన భూసంబంధమగు చట్టముల స్థితి యిట్టులుండెను. పరిశీలించి యుండలి భాగములన్నియును జూచినయెడల అందలిలోటు లన్నియును వెల్లడియగును. రివిన్యూకలెక్టర్ల తీరుమానమునకన్న వ్యవసాయదారులు చెల్లించు సిస్తులకు న్యాయమైన ప్రమాణ మేమియును నాచట్టమున నేర్పడలేదు. అమరకపుశిస్తులో నూటికి 17 రూపాయిలు తప్ప భూస్వాములకు న్యాయముగ మిగిలెడు ఆదాయ మేమియును లేదు. "అపరిమితమగు పన్నులబాధనుండి సంరక్షింపఁబడవలెనని" యును. "నికరాదాయములో కొలదిభాగమే పుచ్చుకొనవలెనని" యును చెప్పుచువచ్చిన వాక్యములకు కేవలము వ్యత్యస్తముగ వింతరీతిని దేశములోని యాదాయ మంతయును తుడిచిపెట్టుకొని పోయెను. భూస్వాములును వ్యవసాయదారులును కూడ నొకమాదిరి దరిద్రులై పోయిరి. ద్రవ్య

మును కూడబెట్టుటకుగాని, జనులయొక్క యుపపత్తి నభివృద్ధిచేసికొనుటకుగాని, యేవిధమైన యాధారమును లేకుండపోయెను. సెటిల్‌మెంటు అయిన కొలఁదికాలములోనే మరలమరల సెటిల్‌మెంటులు రానై యుండెను. ముందు దొరతనమువారు వేయబోవు పన్నులకు మితి యేర్పడదయ్యెను.

చివరకు ఈప్రక్రియ యందలికాఠిన్యమువలననే పనిచేయకుండపోయెను. ఆఖరున 1833 సంవత్సరమున గవర్నరు జనరలుపనికి వచ్చినవారిలో నుత్తముఁడును సమర్థుఁడును నగు విల్లియము బెంటింకు ప్రభువు ఉత్తరహిందూస్థానములోని ప్రజలకు కొంతవిశ్రాంతి నొసంగెను. 1833 సంవత్సరమున జరిగిన భూమి సెటిల్‌మెంటు స్థితి యెట్టిదియో దానినిగూర్చి ముందుప్రకరణమున ముచ్చటింతుము.



## 12. హిందూదేశ ఆర్థికచరిత్ర.

ప్రసిద్ధికెక్కిన రమేశచంద్రదత్తుగారి ఆంగ్లేయగ్రంథములకు భాషాంతరీకరణము. 300 పుటలుగల నాలుగుసంపుటములుగా వెలువడును. ఇందు ఆంగ్లేయుల రాజ్యప్రారంభమునాటి హిందువుల ఆర్థికస్థైర్యమును, ఇప్పటి దానికి కలిగిన వృద్ధిక్షయములును, దాని కారణములును విపులముగ వ్రాయబడినవి. ఆంగ్లేయపరిపాలనల రిపోర్టులనుండి యెత్తి వ్రాయబడిన భాగము లిందువిశేషముగనున్నవి. దేశస్థితి బోధపడవలెనన్న ఈగ్రంథములు చదివితీరవలెను. శైలిసుబోధముగానుండును. వెల చందాదారులకు సంపుటమునకు రు 1 - 0 - 0. ఇతరులకు రు 1 - 8 - 0. ప్రథమసంపుటము వెలువడినది. అంచెకూలి కొనువారలదే.

కావలయువారు:—

సువర్ణలేఖా కార్యస్థానము,

తెనాలి, కృష్ణాజిల్లా.

(అని వ్రాయవలెను.)

---

శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల, [illegible]

